శ్రీ వీరరాఘవగ్రంథావళి.

# యజుర్వేద దర్శనము

## ప్రథమ భాగము

1997 ఏకం సత్

ద్రష్ట: ప్రత్నానంద

దర్శనాచార్య, కళాప్రపూర్ణ
డా. కొండూరు వీరరాఘవాచార్య
తెనాలి



This Book is Published
With the Financial Assistance of
TIRUMALA TIRUPATHI DEVASTHANAMS
Under Their Scheme
Aid to Publish Religious Books

ప్రథమ ముద్రణము. 1990

వేయి ప్రతులు

మూల్యము. రు. 30-00



ప్రాప్తిస్థానము
గ్రంథకర్త గాంధినగర్ తెనాలి-H.O. 522 201.

ప్రకాశకులు :
కె. ఆనందవర్ధన
హైదరాబాద్.

ముద్రణ :
వాణీ ఆర్ట్ ప్రింటర్స్, తెనాలి.

# పూర్ణదర్శనం

ఒకవిధంగా ఆలోచించిచూస్తే వేదాలు చెప్పేది జగత్కథ అని తోస్తున్నది. వేదఋషుల దృష్టికి విశ్వం అనేది పృథివి, అంతరిక్షం, ద్యులోకంగా గోచరించింది. ఈమూటిని వారు - భూః (భూలోకం), భువః (అంతరిక్షం), సువః (స్వర్గలోకం)అని పేర్కొన్నారు. ఈభూర్భువరాదులను వ్యాహృతులనికూడ వారు భావించారు. (భూ ర్భువ స్సువ రిత్యేతా స్తిస్రో వ్యాహృతయః) ఈమూడు లోకాలకు వరుసగా అగ్ని, వాయు, ఆదిత్యులను అధిపతులన్నారు. ఈ భూర్భువస్సువర్లోకములు ఓంకారంలోని అకార, ఉకార, మకారాలకు కూడ సంకేతాలే. అంటే ప్రణవంలోనే ముల్లోకాలు ఇమిడి ఉన్నాయన్నమాట. ఓం అంటే ముజ్జగాలతో కూడిన బ్రహ్మాండం అందులో ఇమిడి ఉన్నట్లెలెక్క.

ఇకపోతే-భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యం-అనుకొన్నప్పుడు సప్తలోకాలూ గోచరిస్తాయి. ఈ సప్తలోకాలే-ఆధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారాలకు సంకేతాలు. కుండలినీయోగపక్షంలో ఈ సప్తచక్రాలకూ, సప్తలోకాలకూ సంబంధం ఉన్నది. "ఇదంవిష్ణు ర్విచక్రమే, త్రేధా నిదధే పదం" "అతో దేవా అవన్తు నో, యతో విష్ణు ర్విచక్రమే, పృథివ్యాస్సప్త ధామభిః" అన్న మంత్రాలలో లోకత్రయ, సప్తలోక, సప్తచక్ర సంబంధం ఉన్నదని ఋగ్వేదదిగ్దర్శన ప్రథమభాగంలో చదివే ఉన్నాము.

అగ్ని, వాయు, సూర్యులనుగూర్చిన సూక్తాలను మనం ఋక్కులలో చూచాము. తరువాత వేదర్షుల దృష్టికి పంచ భూతాలు, నక్షత్రతారాగ్రహాలు గోచరించాయి. అందినంత వరకు వాటి చరిత్రనుకూడ మంత్రాలలో పొందుపరచారు. మనం ఈనాడు చూస్తున్న పాలపుంత, గ్యాలక్సీ వంటి గ్యాలక్సీలు ఎన్నో వున్నాయని వారికి తెలుసు. వాటి నన్నిటినీ వారు ద్యు(లోక) పదంలోనే ఇమిడ్చారు. ముజ్జగాల్నీ బ్రహ్మాండమని భావించారు. అలాంటి బ్రహ్మాండాలు ఎన్నో వున్నాయనికూడ వారికి తెలుసు. అందుకే భగవంతుణ్ణి అనంతకోటి బ్రహ్మాండనాయకుడనివర్ణించారు. విశ్వకర్మపురాణం-కొన్ని బ్రహ్మాండాలు కలసి విష్ణ్వండం అవుతుందనీ, కొన్ని విష్ణ్వండాలు కలిసి ఒక రుద్రాండం అవుతుందనీ, కొన్ని రుద్రాండాలుకలసి ఒక విశ్వకర్మాంశం అవుతాయనీ, ఇలాంటి విశ్వకర్మాండ కోట్లకు ప్రభువే విశ్వకర్మఅనీ చెప్తున్నది. అందుకే "ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః," "ద్యావాపృథివీ అప్రథేతాం" అని విశ్వకర్మసూక్తం అన్నది. విశ్వాన్నిగూర్చి ఇంతపరిజ్ఞానం ఉండబట్టే ఋషులు జగత్కారణ వస్తువును "సత్యం జ్ఞానం, అనన్తం"- అన్నారు ఉపనిషత్తుల్లో. ఇలా పదార్థాన్ని అంచనా వేసినతర్వాత, దాని పరిణామానికి మూలమైనకాలం లెక్కలోకి వస్తుంది ఆకాలాన్ని గూర్చి ఋగ్వేదం 1వ మండలంలోని 164వ, సూక్తం మంత్రాలు బాగానే వర్ణించాయి.

ఇదంతా జగత్కథా, జగత్కుటుంబకథాకాక ఏమిటంటారు? ఋగ్వేదంలోని సృష్టిసూక్త, విశ్వకర్మ, పురుష, మోక్షసూక్తాలు చెప్పేదంతా జగత్కుటుంబకథే అని మనం గ్రహించాలి.

ఋగ్వేదాన్ని పరిశోధించి- ఏకం సత్, సర్వం ఖల్విదం బ్రహ్మ, బ్రహ్మైవేదం విశ్వం-అని మూడు పుస్తకాలను వ్రాసినపిదప, నాదృష్టి యజు రథర్వవేదాలమీదికి వాలింది. ఆ రెంటినిగూర్చి ఒక్కొక్క దర్శనాన్ని వ్రాయడమైనది. యజుర్వేదంలోని చతుర్థకాండం అమూల్యమైనది అందులోనే మనం నిత్యం పఠించే నమక, చమకాలు, విశ్వకర్మసూక్తం ఉన్నాయి. పురుషసూక్త విశ్వకర్మసూక్తాలుఋగ్వేదంలోనూ ఉన్నాయి. ఏవి ఎక్కడఉన్నా వాటి అంతస్తత్వ రహస్యాలు ఎంతవరకుమనకు తెలుసునో ఆలోచించాలి.నమక చమకాలు ఎందుకు వెలసినాయో మీరు చదివి తెలుసుకుంటారు!

విశ్వకర్మ అనగానే పురాణాలుమాత్రమే చదివిన మనకు ఏ దేవశిల్పిగానో, మానవశిల్పిగానో తోస్తుంటాడు. విశ్వకర్మ ప్రభావం అంతమాత్రమే కాదు. మన మనుకొన్న విశ్వచరిత్రకంతటికీ ఆతడే కారణభూతుడు, జగత్పిత. మనలను కన్నతండ్రి. మననే ఏమిటి! మనం చెప్పుకొన్న పృథివ్యన్తరిక్ష, ద్యులోకాలకు స్రష్ట ఆతడే.ఇలాంటి విశ్వపితను- పురుషోత్తముని మనం మరచిపోయినాము.

-అలాగే గాయత్రీమాతనుకూడ మరచిపోయినాము. ఈ ఇద్దరూ ప్రకృతి పురుష స్వరూపులనే సంగతిని అసలే మరచినాము. ఇలాంటి వీరితత్వాన్ని నిరూపించడానికి తైత్తిరీయసంహిత ప్రత్యేకంగా పనిగట్టుకొన్నది. అలాగే వారి నుండి కలిగిన పంచఋషులను, తత్వాలనుకూడ కృష్ణయజుర్వేదం సవిస్తరంగా నిరూపించింది. ఆ విషయాన్ని గ్రహించినతర్వాత ఆ ప్రకృతిపురుష తత్వాన్ని శాఖోపశాఖలుగా

విస్తరించడానికే ఎంతో పరిశ్రమ చేయవలసివచ్చింది. అనేక గ్రంథాలసారాన్ని ఒకేచోట రాసిపోసి చూపవలసివచ్చింది. ఇంతటితో ఇది సంపూర్ణం అనలేను. అయినా కొంత చేయగలిగాననే సంతృప్తి లేకపోలేదు. ప్రకృతిపురుషస్వరూపులైన గాయత్రీ విశ్వకర్మల చరిత్రను తెలుసుకొంటే, ప్రపంచ తత్వాన్ని తెలుసుకొన్నట్లే. విశ్వకుటుంబకథను ఆకళించుకొన్నట్లే! వేదాలయొక్క సర్వపరమార్థమూ ఇదే ఇందులో ఇమిడిపోనిదంటూ ఏమీలేదు. మానవుడి పూర్ణజీవితగమ్యానికి ఇదే త్రోవ.

ఇలాంటి జ్ఞానాన్ని కేవలం వేదాలనుండేకాక, సమస్త సంస్కృతవాఙ్మయాన్నుండికూడ సమాజానికి అలవరచడానికే మాదర్శననిర్మాణయత్నం. అందుకే వేదాలు, శాస్త్రాలు, దర్శనాగమాలు, ఉపనిషత్తులు, సిద్ధాంతాలు తరచి చూడవలసివచ్చింది. వాటి సారాన్ని పిండవలసి వచ్చింది. ఇలాగే సకలయోగమార్గాలనుచవిచూస్తేనేకాని, యోగరాజమయిన కుండలినీయోగం తెలియదు. దాన్ని అనుసరిస్తేనేకాని, లోకత్రయంయొక్కగానీ, సప్తలోకాలయొక్కగానీ స్వేచ్ఛావిహారం సాధ్యంకాదు. పూర్వయోగాలేకాకుండ, ఆధునికసిద్ధులు కనిపెట్టిన యోగవిధానాలుకూడ ఆలోచించదగ్గవే అనేది మాభావం. అంతమాత్రానవాటిఆకర్షణకు లోబడమనికాదు. నీ జ్ఞానానికి పూర్ణత్వాన్ని సంపాదించుకొమ్మని మాత్రమే సూచన. విశ్వబ్రహ్మాండాలనన్నిటినీ నీలోచూచుకొనే ఉన్నత విశాల విశృంఖల పరమోత్కృష్ట మార్గమే అది, దాన్నే "తద్విష్ణోః పరమం పదం, సదా పశ్యన్తి సూరయః, దివీవచక్షు

రాతతమ్" అన్నదివేదం అది నిరుపద్రవమూ, నిస్తులమూ, నిరామయమూ, నిరంజనమూ అయిన మార్గమూ, గమ్యము కూడ. అఖండమైన పూర్ణతత్వంయొక్క బోధకలగాలన్నా, దాని సాక్షాత్కారం సిద్ధించాలన్నా సంకుచితమైన జ్ఞానం కానీ, పఠనంకానీ, దర్శనంకానీ చాలదు. పూర్ణ తత్వ సాక్షాత్కారం కావాలనుకొన్నప్పుడు పూర్ణబోధనే సంపాదించాలి. సమగ్రజ్ఞానమనేది ఎప్పుడయినా, సమగ్రత్వాన్నే అందిస్తుంది. అర, కొఱ జ్ఞానం దానికితగిన ఫలాన్నే ఇస్తుంది.

మన సమస్త వేదాలలోని ఎల్లదేవతలూ, అఖండ పరమాత్మ అంశలే అని మనం చదువుతున్నాము. (యో దేవానాం నామధా ఏక ఏవ) కాని అది ఆచరణకుమాత్రంరాదు. అలాగే 'ఏకం సత్' అని చిలుకపలుకులుమాత్రం పలుకుతాము. ఆచరణమాత్రం సర్వశూన్యం. ఈభేదదృష్టిని పోగొట్టడానికి "సర్వం ఖల్విదం బ్రహ్మ, బ్రహ్మైవేదం విశ్వం" అనే కృత్స్న (సంపూర్ణజ్ఞాన) దృష్టి అలవడాలి. ఇలాంటి జ్ఞానాన్ని సంపాదించటానికి వేదాలనేకాక, అనేక వేదవ్యాఖ్యాతలనుగూడ చదవవలసివచ్చింది. ప్రస్థానత్రయంమీద మధ్వ,శంకర, రామానుజ, శ్రీకంఠాదులభాష్యాదులను చదవడం నాదృష్టి ఎంతోవిశాలమూ, ఉన్నతమూ, కావడానికి ఉపయోగించింది. ఆ పఠనంతోపాటు అంతకంటె ఎక్కువగా తపస్సుచేసి, దివారాత్రులు ఆలోచిస్తేనేకాని విశ్వ కుటుంబకథ ఆకళింతకురాలేదు. ఈ ఆలోచనకుతోడు ఆచరణ కూడ ఉంటేనేకాని లక్ష్యసిద్ధికలిగి సిద్ధత్వం కలుగదని నేను

చెప్పబనిలేదు. ఆచరణలేనిదీ ఏ ఫలమూ కలుగదు. నాఅంత ర్దర్శనానికి ప్రాచీనులైన తత్వచింతకుల గ్రంథాలను తుల్ణంగా చదువబట్టే నాకు అవ్వలిమార్గం సుగమంకాగలిగింది. ఇందుకు వారికి నేనెంతో ఋణపడిఉన్నాను.

దేనినీ సర్వసంపూర్ణం అనే అహంకారం మానవుడికి వద్దు. తన ఆత్మకు సందేహ భయ రహితమైనదాన్నే ఆతడు పూర్ణంగా భావిస్తే చాలు. నిజానికి అదీ (జగత్కారణమూ) పూర్ణమే. ఇదీ (జగమూ) పూర్ణమే, పూర్ణంలోనుండి వచ్చి నదీ పూర్ణమే. పూర్ణంనుండి పూర్ణాన్ని తీసివేస్తే చివరకు మిగిలేదీ పూర్ణమే అని__

"పూర్ణ మదః పూర్ణ మిదం, పూర్ణాత్పూర్ణ ముదచ్యతే,
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణమే వావశిష్యతే."

అనేమంత్రం ఏనాడో చెప్పింది.

ఈ వేదదర్శన నిర్మాణమనేది నావల్లనే జరిగిందని నేను తలంచడంలేదు. ఆనాడు పోతన్నగారన్నట్లు "పలికెడిది భాగవతమట,పలికించెడివాడు రామభద్రుండట" అని, ప్రకృతి పురుషస్వరూపులయిన గాయత్రీవిశ్వకర్మల కరుణాకటాక్షం వల్లనే ఈ గ్రంథాలు రచింపబడ్డాయి. నేను నిమిత్తమాత్రుణ్ణి. వేదజననీ జనకులైన, ఆ జగత్పితలు తక్కిన వేదభాగాలమీద కూడ ఇలాంటి రహస్యాలు బయటపెట్టిస్తారనే నమ్మకం నాకు సంపూర్ణంగా ఉన్నది.

తెనాలి
20-2-90.

—గ్రంథకర్త.

మచిలీపట్టణం ఆంధ్ర జాతీయ కళాశాల Retd. Principal

## శ్రీ భాగవతుల కుటుంబరావు M. A. గారి

# సహృదయానుభూతి

శ్రీప్రత్నానందాపర దీక్షానామయుతులైన శ్రీరాఘవాచార్యులవారు రచించిన యజుర్వేదదర్శన ప్రథమభాగమును పఠించునపుడు, 1) కోశవానాచార్యః, (2) ప్రమాణభూత ఆచార్యః, దర్భపవిత్రపాణిః శుచావవకాశే ప్రాఙ్ముఖ ఉపవిశ్య మహతాప్రయత్నేన సూత్రాణి ప్రణయతిస్మ (3) తపసా విజిజ్ఞాసస్వ (4) స తపోఽతప్యత. (5) తే ధ్యానయోగానుగతా అపశ్యన్ (6) ఉతో, త్వస్మై, తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః (7) నావేదవిన్మనుతే తమ్ బృహన్తమ్ (8) ఎందఱో మహానుభావులు— అను వాక్యములు, నామనోవీథిని మెఱిసినవి. దీక్షాబద్ధుడైన యొకయోగి మూర్తి భాసించినది. పఠనము పూర్తియైన తరువాత, ఈ వేదదర్శన-గ్రంథరచనములకు ప్రోత్సాహమునిచ్చిన ప్రభుత్వమువారి గుణజ్ఞత నభినందించితిని.

విశ్వకర్మతత్త్వ నిరూపణ ప్రకాశనములు ఈ రచనమునకు పరమలక్ష్యముగ భాసించినను, అనర్ఘములైన వైదికవాఙ్మయ సంస్కృతిరత్నములుగూడ నిందు తమకాంతులను వెదజల్లుచున్నవి. శ్రీవిద్యారణ్యులు శ్రీ విశ్వకర్మస్వరూప ప్రాశస్త్యప్రాముఖ్యములను గుర్తించిరని, తెలియుచున్నది. అయినను, వైదికపురాణవాఙ్మయములలో వానికి ఆ పేరుతో రాదగినంత ప్రచారము రాలేదు. ''ఏకమ్ సత్'' అను నుపనిషద్వాక్యము విశ్వకర్మను బోధించును. 'విశ్వకర్మ' అనునది బ్రహ్మనామధేయమే— అని

విజ్ఞలోకమునకు, విశేషముగ నెఱుకగలుగచేసినకీర్తి, ప్రప్రథమముగా శ్రీమాన్ రాఘవాచార్యులవారికే దక్కినదనుకొందును. విశ్వరూపాభిష్టులైన వీరి ప్రజ్ఞా ప్రతిభల విశ్వరూపము, వీరి యీ గ్రంథములలో వ్యక్తమగుచున్నది. వీరు, వేద వేదాన్త పురాణాదివాఙ్మయ పాథోధిని మథించి, విశ్వరూపబ్రహ్మాద్వైత తత్త్వామృతమును, తదితరములైన యనర్ఘ రత్నములను వెలికిదీసి, సాధక జిజ్ఞాసు పండిత పరిశోధక లోకమునకు పాథేయముగ నందించినారు.

వేదములలోని సృష్టిప్రక్రియావైభవము సప్రమాణముగ నిందు ప్రతిపాదితమైనది. వేదములలో నద్వైతభావన యున్నదని సనిదర్శనముగ నిరూపితమైనది. భారతీయులకు ప్రాణమైన గాయత్రీస్వరూపము వేదసమ్మతముగా వర్ణితమైనది. "పురాణములు వేదార్థోపబృంహకములు" అను వాక్యార్థమునకిందులో నుదాహరణములు కనుపడును. పరస్పరభిన్నార్థకములుగ పైకిభాసించు వాక్యములకు సమన్వయమును చూడగలము. 1) సమాధి 2) పరకీయ 3) లౌకికభాషాశైలీమయములైన వేదపురాణ వాక్యములకు, ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికార్థము లున్నవి. ఈ విషయము యాస్కాచార్య సమ్మతము. దీనికి, దృష్టాన్తము లీ గ్రంథములోనున్నవి. విశ్వరూప కథా వివరణమున నీ విషయము ప్రముఖముగ నగుపడును. వేదాదులు, పారలౌకికములే, వానికి సామాజికస్పృహ,సామాజిక యోగక్షేమ ప్రదర్శనములు లేవనువారి మత మజ్ఞాన మూలకమను విషయము నీ గ్రంథపఠితలు గ్రహింపగలరు. భారతీయ వేదవిజ్ఞాన సంస్కృతులను మన మిచట నవగాహన చేసికొనగలము:

"తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచ స్సామాని జజ్ఞిరే"— అను వాక్యార్థవివరణములో ఋగ్యజుస్సామాదిక్రమ వర్ణనములో కనపడు వైరుధ్యమును పరిహరించుచు సమన్వయమును చేయుటలోను, "మనో గంధర్వః" అను వాక్యార్థవివరణమునందును ఆచార్యులవారి పరిశీలన పరిశోధనలపటిమ

ప్రశంసాపాత్రము. కృష్ణయజుశ్శబ్దార్థము, రుద్రశబ్దార్థముల ప్రతిపాదన బాగున్నది.

"యోఽర్థజ్ఞ ఇత్ సకలమ్ భద్ర మశ్నుతే" "య దధీత మవిజ్ఞాతమ్ నిగదేనైవ శబ్ద్యతే, అనగ్నావివ శుష్కైధో న తత్ జ్వలతి కర్హిచిత్"— అను వాక్యార్థములలోని హెచ్చరికను చూపి, శతరుద్రీయమునకు సరళమైన భాషలో అర్థమును వ్రాసి, రుద్రభక్తుల కెనలేని సాయము చేసినారు. "గిరిశంత, సుమంగళా"ది శబ్దములకు కొన్నిటికి యోగశాస్త్రపరమైన యర్థమునిచ్చినారు. "శివేన వచసా త్వా" "అధ్యవోచ దధివక్తా, అసౌ యస్తామ్రో", "అసౌ యోఽవసర్పతి" సూక్తముల యంతరర్థము, నీలగ్రీవశబ్ద సూచితనీతి, సహస్రాక్ష శబ్దమును రుద్రవిశ్వకర్మేంద్రులకును అన్వయించుట, కృత్స్నవీతాయ, అవభిందతే చ, పూర్వజావరజ మధ్యమ శబ్దాదుల యాధ్యాత్మికార్థములు, తస్కర, సోమ, సభాపతి, అగ్రియ శీభ్య, శూల్య, దూరేవధ, శష్ప్య, పాంసవ్య, దరిద్ర, వాస్తోష్పతి, భగవత్ శబ్దముల యర్థముల వివరణములలో ఆచార్యులవారు తమ ప్రత్యేకతను ప్రదర్శించినారు.

"తం వో జంభే దధామి" అనువాక్యార్థ విషయమున - విష్ణుసూరి, అభినవశంకరులు, స్కందదేవులు వ్రాసిన వివరణలు ఆచార్యులువారెఱుగక పోరు. ఈ విషయమున శత్రు శబ్దమునకు పాపము, విఘ్నము, అజ్ఞానము అనునర్థములను వారు వ్రాసిరి. ఇక్కడ కాకపోయినను, మరొకచోటనైనను ఇట్టియర్థమును ఆచార్యులవారును, ఇచ్చియేయున్నారు. నమకము ముఖ్యముగా కర్మోపాసనామార్గమునకు సంబంధించినది. అందుచే ద్వైతభావన తప్పదు. నమకరహస్యము అను భాగము - సాధకుల కవశ్యపఠనీయము. 95వ పుట లోని విషయము మననీయము.

శ్వేతాశ్వతరోపనిషత్తు "శతరుద్రీయమునకు భాష్యము" — అను విషయము విజ్ఞుల కామోదమునుకూర్చును. ఈ సందర్భములో త్ర్యంబక

శబ్దమునకుగల యర్థములను, సేకరించి యిచ్చిన శ్రీ ప్రత్నానందుల నభి నందింపని వారుండరు. వసిష్ఠమహర్షి ఇచ్చిన యర్థము, సామాన్యలోకము నకు తెలియనిదే.

విశ్వకర్మతనయులే, వసువులు ఏకాదశరుద్రులు, ఆదిత్యులు, - విశ్వ కర్మయే పరమేష్ఠి, అని సప్రమాణముగనిందు నిరూపితమైనది. విశ్వకర్మో పనిషత్తులోని విషయములుకూడ వేదానుసారులై నందున తత్త్వబోధకములే యని సోదాహరణముగ నిచట నిరూపితమైనది. ఈ దర్శనమును చదువుచున్న కొలదియు, ఎప్పటికప్పుడు వేనినో క్రొత్త విషయములను తెరమీదికి తీసికొని వచ్చి, మనకు చూపుచు, పాఠకులకు అచ్చెరువును కలిగించు నాచార్యులవారికి కరద్వయ మంజలి ఘటించుచున్నది. శివపంచాక్షరీ, విశ్వకర్మాష్టాక్షరీ, నారాయణాష్టాక్షరీమంత్ర తులనాత్మక పరిశీలనము, బ్రహ్మవిష్ణురుద్రాదులకు, విశ్వకర్మకునుగల సారూప్యము, శివ, విష్ణు, ఇంద్ర, రుద్ర, వరుణ, ప్రజాపతు లకు, సప్తర్షులకు, పంచర్షులకు విశ్వకర్మకు గల సంబంధము-పంచముఖముల రహస్యమును, వివరించు సమయమున, ప్రత్నానందులొక యనుభూతి విశేష ములో నున్నారనిపించుచున్నది.

ఇక విశ్వరూపకథా పరమార్థ ప్రకటనము విశ్వకర్మ సూక్తార్థవివరణ ములు,గ్రంథమునకు తలమానికములు. శ్రీప్రత్నానందులిచట విశ్వతోముఖులై విశ్వరూపకథకుగల యాధ్యాత్మికాధిదైవికాధిభౌతిక, చారిత్రకాద్యంశముల నన్నిటిని, సమ్యగ్దృష్టితో వివరించినారు. విశ్వకర్మయను శబ్దమును, మనము, పురుషసూక్తాదులలో దినదినము వినుచునేయున్నను, అది పరబ్రహ్మకుగల విశేషణవాచక శబ్దములలో నొకటియని గ్రహించి, వదలుచున్నామేగాని, దాని ప్రాముఖ్యమును ప్రత్నానందులు, మనకు చూపించునంతవఱకు, మనము గుర్తింపలేదని పాఠకులు తప్పక భావింపగలరు. శ్రీ మహాచార్యులవారొక యుద్ఘమానాభినివేశములతో నిట్లువ్రాయుచున్నారనుకొనువారును నుండవచ్చును.

వారిని మఱియొకసారి, మీ యభిప్రాయమును, పర్యాలోచనసేయుడని మాత్రమే చెప్పగలము. అభిమానావేశ మొక్కొకచో భాసించినను, పాఠకులాయంశ మును పట్టించుకొనరాదు. విశ్వకర్మసూక్తార్థ వివరణ సందర్భమున, "అజనాభ" శబ్దార్థ వ్యాఖ్యానమునుగూడ పాఠకులు చదివి తీరవలయును. ఇంతయేల, విశ్వకర్మసూక్తార్థము విశ్వకర్మభక్తులు కానివారును నవశ్యము చదువవలయును. అడుగడుగున, నందఱును, పరమప్రమాణముగ నంగీక రించు భగవద్గీతా శ్లోకములనుగూడ నిందు నిరూపితములైన విషయములకు ప్రమాణములుగ నాచార్యులవారుదాహరించుచునేయున్నారు. ఈ సూక్తార్థ వివరణములలో ననేక రహస్యములను చాటినారు. ఈ సందర్భమున భౌవన విశ్వకర్మ అద్వైత సిద్ధాన్తప్రవక్తయని యాచార్యులయభిమతమిందు కనపడు చున్నది. 186 పుటలో ఆచార్యులవారు సూచించిన యోగసాధనరహస్య మును సాధకులు గమనింపవలయును. విశ్వకర్మసూక్తములలో సిద్ధాన్త వ్యాసమునకు (Thesis) కావలసినంత యమూల్య విషయమున్నదను వీరి సూచనయు నీసందర్భమున నున్నది.

ఇంకొక క్రొత్త విషయము. "కృష్ణం వన్దే జగద్గురుమ్" అను చున్నాము. విశ్వకర్మయే, బ్రహ్మవిద్యోపదేశముచేసిన ఆద్యగురువులకుగూడ గురువు (గురూణామ్ గురుః), ఆది జగద్గురువు అని ప్రత్నానందులుద్ఘోషణ చేయుచున్నారు. ''నారాయణం పద్మభువమ్ వశిష్ఠమ్" అను గురుపరంపర స్థానమున నింకొక గురుపరంపర – "విశ్వకర్మ సమారంభామ్'' అని యున్నదనుటకు ఉపనిషదాది ప్రమాణములను సంకలనము చేసినారు.

సృష్టి తత్త్వనిరూపణము అను భాగమునందు "నాసదీయ, పురుష, విశ్వకర్మసూక్తములయర్థములు తులనాత్మకముగ భావితములైనవి. ఇక ఉపనిషత్తులును, భగవద్గీతయు విధిగ నుండితీరునుగదా ! ఇచట, అద్వైత సిద్ధాంతమునందలి వివర్తవాదము కొంతగా వివరింపబడినది. రజ్జుసర్ప, సువర్ణభూషణన్యాయముల ప్రసక్తియు నున్నది.

గాయత్రీవిశ్వకర్మల పరమాద్వైత భావవివరణము ప్రమోదమును కలుగజేయును. అయిదు ముఖముల రహస్యమును పాఠకులు చదివి యానందింపగలరు. గాయత్రీవిశ్వకర్మలకు స్త్రీ పుంభేదముతప్ప మఱి యేయితర భేదములేదని తత్త్వసాధకులకు సూచననిచ్చినారు ప్రత్నానందులు. "ఎచ్చట విశ్వకర్మపదము వచ్చినను, దానికి సమస్తకర్మాధినాథుడైన పరమేశ్వరుడే యర్థమని సాయణులు భాష్యము వ్రాయుచుందురు" అనియుననినారు. గాయత్రీ మంత్రార్థ లక్ష్యహేతుతు విశ్వకర్మయే- అని 243 పుటలోననుచు, నాయర్థమును వివరించినారు. సవిత, సావిత్రి శబ్దార్థముల వివరణమును నిందుకనుకూలముగ, పొందుపఱచినారు. పురుషసూక్తములో విశ్వకర్మశబ్దమే యున్నదిగదా ! ఇక పంచతత్త్వములు, పంచర్షులు, వశిష్ఠాది ఋషిపంచకములను గుఱించిన వివరణము వేదపురాణాదివాక్యములతో నున్నది. విశ్వకర్మావతారములును వర్ణితములైనవి. భౌవనావతార విశేషము వర్ణితమైనది.

గ్రంథాంతమున, చమక మన్త్రములకు అర్థమీయబడినది. అందులో భక్తునిచే కోరబడిన విషయముల ప్రాముఖ్యము వర్ణితమైనది. వేద మహత్త్వము కొనియాడబడినది. మన్త్రార్థములనెఱిగి మన్త్రపఠన వినియోగములను చేయుటమే శ్రేయోదాయకమను హెచ్చరికను పాఠకులు గుర్తింపవలయును. ఊర్ధ్వదిక్కునకుగల ప్రాశస్త్యము వర్ణితమైనది. చమకరహస్యము, ఈశావాస్యదృష్టి, అను భాగములు విజ్ఞానప్రదములు.

"సంన్యాసభావమునకు-ప్రపంచ త్యాగమొనర్పవలయుననుటకు చమకము విరుద్ధముగా కనుపడుచున్నది. ప్రపంచమును వదలి వైరాగివి కమ్మనుట వేద హృదయముకాదు. ఈప్రపంచమును సాధనముగా చేసికొని, దానికి హేతువైన పరమాత్మను సాక్షాత్కరించుకొని, ప్రాపంచిక బంధములనుండి ముక్తులవు కావలసినదని బోధించుటయే వేదఋషుల తాత్పర్యముగా అగుపడుచున్నది". అని ప్రత్నానందులు తమ యభిప్రాయమునావిష్కరించి, ఈశావాస్యోపనిషత్తులోని "కుర్వన్నేవేహకర్మాణి" యను వాక్యము నుదాహరించి, వివరించినారు.

ఉపసంహారము, మంగళాశాసనము మనస్సులకు ఉద్దీపములగుట నిస్సంశయము. అనుబంధములో భగవచ్ఛబ్దార్థ వివరణము తిరిగి విచారింపబడినది. ఇదియును విజ్ఞానదాయకమే.

ఈ గ్రంథములోని ప్రతిపత్రము విషయభరితము - పరిశీలనాత్మకము- పరిశోధనా ఫలితము- బుద్ధ్యుద్దీపకము - విజ్ఞానదాయకము, అనుభవైకవేద్యము ననుటలో నెవరికిని విప్రతిపత్తి యుండదు. అచట నచట నెవరికైన నీషద్భావభేదమున్నను, నది సర్వగ్రంథసహజమే - సర్వవాదసహజమే యగుటచే, నవి ఈ గ్రంథముయొక్క ప్రకృష్టతను, ఉపయోగితను ఏమాత్రము తగ్గింపవు. పైగా, నవి ఇతరుల భావముల కేవిధముగనైన నుద్దీపకములే యైనందువలన, తత్త్వవిచారణశీలురకు నిచట చర్చితములు, నిరూపితములునైన యంశములు సర్వదా పరిగ్రాహ్యములు మననీయములు, పరిశీలనీయములుననుటలో నెవరికిని భేదాభిప్రాయముండదనియే నేను విశ్వసించుచున్నాను.

శ్రీ ప్రజ్ఞానందు లీవిధముగనే, అథర్వవేదమునందలి యనర్ఘరత్నములనుగూడ కొన్నిటిని వెలికిదీయుదురని యాశించుచున్నాను.

విశ్వరూపో భగవాన్ విజయతే తమామ్ ।

"సన్తః పరీక్ష్య"....

ఓమ్ శమ్

భాగవతుల కుటుంబరావు.

20-17, చిలకలపూడి,
మచిలీపట్నం - 2.
14—3—90

# ప్రత్న దృష్టి

## ప్రకృతి పురుష విలాసం

("పితైషాం ప్రత్నో అభిరక్షతి వ్రతమ్" ఋ 9-73-3)

పరిశీలించి చూస్తే సృష్టిలో రెండు వస్తువులు గోచరిస్తాయి — ఒకటి చైతన్యం, రెండు జడం. ఈ రెంటినే **Spirit and Matter** అని ఆంగ్లంలో అంటారు. భగవద్గీత ఈ రెంటినీ పురుషుడు (ఆత్మ), ప్రకృతి అనీ, క్షేత్రజ్ఞుడు క్షేత్రంఅనీ — అన్నది. ప్రత్నానంద వీటిని దృక్కు — దృశ్యం అని అన్నారు.

సృష్టి రెంటిచేత చేయగాబడె నందు
ఒకటి చూడబడు, మఱొకటి చూచు ;
చూచువాడు ద్రష్ట, చూడంగబడునది
దృశ్యమనగ జెల్లు ; ధీరమిత్ర !

జీవుడనేవాడు దృక్స్వరూపుడుకాగా, అతనికి గోచరించేదంతా దృశ్య మవుతున్నాయి. అంటే, ద్రష్ట చైతన్యంకాగా, పదార్థం జడమని సారాంశం. ఈ జడచైతన్యములయొక్క సంయోగమే చరాచరాత్మకమైన జీవులూ, నిర్జీవులూను. నిర్జీవులను కేవలం నిశ్చైతన్యులని అనడానికి వీలులేదు. వాటిని అనభివ్యక్త చైతన్యములనీ, జీవులను అభివ్యక్త చైతన్యములనీ అనుకోవాలి. ఈ అభివ్యక్తచైతన్యం, అనభివ్యక్తచైతన్యం కావడానికీ, అనభివ్యక్తచైతన్యం అభివ్యక్తచైతన్యం కావడానికీ, ప్రకృతిలో అవకాశాలు ఉన్నాయి. అందుకు కాలంకూడ కలసిరావాలి. ఈ రహస్యాన్నే గీత —

"యావత్సంజాయతే కించిత్, సత్త్వం స్థావర జంగమం,
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగాత్తద్విద్ధి భరతర్షభ." — 13-26

అన్నది. ఇందు పేర్కొనబడిన క్షేత్ర (జడ) క్షేత్రజ్ఞ (చైతన్య) సంయోగాన్నే మనం జడచైతన్యముల సంయోగంగా గ్రహించాలి. ఈ ఉభయ సంయోగం సత్వములసృష్టికి మూలమన్నమాట. ఇక్కడ దీన్ని ఉపమానంగా తీసుకోవచ్చు. అహల్య అనే ఆవిడ శాపానికి పూర్వం అభివ్యక్తచైతన్యం కాగా, శాపానంతర శిలారూపం అనభివ్యక్తచైతన్యం అన్నమాట. శిలా రూపంలో చైతన్యం అభివ్యక్తం కానేరదు. అంతమాత్రాన అందులో చైతన్యం లేదనికాదు. దానికి లేనిది అభివ్యక్తి మాత్రమే. ఈ విషయాన్నే మనం జీవులు జాగృత చైతన్యములనీ, నిర్జీవపదార్థాలు నిద్రాణ చైతన్యములనీ చెప్పుకోవచ్చు. ఈ సందర్భంలో చైతన్యానికి నిద్రాజాగరణలు ఎప్పుడెప్పుడు కలుగుతాయి, అనడానికి గీత సమాధానం ఇది. సృష్టి జాగ్రద్దశకాగా, ప్రళయం నిద్రాణస్థితి. గీత ఈ విషయాన్ని -

అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే". - 8-18

పగటిరాక, (అహరాగమం) రాత్రిరాక (రాత్ర్యాగమం) అని వర్ణించింది.

ఇక పోతే, సృష్టికి పూర్వం జడంకానీ, చైతన్యంకానీ - లేనీ - కానీ ఒకానొక అవ్యక్తస్థితి ఉండేదని గ్రహించాలి. నాసదీయసూక్తం ఆస్థితినే "నాస దాసీ న్నో సదాసీత్" అనీ, గీత - "న స త్త న్నానదుచ్యతే" అనీ వర్ణించినాయి. ఇలా సదసత్తులను అవ్యక్తంగా తన గర్భంలో ఇముడ్చుకొని బ్రహ్మాండాలను వెలువరించిన దివ్యశక్తినే ఋగ్వేదదశమ మండలం లోని 81, 82వ సూక్తాలు విశ్వకర్మ శబ్దంతో పేర్కొన్నవి. అంటే ఆ అనిర్వచనీయ దివ్యశక్తి చైతన్యపదార్థాల సంయోగంవల్ల జగత్తులను ప్రసవిస్తూ, పెంచుతూ, చివరకు తనలోనే లీనమొనర్చుకొంటూ జగత్క్రీడా కర్మలను నడపుతున్నదికనుక, దాన్ని విశ్వకర్మ అని వేదద్రష్టలన్నారు. అంటే ఇంకొకపదంతో దాన్ని పిలవకూడదని కాదు. ఏ పదాలతో పేర్కొన్నా,

విశ్వకర్మ పదానికున్నంత సార్థకత్వం వాటికి రాదు. పదవ్యుత్పత్తులనుబట్టి ఈ సంగతిని ఆలోచించిచూస్తే తెలుస్తుంది. అయినా, రుద్ర, విష్ణు, త్వష్టృ, పురుష, హిరణ్యగర్భ, పరమేష్ఠి, ప్రజాపత్యాది పదాలతోనూ, ఇంద్ర, వరుణ, సవితృ, అగ్నియమాది పదాలతోనూ దాన్ని పేర్కొనకపోలేదు వేదం. ఇక్కడ పదార్థాన్నిగూర్చి ఒకవిషయం చెప్పాలి. మనం పదార్థం, లేక ప్రకృతి అనుకొనే వస్తువు తమస్సు, రజస్సు, సత్వం అనే మూడు గుణస్వరూపాలు కలిగి ఉంటుంది. దీనినుండి పంచభూతాలు కలుగుతాయి. ఇవి ఒకదానితో ఇంకొకటి కలియనిదశ ఒకటీ, కలిసి ఉండేదశ ఒకటీను. కలియని దశను అపంచీకృత మనీ, కలిసనదశను పంచీకృతమనీ అంటారు. మనం ఈనాడు చూస్తున్న ప్రకృతి అంతా తమఃప్రధానమూ, పంచీకృతమూ అయినట్టిదే. అపంచీకృత త్రిగుణాత్మక పంచభూతాలు యోగులకుమాత్రమే గోచరిస్తాయి. ఈ మూడు గుణాలతోగూడిన పంచభూతాలయొక్క సాంకర్యంవల్లనే ప్రకృతిలో ఉపాధు లనేవి ఏర్పడుతాయి. ఆ ఉపాధులద్వారానే చైతన్యంయొక్క అభివ్యక్తిగాని, అనభివ్యక్తిగాని. ఈ విషయాన్ని యజుర్మంత్రమొకటి విశ్వకర్మవల్ల వసు, రుద్రాదిత్యులు కలిగారని నిగూఢంగా చెపుతున్నది – సృష్టిని సూచిస్తూ. ఈ త్రిగుణాత్మక సృష్టినిగూర్చి మనకు సాంఖ్యం చెపుతూనే ఉన్నది. దీన్ని కొంతవరకు విశదంగా ప్రత్యానంద తన తత్త్వసాధన గ్రంథంలో వివరించే ఉన్నారు. దాన్నిచదివితే మనకు శివవిష్ణ్వాదుల–దేవ మానవ తిర్యక్ స్థావరాదుల సృష్టిరహస్యం తెలుస్తుంది. కనుక ఆదిమూల వస్తువును వేదం విశ్వకర్మ అని పేర్కొనడంలో అసత్యమూ, కల్పనా, ఏమీలేదు. నిక్కమైన అనుభవ పరమార్థమే అది.

ఈ రహస్యాన్ని తెలుసుకొనడానికి ప్రత్యానంద వేదాలనుండి లౌకిక వాఙ్మయంవరకూ ఎన్నో పుస్తకాలను చదివారు. ఎంతోసాధన చేశారు. తపోయోగమార్గాలలో చిరకాలం శ్రమించి, వాటి సత్యాన్ని సాక్షాత్కరింప

చేసుకొన్నారు. దివ్యదర్శనాన్ని, పూర్ణదర్శనాన్ని పొందారు. ఆయనది అష్టాంగ యోగమార్గమేకాక, కుండలినీ యోగమార్గంకూడ అయినందున, ఎన్నెన్నో రహస్యాలను అందుకొని ఆకళించుకొనేశక్తి ఆయనకు అలవడ్డది. ఇలాంటి యోగపరిపూత దృష్టితో దర్శించి చెప్పడంవల్ల ఆయన చెప్పేదాంట్లో కల్ల బొల్లులు, ఇంద్రజాలం ఉండడానికి వీలులేదు. "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అన్నట్లు ఆయన నిశితమైన తపస్సు చేతనే బ్రహ్మ (వేద) రహస్యాలనూ, పరబ్రహ్మతత్వాన్నీ ప్రవచనం చేస్తారు. అందుకనే ఆయన పుస్తకాలను మహాయోగులు, మహాత్ములూ, మహాపండితులూ మెచ్చుకొన్నారు.

ప్రత్నానందుల ఆత్మ, శిల్ప, యోగాదిదర్శనాలనూ, సాహిత్య గ్రంథాలనూ మహనీయులైన వేలూరి శివరామశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, వున్నవ లక్ష్మీనారాయణ, మాధవరామశర్మ, B. D. జట్టి, మలయాళస్వామి, తత్వానంద వంటివారు మెచ్చుకొని పీఠికాభిప్రాయాలను వ్రాశారు. ఈ వేదదర్శనాలలో వెలువరించిన విశేషాలకు నాటి ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు డా॥ శంకర్‌దయాళ్ శర్మగారే ఆశ్చర్యపడి అభినందించారు. ఇంక డా॥ D. అర్క-సోమయాజులు, ప్రొఫెసరు P. S. శాస్త్రి, డా॥ అమరేంద్ర, డా॥ S. N. శోభిలోల, డా॥ V. V. L. నరసింహారావు, డా॥ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, శ్రీ సూరి రామకోటిశాస్త్రి ప్రభృతులు చదివి ప్రశంసావర్షాలు కురిపించారు.

శ్రీ ప్రత్నానందఅంటారు :- బ్రహ్మంగారు, వేమన, కబీరు, సదాశివ బ్రహ్మేంద్రులు, గుంటూరులోని మస్తానుసాహెబు, బందరులోని దొంతులమ్మ, బెంగుళూరులోని నిర్వాణమ్మ, షిర్డీ సాయిబాబా, మడుగుస్వామి, చిన్నమ్మ, పెద్దమ్మ, పిచ్చమ్మ, రాజుపాలెం అమ్మ - వంటివారు పొందిన యోగాత్మానుభూతి మన పుస్తకాలు చెప్పేదానికంటే ఎంతో విశిష్టమైనదని. అందుకే ఆయన గురువులు చెప్పినమార్గాన్ని వేద, వేదాంత, దర్శనాదుల పఠనంచేత

విస్తృతంచేసుకొని, ఒకానొక విశిష్టయోగమార్గాన్ని చేపట్టి, పరమ తత్త్వాను భూతిని పొందగలిగారు. దానిఫలితమే ఈ గ్రంథాల విశిష్టరచన; అపూర్వార్థ వివరణశక్తీను. ఆ అనుభూతి మాటలకూ, చేతలకూ, మనస్సుకూ అందేది కాదని వారి దృఢనిశ్చయం. దానిముందు బాహ్యాలైన పూజా, పురస్కార, ఉపాసనా, ధ్యానాదులు ఎంతో క్రిందిమెట్లని వారి భావన.

ఈనాడు శాఖోపశాఖలుగా పెరుగుతున్న శాస్త్రవిజ్ఞానం (సైన్సు) వేద విజ్ఞానానికి దోహదం చేసేదేకాని, దాన్ని ఖండించేదికాదని ప్రత్నానందుల భావం. అందుకే అధునిక విజ్ఞానంలోని ప్రతివిషయాన్ని వారు పట్టి పట్టి చూచి, అది వేద విషయాలకు సరిపడుతుందా, లేదాఅని పరిశీలిస్తూ ఉంటారు. ఇలాంటి ప్రత్యేకమైన దృష్టిని పెట్టుకొన్నారు కనుకనే వారు ప్రతిదాన్ని పరిశీలించి, పరిశోధించి, సాక్షాత్కరించుకొనికానీ, సత్యనిర్ణయానికీ, సత్యోద్ఘాటనకూ పూనుకోరు! స్థూలమూ, అర్థహీనమూ అయిన బాహ్యాచార దాస్యానికి ఆయన బద్ధవిరోధి. ప్రతిదీ అనుభూతి రాతిమీద నిగ్గుతీరాలి. అప్పుడుగాని అది అనుష్ఠానయోగ్యం కాదంటారు. తాత్త్విక విషయాలను కానీ, వేదార్థ రహస్యాలనుకానీ ఆయన కేవలం శబ్దార్థాలమీదనే ఆధారపడి ఆలోచించరు. ఒకానొక సమాధిదశలో అవి తనకు గోచరిస్తాయంటారు. ఆయన నిద్రపోతాడని అనలేము. ఆ నిద్ర శంకరులన్నట్లు (నిద్రా సమాధిస్థితిః) ఒకానొక సమాధిస్థితి! అందులో ఆయన తనకు ఎన్నో సత్యాలు గోచరిస్తా యని తన ఆత్మీయులకు చెపుతుండగా మేము విన్నాము. అందుకే ఆయన తెల్లవార్లూ ఆకళించుకొన్న అంశాలను ఉదయమేలేచి కాగితాలమీద వ్రాస్తూ ఉంటారు. ఒక్కొక్కప్పుడు రాత్రివేళల్లోకూడ వ్రాస్తూఉండడం మేమెరుగుదుం. ఆయన తత్త్వసూక్తులన్నీ ఇలా వెలువడినట్టివే. లేకపోతే ఋక్కులలో కుండలినీయోగం, అద్వైత సిద్ధాంతం ఉన్నవని ఎవరు చెప్పారు? ఆయన వెలువరించే వైదికరహస్యాలన్నీ ఇలాంటివే. విశ్వకర్మతత్త్వాన్ని సృష్టి కారణమని ఇంత విస్తృతంగా వ్రాయడమంటూ ఆయనకే చెల్లింది.

పూర్వజన్మ విషయాలుకూడ సమాధిద్వారా తెలుసుకోవచ్చునని వారు అంటూఉంటారు. ప్రణిధానంవల్ల పూర్వజన్మాంశాలు తెలుస్తాయని యోగ శాస్త్రం చెబుతున్నదికదా! మన ఋషులకు జన్మాంతర విషయాలు తెలుసునని మనం చదువుతూనే ఉంటాము. అందుకే ఆయన ప్రత్నానంద నామధారి అయినారు. ప్రత్నమహర్షి ప్రాచీదిశామాది మంత్రాలలో చతుర్థ దిక్కున విన బడుతాడు. విశ్వకర్మ తనయుడు, మాగోత్రకర్త. ప్రత్నుడంటే ప్రాచీనుడని భావం. తొట్టతొలి తత్త్వం పరబ్రహ్మమేకదా. అందుకే గీత - "నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః" అన్నది - అంటే భగవంతుడే కదా! అలాంటి సనాతన తత్త్వమే తాననే అద్వైతభావం ప్రత్నానందపదంలో ఉన్నది. అందుకే ఆయనను వేదర్షుల అనుయాయిగా మేం భావిస్తాం. ఇలాంటి వారికి సంతానం కావడం మా అదృష్టమనికూడ మా భావం. ఈ మాటలు మానాన్నగారి గొప్పతనాన్ని చాటడానికి వ్రాసేవికావు. వారి పుస్తకా లను ప్రత్యక్షర పరిశీలనతో చదివితే వారికృషి, ఆత్మానుభూతి, సాధనవిధానం అవగాహనకు వస్తాయి. మనకాలంలో ఉన్న ఒక మహావ్యక్తిని గుర్తించ డానికైయే ఈపాటి పరిచయం చేయడమవుతున్నది. అసలు తత్త్వయోగ శాస్త్రాలను నిశితంగా పరిశీలించి ఆచరించి, ఫలితాలను పొందడానికే ఆయన జన్మ వచ్చిందని మాకనిపిస్తుంది. ఏ విధమైన ఆచరణా లేకుండ యోగఫలి తాలను అవహేళన చేసేవారినిగూర్చి ఏమనాలో మాకు తెలియదు. గాంధీ మహాత్ముడు పుట్టేంతవరకు అహింసమహిమను ఎందరు తెలుసుకొన్నారు. బుద్ధునిస్థితి, ఆయన ప్రయోగాలు వేరు, కనుక ఒకొకరు ఒకందుకే పుడతారు. ప్రత్నదృష్టి అంటే, భగవద్దృష్టి, వేదదృష్టి అనికూడ భావం. ఇక ప్రత్నానంద దృష్టి అనే అర్థం సరేసరి.

కేవలం బ్రాహ్మీస్థితిని పొందినవారంతా లోకానికి ఉపయోగించరు. తాము పొందిన స్థితిని లోకానికి చెప్పగలిగి ఉండాలి. అంతేకాదు. చెప్పేదాన్ని

శిష్యబోధకంగా వ్రాసే నేర్పుకూడ ఉండాలి. అలాంటి శక్తులున్న వారే మన వేదఋషులు, శాస్త్ర. దర్శనకారులున్నూ. ప్రజ్ఞానందకుకూడ ఇలాంటి అర్హతలు ఉండబట్టే ఈ గ్రంథాలు లోకానికి అందుతున్నాయి. ఇలాంటి వైదిక, దార్శనికదృష్టితోను, తపోయోగదీక్షతోనూ వారు వేదాలను ఆకళించు కొన్నారు. వేదసారాన్ని, మంత్రద్రష్టల అంతర్యాన్ని తెలుసుకొన్నారు. ఆవేద విజ్ఞానాన్ని గడపగడపకు అందించాలని పూనుకొన్నారు. ఆయన దృష్టిలో ప్రపంచమానవులందరూ అమృతపుత్రులే. హెచ్చు తగ్గుల దృష్టితోవారు ఎవరినీ చూడరు. అలాంటి సమదృష్టితోనే దేవతలను, దైవశక్తులను దర్శించి, వారితత్త్వాన్ని లోకానికిచాటడానికనే ఋగ్వేదదిగ్దర్శనత్రయాన్ని రచించారు. వాటిని పండితులూ, ప్రజలూ, ప్రభుత్వంవారూ మెచ్చుకొని ప్రోత్సహించారు.

ఇప్పుడీ యజుర్వేద దర్శనమును వ్రాసి మనకు అందిస్తున్నారు .ఈ పుస్తకంలో రుద్రవిశ్వకర్మల తత్వాన్నిగూర్చి చాలవరకు వివరించారు. విశ్వ కర్మావతారాలను పరికించారు. విశ్వకర్మ సర్వదేవతామయుడు, అన్నినామ రూపాలు ఆయనకు ప్రతినిధులే అన్నారు. ఇది తనమాట కాదు. వేదమే. "యో దేవానాం నామధా ఏక ఏవ" అన్నదికదా. అలాగే ''విశ్వకర్మాహ్యజనిష్ఠ దేవ ఆది ద్గంధర్వో అభవ ద్వితీయః, తృతీయః పితా జనితౌషధీనామ్" విశ్వకర్మ మొదట సృష్టిచేసే బ్రహ్మ, లేక త్వష్టఅయి నాడనీ, ఆవల సూర్యచంద్రులుగా రూపొందినాడనీ చెప్పినదికదా. ఈ సందర్భంలో గంధర్వుడంటే సూర్యుడనే అర్థాన్ని ప్రజ్ఞానంద వేదాలు వెదకి పట్టుకొన్నారు. ఇలాంటి రహస్యాలు ఎన్నెన్నో ఈ గ్రంథంలో మనం చూడగలుగుతాము.

భౌవనవిశ్వకర్మ, విశ్వకర్మసూక్తద్రష్ట కావడమే కాదు. మానవ సమాజంలో మొట్టమొదటి సార్వభౌముడుకూడా అతడేఅని ఐతరేయ బ్రాహ్మణం అంటున్నదికదా. ఇది గొప్ప చరిత్రాంశం. ప్రభాసపుత్రుడైన

ఇంకొక విశ్వకర్మ ఋభువులకూ, శిల్పాచార్యులకూ మూలభూతుడైనవాడని సప్రమాణంగా పేర్కొన్నారు. ఇంకా ప్రజాపతి పరమేష్ఠి విశ్వకర్మ ఒక్కరే అనీ, సానగాదులు, వసిష్ఠాదులూ, వసురుద్రాదిత్యులూ విశ్వకర్మ సంతానమే అనీ చేసిన నిరూపణ వైదిక దేవతల సమైక్యాన్నేకాక, వారినుండి కలిగిన మానవాళియొక్క సమైక్యాన్నికూడ చాటుతూ, ఈ కాలంవారు కోరే జాతీయ సమైక్యానికీ, విశ్వమానవ సోదరభావానికీ పునాదులు వేస్తున్నదికదా. ఈ విధంగా ఈ గ్రంథం "జై జగత్'' నినాదానికిగూడ ఊత నిస్తున్నది. పరమాణువునుండి పరమాత్మ వరకూగల సర్వమూ పరమాత్మయే, పరమాత్మ స్వరూపమే అనే ప్రత్నానందుల విశాల విశ్వసృష్టి సమైక్యభావం, ఆత్మ దృష్టి – ఇలాంటివి ; ఇందులో ఏ భాగంలోనూ, ఏ అణుపరమాణువుల లోనూ సంకుచితత్వానికి తావే లేదు. వేదద్రష్టలైన పరమ బ్రహ్మఋషుల ఏకంసత్, సర్వం ఖల్విదం బ్రహ్మ – భావమేకాక, విశాల విశ్వవస్తు, విశ్వకర్మ, విశ్వబ్రహ్మైక్యభావమే అంతటా గోచరిస్తున్నది. పరమాణువు నుండి పరమాత్మవరకు అన్నీ, ఆలోచనీయాలే, ఆచరణీయాలే ఆరాధనీయాలే, అనుభవనీయాలే అని గ్రంథం చెపుతున్నది. దీన్ని చదివి మననంచేసి అనుభూతికి తెచ్చుకొంటే నరుడు రాగద్వేషాదిబంధరహితుడై దుఃఖదూరుడై అమృతానందరూపుడై ప్రకాశించగలడనడంలో ఎలాంటి సందేహమూ లేదు.

ప్రత్నానందులు వేదాలనుండి ఇలాంటి ఎన్నో రహస్యాలను ఆవిష్కరించడానికి, ఆయన చేసిన విశిష్టయోగమార్గ సంచారమూ, దానిచే పొందిన ఒకానొక అతీంద్రియ విషయ దర్శనశక్తే కారణాలు. యోగంవల్ల ప్రకృతిలో అసాధ్యమనేది మనకు ఏదీలేదని పాతంజలాదియోగ శాస్త్రాలు, బ్రహ్మంగారు మొదలైన యోగీశ్వరుల అనుభవాలు చాటుతూనే ఉన్నాయికదా ! ఈ శక్తిని, తన పుస్తకాలను చదివి జీర్ణించుకొన్నవారు ఇంకా ఇతోధికంగా సాధనచేసి సంపాదించవచ్చునని ఆయన అంటారు. ఇలాంటి రహస్యాలు వారి ఉత్తర యోగమార్గ గ్రంథంలో దొరుకుతాయని ఆశించవచ్చు.

ప్రత్యగాత్మానందులకు జరిగిన ఒక సన్మానసభలో తెలుగు విశ్వవిద్యాలయం మాజీ ఉపాధ్యక్షులు ప్రొఫెసర్ తూమాటి దోణప్పగారు ఇలా అన్నారు. "ఆచార్యులుగారు అందరూవ్రాసే పుస్తకాలవంటివి వ్రాయరు. ఆయనవ్రాసే పుస్తకాలవంటివి అందరూ వ్రాయలేరు." ఈ మాటలు వారి విలక్షణమైన గ్రంథరచనా విశేషాన్ని చెబుతున్నవికదా.

అనేకులు ప్రత్యగాత్మానందుల దర్శనాలను చదివి వారికి వ్రాసే శతాధిక ప్రశంసా లేఖలు, వారిని విశ్రాంతిరహితంగా గ్రంథరచనకు ప్రేరేపిస్తున్నాయి. అలాగే అనసూయులు, గుణగ్రహణపరులు అయిన పండితుల ప్రశంసలుకూడ వారికృషిని బలపరచేవిగానే ఉన్నాయి. ఇందుకు వీటిమీద సంస్కృతాంధ్రాంగ్ల భాషలలోగల ఉపోద్ఘాతాదులే నిదర్శనాలు.

ఇంత చేసినా, చేస్తున్నా, ఆయన అతినిరాడంబరుడు. అహంకారమనేది ఆయనకు లేనేలేదు. తెనాలి వీథులలో ఒక అమాయకుడిలా, పిచ్చివాడిలా అందరితో కలసిమెలసి – అన్నిటిలో బ్రహ్మమునూ, అన్నిటినీ బ్రహ్మములోనూ చూస్తూ, తిరుగుతూ కాలక్షేపం చేస్తూఉంటారు. అందుకే తత్త్వవేత్తల స్థితిని తన మిత్రహసాస్రిలో ఇలా వర్ణించిపెట్టారు.

పిచ్చివానివలెను, పిన్నవానింబలె
గాలి సోకినతని కరణిఁ దిరుగు
బ్రహ్మవిదుని గుర్తుపట్టుట సాధ్యమా!
విశ్వహితచరిత్ర వినరమిత్ర!

ఇది ఎందుకు చెప్తున్నానంటే, ఆయన గ్రంథాలన్నీ ఆయన అనుభూతులే కాని, వేరు కాదనడానికే.

# కృతజ్ఞతలు

నాన్నగారి ఇతర దర్శనాలకువలె ఈ యజుర్వేద దర్శనానికికూడ ధన సహాయం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానములవారి మేలు ఎన్నటికీ మరువలేము.

అలాగే K.C.P. వుయ్యూరు పంచదార ఫ్యాక్టరీలో సీనియర్ డ్రాఫ్ట్‌మేన్‌గా ఉన్న శ్రీ అరెపాక సుబ్బారావుగారు, రు. 216 లూ, ఫణిదపు ప్రభాకరశర్మగారు రు. 116 లు ఇచ్చి తోడ్పడినారు. వీరందరికీ, గ్రంథాన్ని శ్రద్ధగానూ, విమర్శగానూ చదివి తమ అమూల్య సమీక్షానుభూతిని వ్రాసియిచ్చిన సహృదయ పండితులు శ్రీ భాగవతుల కుటుంబరావుగారికీ మా కృతజ్ఞతానమస్కారములు. ఋగ్వేదదిగ్దర్శనములవలె ఈ యజుర్వేద దర్శనం కూడ తెలుగువారి ఆమోదప్రమోదాలను చూఱగొనగలదని ఆశిస్తున్నాము.

విజయ నగరం.
20—3—90

ఆనందవర్ధన
న్యూస్ ఎడిటర్ : 'ఆంధ్రప్రభ'

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| 1. | వందనాదికము | 1 |
| 2. | యజుః ప్రశంస | 3 |
| 3. | శత రుద్రీయము | 9 |
| 4. | నమకము - అర్థవివరణ | 18 |
| 5. | నమకరహస్యము | 86 |
| 6. | శ్వేతాశ్వతర సమన్వయము | 96 |
| 7. | విశ్వరూపకథా పరమార్థము | 128 |
| 8. | విశ్వకర్మ సూక్తము | 142 |
| 9. | విశ్వకర్మ సూక్తార్థవివరణ | 146 |
| 10. | శుక్లయజుర్విశ్వకర్మ సూక్తము | 193 |
| 11. | విశ్వకర్మా జగద్గురుః | 198 |
| 12. | కృష్ణం వందే జగద్గురుం | 206 |
| 13. | సృష్టితత్త్వము | 209 |
| 14. | సగుణ బ్రహ్మము | 222 |
| 15. | పరమోపాసన | 224 |
| 16. | గాయత్రి | 226 |
| 17. | చతుష్పాద్విభూతి | 234 |
| 18. | సావిత్రి | 239 |
| 19. | పంచ విధ సామ్యములు | 242 |
| 20. | గాయత్రీ మంత్రార్థము | 245 |

| | | |
|---|---|---|
| 21. | సవిత | 246 |
| 22. | విశ్వ శంభువు | 254 |
| 23. | పురుషుడు | 259 |
| 24. | పంచ తత్త్వములు | 269 |
| 25. | పంచ ఋషులు | 281 |
| 26. | వసిష్ఠాది ఋషిపంచకము | 284 |
| 27. | అవతారములు (మూర్తి భేదములు) | 295 |
| 28. | మూర్తుల సమైక్యము | 301 |
| 29. | భావనావతరము | 304 |
| 30. | ప్రాభాసుడు | 306 |
| 31. | చమకము | 309 |
| 32. | చమకము - అర్థవివరణ | 311 |
| 33. | చమక రహస్యము(ఈశావాస్య దృష్టి) | 328 |
| 34. | ఉపసంహారము | 337 |
| 35. | మంగళా శాసనము | 339 |
| 36. | అనుబంధము | 342 |




## లభించే ఇతర గ్రంథాలు

| | | |
|---|---|---|
| 1. | ఋగ్వేదదిగ్దర్శనము (2వ భాగం) | 25.00 |
| 2. | ,, 3వ భాగము | 25.00 |
| 3. | ఆత్మ దర్శనము | 14.00 |
| 4. | యోగ దర్శనము | 15.00 |
| 5. | తత్త్వసాధన | 15.00 |
| 6. | మిత్ర సాహస్రి | 12.00 |
| 7. | విశ్వకర్మ పురాణము (తాత్పర్యసహితం) | 12.00 |
| 8. | నాగరఖండము | 12.00 |
| 9. | మాఘ పురాణము | 12.00 |
| 10. | అనర్ఘ రాఘవము | 12.00 |
| 11. | తత్త్వసూక్తులు (2వ భాగం) | 10.00 |
| 12. | మోహనాంగి (నవల) | 10.00 |
| 13. | అమరావతి (పద్య కావ్యం) | 5.00 |
| 14. | శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతం | 4.00 |
| 15. | ఋగ్వేద దిగ్దర్శనము (1వ భాగం) | |
| 16. | లేపాక్షి (నవల) | |
| 17. | కళారాధన (నవల) | |
| 18. | మూడు కావ్యాలు (సమీక్ష) | |
| 19. | తత్త్వసూక్తులు (1వ భాగం) | |
| 20. | సాహిత్య వ్యాసాలు | |

చివరి ఆరూ పునర్ముద్రణం కావాలి.

గ్రంథకర్తపేర, గాంధీనగర్ - తెనాలి H O Pin : 522 201.

# యజుర్వేద దర్శనము

## ప్రథమ భాగము

## ఏకం సత్

### వందనాదికము

శ్లో॥ పంచాననాది సామ్యేన, పంచ సృష్ట్యాది కర్మభిః
వేదస్య పితరా వన్దే ఆద్యా వన్యర్థ దంపతీ. 1

తా. అయిదు మోములు, పదిచేతులు మొదలగు పోలికలచేతను, సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అను గ్రహము - అనెడి అయిదు కర్మలచేతను, సార్థకత్వమును పొందిన ఆదిమదంపతులగు వేదజననీ జనకులకు వందనము.

శ్లో॥ నమ స్తే వేదమాత్రే తే, జగదాకృతయే సదా,
నమ స్తే వేదపిత్రే తే, జగదాత్మ స్వరూపిణే. 2

తా. పంచభూతమయములగు జగత్తుల ఆకారమే అయిన వేదమాత (గాయత్రి) వగు నీకు నమస్కారము. జగద్రూపమునే కాక, దాని కాధారమైన అంతరాత్మ స్వరూపమునుకూడ తాల్చిన వేదజనకుడవగు (విశ్వకర్మకు) నీకు నమస్కారము. గాయత్రీ విశ్వకర్మల పరమతత్త్వము ఈ గ్రంథమునందు కొంతవఱకు చదువగలరు.

శ్లో॥ శ్రుతి సూక్తాని సర్వాణి యః క్రమేణ విభక్తవాన్
చతుర్వేద స్వరూపేణ, వేదవ్యాసం స్మరామి తమ్. 3

తా. ఏ మహానుభావుడు సమస్తమైన శ్రుతిసూక్త రాశిని ఋగ్యజుస్సామాథర్వములనెడి నాలుగు వేదములుగా విభజించినాడో, అట్టి వేదవ్యాసుని స్మరింతును.

శ్లో॥ ఆత్మనః పితరౌ వన్దే, పార్వతీశ్వర రూపిణౌ
యజుర్దర్శన నిర్మాణ నిష్ప్రత్యూహ సమాప్తయే. 4

తా. ఈ యజుర్వేద దర్శనము నిర్విఘ్నముగా పూర్తికావలయునని పార్వతీశ్వరస్వరూపులైన నా తలిదండ్రులను పార్వతీ కోటీశ్వరాచార్యులను స్తుతించుచున్నాను.

శ్లో॥ ప్రత్నం జ్ఞానం సమాసాద్య, ప్రత్నానందయ ఈరితః,
సోఽహం ప్రత్నర్షి మాత్మజ్ఞో, గోత్రకర్తార మాశ్రయే. 5

తా. ఏ నేను సనాతనమైన వేద విజ్ఞానము నార్జించి ప్రత్నానందస్వామిఅని చెప్పబడితినో, అట్టి ఆత్మవేత్తనైన నేను, నా గోత్రకర్తయైన ప్రత్నఋషిని ఆశ్రయించుచున్నాను.

శ్లో॥ యజుస్తత్వం భావయిత్వా యథాశక్తి చిరం హృది,
విరచ్యతే యజుర్వేద-దర్శనం నామ సత్కృతిః. 6

తా. యజుర్వేదముయొక్క తత్వమును శక్తి ననుసరించి చిరకాలము భావనచేసిన నాచేత యజుర్వేదదర్శన మనెడిఈ గ్రంథము రచింపబడుచున్నది.

## యజుః ప్రశంస

ఋగ్ యజు స్సామాథర్వ వేదములని లోకవ్యవహారము. ఇది పురాణేతిహాసములనుండి లోకమునకు సంక్రమించి యుండవచ్చును. కనుకనే భాగవతపురాణము "ఋగ్ యజు స్సామాథర్వాఖ్యాన్ వేదాన్ పూర్వాదిభి ర్ముఖైః (భాగవతంస్కం-6-అధ్యా. 2.)" బ్రహ్మదేవుని పూర్వాది ముఖములనుండి వరుసగా ఋగ్యజుస్సామాథర్వవేదములు పుట్టిన వన్నది. కాని ఋగ్వేద దశమ మండలమునందలి 90 వది అయిన పురుష సూక్తములోని 9 వ మంత్రము ఇట్లనుచున్నది.

"తస్మా ద్యజ్ఞా త్సర్వహుతః" ఋచ స్సామాని జజ్ఞిరే,
ఛందాగ్ంసి జజ్ఞిరేతస్మాత్ యజు స్తస్మా దజాయత.

ఋ 10-90-9

ఆ యజ్ఞమునుండి ఋక్కులు, సామములు, ఛందస్సులు (గాయత్రి మొదలైనవి) కలిగినవని చెప్పి అటు పిమ్మటనే దానినుండి యజుర్వేదము కలిగినదని పలికినది. దీనినిబట్టి వేదములవరుస ఋక్కు, సామము, యజుస్సు- అని తెలియుచున్నది. ఈ ఋగ్వేదవాక్యమునకు బలముగా యజుర్వేదముగూడ ఇట్లనుచున్నది.

ప్రజాపతి ర్విశ్వకర్మా మనో గంధర్వః,
తస్య ఋక్సామా న్యప్సరసో వహ్నయః"

యజుఃకాండం 3- ప్రపా 4- అను 7.

దీనికి సాయణుల భాష్యము :- "ప్రజానాం పాలకః ప్రజాపతిః, విశ్వం కర్మ కరణీయం యస్యాసౌ విశ్వకర్మా. తాదృశో మనోనామకః కశ్చిద్గంధర్వః. తస్య చ ఋక్సామ దేవతా భార్యాః. తాశ్చ సౌందర్యం వహంతీతి వహ్నయ ఇత్యుచ్యంతే". దీనిభావము ఇది:- ప్రాణిలోక రక్షకుడును విశ్వముయొక్క సృష్ట్యాదికర్మములు కలవాడును అయిన దేవుడు విశ్వకర్మ. అతడే మనోనామకుడైన ఒకానొక గంధర్వుడు. అతనికి ఋక్సామదేవతలు భార్యలు. వారు సౌందర్యమును వహింతురుగాన (వహ్నులు) భార్యలు అగుచున్నారు. ఇక్కడ అప్సరశ్శబ్దము భార్య అను అర్థమున వాడబడినది. విశ్వకర్మ గంధర్వావతారము (రూపము) తాల్చినట్లు యజుర్వేదీయ విశ్వకర్మసూక్తము. ఇట్లుచెప్పినది.

"విశ్వకర్మా హ్యజనిష్ట దేవ
ఆది ద్గంధర్వో అభవ ద్ద్వితీయః. 4-6-2-8

విశ్వకర్మ మొదట సృష్టికర్తయైన దేవుడై ఆవల రెండవ వాడుగా గంధర్వుడయినాడనుచున్నది. ఇక్కడ మనకు కావలసినది ఋక్సామవేదములయొక్క వరుస మాత్రమే. ఆవరుస ఋగ్వేద పురుషసూక్తమువలె ఈ యజుర్వేద మంత్రములుకూడ చెప్పినవి. ఇంకను యజుర్వేదప్రథమకాండ ద్వితీయ ప్రపాఠకమునకూడ "ఋక్సామయో శ్శిల్పే స్థః, తే వా మారభే తేమా" అని ఋక్ నామ పదములవరుస వినబడుచున్నది. కృష్ణయజు ర్ద్వితీయ

కాండ చతుర్థప్రశ్నమునకూడ "త దస్మై త త్ప్రాయచ్ఛ దృచ స్సామాని యజూగ్ంషి" (42) అని కలదు.

ఋక్కులు జ్ఞాన ప్రధానములయినవి. అవి దైవశక్తులను ప్రకాశింపచేయునట్టివికూడ. అనగా ఋగ్వేదపఠనము చేతను, అర్థ రహస్యముల మననముచేతను జగత్కారణ మయిన దివ్యశక్తి సాధకులకు తెలియునన్నమాట! ఆశక్తిని ఆరాధించుటకు భక్తియోగము, గానము ప్రధానమయిన సామవేదము సాధనమని ఋగ్యజుర్మంత్రములు దానిని రెండవదిగా పేర్కొన్నవి. దీనికి తగినట్లుగానే తైత్తిరీయోప నిషత్తు (శీక్షావల్లి) కూడ "భూః, భువః, సువః" అనెడి వ్యాహృతులను పేర్కొని తర్వాత "భూరితి వా ఋచః, భువ ఇతి సామాని, సువరితి యజూగ్ంషి, మహ ఇతి బ్రహ్మ, బ్రహ్మణా వావ సర్వే వేదా మహీయంతే" అని వేదముల క్రమమును భూ ర్భువ స్సువ శ్శబ్దముల ప్రకారము ఋక్సామ యజుస్సులనియే చెప్పినది. ఇక తైత్తిరీయ బ్రహ్మానందవల్లి ప్రాణమును గూర్చి చెప్పుచు మఱియొకవిధముగా వర్ణించినది. "...అన్వయం పురుషవిధః. తస్య యజురేవ శిరః, ఋగ్దక్షిణః పక్షః, సామోత్తరః, పక్షః, ఆదేశ ఆత్మా. అథర్వాంగిసః పుచ్ఛం ప్రతిష్ఠా...." (తృతీయానువాకము). దీనినిబట్టి చూడ సర్వప్రధానమయిన శిరస్సు వంటిదే యజుర్వేద మనియు, ఋక్సామములు రెండును కుడిఎడమల ఱెక్కలవంటి వనియు, అథర్వవేదము తోక అనియు తెలియుచున్నది.

ఆత్మస్వరూపునికి యజుర్వేదము శిరము వంటిదనియు, ఋక్సామవేదములు కుడిఎడమలనుండు రెక్కలవంటివనియు, అథర్వవేదము తోకవంటిదనియు ఈ వర్ణనముచే తెలియుచున్నది. దీనిబట్టి యజుర్వేదమును శిరస్సని చెప్పుటచేత దానికి సర్వప్రాధాన్యము కలదని తెలియుచున్నది. శరీరమునందెల్లా శిరస్సునకేగదా అధిక ప్రాధాన్యము. అందుకే, "సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్" అనినారు. ఇంత మాత్రముచేత ఋగ్వేదమునకంటె యజుర్వేదము ఎక్కువ ప్రాధాన్యము కలదని తలంపరాదు. అయినను యజ్ఞాది కర్మకాండలలో యజుర్మంత్రములకే ప్రాధాన్యమున్నందున దానిని ఉపనిషత్తు శిరమని వర్ణించినది. ఈ తైత్తిరీయ మంత్రమునకు భాష్యము వ్రాయుచు శంకరులు యజ్ఞాదులలో ఉపయోగింపబడుటచేతనే యజుస్సునకు అంతటి ప్రాధాన్యమనినారు. కనుకనే వ్యవహారమున ఋగ్యజుస్సామాథర్వములనెడి ప్రసిద్ధి కలిగినది.

ఈ దృష్టితో చూచినప్పుడు వేదపురుషుడు (పురుష సూక్తము) పేర్కొన్న క్రమము సరియైనదిగానే తోచవచ్చును. కాని కర్మప్రధానమయిన యజుర్వేదమును రెండవదిగా బ్రాహ్మణాది గ్రంథములు, పురాణేతిహాసములు పేర్కొన్నవి. కర్మము సర్వప్రాణి సాధారణమైనట్టిది. భక్తి జ్ఞానములు ఉన్నను, లేకున్నను ప్రతి వ్యక్తి కర్మను చేయగల్గును. భక్తిజ్ఞానముల అనుష్ఠానము కొంత కష్టముతో కూడి

నట్టిది. అందుచేత వేదపురుషుడు సామమును రెండవదిగా లెక్కించినను, వ్యావహారిక జగత్తున అది కర్మమునకు పిమ్మటిదై మూడవ స్థానమును పొందియుండవచ్చును. సామాన్యముగా జనులందరును కర్మచేయుటకే సంసిద్ధులయి ఉందురుకాని, కష్టములైన భక్తి జ్ఞాన యోగములకు పాల్పడ లేరు. ఈ దృష్టితో చూచిమనము ఋగ్యజుస్సామాథర్వము లనెడి క్రమమును అనుసరింపవలసి యున్నది.

ఈ యజుర్వేదము కృష్ణయజుర్వేద మనియు, శుక్ల యజుర్వేద మనియు రెండు విధములుగా ఉన్నది. కృష్ణ యజుర్వేదమునకే తైత్తిరీయ సంహిత అనికూడ మఱొక పేరు కలదు. అట్లే శుక్లయజుర్వేదమును వాజసనేయ సంహిత అనికూడ అందురు. మంత్రములు, అర్థవాదములు, బ్రాహ్మణ భాగములు కలగా పులగముగా కలసియుండి పాఠకులను భ్రమింపజేయుచుండుటవలన తైత్తిరీయ సంహితకు కృష్ణ యజుర్వేదనామము కలిగినది. అట్లుకాక, వాజసనేయ సంహితలో బ్రాహ్మణ భాగములు కలియక మంత్రార్థ వాదములు మాత్రమే ఉండుటచేత దానిని శుక్లయజుర్వేద మన్నారు. "యజ సేవాయాం" దేవతలను యజ్ఞకర్మలచేత యజించు పద్ధతులు ఇందు చెప్పబడుట చేత దీనికి యజుర్వేద మని పేరు కలిగినది.

**1971-72** సంవత్సరములో వీబర్ పండితుడు ప్రక టించిన తైత్తిరీయ సంహితను బట్టి చూడగా అందు ఏడు

కాండములును, 44 ప్రపాఠకములును గలవు. ఒక్కొక్క ప్రపాఠకమున కొన్ని అనువాకములును, వాటిలో కొన్ని మంత్రములును ఉండును. ఈనాడు మనము వాడుకొనుచున్న కృష్ణ యజుర్వేదము సప్తకాండలతో గూడినట్టిదే. ఒక్కొక్క కాండమునందు 8 గాని, 7 కాని, 6, కాని 5 కాని ప్రపాఠకములు ఉండవచ్చును. ప్రపాఠకములను ప్రశ్నలనికూడ అనుచుందురు. ఇక శుక్లయజుర్వేదము 40 అధ్యాయములు కలదై, పూర్వవింశతియందు 20 అధ్యాయములు, ఉత్తరవింశతియందు 20 అధ్యాయములు కలదై యున్నది. ఉత్తరవింశతిలోని కడపటి అధ్యాయమే ఈశోపనిషత్తు. ఇది వేదములోనే అంతర్భూతమై యున్నందువలన దీనిని వేదోపనిషత్తు అందురు. ఇందు మొదటి మంత్రము "ఈశావాస్య మిదం సర్వం" అని ప్రారంభమగుచున్నందున దీనికి ఈశోపనిషత్తు అనెడి నామము కలిగినది. 18 శ్లోకములు మాత్రమే కల ఈ ఉపనిషత్తు సర్వశ్రేష్ఠమని చెప్పబడుచున్నది. 18 మంత్రములలోనే తత్త్వార్థ మంతయు సులభముగా ఇమిడ్చి బోధింపబడినది.

ఋక్కులనగా ఛందోబద్ధములై నాలుగుపాదములు గల శ్లోకములు, లేక పద్యము లన్నమాట. వేదములోని శ్లోకములను మంత్రము లందురు. ఇక పాద నియమమును, ఛందోనియమములేక గద్యశైలిలో కొనసాగెడివే యజుస్సులనగా. యజుర్వేదమంతయు చాలభాగము ఇట్టి గద్య

మయమే అనవచ్చును. ఎక్కడనైనను విష్ణు రుద్ర విశ్వ కర్మాది మంత్రములు ఛందోబద్ధములైనవి ఉన్నను అవి ఋగ్వేదమునుండి స్వీకరింపబడినవిగా ఎన్నవచ్చును. అట్లు కాక కొలదిపాటి శ్లోకములుకూడ యజుర్వేదమున లేక పోలేదు. అట్టివాటిని ఉదాహరింపబోవు నమకమునందే మనము కాంచగలము. కృష్ణయజుర్వేదము "ఇషే త్వోర్జే త్వా వాయవస్థో పాయవస్థ దేవో వ స్సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణే...." అనెడి మంత్రముతో ప్రారంభ మగుచున్నది.

తైత్తరీయ సంహితయందలి ఏడు కాండములలోను చతుర్థకాండము మిక్కిలి ప్రశస్తమైనదని చెప్పవచ్చును. ఇందలి - 5, 6, 7 - ప్రపాఠకములలో వరుసగా శతరుద్రీయము (నమకము) విశ్వకర్మ సూక్తములు, చమకము చోటు చేసికొన్నవి. ఇట్లే వేదమున రుద్ర విశ్వకర్మలు అభేదరూపులుగా, జగత్కారణులుగా వర్ణింపబడుదురు. ఇట్టి జగత్కారణ పరబ్రహ్మమును సగుణ నిర్గుణమార్గమున వర్ణించుటచేత ఈ చతుర్థకాండము ఎంతో ప్రాముఖ్యము కలదైనది.

## శతరుద్రీయము

(అనువాకం 1. ఇందు 15 ఋక్కులు కలవు)

"నమ స్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః,
నమ స్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముత తేనమః." 1

యా త ఇషు శ్శివతమా శివం బభూవ తే ధనుః
శివా శరవ్యా యా తవ తయా నో రుద్ర మృడయ. 2

యా తే రుద్ర శివా తనూ రఘోరా పాప కాశినీ
తయా న స్తనువా శంతమయా గిరిశంతాభిచాకశీహి. 3

యా మిషుం గిరిశ స్త హ స్తే (1) బిభ ర్ష్య స్తవే
శివాం గిరిత్ర తాం కురు మాహింసీః పురుషం జగత్. 4

శివేన వచసా త్వా గిరిశా చ్ఛా వదామసి,
యథా న స్సర్వ మిజ్జగ దయక్ష్మం సుమనా అసత్. 5

అధ్యవోచ దధివక్తా ప్రథమో దైవ్యో భిషక్
అహీంశ్చ సర్వా ఞ్జంభయ న్సర్వా శ్చ యాతుధాన్యః. 6

అసౌ య స్తామ్రో అరుణ ఉత బభ్రు స్సుమంగలః,
యే చేమాం రుద్రా అభితో దిక్షు (2) శ్రితాః
సహస్రశో వైషాం హేడ ఈమహే. 7

అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః
ఉతైనం గోపా అదృశ న్నదృశ న్నుదహార్యః
ఉతైవం విశ్వా భూతాని స దృష్టో మృడయాతి నః. 8

నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే,
అథో యే అస్య సత్వా నోఽహం తేభ్యో కఽరం నమః. 9

ప్రముంచ ధన్వన స్త్వ ముభయో రార్త్నియో ర్జ్యామ్,
యా శ్చ తే హస్త ఇషవః (3) పరా తా భగవో వప

అవతత్య ధను స్త్వం సహస్రాక్ష శతేషుధే,
నిశీర్య శల్యానాం ముఖా శివో న స్సుమనా భవ. 11

విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవానుత
అనేశన్న స్యేషవ ఆభు రస్య నిషంగధిః. 12

యా తే హేతి ర్మీఢుష్టమ హస్తే బభూవ తే ధనుః
తయాస్మాన్ విశ్వత స్త్వ మయక్ష్మయా పరిబ్భుజ. 13

నమ స్తే అస్త్వాయుధాయా నాతతాయ ధృష్ణవే
ఉభాభ్యా ముత తే నమో బాహుభ్యాం తవ ధన్వనే.

పరి తే ధన్వనో హేతి రస్మా న్వృణక్తు విశ్వతః
అథో య ఇషుధి స్తవారే అస్మ న్నిధేహి తమ్. 15

(అనువాకం_2. ఇందు 13 యజుస్సులు కలవు)

నమో హిరణ్య బాహవే సేనాన్యే దిశాంచ పతయే
నమో, నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాం పతయే
నమో, నమ స్సస్పింజరాయ త్విషీమతే పథీనాం పతయే
నమో, నమో బభ్లుశాయ వివ్యాధినే (అ)న్నానాం పతయే
నమో, నమో హరికేశా యోపవీతినే పుష్టానాం పతయే
నమో, నమో భవస్య హేత్యై జగతాం పతయే నమో,
నమో రుద్రాయాతతావినే క్షేత్రాణాం పతయే నమో,
నమ స్సూతాయాహంత్యాయ వనానాం పతయే నమో,
నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమో,

నమో మంత్రిణే వాణిజాయ కక్షాణాం పతయే నమో,
నమో భువన్తయే వారివస్కృతా యౌషధీనాం పతయే
నమో, నమ ఉచ్చైర్ఘోషా యాక్రన్దయతే పత్తీనాం పతయే
నమో, నమః కృత్స్నవీతాయ ధావతే సత్వానాం పతయే
నమః.

(అనువాకం_3. ఇందు 12 యజుస్సులు కలవు)

నమ స్సహమానాయ నివ్యాధిన ఆవ్యాధినీనాంపతయే
నమో, నమః కకుభాయ నిషజ్గిణే స్తేనానాం పతయే నమో,
నమో నిషజ్గిణ ఇషుధిమతే తస్కరాణాం పతయే నమో,
నమో వఞ్చతే పరివంచతే స్తాయూనాం పతయే నమో,
నమో నిచేరవే పరిచరాయారణ్యానాం పతయే నమో,
నమస్సృకావిభ్యో జిఘాంసద్భ్యో ముష్ణతాం పతయే నమో,
నమోఽసిమద్భ్యో నక్తంచరద్భ్యః ప్రకృన్తానాం పతయే
నమో, నమ ఉష్ణీషిణే గిరిచరాయ కులుఞ్చానాం పతయే
నమో, నమ ఇషుమద్భ్యో ధన్వావిభ్య శ్చ వో నమో,
నమ ఆతన్వానేభ్యః ప్రతిదధానేభ్య శ్చ వో నమో,
నమోఽ స్యద్భ్యో విధ్యద్భ్య శ్చ వో నమో, నమ ఆసీనేభ్య
శ్శయానేభ్య శ్చ వో నమో, నమ స్స్వపద్భ్యో జాగ్రద్భ్య
శ్చ వో నమో, నమ స్తిష్ఠద్భ్యో ధావద్భ్య శ్చ వో నమో,
నమ స్సభాభ్య స్సభాపతిభ్య శ్చ వో నమో, నమో
అశ్వేభ్యోఽశ్వపతిభ్య శ్చ వో నమః.

(అనువాకం-4. ఇందు 17 యజుస్సులు కలవు)

నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీభ్యశ్చ వో నమో, నమ ఉగణాభ్యస్తృంహతీభ్యశ్చవో నమో, నమో గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో నమో, నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ వో నమో, నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమో, నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమో, నమో మహద్భ్యః క్షుల్లకేభ్యశ్చ వో నమో, నమో రథిభ్యో రథేభ్యశ్చ వో నమో, నమో రథేభ్యో రథపతిభ్యశ్చ వో నమో, నమ స్సేనాభ్యస్సేనానిభ్యశ్చవో నమో,నమః క్షత్తృభ్యస్సంగ్రహీతృభ్యశ్చ వో నమో, నమ స్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమో, నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చ వో నమో, నమః పుంజిష్టేభ్యో నిషాదేభ్యశ్చ వో నమో, నమ ఇషుకృద్భ్యో ధన్వకృద్భ్యశ్చ వో నమో, నమో మృగయుభ్యశ్శ్వనిభ్యశ్చ వో నమో, నమశ్శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చ వో నమః.

(అనువాకం-5. ఇందు 15 యజుస్సులు కలవు)

నమో భవాయచ, రుద్రాయచ, నమ శ్శర్వాయ చ, పశుపతయేచ, నమో నీలగ్రీవాయ చ, శితికణ్ఠాయచ, నమః కపర్దినేచ వ్యుప్తకేశాయ చ, నమ స్సహస్రాక్షాయచ, శతధన్వనేచ, నమో గిరిశాయచ, శిపివిష్టాయ చ, నమో మీఢుష్టమాయ, చేషుమతే చ, నమో హ్రస్వాయ చ, వామనాయ చ, నమో బృహతే చ, వర్షీయసే చ, నమో వృద్ధాయ చ, సంవృధ్వనేచ, నమో అగ్రియాయచ, ప్రథమాయచ, నమ ఆశవే

చాజిరాయ చ, నమ శ్శీఘ్రియాయ చ, శీభ్యాయ చ, నమ ఊర్మ్యాయ, చావస్వన్యాయ చ, నమ స్రోతస్యాయ చ, ద్వీప్యాయ చ.

(అనువాకం-6. ఇందు 15 యజుస్సులు కలవు)

నమో జ్యేష్ఠాయ చ, కనిష్ఠాయచ; నమః పూర్వజాయ చాపరజాయ చః నమో మధ్యమాయ, చాపగల్భాయ చ; నమో జఘన్యాయ చ, బుధ్నియాయ చః నమస్సోభ్యాయ చ, ప్రతిసర్యాయచః నమోయామ్యాయచ, క్షేమ్యాయచ; నమ ఉర్వర్యాయ చ, ఖల్యాయచ; నమశ్శ్లోక్యాయ, చావసాన్యాయచ; నమో వన్యాయ చ, కక్ష్యాయచః నమ శ్శ్రవాయ చ, ప్రతిశ్రవాయ చ; నమ ఆశుషేణాయ, చాశురథాయ చ; నమ శ్శూరాయ, చావభిన్దతే చః నమో వర్మిణే చ, వరూథినే చః నమో బిల్మినేచ, కవచినే చ; నమ శ్శ్రుతాయచ, శ్రుత సేనాయ చ.

(అనువాకం 7. ఇందు 16 యాజుస్సులు కలవు)

నమో దున్దుభ్యాయ, చాహనన్యాయ చః నమో ధృష్ణవే చ, ప్రమృశాయ చః నమో దూతాయచ, ప్రహితాయ చ; నమో నిషంగిణే, చేషుధిమతే చ; నమ స్తీక్ష్ణేషవే, చాయుధినే చ; నమ స్స్వాయుధాయచ, సుధన్వనేచ; నమ స్స్రుత్యాయ చ, పథ్యాయచ; నమః కాట్యాయచ, నీప్యాయ చః నమ స్సూద్యాయ చ, సరస్యాయ చః నమో నాద్యాయ చ,

వైశన్తాయచ; నమఃకూప్యాయ, చావట్యాయ చః నమోవర్ష్యా
య,చావర్ష్యాయ చః నమో మేఘ్యాయ చ, విద్యుత్యాయ చః
నమ ఈధ్రియాయ, చాతప్యాయ చః నమో వాత్యాయచ
రేష్మియాయ చః నమో వాస్తవ్యాయ చ, వాస్తుపాయచ.

(అనువాకం 8. ఇందు 17 యజుస్సులు కలవు)

నమ స్సోమాయ చ, రుద్రాయ చ, నమ స్తామ్రాయ
చారుణాయ చ, నమశ్శఙ్గాయ చ, పశుపతయే చ, నమ
ఉగ్రాయ చ, భీమాయ చ, నమో అగ్రేవధాయ చ,
దూరే వధాయ చ, నమో హన్త్రే చ, హనీయసే చ,
నమో వృక్షేభ్యో, హరికేశేభ్యో, నమస్తారాయ, నమశ్శమ్భవే
చ, మయోభవే చ, నమశ్శఙ్కరాయచ, మయస్కరాయ
చ, నమశ్శివాయ చ, శ్శివతరాయ చ, నమస్తీర్థ్యాయ చ,
కూల్యాయ చ, నమః పార్యాయ చావార్యాయ చ, నమః
ప్రతరణాయ, చోత్తరణాయ చ, నమ ఆతార్యాయ,
చాలాద్యాయ చ, నమశ్శష్ప్యాయ చ, ఫేన్యాయ చ, నమ
స్సికత్యాయచ, ప్రవాహ్యాయ చ.

(అనువాకం 9. ఇందు 19 యజుస్సులు కలవు)

నమ ఇరిణ్యాయ చ, ప్రపథ్యాయ చ, నమః కిం
శిలాయ చ, క్షయణాయ చ, నమః కపర్దినే చ, పులస్తయే
చ, నమో గోష్ఠ్యాయ చ, గృహ్యాయ చ, నమ స్తల్ప్యాయ
చ, గేహ్యాయ చ, నమః కాట్యాయ చ, గహ్వరేష్ఠాయ చ,

నమో ప్రహృదయ్యాయ చ, నివేష్ప్యాయ చ, నమః పాంస
వ్యాయ చ, రజస్యాయ చ, నమ శ్శుష్క్యాయ చ, హరి
త్యాయ చ, నమో లోప్యాయ, చోలప్యాయ చ, నమ
ఊర్వ్యాయ చ, సూర్మ్యాయ చ, నమః పర్ణ్యాయ చ,
పర్ణశద్యాయ చ, నమో౽పగురమాణాయ, చాభిఘ్నతే చ,
నమ ఆక్ఖిదతే చ, ప్రక్ఖిదతే చ, నమో వః కిరికేభ్యో, దేవా
నాం హృదయేభ్యో, నమో విక్షీణకేభ్యో, నమో విచిన్వ
త్కేభ్యో, నమ అనిర్ హతేభ్యో నమ ఆమీవత్కేభ్యః.

(అనువాకం 10. ఇందు 12 ఋక్కులు కలవు)

ద్రాపే అన్ధసస్పతే దరిద్రన్నీలలోహిత, ఏషాం
పురుషాణా మేషాం పశూనాం మాభే ర్మారో మో ఏషాం
కించ నామమత్. 1. యా తే రుద్ర శివా తనూ శ్శివా
విశ్వాహ భేషజీ, శివారుద్రస్య భేషజీ తయా నో మృడ
జీవసే. 2. ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినే క్షయ
ద్వీరాయ ప్రభరామహే మతిమ్. యథా న శ్శ మస
ద్ద్విపదే చతుష్పదే, విశ్వం పుష్టం గ్రామే అస్మి న్న నా
తురమ్. 3. మృడానో రుద్రోత నో మయస్కృధి, క్షయ
ద్వీరాయ నమసా విధేమ తే, య చ్ఛంచయో శ్చ మను
రాయజే పితా, త దశ్యామ తవ రుద్ర ప్రణీతౌ. 4. మా
నో మహాన్త ముత మా నో అర్భకం, మా న ఉక్షన్త ముత
మా న ఉక్షితమ్: మా నో వధీః పితరం మోత మాతరం ప్రియా
మా న స్తనువః రుద్రరీరిషః 5. మా న స్తోకే తనయే మాన

ఆయుషి మా నో గోషు మానో అశ్వేషు రీరిషః, వీరా న్మా నో రుద్ర భామితో వధీ ర్హవిష్మన్తో నమసా విధేమ తే.6. ఆరా త్తే గోఘ్న ఉత పూరుషఘ్నే క్షయద్వీరాయ సుమ్న మస్మే తే అస్తు. రక్షా చ నో అధిచ దేవ బ్రూహ్యధాచ న శ్శర్మ యచ్ఛ ద్విబర్హా స్తుహి. 7. శ్రుతంగ ర్తసదం యువానం మృగం న భీమ ముపహత్నుముగ్రమ్, మృడా జరిత్రే రుద్ర స్తవానో అన్యం త అస్మి న్నివపన్తు సేనాః. 8. పరిణో రుద్రస్య హేతి ర్వృణ క్తు పరి త్వేషస్య దుర్మతి రఘాయోః. అవస్థిరా మఘవద్భ్య స్తనుష్వ మీఢ్వ స్తోకాయ తనయాయ మృడయ 9. మీఢుష్టమ శివతమ శివో న స్సుమనా భవ. పరమే వృక్ష ఆయుధం నిధాయ కృత్తిం వసాన ఆచర పినాకం బిభ్రదాగహి. 10. వికిరిద విలోహిత నమ స్తే అస్తు భగవః, యాస్తే సహస్రం హేతయోఽన్య మస్మ న్నివపన్తు తాః. 11. సహస్రాణి సహస్రధా బాహువో స్తవ హేతయః, తాసా మీశానో భగవః పరాచీనా ముఖా కృధి. 12.

(అనువాకం 11. ఇందు 10 ఋక్కులు, 3 యజుస్సులుకలవు)

సహస్రాణి సహస్రశో యే రుద్రా అధిభూమ్యామ్,
తేషాం సహస్రయోజనేఽ వ ధన్వాని తన్మసి. 1

అస్మి న్మహత్యర్ణవేఽ న్తరిక్షే భవా అధి. 2

నీలగ్రీవా శ్శితికంఠా శ్శర్వా అధః క్షమాచరాః. 3

నీలగ్రీవా శ్శితికంఠా దివగ్ం రుద్రా ఉపశ్రితాః. 4

యే వృక్షేషు సస్పిఞ్జరా నీలగ్రీవా విలోహితాః. 5
యే భూతానా మధిపతయో విశిఖాసః కపర్దినః. 6
యే అన్నేషు వివిధ్యన్తి పాత్రేషు పిబతో జనాన్. 7
యే పథాం పథి రక్షయ ఐలబృదా యవ్యుధః. 8
యే తీర్థాని ప్రచరన్తి సృకావన్తో నిషఙ్గిణః. 9
య ఏతావన్తశ్చ భూయాగ్ంసశ్చ దిశో రుద్రా వితస్థిరే
తేషాగ్ం సహస్రయోజనేఽవధన్వాని తన్మసి. 10

నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యేఽన్తరిక్షే యే దివి యేషా మన్నం వాతో వర్ష మిషవస్తేభ్యో దశ ప్రాచీ ర్దశ దక్షిణా దశ ప్రతచీ ర్దశోదీచీ ర్దశోర్ధ్వా స్తేభ్యో నమ స్తే నో మృడయంతు తే యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తం వో జమ్భే దధామి.

అర్థ వివరణ

కృష్ణయజుస్సంహిత చతుర్థకాండము పంచమప్రపాఠకములో 11 అనువాకములలో శతరుద్రీయమనెడి రుద్రస్తుతి చెప్పబడినది. ఇందు ప్రతినామము చివర 'నమః' అని వచ్చుటచేత దీనిని నమకమనియు అనుచున్నారు. ఋగ్వేదమున నాలుగైదు సూక్తములలో కొలదిమంత్రములలో లయకాలుడుగాను, కోపిగాను, క్రూరుడుగాను వర్ణింపబడిన రుద్రుడు ఇందు సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ, సర్వశక్తిమత్వాది

గుణములు కల మహాదేవుడుగాను, జగదీశ్వరుడుగాను, సర్వ దేవాత్మకుడుగాను కూడ వర్ణింపబడినాడు. పెక్కుసారులు రుద్రుడిందు బహుధా స్తుతింపబడినందున దీనికి శతరుద్రీయ మను పేరుకూడ సార్థకమే. రుద్రుడు గొప్ప వైద్యుడుగా కూడ ఋక్కులలో వర్ణింపబడినాడు. రుద్రనామాభి మంత్రితమైన ఉదకములు రోగములను పోగొట్టునని మన వారి విశ్వాసము. ఆ విశ్వాసము సత్యముకూడ. అందు కనియే శివాలయములందు రుద్రాభిషేకాదులు చేయించు చుందురు. రుద్రులు పదునొకండుగురని ప్రసిద్ధి. అందుకే ఈ ప్రపాఠకమున వారిస్తుతి 11 అనువాకములలో జరిగినది. వసు రుద్రాదిత్యులు విశ్వకర్మచే సృజింపబడిన- ఆయన తన యుఃతే అని మనము ఋగ్వేదదర్శన ద్వితీయభాగమున చదివియే యున్నాము. (18, 19 పుటలు) రాబోవు గ్రంథమునగూడ చదువగలము.

రుద్రశబ్దమునకు "సోఽ-రోదీ ద్య దరోదీత్, త ద్రుద్రస్య రుద్రత్వం" ఆ రుద్రుడు రోదనముచేసెను. అందుచేతనే రుద్రుడయినాడు.— అని ఒక వ్యుత్పత్తి. రుద్ ధాతువును అంతర్భావితప్రేరణముగా ఎంచి కాలముతీరిన ప్రాణులను చంపి, వారి బంధువులను ఏడ్పించువాడని చెప్పికొన్నచో రుద్రశబ్దమునకు లయకాలుడను అర్థము సిద్ధించి, సమంజస ముగా ఉండును. ఇక రెండవ వ్యుత్పత్తి "రుద్ దుఃఖం ద్రావయతీతి రుద్రః" భక్తుల దుఃఖములను పాఱద్రోలు వాడని యున్నది. ఈ రెండర్థములును స్వీకరింపదగినవే.

"నమ స్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః,
నమ స్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముత తే నమః. 1

టీక. హేరుద్ర=ఓరుద్రుడా!, తే=నీయొక్క, మన్యవే=కోపమునకు, నమః=నమస్కారము. దానిని మాపై ప్రదర్శింపకుమని భావము, ఉత=ఇంకను, తే ఇషవే=నీబాణమునకు నమః. తే ధన్వనే నమోఽస్తు=నీ ధనస్సునకుకూడ నమస్కారము, ఉత=ఇంకను, తే బాహుభ్యాంనమః=ఆ బాణాదులను ప్రయోగించు నీ చేతులకు నమస్కారము. వాటిని మాపై ప్రయోగింపవలదనియే ఇట్టిచోట్ల భావము.

"యా త ఇషు శ్శివతమా, శివం బభూవ తే ధనుః
శివా శరవ్యా యా తవ తయా నో రుద్ర మృడయ! 2

తా. ఓరుద్రుడా! నీ శాంతమైన బాణమును, మంగళకరమైన ధనుస్సును, నీ శాంతమైన అమ్ములపొదిని మాపై ప్రయోగింపక మమ్ము సుఖంపజేయుము. అనగా అవి క్రూరములైనను భక్తుల విషయమున శాంతములే అయి సుఖమును కలగించునని భావము.

"యా తే రుద్ర శివా తనూ, ర ఘోరా పాపకాశినీ,
తయా న స్తనువా శంతమయా గిరిశం తాభిచాకశీహి. 3

తా. "రుద్రో వా ఏష య దగ్నిః, తస్యై తే తనువౌ ఘోరాన్యా, శివాన్యా." అగ్ని స్వరూపుడైన రుద్రునికి ఘోరము, శివము అని రెండు శరీరములు కలవు. వీటిలో

ఘోరము హింసించునది. శివము అనుగ్రహించునది. భగవంతు డెప్పుడును భక్తులను అనుగ్రహించుచు దుష్టులచే వారి దుష్కర్మముల ననుభవిపజేయుచు వారిని హింసించుచుండును. అట్లు శిష్టరక్షణ, దుష్టశిక్షణ చేయునవే ఆయన రెండు శరీరములు - అనగా రెండు స్వభావములు. అగ్నికూడ తనను సరిగా ఉపయోగించుకొను వారిని రక్షించుచునూ, తన్ను తాకువారిని కాల్చుచును ఉండునుగదా. ఈ స్వభావములు ప్రతివస్తువునకు ఉండునవే.

తా. ఓరుద్రా! నీయొక్క ఘోరముకానిదీ, పాపములేనిదీ అయిన శివంకరమైన తనువుచేత మమ్ము సుఖింప జేయుము. నీ శివము శాంతము సుఖకరము అయిన తనువునే మాకు చూపుమని భావము. ఈ మంత్రమున రుద్రుడు "గిరిశంత" అని సంబోధింపబడినాడు. అనగా కైలాసగిరియందుండి సుఖమునిచ్చువాడనెడి భావమును భాష్యకర్తలువ్రాసినారు. ఆధారాది చక్రములలో కొండవంటిదై అన్నిటికి పైనుండెడి సహస్రారమునందుండు పరబ్రహ్మమని యోగపక్షముగా అర్థము చెప్పికొనుట లెస్సగానుండును. 3

"యా మిషుం గిరిశంత హస్తే, బిభర్ష్య స్తవే,
శివాం గిరిత్ర తాం కురు మా హింసీః పురుషం జగత్. 4

తా. సహస్రారరూప కైలాసమునందున్న ఓ రుద్రా! శత్రుసంహారార్థమై చేతదాల్చిన నీ బాణమును, మా విషయమునను, మా జంగమ జీవులైన గవాశ్వాదులయందును

శాంతమైనదాని నొనర్పుము. మేము నీకు శత్రువులముకాక భక్తులముకాన మమ్ము హింసింపక సుఖపెట్టుమని భావము. అనగా జగత్కర్తను, జగమును ఆరాధించువారికి సుఖ శాంతులే లభించుచున్నవి కాన జగత్కల్యాణ కార్యములే ఒనర్పుమని ఈ మంత్రముయొక్క నిగూఢార్థము. 4

"శివేన వచసా త్వా గిరిశాచ్ఛావదా మసి,
యథా న స్సర్వ మిజ్జగ దయక్ష్మం సుమనా అసత్". 5

తా. ఓ సహస్రారస్థ పరమాత్మా! మేము నిన్ను పొందుటకు మంగళకరములైన స్తుతివాక్యములనే పలుకుదుము గాక. ఆయననేకాక, ఆయన సృష్టించిన జగత్తులోని ప్రాణులనుగూర్చికూడ మంచిమాటలనే పలుకుదుము గాక అని అంతరర్థము. దీనివల్ల ఎల్లరకు వాక్శుద్ధి అవసరమని గ్రహింపవలసియున్నది. ఇందువలన మేము, మా సంబంధులతోకూడిన సమస్త జగము రోగ బాధలులేనిదీ, మంచి మనస్సు కలదీ అగుగాక, మా దైహిక మానసిక ఆరోగ్యములకు భంగమురానిరీతిగా మేము మాటనేర్పరితనమును చూపుదుము గాక అని రహస్యార్థము. ఈ విధముగా ఈ నమక మంత్రయు భగవన్నుతితోనే కాక, ఆత్మ సంస్కార విధానములతోగూడ కూడియున్నదని గ్రహించి మనుజులు తమ ప్రవర్తనను చక్కజేసికొనవలసి యున్నది. మంత్రములయొక్క మహత్తర ప్రబోధము ఇదియేకాని వేఱుకాదు.

"అధ్యవోచ దధీవక్తా ప్రథమో దైవ్యో భిషక్,
అహీం శ్చ సర్వాన్ జంభయన్, సర్వా శ్చ యాతు
ధాన్యః. 6

తా. సర్వ దైవశక్తులను రక్షించునట్టి మొదటి దేవాదిదేవుడును, వేదములను వచించిన వక్తయు ఆధివ్యాధులను హరించు వైద్యుడును అగు రుద్రుడు మాకపకారము చేయు సర్వవ్యాఘ్రాది క్రూరజంతువులను, రాక్షసులవలె మా కెగ్గుచేయువారిని నాశనము చేయుచు నన్ను సర్వశ్రేష్ఠునిగా ఒనర్చుగాక. అనగా సత్ప్రవర్తనచేత శత్రురహితుడనై, భగవదనుగ్రహముచేత నేను శ్రేష్ఠుడ నగుదునుగాక అని భావము. "భిషక్తమం త్వా భిషజాం శృణోమి" అన్నది రుద్రునిగూర్చి ఋక్కు (2-33-4).

"అసౌ యస్తామ్రో అరుణ, ఉత బభ్రు, స్సుమంగళః
నమే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు (2) శ్రితా
స్సహస్రశో వైషాన్ హేడ ఈ మహే. 7

ఈ మంత్రమున రుద్రుడు సూర్యునిగా స్తుతింపబడుచున్నాడు. సూర్యుడు త్రిమూర్త్యాత్మకుడేకాక పంచమూర్త్యాత్మకుడు, విశ్వకర్మస్వరూపుడు అని మనము చదివియే యున్నాము. అంతేకాదు. గిరిశ, గిరిశంత-శబ్దములకు కైలాసమనియేకాక, సహస్రార కమలమునందలి పరమాత్మ అనియు అర్థవివరణము చేసికొన్నాము. కనుక సూర్యునిలో

ఎల్లదేవతలు కలరనుట సత్యము. అందుకే ఆయవకు చరాచరములను కన్న తండ్రి అను అర్థముకల సవిత, అను పేరు కూడ కలిగినది.

తా. ఈ రుద్రుడు సూర్యస్వరూపుడై ఉదయకాలమున తామ్రుడు - ఎఱ్ఱనివాడుగాను, పిమ్మట అరుణః = లేతఎరుపు కలవాడుగాను, ఆవల పింగళ వర్ణముకలవాడును.అట్లే ఆ యా వేళలయందు సుమంగలః=మంగళకరములైన సప్తవర్ణములు కలవాడుగాను అయి లోకములను అనుగ్రహించి వాటిచే పనులు చేయించుచున్నాడని భావము. అట్టి సూర్యునియొక్క రుద్రరూప కిరణములు వేలసంఖ్యగలవై దశ దిక్కులయందు వ్యాపించిన చీకట్లను పాఱద్రోలుచున్నవి. అట్టి ఆదిత్య, తత్కిరణరూపరుద్రుల క్రోధమును స్తుతించుచున్నాను. "ధ్యేయ స్సదా సవితృమండల మధ్యవర్తీ" అన్నది ఒక్క విష్ణుమూర్తికే కాక, శివ, విశ్వకర్మ,లలితాది సర్వదేవతలకూ చెల్లునని మఱువరాదు. సర్వదేవతలు సూర్యమండల మధ్యవర్తులే. ఈ సూర్యమండలము వెలుపలిది మాత్రమే అని యెంచరాదు. ఇడాపింగళా సుషుమ్నలు కలియుత్రికూటస్థానమే ఆరాధింపదగిన ఋతస్వరూప సూర్యమండలము. దానికి హేతువైనది సహస్రారమనెడి సూర్యగోళమే. దానియందే సర్వదేవతలు నివసించునది.

"అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః,
ఉతైనం గోపా అదృశ న్నదృశ న్నుదహార్యః". 8
ఉతైనం విశ్వా భూతాని, స దృష్టో మృడయాతి నః,

తా. కాలకూటవిషమును తినుటచేత నల్లని కంఠము కలవాడైన ఈ రుద్రుడు లోహితవర్ణముకలవాడై ఆకాశమున సూర్యుడుగాఉండి ఉదయసాయంకాలములను లోకము నిమిత్తమై సృష్టించుచున్నాడు. ఇట్టి సూర్యభగవానుని వేదశాస్త్ర, తత్వానుభవాదులులేని సామాన్యమానవులు, నీళ్ళనుమోయునట్టి సామాన్య స్త్రీ జనముకూడ (ఉదహార్యః = నీళ్ళుతెచ్చు స్త్రీలు) చూచి ఆరాధింపగలుగుచున్నారు. సూర్య నమస్కారాదులచేత సేవించి ఫలితములను పొందుచున్నారని భావము. ఈ శక్తిని సామాన్య స్త్రీ పురుషులే కాక సమస్త భూతములుకూడ చూడగలుగుచున్నవి. అట్లు చూడబడిన సూర్యస్వరూప రుద్రుడు మనలను సుఖపెట్టుచున్నాడు. ఇందు నీలగ్రీవ పదము రుద్రునిగూర్చి ప్రయోగింపబడినది. అనగా విషమును కంఠమున ఇముడ్చుకొన్నవాడని దానిభావము. అట్లే భగవదారాధకులుకూడ విషమువంటిదైన పరులదోషములను బయటికి చెప్పక కంఠములోనే ఇముడ్చుకొనవలయునని అంతరర్థము. అనగా ఈశ్వరభక్తులు నీలగ్రీవునివలె చరించవలెనన్నమాట. ఈ అంశమునే ఒకకవి ఇట్లు చమత్కారముగా పలికినాడు.

"గుణదోషౌ బుధో గృహ్ణన్ ఇందు క్ష్వేడా వివేశ్వరః,
శిరసా శ్లాఘతే పూర్వం, పరం కంఠే నియచ్ఛతి".

తా. బుద్ధిమంతుడైనవాడు ఇతరుల గుణదోషములను గ్రహించి, శివుడు అందరికగపడునట్లు చంద్రుని శిరమున తాల్చి, విషమును ఎవరికీ అపకారమొనర్పనీయక కుత్తుక లోనే దాచినట్లు దోషమును గుండెలోనే ఉంచుకొని గుణమును గూర్చి లోకమునకు చాటవలయును.

"నమో అస్తు నీలగ్రీవాయ, సహస్రాక్షాయ మీఢుషే
అథో యే అస్య సత్వానో అహం తేభ్యోఽకరం
నమః. 9

తా. సహస్రాక్షుడనగా ఇంద్రుడని ఒక అర్థము. అట్టి ఇంద్రస్వరూపుడును, నీలగ్రీవుడును అయిన రుద్రునకు నమస్కారము. వర్షములనిచ్చునట్టి మేఘరూపు (మీఢుషే) డైన రుద్రునికి నమస్సు. అంతేకాదు. ఆ భగవంతునికి భృత్యులు, సేవకులు, భక్తులు అయినవారికి కూడ నా నమస్కారము. ఇక్కడ ఒక విశేషము; అందఱు భగవంతుని స్వయముగా చూడలేరు. కాని ఆ భగవంతుని చూచిన భక్తులనూ, సేవకులనూ చూచి తరించగలరు. అందుకే భగవత్సేవకంటెను భక్తులసేవ గొప్పదని ప్రతిసిద్ధాంతమూ చాటుచున్నది. కనుకనే మంత్రము ఆ రుద్రసంబంధులైన వారికి నమస్కార మన్నది.

సహస్రాక్ష శబ్దమునకు ఇంద్రుడనియేకాక, విశ్వపిత అయిన విశ్వకర్మ అనికూడ అర్థము చెప్పుకొనుట లెస్స. ఆ జగత్కర్తను విశ్వకర్మ సూక్తమంత్రము.

విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో
విశ్వతో హస్త ఉత విశ్వత స్పాత్."

—యజుః - 4-6-2. 10

ఆయన అంతటను కన్నులు, మోములు, చేతులు, కాళ్ళు కలవాడని వర్ణించినదికదా. ఈ మంత్రవాక్యమును బట్టి "సహస్ర శీర్షా పురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్" అని పురుష సూక్తమును, "సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వ శంభువం" అని మంత్రపుష్పమును పేర్కొన్న ఈ మంత్రములందలి పరమాత్మ నమకములోని సహస్రాక్ష స్వరూప రుద్రుడు అనికూడ చెప్పుకొనుట రుద్రునియొక్క సర్వేశ్వరత్వ సర్వపితృత్వములకు నిదర్శనముగా నుండును.

'నమః' అనగా కేవలము చేతులెత్తి దండము పెట్టుటయే కాదు. సర్వేంద్రియములను ఆయనకు, తద్భక్తులకు సమర్పించి వాటితో వారిని సేవించి ధన్యులగుటయనియే నమశ్శబ్దముయొక్క అంతరర్థము దీనిచేత "శ్రవణం, కీర్తనం, కేళిః" మొదలైన నవవిధ భక్తులు చెప్పబడినవి.

"ప్రముంచ ధన్వన స్త్వ ముభయో రార్త్ని యో ర్జ్యాం,
యా శ్చ తే హస్త ఇషవః(3)పరా తా భగవోవప!10

తా. షడ్గుణైశ్వర్య సంపదకల ఓ రుద్ర దేవా! నీవు నీ వింటియొక్క కొప్పులయందు తగిలించియున్న అల్లె త్రాటిని శిథిలపఱుపుము అనగా వింటినెక్కు పెట్టవలదని భావము. అట్టే ప్రయోగించుటకోసమై నీ చేత తాల్చిన బాణములనుకూడ పరిత్యజింపుము. ఇందు భక్తుడు రుద్రుని తనపై ఖడ్గబాణాదులు ప్రయోగింపవలదని వేడుచున్నాడు.

"అవతత్య ధను స్త్వం, సహస్రాక్ష శతేషుధే!
నిశీర్య శల్యానాం ముఖా, శివో న స్సుమనాభవ!. 11

తా. నూరు అమ్ములపొదులుగల ఓ సహస్రాక్షరూప రుద్రా! నీవు నీ ధనుస్సును నారి లేనిదానిని చేసి బాణముల యొక్క ఇనుపములుకులను క్రింది చూచునట్లు అమ్ముల పొదులలో పెట్టి మాయెడ రోషింపక శాంతుడవు, మమ్ము గూర్చి అనుగ్రహముతో గూడిన మంచి మనస్సు కలవాడవు కమ్ము. అనగా నీ కోపమును, మాయెడ చూపక అనుగ్రహమునే మా విషయమున ప్రదర్శింపుమని ప్రార్థన. 11

"విజ్యం ధనుః కపర్దినో, విశల్యో బాణవా నుత,
అనేశ న్నస్యేషవ, ఆభు రస్య నిషంగధిః. 12

తా. జటాజూటముకల రుద్రునియొక్క ధనుస్సు తగిలించబడిన నారికలది కాకుండుగాక. బాణములు ములుకులు లేనివగుగాక. అనగా అమ్ములపొదిలోనుండి బయటికి రాకుండుగాక అని భావము. కనుకనే అతని బాణములు

ప్రయోగింప సమర్థములు కాకుండుగాక. అతని ఖడ్గము కోశము (కత్తిఒర) నుండి బయటికి రాకుండుగాక. అనగా రుద్రునియొక్క ధనుర్బాణ ఖడ్గాద్యాయుధములు మాజోలికి రాకుండుగాతమని వేడికోలు.

"యా తే హేతి ర్మీఢుష్టమ, హస్తే బభూవ తే ధనుః,
తయా స్మాన్ విశ్వత స్త్వ మయక్ష్మయా పరింభుజ. 13

తా. కోరికల నొసంగునట్టి ఓ రుద్రా! నీ చేతిలోని ఖడ్గ బాణ ధనురాది ఆయుధములచే మా కెగ్గు కలుగనీయక మమ్ము ఎల్ల రీతుల ఆరోగ్యాది సుఖములతో పాలించి రక్షింపుము. 13

"నమ స్తే అస్త్వాయుధాయా నాతతాయ ధృష్ణవే,
ఉభాభ్యాముత తే నమో, బాహుభ్యాం తవ ధన్వనే.
"పరి తే ధన్వనో హేతి రస్మాన్ వృణక్తు విశ్వతః,
అథో య ఇషుధి స్తవారే, అస్మ న్ని ధేహి తమ్. 15

తా. ప్రయోగింప తగినదైనను, ఎక్కుపెట్టబడనట్టి నీ బాణమునకును, బాణములను ప్రయోగించు నీ రెండు చేతులకూ, నీ ధనస్సునకూ మా జోలికి రావలదని నమస్కరించుచున్నాము (14). నీ ధనుస్సునందలి బాణములు మా జోలికి రాక మమ్ము వదలిపెట్టుగాక. అంతేకాదు. నీ అమ్ములపొదిని కూడ మాకు దూరముగా నుంచుము.

అనగా నీ సర్వాయుధములనుండి మా కెగ్గు కలుగనీయకుమని సారాంశము. ఈ 15 మంత్రములతో మొదటి అనువాకము పూర్తి అయినది. ఇక రెండవ అనువాకము ప్రారంభమగుచున్నది. ప్రథమానువాకమున రుద్రుని ప్రధానమైన శరీరమును స్తుతించి, పిమ్మట జగన్నిర్వహణ హేతువులయిన లీలావిగ్రహములను 8 అనువాకములచే స్తుతించుట అగుచున్నది. ఈ ఎనిమిది అనువాకములలోని వన్నియు యజుర్మంత్రములేకాని ఛందోబద్ధమైన ఋక్కులు కావు. ఇవి ఉభయతో నమస్కారములు, ఏకతర నమస్కారములు అని రెండు విధములు. ఉభయతో నమస్కారములనగా ఆద్యంతముల నమస్సులు కలవి. వీటిలో మూడు అనువాకముల యందు నమస్కారము ఆదియందు, అంతమందు ఉండును. తక్కిన 5 అనువాకములయందు నమస్కార మొక్కటొకటిని కల యజుస్సు లుండును. ఈ ద్వితీయానువాకమున 13 యజుస్సు లున్నవి. అందు మొదటిది.

"నమో హిరణ్య బాహవే, సేనాన్యే, దిశాం చ పతయే నమో, నమో వృక్షేభ్యో హరికేశేభ్యః, పశూనాం పతయే నమో, నమః సస్పింజరాయ, త్విషీమతే, పథీనాం పతయే నమో, నమో బభ్లుశాయ, వివ్యాధినే, ఒన్నానాం పతయే నమో,నమో హరికేశాయోపవీతినే, పుష్టానాం పతయే నమో, నమో భవస్య హేత్యై, జగతాం పతయే నమో, నమో రుద్రాయాతతావినే, క్షేత్రాణాం పతయే

నమస్సూ తాయాహంత్యాయ వనానాం పతయే నమో(1)
నమో రోహితాయ, స్థపతయే, వృక్షాణాం పతయే నమో,
నమో మంత్రిణే వాణిజాయ కక్షాణాం పతయే నమో,
నమో భువన్తయేవారివస్కృతాయౌషధీనాం పతయేనమో,
నమ ఉచ్చైర్ఘోషాయాక్రన్దయతే పత్తీనాం పతయే నమో,
నమః కృత్స్నవీతాయ ధావతే సత్వానాం పతయే నమః(2)

టీక :- హిరణ్య బాహవే నమః = బంగారునగలు చేతులయందుగల రుద్రునికి నమస్కారము, సేనాన్యే = సేనలను నడుపు సేనాపతియు, దిశాంచ పతయే నమః = దిక్కులకు అధిపతియు అయిన రుద్రునకు నమస్కారము (1) ఇక్కడ దిశాధిపత్యమనునది రుద్ర విశ్వకర్మాదులకు కలదని దిగువ నుదాహరించిన యజుర్మంత్రము పలుకుచున్నది. —

"విశ్వకర్మా దిశాం పతి స్స నః పశూ న్పాతు,
సోఽస్మా న్పాతు తస్మై నమః. ప్రజాపతీ
రుద్రో వరుణోఽగ్ని ర్దిశాం పతి స్స నః
పశూ న్పాతు సోఽస్మా న్పాతు తస్మై నమః."
— యజుఃకాండం. 5- ప్రశ్న 5. 22

హరికేశేభ్యః వృక్షేభ్యః నమః = పచ్చనిరంగుగల ఆకులే కేశములుగాగల వృక్షస్వరూపుడైన రుద్రునికి నమస్కారము. చరాచరాత్మకమైన సర్వజగత్తు పరమేశ్వర

స్వరూపమే అనిచెప్పదలచిన శ్రుతిమాత ఈ మంత్రములలో సర్వమును రుద్రరూపముగా భావించి ఆరాధింపుమని ప్రబోధించుచున్నది. పశూనాం పతయే నమః = పశువులనగా జీవులని భావము. అట్టి జీవుల కందఱికి ప్రభువైన రుద్రునకు నమస్కారము. జీవులు పశువులనియు, వారికిగల సంసారము పాశమనియు, ఆ పాశమును తెగగొట్టి జీవులకు మోక్షము నిచ్చుపాలకుడు ఈశ్వరుడనియు శైవదర్శనములు పలుకుచున్నవి. (2)

సస్పింజరాయ త్విషీమతే = లేతపచ్చికవంటి కాంతి గలవాడును, కాంతిమంతు (చిత్స్వరూపు)డును, పథీనాం పతయే నమః = దక్షిణము, ఉత్తరము, మధ్యమము అనెడి మార్గములకు పాలకుడును అయిన రుద్రునకు నమస్కారము. వేదాంతమున అర్చిరాదిమార్గము, ధూమాదిమార్గము, మధ్యేమార్గము అని మూడుత్రోవలు కలవు. వీటిలో మొదటిరెంటిని దక్షిణోత్తరాయణము లనియు అందురు. తన్నారాధించువారిని ఆ త్రోవలలో పయనింపజేయువాడని భావము. (3)

బభ్లుశాయ = బభ్రువనగా వృషభము. దానిమీద నుండువాడు బభ్లుశుడు. అనగా రుద్రు డన్నమాట. ఇక్కడ రలయోరభేదమును పాటించి బభ్రుశబ్దము బభ్లువుగా ప్రయోగింపబడినది. వివ్యాధినే = శత్రువులను వధించువాడును,

అన్నానాం పతయే నమః = జీవులు తినెడి ఆహారములకు పోషకుడును అగు రుద్రునకు నమస్కారము. (4)

హరికేశాయ = నల్లనివెంట్రుకలు గలవాడును, నిత్య యౌవనుడు కనుక ఆయన కేశము లెప్పుడును తెల్లబడవని భావము. ఉపవీతినే = మంగళార్థము యజ్ఞోపవీతమును తాల్చినవాడును, పుష్టానాం పతయే నమః = సర్వగుణముల చేతను, సర్వసంపత్తులచేతను పరిపూర్ణులైన వారికి స్వామియు అగు రుద్రునకు నమస్సు. (5)

భవస్య=జీవుల సంసారమునకు, హేత్యై=కర్తివంటి వాడును, జగతాం పతయే నమః = జగత్ప్రభుడైన రుద్రు నకు నమస్కారము. (6)

ఆతతావినే = భక్తరక్షకుడును, క్షేత్రాణాం = శరీ రములకు, పతయే = ప్రభుడైన, రుద్రాయ నమః = రుద్రు నకు నమస్సు. "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అని గీత 13 వ అధ్యాయ మనుచున్నది. కనుక క్షేత్రపాలకుడగుజీవుడు రుద్రుడే అని మంత్రభావము. అనగా క్షేత్రమునెఱింగిన జీవుడు రుద్రరూపుడే అని ఇక్కడ అద్వై తమే ప్రతిపాదింపబడినది. ద్వైతులు క్షేత్రములను పాలిం చెడి జీవులు వేఱు, ఈశ్వరుడు వేఱు అని భావింతురు. (7)

అహన్త్యాయ = శత్రువులచే కొట్టబడని, సూతాయ= సారథిస్వరూపుడైన వాడును, వనానాం పతయే నమః =

ఓషధులకు నివాసమైన అడవులను రక్షించువాడును అగు రుద్రునకు నమస్సు. (8)

రోహితాయ=లోహితవర్ణము కలవాడును, స్థపతయే=జగత్తులకు ప్రభువును, లేక జగత్తులను నిర్మించిన శిల్పాచార్యుడు అని చెప్పుకొనుట మిక్కిలి సమంజసము. శిల్పాగమములు స్థపతినిగూర్చి ఇట్లు లక్షణము చెప్పినవి.

"స్థపతిః స్థాపనాయార్హో వేదవి చ్ఛాస్త్ర కోవిదః,
స్థాపనాధిపతి ర్యస్మాత్త స్మాత్ స్థపతి రుచ్యతే."
— మానసారం.

దేవ, మనుష్యాలయ, గ్రామ పట్టణాదులను స్థాపించు (నిర్మించు) నర్హతగల వేద శాస్త్ర వేత్తను స్థపతి అందురు. ఆతడట్లు స్థాపించునర్హత కలవాడుకనుకనే స్థపతియని చెప్ప బడినాడు.

దీనినిబట్టి బ్రహ్మండభవన స్థాపకుడైన శిల్పాచార్యునిగా రుద్రునెన్నుట వేదశాస్త్రాగమ సమ్మతము. ఇందుకు తగినట్లే ఋఙ్మంత్ర మొకటి—.

"బ్రహ్మణస్పతి రేతా సం కర్మార ఇవాధమత్".
— ఋ. 10-72-2.

పరమేశ్వరుడు కమ్మరి (శిల్పి) వలె ఈ జగత్తును నిర్మించెను, అన్నది. అంతే కాదు. విశ్వకర్మ సూక్తము

లందు పరమేశ్వరుడు విశ్వకర్మయని స్తోత్రింపబడుటకూడ ఆతని విశ్వ శిల్పకర్మలకే నిదర్శనము. వృక్షాణాం పతయే నమః = సర్వజీవులకు అన్నాది భోజ్యపదార్థముల నందించెడి చెట్లకు ప్రభుడైన రుద్రునకు నమస్కారము. (9)

మంత్రిణే = వేదాదులలోని మంత్రములను నిర్మించిన వాడును, లేక రాజులవద్ద మంత్రియై యుండి రాజకార్యముల నడుపువాడును, వాణిజాయ = కొనుట అమ్ముట అనెడి వాణిజ్యమును చేయువారికి అధిపతియగువాడును. వాణిజ్యము లేకున్నచో లోకమున ధన వినిమయము జరిగి సంపత్తి పెంపొందజాలదు. కావున రుద్రుని వణిక్సార్వభౌముడని వేదము వర్ణించినది. కక్షాణాం పతయే నమః = అడవుల లోని పొదలు మొదలగువాటికి అధిపతియగు రుద్రునికి నమస్సు. (10)

భువంతయే = లోకములను విస్తరింపజేయువాడును, వారివస్కృతాయ = ధనవంతులకు అధిపతియు (ఈశ్వరుడు పరమైశ్వర్యశాలి కదా!) ఓషధీనాం పతయే నమః = గ్రామములందును, అడవులయందును పుట్టెడి సమస్త ఓషధులకూ పాలకుడును అగు రుద్రునకు నమస్సు. (11)

ఉచ్చైః ఘోషాయ = యుద్ధములయందు. లెస్సగా బొబ్బరించువాడును, ఆక్రన్దయతే = శత్రువులను ఏడ్పించు వాడును, పత్తీనాం పతయే నమః = కాలిబంట్లకు పాలకుడును అగు రుద్రునకు నమస్సు. (12)

కృత్స్నవీతాయ = సైన్యముచే పరివేష్టింపబడిన వాడును, ప్రాణేంద్రియ సమూహాముచే పొదువబడినవాడని ఆధ్యాత్మికార్థము. ధావతే = పరుగెత్తు శత్రువులవెంట పరుగిడువాడును, సత్వానాం పతయే నమః = శరణువేడిన సత్వగుణముకల ఆశ్రితులను కాపాడువాడును అగు రుద్రునకు నమస్కారము. (13) సత్వములనగా ప్రాణులని చెప్పకొన్నచో పశుపతి అనునర్థము రాగలదు. ఏదైనను రుద్రుని విశ్వరూపమునకు విరోధము రాదు. ఇక 3వ, అనువాకము.

2 వ అనువాకమున ఆద్యంతములయందు నమస్కారములుకల కొన్ని యజుస్సులు చెప్పబడినవి. ఈ 3 వ అనువాకమునను అట్టివే అయిన అస్పష్టార్థములు గల 12 యజుస్సులు చెప్పబడుచున్నవి.

"నమ స్సహమానాయ నివ్యాధిన ఆవ్యాధినీనాం పతయే నమో, నమః కకుభాయ నిషంగిణే, స్తేనానాం పతయే నమో, నమో నిషంగిణ ఇషుధిమతే, తస్కరాణాం పతయే నమో, నమో వంచతే పరివంచతే, స్తాయూనాం పతయే నమో, నమో నిచేరవే పరిచరాయారణ్యానాం పతయే నమో, నమః సృకావిభ్యో జిఘాంసద్భ్యో, ముష్ణతాం పతయే నమో, నమో ఉసిమద్భ్యో నక్తం చరద్భ్యః ప్రకృన్తానాం పతయే నమో, నమ ఉష్ణీషిణే గిరిచరాయ, కులుం

చానాం పతయే నమో, నమ (1) ఇషుమద్భ్యో ధన్వావిభ్య శ్చవో నమో, నమ ఆతన్వానేభ్యః ప్రతిధానేభ్య శ్చ వో నమో, నమ ఆయచ్ఛద్భ్యో విసృజద్భ్య శ్చ వో నమో, నమోఽ స్యద్భ్యో విస్యద్భ్య శ్చ వో నమో, నమ ఆసీనేభ్య శ్శయానేభ్య శ్చ వో నమో, నమః స్వపద్భ్యో జాగ్రద్భ్య శ్చ వో నమో, నమ స్తిష్ఠద్భ్యో ధావద్భ్య శ్చ వో నమో, నమ స్సభాభ్య స్సభాపతిభ్య శ్చ వో నమో, నమోఽశ్వేభ్య శ్శాశ్వపతిభ్య శ్చ వో నమః.

ఈ అనువాకమునందు తస్కరులు మొదలగువారిని రుద్రస్వరూపులనుగా భావించి వారికి నమస్కారము చేయబడుచున్నది. తస్కరాదిశబ్దములకు దొంగ మొదలగు అర్థములు వాచ్యములు. ఈశ్వరునియొక్క ఏ పరమ స్వరూపము సచ్చిదానంద లక్షణమైనది కలదో, అది యేమో లక్ష్యార్థమని ఉపాసకులు భావింపవలసి యున్నది. అట్లు కాకున్నచో, తస్కరాదులకు నమస్కారము కాని, దానివలన పూజకులకు ఫలముగాని పొసగనేరదు. "అహం బ్రహ్మాస్మి" మొదలైన మహావాక్యముల విషయమునందే వాచ్యార్థము కుదురనందువలన లక్ష్యార్థము చెప్పుకొనవలసి వచ్చినది. కాగా ఈ మంత్రముల విషయమునను లక్ష్యార్థమును భావించక తప్పదు. ఆరాధకులు ఈ సందర్భమున తమకు ఉపాస్యుడైన పరమేశ్వరు డొక్కడే ఆ యా దేశ కాల పాత్రములయందు నటునివలె, తస్కరాదుల రూపమును

ధరించి లీలా శరీరుడై ప్రవర్తించుచున్నాడని భావించి ఈశ్వరారాధనము చేయవలసియున్నది. మంత్రజపారాధనల సమయములందేకాక, నిజజీవితమునను వారివారితో వ్యవహారము సలుపునప్పుడును ఈపారమేశ్వర భావమును వీడరాదు. అట్లు చేసిననేకాని వారికి ముక్తి లభింపదు. భేదభావ మెప్పుడును బంధహేతు వనియు. అభేదభావము మోక్షహేతువనియు ఏ సాధకుడుకాని మఱువ రాదు. రుద్రాధ్యాయభాగమున సమాజ కల్యాణదృష్టికూడ ఎంతగానో కన్పట్టుచున్నది. సంఘమునందు సర్వులను ఈశ్వరాంశజులుగా భావింపకున్నచో, నరుడు రాగద్వేషములకు వశుడు కావలసివచ్చును. రాగద్వేషములు బంధకారణములేకాని, ముక్తి హేతువులు కావుగదా. రుద్రాధ్యాయ మంత్రములలో ఇంతటి సాంఘికదృష్టియు, పారమార్థిక భావమును ఇమిడి యున్నవని గ్రహింపవలసి యున్నది

టీక :- సహమానాయ = సర్వమును సహించునట్టివాడును, నివ్యాధినే = తాపత్రయాదివ్యాధులు లేనివాడును అగు, ఆవ్యాధినీనాం పతయే నమః = తాపత్రయ వ్యాధిగ్రస్తులైన సంసారులకు పాలకుడైన రుద్రునికి నమస్కారము. (1) కకుభాయ = సర్వప్రధానుడును, నిషంగిణే = ఖడ్గము చేతదాల్చినవాడును, స్తేనానాం పతయే నమః = తాము దొంగలమని తెలియనీయక దొంగతనము చేయువారు స్తేనులు - అనగా గుప్తచోరు లన్నమాట. అట్టి వారికి ప్రభువయిన రుద్రునికి నమస్సు. (2)

నిషంగిణే = ఎక్కుబెట్టి సిద్ధమైన బాణముకలవాడును ఇషుధిమతే = బుజమున వ్రేలాడు అమ్ములపొది గలవాడును అగు, తస్కరాణాం పతయే నమః = వీరు దొంగలే అని తెలియబడి దొంగిలించునట్టి దొంగలకు రక్షకుడైన రుద్రునికి నమస్కారము. (3)

వంచతే = యజమానుని రహస్యముగా వంచించువాడు వంచకుడు - అట్టివానికిని, పరివంచతే = రహస్యమనునది లేక ప్రతిదానియందు వంచించువాడు పరివంచకుడు. అట్టివానికిని, స్తాయూనాం పతయే నమః = స్తాయువులనగా యజమానులను నమ్మించి, రాత్రిపగలనెడి భేదములేక వారి సొమ్మును హరించువారు. అట్టివారికి పాలకుడైన రుద్రునికి నమస్సు. (4)

నిచేరవే = యజమానుని ఇంటియందే యుండి దొంగిలించువీలు కలుగగా తస్కరించువాడు నిచేరువు - అట్టివానికిని, పరిచరాయ = అంగళ్ళలో ఉండి అదను చిక్కినపుడు దొంగిలించువాడు పరిచరుడు - అట్టివానికిని, ఆరణ్యానాం పతయే నమః = అడవులలో దాగి దారులుకొట్టువారు ఆరణ్యులు - అట్టివారికి రక్షకుడైన రుద్రునికి నమస్కారము. ఈ వర్ణననుబట్టి దొంగలలోగల భేదములు మనకు తెలియుచున్నవి. (5)

సృకావిభ్యః = వజ్రములవంటి కవచములుగల చోరులకును, జిఘాంసద్భ్యః = జనులను చంపి వారిసొమ్ము

హరించు చోరులకును, ముష్ణతాం పతయే నమః = కూలి నాలికి వచ్చి యజమానుల ధాన్యాదులను హరించు దొంగలకు పతియైనవానికిని నమస్సు, (6]

అసిమద్భ్యః = కత్తులు చేబూని దొంగతనము చేయువారికి, నక్తం చరద్భ్యః = రాత్రులయందు వీధులలో సంచరించువారిని దోచుకొనువారికిని, ప్రకృన్తానాం పతయే నమః — జనులను చంపివేసి వారి ధనమును హరించు దొంగలకు పాలకుడైన రుద్రునికి నమస్సు. (7)

ఉష్ణీషిణే=తలగుడ్డలు చుట్టుకొని పెద్దమనుష్యులవలె తిరిగి దొంగిలించు వానికిని, గిరిచరాయ = కొండలయందుండి కట్టెలకోసమై వచ్చువారినుండి దొంగిలించువానికిని, కులుంచానాం పతయే నమః = ప్రజల భూ గృహ సువర్ణాదులను దొంగిలించువారికిని పాలకుడైన రుద్రునికి నమస్కారము. (8)

ఇషుమద్భ్యఃధన్వావిభ్యశ్చ వఃనమః=చేత ధనుర్బాణములపీతాల్చి భయపెట్టి దొంగిలించువారి రూపముగానున్న రుద్రరూపులగు మీకు నమస్కారము. (9)

ఆతన్వానేభ్యః, ప్రతిధానేభ్యశ్చ వః నమః = వింటియందు అల్లెత్రాటిని తగిలించియు, బాణము నెక్కు పెట్టియు బెదిరించు దొంగలైన రుద్రులకు మీకు నమస్కారము. (10)

ఆయచ్ఛద్భ్యః, విసృజద్భ్యః వః నమః = బాణము నెక్కుపెట్టి అల్లెత్రాటిని లాగుచున్నవారును, బాణమును వదలుచున్నవారును అగు రుద్రరూపులగు మీకు నమస్కారము. (11)

ఆస్యద్భ్యః, విస్యద్భ్యః వః నమః = బాణమును లక్ష్యముదాకా విడిచిన వారును, లక్ష్యమున ప్రవేశపెట్టిన వారును అగు రుద్రులకు మీకు నమస్కారము. (12)

ఆసీనేభ్యః = కూర్చున్నవారును, శయానేభ్యః = పండుకొన్నవారును అగు మీకు నమస్కారము, (13) నిద్రించుచున్నవారును, మేల్కొన్నవారును అగు మీకు నమస్సు (14) నిలిచియున్నవారును, పరుగిడుచున్నవారును అగు మీకు నమస్సు. (15) సభాస్వరూపులును, సభాపతి రూపులును అగు మీకు నమస్కారము. (16) అశ్వరూపులును, అశ్వపాలక రూపులును అగు మీకునమస్కారము17. ఇట్లు అన్నిపనులు చేయుచున్న వారిని రుద్రరూపులుగా నే యెన్ని వారికి నమస్కారర మర్పింపబడుట రుద్రాధ్యాయము గొక్క సర్వాత్మ భావమునకు ప్రబలమైన నిదర్శనము. ఇది "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అనెడి ఉపనిషన్మహా వాక్యమునకు వ్యాఖ్యాన-వివరణ రూపమైన ఆచరణగనే అనిపించుచున్నది. ఈ దృష్టితో శతరుద్రీయమును భావించి,

ఆచరించి ధన్యులు కావలయుననుట వేదమాత హృదయ మని ఎన్నవలసి యున్నది. ఇక 4 వ అనువాకము :

4. నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీభ్య శ్చ వో నమో,
నమ ఉగణాభ్య స్తృంహతీభ్య శ్చ వో నమో,
నమో గృత్సేభ్యో గృత్సపతిభ్య శ్చ వో నమో,
నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్య శ్చ వో నమో.
నమో గణేభ్యో గణపతిభ్య శ్చ వో నమో,
నమో విరూపేభ్యో, విశ్వరూపేభ్య శ్చ వో నమో,
నమో మహద్భ్యః, క్షుల్లకేభ్య శ్చ వో నమో,
నమో రథిభ్యో ఽరథేభ్య శ్చ వో నమో,
నమో రథేభ్యః (1), రథపతిభ్య శ్చ వో నమో,
నమ స్సేనాభ్య, స్సేనానిభ్య శ్చ వో నమో,
నమః క్షత్తృభ్య, స్సంగ్రహీతృభ్య శ్చ వో నమో,
నమ స్తక్షభ్యో, రథకారేభ్య శ్చ వో నమో,
నమః కులాలేభ్యః కర్మారేభ్య శ్చ వో నమో,
నమః పుంజిష్టేభ్యో, నిషాదేభ్య శ్చ వో నమో,
నమ ఇషుకృద్భ్యో, ధన్వకృద్భ్య శ్చ వో నమో,
నమో మృగయుభ్యః, శ్వనిభ్య శ్చ వో నమో,
నమః శ్వభ్యః, శ్వపతిభ్య శ్చ వో నమః. (2)

దీనికి తాత్పర్యము మాత్రము వ్రాయబడుచున్నది :-

ఆ వ్యాధిని మొదలైన స్త్రీమూర్తులైన మీకు నమస్కారము. ఉత్కృష్ట గణరూపలైన సప్తమాతృకలకు, హింసించునట్టి ఉగ్రమూర్తులైన దుర్గా ప్రభృతులకు, ప్రాపంచికభోగ లంపటులైనవారు, వారి పాలకులు అయిన మీకు నమస్కారము. అనేక శాఖలకు చెందినవారు, వారి పాలకులైన మీకు, ప్రమథాది గణములు, ఆ గణములకు అధిపతులు అయిన మీకు, విపరీత రూపములు కలవారికి, అశ్వనూకరాది ముఖములు గలవారికి నమస్కారము. అణిమాద్యష్ట సిద్ధులుగల మహనీయులకు, అవిలేని సామాన్యులకూ, రథికులకు, రథములు లేనివారికికూడ నమస్కారము. ఇట్లనుటచేత కలవారిని గౌరవించి, లేనివారిని అగౌరవపరచుట అను భేదరాహిత్యము సమదృష్టి ప్రకటమగుచున్నవి. అంతేకాదు. జడములైన రథములకు, అట్టిరథములకు పాలకులైన చేతనులకు నమస్కార మొనర్పనైనది. సేనలకు, సేనాధిపతులకు రథమునుతోలు సూతులకు, రథ సంగ్రహీతలకు, శిల్పులకు, రథ గృహ సౌధాదులను నిర్మించు రథకారాది శిల్పాచార్యులకు, కుండలు మొదలగునవి చేయు కుంభకారాదులకు లోకసేవా నిమగ్నులై కమ్మరముచేసి లోకయాత్ర సాగ తోడ్పడెడి లోహకార శిల్పాచార్యులు మున్నగు వారికి నమస్కారము. ఇట్లనుటచేత వేదమాతకుహస్తకర్మలచే

లోకమునకు ఉపకారము లొనర్చు వారియెడగల ప్రేమాదర గౌరవ భావములు వెల్లడి యగుచున్నవి.

పిమ్మట పక్షులను చంపితినెడి పుంజిష్టులకు, చేపలను పట్టితినెడి నిషాదులకు, ఇషువులనగా బాణములు. వాటిని చేయువారు ఇషుకారులు, ధనుస్సులను నిర్మించువారు ధన్వకారులు, వారికి గూడ నమస్కారము. పిమ్మట వేటకాండ్రకు, కుక్కలమెడలకు గొలుసులనుంచి త్రిప్పువారికి అనగా శునక పాలకులకు, (కుక్కల బెంచువారికి) ఆ కుక్కలకు, వాటి రక్షకులకుగూడ నమస్కారమని చెప్పి శ్రుతిమాత తన "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అనెడి పారమేశ్వర దృష్టిని విపులీకరించి తన పుత్రులయొక్క ఆచరణ మెట్లు ఉండవలయునో నిరూపించినది. ఇక 5వ అనువాకము నుండి ఒక్క నమస్కారముతో ప్రారంభమగు మంత్రములు కొనసాగుచున్నవి —

5. నమో భవాయ చ, రుద్రాయ చ: నమ శ్శర్వాయ చ, పశుపతయే చ; నమో నీలగ్రీవాయ చ, శితికంఠాయ చః నమః కపర్దినే చ, వ్యుప్తకేశాయ చ; నమ స్సహస్రాక్షాయ చ, శతధన్వనే చ; నమో గిరిశాయ చ, శిపివిష్టాయ చః నమో మీఢుష్టమాయ చేషుమతే చ; నమో హ్రస్వాయ చ, వామనాయ చ; నమో బృహతే చ, వర్షీయసే చ; నమో వృద్ధాయ చ, సంవృధ్వనే చ; (1) నమో అగ్రియాయ చ, ప్రథమాయ చ; నమ ఆశవే

చాజిరాయ చ; నమః శీఘ్రియాయ చ శీభ్యాయ చ; నమ ఊర్మ్యాయ, చావస్వన్యాయ చ; నమః స్రోతస్యాయ చ, ద్వీప్యాయ చః (2)

ఈ మంత్రములందు అనేక శివనామములు ఉగ్గడింపబడి నమస్కార మొనర్పబడు చున్నది. ఆ నామముల విశేషములను, వ్యుత్పత్త్యాదులను పరిశీలింతము.

తా. అతనినుండి భూతములు (ప్రాణులు) పుట్టు చున్నవి కనుక భగవంతునికి భవుడు అనెడి పేరు కలిగినది. దీనినిబట్టి రుద్రుడు సృష్టికారుడైన బ్రహ్మయే అని తేలు చున్నది. 'రుద్' అనగా దుఃఖము. అట్టి దుఃఖమును పాఱద్రోలువాడు కావున భగవానునికి రుద్రుడను పేరు సార్థకము. దుఃఖమును దూరముచేసి ఆనంద మొసగి రక్షించును గాన ఆయన రక్షకుడైన విష్ణువేకాని భిన్నుడు కాడని సారాంశము. పాపమును పోగొట్టువాడు కావున శర్వుడని పేరు కలిగినది. పశు సమానులైన అజ్ఞానులను పాలించి రక్షించును కావున పశుపతి అగుచున్నాడు. కాల కూట విషమును తినుటచేత కంఠంతగాతు నల్లబడినది కాన ఆయనను నీలగ్రీవు డన్నారు. ప్రతిమానవుడు పరదోషము లను దిగమ్రింగి నీలగ్రీవుడు కావలయునని ఇటః పూర్వము వ్రాయబడినది. 'శితి' అనగా తెలుపు. కంఠ ప్రదేశ మంతయు నల్లబడిపోయి ఒక్కచోటమాత్రమే తెలుపుగలిగి యున్నందున శివుడు శితికంఠుడు. శితి పదమునకు నలుపని

లోస్థముచెప్పుకొన్నచో నల్లనికంఠము కలవాడేఅగుచున్నాడు. కపర్దము అనగా జడలయొక్క ముడి. అట్టిది కలవాడేమో కపర్ది. ఇది రుద్రుని బాహ్య స్థూలరూపమును వర్ణించు వర్ణన. వ్యుప్తకేశుడు అనగా గొరగబడిన జుట్టుకల వాడని భావము. తలను గొరిగించుకొన్న వాడని సారాం శము. సహస్రాక్షుడనగా ఎన్నో కన్నులు కలవాడని భావము. విశ్వకర్మకు విశ్వాక్షుడని, సహస్రాక్షుడని పేర్లు కలవు. కాన సాక్షాత్తు రుద్రుడు విశ్వకర్మ స్వరూపుడనియు భావము. మఱియు "సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వ శంభువం" అని నారాయణోపనిషత్తు అన్నందున సాక్షా న్నారాయణ స్వరూపుడనియు ఎన్నవచ్చును. సహస్రాక్ష శబ్దము ఇంద్రునికి సైతము ఉన్నందున ఇంద్ర రూపుడనియు కొందఱందురు. ఈ అర్థము లన్నింటికీ "ఏకం సత్" అనెడి ఋగ్వేద మంత్రమును, "యో దేవానాం నామధా ఏక ఏవ" అనెడి సృష్టిసూక్తమంత్రమును ఆధారములు.

శతధన్వు డనగా అనేక ధనుస్సులు కలవాడని భావము. దుష్టులను సంహరించుటకు దేవునకెన్నో మార్గము లున్నవి. అట్టివన్నియు ధనువులే. గిరిశుడనగా కైలాస గిరిపై నుండువాడని బాహ్యార్థము. సహస్రారపద్మస్థితుడని అంతరర్థము. "విష్ణుః శిపివిష్టః" అనెడి శ్రుతినిబట్టి విష్ స్వరూపమునుకూడ తాల్చినవాడని భావము. మీఢుష్ట ముడనగా మేఘ స్వరూపమును తాల్చి లెస్సగా వర్షించు

వాడని భావము. సర్వమును పరబ్రహ్మస్వరూపమే కావున రుద్రుడు మేఘరూపుడుకూడ అయినాడనుటకు సంశయింప నక్కరలేదు. ఇషుమంతుడనగా బాణములు కలవాడని భావము. ఇట్టి పదములన్నియు భక్తుల పాపములను, తప్పులను అణచివేయునట్టి అర్థముకలవని ఎన్నవలయును.

హ్రస్వుడనగా పొట్టివాడని భావము. పరమాత్మ "అణో రణీయాన్" అణువుకంటెను, పరమాణువుకంటెను సూక్ష్మరూపుడని శ్రుతియు, సాధకుల అనుభవములును చాటుచున్నవి కనుక, ఆతడు హ్రస్వుడే. వామనుడన్నను అదే అర్థము. బృహత్తు అనగా మహత్స్వరూపుడని భావము. "మహతో మహీయాన్" అని శ్రుతి. ఆకాశమున కంటెను గొప్పది మహత్తత్త్వము. దానికంటెను గొప్పది పరామాత్మ కావున, దానికి బృహచ్ఛబ్దము సార్థకమే! వర్షీయసుడనగా ముసలివాడన్నమాట. ఇక్కడ వృద్ధత్వము శరీరము వలన కలిగినదికాక, గుణములచేత కలిగిన పెద్దతికమని భావము. పరమాత్మ, లేక భగవంతునివంటి సర్వగుణ సంపూర్ణుడింకొకడు ఉండడుకాన, అతడు ముసలులకన్న ముదుసలి. ప్రపంచమునకన్న పెద్దవాడనియు. రుద్రుడు ముసలివాడనుటకు ఇంకొక రహస్యము కూడ కలదు. శ్రీ కాళహస్తి మునిప్రణీత విశ్వకర్మ పురాణము ఇట్లనుచున్నది. మనము సృష్టిలో బ్రహ్మాండములు కలవని మాత్రమే వినుచున్నాము. ఇట్టి బ్రహ్మాండములు కొన్ని

కలసినగాని, విష్ణ్వాండము కాదట. అట్టి విష్ణ్వాండములుకొన్ని కలసినగాని ఒక్క రుద్రాండము కాదట. అట్టి రుద్రాండముల సహస్రములు కలసిననేకాని విశ్వకర్మాండము కాదట. అట్టి విశ్వకర్మాండము ఆ విశ్వకర్మ భగవానునిలో ఒక కోట్యంశము అగునో కాదో చెప్పలేము. అందుకే విశ్వకర్మ మహిమ నభివర్ణించెడి పురుషసూక్తము "పాదోఽస్య విశ్వా భూతాని" అని ఆ విశ్వకర్మాండము కూడ ఆయన లోని అంశము మాత్రమే అని చెప్పినది. ఈ దృష్టితో చూచినప్పుడు రుద్రుడు, బ్రహ్మ విష్ణువులకంటెను ముదుసలియే కదా. కాలదృష్టితో చూడగా పెద్దవాడే కదా! ఆయనకన్న పెద్ద విశ్వకర్మ యొక్కడే. ఇక ఆ దేవదేవుని నిరాకార నిర్గుణ స్వరూపమున కంతమేముండును! అందుకే దానిని "సత్యం, జ్ఞాన, మనన్తం బ్రహ్మ" అని తైత్తిరీయము వర్ణించినది. మనము వేదములోని భగవత్సూక్తములకు అర్థవివరణము చేయునప్పుడు ఇంతటి విశాలదృష్టితో మంత్రములను, మంత్రవాక్యములను సంభావింపవలసి యున్నది. అట్లు చేసిననేకాని పరిపూర్ణమైన అర్థసిద్ధి కలిగి, పూర్ణానుభవము రాదు.

వృక్ష శబ్దమునకుగూడ ఇప్పుడు మనము చెప్పుకొన్న భావముల నన్నిటిని అన్వయింప జేసికొనవలయును, సంవృద్ధి చెందినగా భక్తుల స్తోత్రములచేత వృద్ధి పొందువాడని భావము. అనగా భక్తులస్తుతులు ఆయనను పెంచునని కాదు.

భక్తులగువారు ఆయన మహిమలను, స్తుతులచేత ఎఱుంగ వలయునని భావము. ఇక్కడ స్తుతి అనగా చింతన. భగవ త్తత్వమును గురువుయొక్క, శాస్త్రములయొక్క బోధలచేత మననముచేసి తెలిసికొనవలయునని భావము. అనగా శ్రవణ, మనన, నిదిధ్యాసలచే నీలోని భగవత్తత్వమును ఉద్దీప్తము చేసికొనవలయునని గ్రహింపవలయును. అంతే కాని "వందే శంభు ముమా పతిం" ఇత్యాది స్తుతులను అర్థానుభూతిలేకుండ చదువుమని కాదు.

అగ్రియుడనగా అందఱికంటెను, అన్నిటికంటెను ముందున్నవాడని భావము. పరమాత్మయందు ప్రకృతి, లేక, మాయాశక్తి తోచకముందే ఆ పరమాత్మ శాశ్వతుడై ఉన్నాడు. కావున పరాపరప్రకృతులకంటెను ఆ దేవుడు అగ్రియు డగుచున్నాడు. ఈ అంశమునే ఉపనిషత్తు "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్య త్కించన మిషత్" అని కేవల పరమాత్మ తత్వ మొక్కటే మొదట కలదు అన్నది. అట్టి అగ్రమునుండియు కలవాడే అగ్రియు డనగా! పరమాత్మ అన్నింటికంటెను ముందు ఉన్నాడను నంశమును మూలస్తంభ పురాణము లెస్సగాను, సత్యము గాను చెప్పినది.

"న భూమి ర్న జలం చైవ, న తేజో, న చ వాయవః,
న చ బ్రహ్మా, న విష్ణుశ్చ, న రుద్రో, న చ తారకాః,
సర్వశూన్యే విశ్వకర్మా స్వయంభూ రభవ త్తదా!"

పంచభూతములు లేనప్పుడు, బ్రహ్మ విష్ణు రుద్రాదులు లేనప్పుడు, సర్వశూన్యముగా నున్నప్పుడు రాబోవు విశ్వము లకు ఆధారమైన దివ్యశక్తి ఒక్కటి మాత్రమే కలదు. అని భావము. ఈ అర్థమునే ఋగ్వేదములోని సృష్టిసూక్తము "నాస దాసీ న్నోస దాసీత్" అని చెప్పినది. కనుక ఆలో చించి చూచినచో రుద్ర నమకమునందు ఇంతటి నిగూఢ మైన గంభీరార్థ మున్నదని పాఠకులు గ్రహించి, మననము చేసి సమాధిస్థితిని ఆత్మసాక్షాత్కారమును అందవలసి యున్నారని మఱువరాదు.

ప్రథముడను శబ్దముకూడ ఇట్టి యర్థము కలదే. ప్రకృతికంటెను ప్రథముడు పురుషుడే కనుక ఆయనకు ప్రథముడను (మొదటివాడు) పేరు చెల్లుచున్నది. ప్రథమ శబ్దమునకు సాయణులు సభలో మొదటివాడు- అని కూడ వ్రాసినారు. అనగా సభాపతి అని భావము. శరీరేం ద్రియ రూప సభలో జీవుడు లేకున్న ఏమీ జరుగదు కనుక అట్టి దేహ సభాధిపతి అని అన్వయించుకొనుట లెస్స. తరు వాతిమాట ఆశువు. అనగా "అశూ" ధాతువునకు వ్యాప్తి అర్థము కాన, అంతట- బాహ్యాంతరములందు వ్యాపించి యుండువాడని భావము. భగవంతుడు తప్ప సర్వత్ర వ్యాపించు వాడెంకెవడు? వాయువును, ఆకాశమును అంతట వ్యాపింపవా, అందురేమో. అవి వ్యాపించు దేశము కొంత వఱకే. అవి లేని తావునగూడ భగవత్పదార్థమే వ్యాపించి

యుండును. అసలు తానేమిటి ? తావునకును తావు కలిగించు నదికూడ పరమాత్మయే అని శాస్త్రమును, అనుభవమును చాటుచున్నవి. సర్వ పరిపూర్ణ నిరావరణ పరవస్తువు నందే కదా దేశ కాల వస్తువులు కల్పింపబడినవి. కనుక ఆయనవలె ఆశుశక్తి కలది ఇంకొకటి లేనేలేదని సాధకులు మఱువరాదు.

అజిరుడనగా నడకనేర్పు కలవాడని యర్థము. ఇది కూడ వ్యాప్త్యర్థకమే. రుద్రుడు సర్వ వ్యాపియని భావము. శీఘ్రియుడన్నను శీఘ్రశాలి అనియే భావము. ఏ కాల మున కెవరి కెట్టి కర్మల ఫలము లందవలయునో వారి కా ఫలములను ఆలస్యము జరుగకుండ చేకూర్చువాడని తాత్పర్యము. ఇట్టి భగవచ్ఛక్తియే లేనిచో జీవులు తమ పుణ్యాపాపముల ఫలముల నెట్లు పొందగలరు! "శీభ" పదమునకు నీటి ప్రవాహమని యర్థము. కాన, నీటిధారలయందుండువాడని భావము. అందుకే శివునికి నీటిధారలతో అభిషేకము చేయుచున్నారు. "జలధారా ప్రియః శ్శివః" అని అందుకే అన్నారు. ఇక అంతరర్థము :- "అపాం గర్భం వ్యదధాత్పురుత్రా" అని విశ్వకర్మసూక్త మంత్రము. జగదుత్పత్తి బీజమును విశ్వకర్మ నీటియందే ఉంచినాడట. కావునను ఆయన జలప్రియు డగుచున్నాడు. ఇక్కడ శివ, విశ్వకర్మ పరమాత్మలకు అభేదమే కాని, భేద భావము లేనే లేదు. అట్లే —

"సముద్రాయ వయునాయ సింధూనాం పతయే నమః,
నదీనాం సర్వాసాం పిత్రే జుహుతా విశ్వకర్మణే
విశ్వాహా మర్త్యాగ్ం హావిః."

అన్న మంత్రమునుగూడ శివపరముగా అన్వయించుకొని, శీభ్య శబ్దార్థమును గ్రహింపవలసి యున్నది. ఊర్మి అనగా జలతరంగము. ఊర్మ్యుడనగా తరంగములయందుండువాడని భావము. సముద్రము పరమేశ్వర స్వరూపమని పై మంత్రము పలికినది. అందలి తరంగములే జీవులు. సర్వ జీవులలోనూ పరమాత్మ అంతర్యామి రూపముగా నున్నందున భగవంతుడు ఊర్మ్యుడు అగుట సమంజసమే. "ఏష దేవో విశ్వకర్మా మహాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః" అని చదివియే యున్నాముకదా !

మఱియొక నామము అవస్వన్యుడు అనునది. అనగా నిలకడగల నీటిలో నుండువాడని భావము. ప్రవాహమున నుండువాడే కాక, కదలని నీటిలోనూ ఉండువాడని దీని భావము. ప్రవాహ మనగా చరములైన ప్రాణులనియు, నిలకడగల నీరములనగా అచరములైన ప్రాణులనియు ఆంతరమైన తాత్పర్యము. కాగా రుద్రుడు చరాచరముల యందు పరిపూర్ణుడై యుండువాడని తెలుచున్నది. కనుక "ఇందు గల డందు లేడని సందేహము వల"దన్నమాట. స్రోతస్సు అనగా ప్రవాహము. దానియందుండువాడు స్రోతస్యుడు. అంతేకాదు. ద్వీపమనగా ప్రవాహములోని దీవి.

దానియందుకూడ ఉండువాడు వాడేనట. అందుకే అతనిని ద్వీప్యుడని శ్రుతి పలికినది. అనగా నీటను, నీరు లేని చోట, అంతట నుండువాడా రుద్రుడే. ఇవి రెండును శీతోష్ణాది ద్వంద్వములకు సంకేతములు. ద్వంద్వములు రెంటి యందు నుండి వాటి అనుభూతిని జీవులకు కలిగించువాడు పరమాత్మయే అని రహస్యార్థము ! ఈ విధముగా రెండేసి మాటలకు ఒక్క నమ శ్శబ్దమును జోడించి రుద్రున కిందు నమస్సు చెప్పబడినది. ఈ చతుర్థానువాకమునం దంత టను అత్యద్భుతములైన, అమోఘములైన, అనుభవ పర మార్థములైన శబ్దములను వాడి, ఎంతటి తత్వార్థమునో శ్రుతిమాత సాధకుల కందించినది.

పూర్వానువాకమున దొంగలు, వంచకులు మున్నగు వారు రుద్రుస్వరూపులే అనిచెప్పి, ఈఅనువాకమున అంతయు శివ స్వరూపమే అనిప్రశంసించి సాధకులకెట్టి పరమాద్వైత జ్ఞానమును శ్రుతిమాత కలిగించినదో మననము చేయదగి యున్నది. ఇక 6వ అనువాకము —

6. "నమో జ్యేష్ఠాయ చ, కనిష్ఠాయచః నమః పూర్వ జాయ చాపరజాయ చ; నమో మధ్యమాయ, చాపగల్భ్య య చః నమో జఘన్యాయ చ, బుధ్నియాయ చ; నమ స్సోభ్యాయ చ, ప్రతిసర్యాయ చ; నమో యామ్యాయ చ, క్షేమ్యాయ చ, నమ ఉర్వర్యాయ చ, ఖల్యాయ చ; నమః శ్లోక్యాయచా వసాన్యాయ చః నమో వన్యాయ చ

కక్ష్యాయ చ; నమః శ్రవాయ చ, ప్రతిశ్రవాయ చ; (1) నమ ఆశుషేణాయ, చాశురథాయ చ; నమ శ్శూరాయ చావభిందతే చ; నమో వర్మిణే చ, వరూథినే చ; నమో బిల్మినే చ, కవచినే చ; నమః శ్రుతాయ చ, శ్రుతసేనాయ చ; (2)

ఈ షష్ఠానువాకమునకూడ ఒకే నమస్కారముకల 15 యజుస్సులు ప్రస్తావింపబడు చున్నవి. వీటికి గూడ పూర్వమువలెనే విశేషార్థ వివరణము చేయబడుచున్నది —

జ్యేష్ఠుడనగా వయస్సుచేత మాత్రమే పెద్దవాడని కాదు. విద్య, జ్ఞానము, యోగము, ఐశ్వర్యము మొదలగు గుణములచేత పెద్దవాడని అర్థము. అట్టి విద్యాజ్ఞానైశ్వర్యాదులచేనైన పెద్దఱికము ఒక్క పరమేశ్వరునికి మాత్రమే కలదు. అట్టి పరమేశ్వర దర్శనము పొందిన వారికిని కొంత వఱకు జ్యేష్ఠత్వము ఉండగలదు. అట్టి జ్యేష్ఠునికి నమస్కార మన్నమాట. విద్యాజ్ఞానాది శుభలక్షణములు లేనివాడు కనిష్ఠుడు. అనగా చిన్నవాడన్నమాట. జ్యేష్ఠుడుకాని, కనిష్ఠుడుకాని పరమేశ్వర రూపుడేకాన, అట్టి కనిష్ఠునికిగూడ నమస్కారార్పణ చేసి శ్రుతి తన సమదృష్టిని చాటుటయే కాక, సాధకుల ప్రవర్తనకూడ ఎట్లుండవలయునో చెప్పినది.

పూర్వజుడనగా ముందు పుట్టినవాడు. అట్టివాడు జగత్తులను సృష్టించిన హిరణ్యగర్భుడని వేదాంత సంప్ర

దాయము. అపరజుడు అనగా చివర పుట్టినవాడు. లోకము లను హరించుకాలాగ్ని రుద్రాది స్వరూపుడు - లయకారు డన్నమాట. సృష్టికర్తయే తానగుట కాదు. లయకర్త కూడ తానే అనుట ఇందలి రహస్యము. మధ్యముడనగా ఆది-అంతములందు కాక, నడిమి కాలమున నుండువాడు. ఆదియందు సృష్టికర్త, అంతమందు లయకర్త ఉండగా, మధ్యకాలమున ఆ సృష్టికర్తచే సృష్టింపబడిన దేవ మానవ తిర్యగాది జీవులు, వారి లోకములు ఏర్పడినవి. కనుక అవికూడ పరమేశ్వర స్వరూపములే. బీజము, దానినుండి వెలువడిన పత్రపుష్పఫలాదులు, వాటి నాశనము అంతయు బీజమే అయినట్లు- సృష్టి, దాని రూపము, దాని అంతము కూడ భగవద్రూపమే అని భావము. దీనినే గీత - "భూతానా మాది రన్త శ్చ మధ్యమేవ చ పాండవ" అన్నట్లు - ఆద్యన్త మధ్యము లనెడివి ఈశ్వర రూపములే కాని భిన్నములు కావన్నమాట. మధ్యముడనగా విష్ణు వనియు తలంపవచ్చును. మూర్తిత్రయములో నడిమివాడు కదా విష్ణువు!

అపగల్భుడనగా ఇంద్రియములకు పటుత్వముకలుగని వయస్సుకలవాడు. అనగా అవికసితేంద్రియు డన్నమాట. జఘన్యుడనగా ఆవువెంట చనెడి లేగదూడవంటివాడు. అనగా స్వతంత్రత రానివాడు. ఇట్టి వారందఱు బాలురే, అజ్ఞానులే. బుధ్నియుడనగా చెట్టుమొదట పుట్టిన కొమ్మ

లన్నమాట. అదికూడ కడతేరమికి, అప్రగల్భతకు సూచ
నయే. పుణ్యాపాపము లనెడి ఉభయముతో కూడినది
సోభము. అట్టిది కలవాడు సోభ్యుడు. అనగా పుణ్యాపాప
రూప కర్మల నాచరించువాడని అర్థము. అనగా జీవరూపు
డన్నమాట. ప్రతిసర మనగా వ్రతాదులయందు కేల
దాల్చెడి తోరము. అది కలవాడు ప్రతిసర్యుడు. అనగా
పుణ్యముకోసమై ఆ యా కర్మల నొనర్పబూనువాడని
భావము. యామ్యుడనగా యమలోకమున పాపులను
శిక్షించెడి అధికారి. అట్టివాడు రుద్రుడన్నమాట. క్షేమ
మనగా మోక్షము. దానికి తగినవాడు క్షేమ్యుడు. మోక్షార్థి
అని సారాంశము. ఉర్వర అనగా సస్యములతో నిండిన
నేల. దానికి అర్హుడైనవాడు ఉర్వర్యుడు. కర్షకులు మొదలైన
పంటలను పండించువారన్నమాట. ఖల్యుడనగా ధాన్యరాశు
లుంచిన ప్రదేశముకలవాడు. అనగా పండించినరైతు- అన్న
మాట. శ్లోక్యుడనగా శ్లోకాదిరూప మంత్రముల నెఱింగిన
వాడు - వేదవేత్త. అవసాన్యుడనగా వేదముల యవసానము
ఉపనిషత్తులు. వాటి కర్హుడైన జ్ఞాని అన్నమాట. అనగా
వేదాంతి అని భావము. వనములయందు పుట్టినవి వన్యములు
వృక్షాదులు. తత్స్వరూపుడన్నమాట. కక్ష్యుడనగా పొద
రిండ్లు మొదలైన వాటి కర్హుడు. గుల్మాది స్వరూపుడన్న
మాట. శ్రవ్యుడనగా శ్రవణరూపుడు, లేక శ్రవణార్హుడు.

ఆశుషేణుడనగా తొందరగాపోవు సేనకలవాడు. ఆశురథుడనగా శీఘ్రముగ పయనించు రథములుకలవాడు. వేదకాలమున రథములు, రథికులు, రథములను తయారుచేయు రథకారాది శిల్పులు విశేషముగా నుండెడివారు. శూరుడనగా ధైర్యశాలి, కార్యకుశలుడు, సమర్థుడుఅన్నమాట. అవభిందుడనగా శత్రువులను భేదించువాడు. ఆధ్యాత్మిక దృష్టితో చూచిన అంతశ్శత్రువులైన కామాదులను గెలుచువాడని భావము. వర్మి అనగా యుద్ధమున శరీరమును కాపాడెడి ఇనుపకవచము కలవాడు. వరూథి అనగా గృహము కలవాడు. బిల్మి అనగా యుద్ధములందు తలను కాపాడెడి శిరస్త్రాణము (ఇనుప తలగుడ్డ) కలవాడు. కవచి అనగా శరీరమున తొడుగు ఇనుపచొక్కా కలవాడు. శ్రుతుడనగా వేదవిద్య కలవాడు. శ్రుతసేనుడనగా వేదప్రసిద్ధమైన శ్రుతసేనకలవాడని భావము. ఈ విధముగా ఈ అనువాకమునందు వేద వేదాంతములయందును, లోకమునందును ప్రసిద్ధములైన పెక్కుపదములచే రుద్రుని విశ్వరూపత్వము, సర్వాత్మభావము విశదీకరింపబడి 'ఏకం సత్, సర్వం ఖల్విదం బ్రహ్మ, బ్రహ్మైవేదం సర్వం, అనెడి మహావాక్యముల తాత్పర్యమే నానావిధముల వక్కాణింపబడి, సాధకుల భగవదుపాసనకే కాక, లోకసేవా విధానమునకును బాటలను తీర్చుచున్నది. పిమ్మట సప్తమానువాకమునకూడ ఏకతర నమస్కారములుకల 16 యజుస్సులు దర్శింపబడుచున్నవి.

7. "నమో దుందుభ్యాయ చాహనన్యాయ చః నమో
ధృష్ణవే చ, ప్రమృశాయ చః నమో దూతాయ చ,
ప్రహితాయ చ; నమో నిషంగిణే చేషుధి
మతే చః నమ స్తీక్ష్ణేషవే, చాయుధినే చః
నమ స్స్వాయుధాయ చ, సుధన్వనే చః
నమ స్స్రుత్యాయ చ, పథ్యాయ చః నమః
కాట్యాయ చ, నీప్యాయ చః నమ సూ్న
ద్యాయ చ, సరస్యాయ చః నమో
నాద్యాయ చ, వైశన్తాయ చ, (1) నమః కూప్యాయ
చావట్యాయ చః నమో వర్ష్యాయ చావర్ష్యా
య చః నమో మేఘ్యాయ చ, విద్యుత్యాయ చః
నమ ఈధ్రియాయ చాతప్యాయ చ; నమో
వాత్యాయ చ, రేష్మియాయ చః నమో
వాస్తవ్యాయ చ, వాస్తుపాయ చః (2)

తా. దుంధుభ్యుడనగా దుందుభి (భేరీ) ధ్వని స్వరూపుడు. ఆహనన్యుడనగా భేరీ మ్రోగించు దండపు (కఱ్ఱ) దెబ్బవంటి వాడు. ధృష్ణువు - యుద్ధములందు పాఱిపోక నిలుచువాడు. కాందిశీకుడు కానివాడన్నమాట ! ప్రమృశుడు = పరసైన్య వృత్తాంతములను పరామర్శించువాడు. దూత = దూతగా

వ్యవహారించువాడు. ప్రహితుడు = స్వప్రభునిచేత పంపింప బడినవాడు. దూతకు, ప్రహితునికి భేదమేమన, దూత స్థిరముగా నుండువాడు. ప్రహితుడు తాత్కాలిక కార్య నిర్వాహకుడు. నిషంగి = కత్తిగలవాడు. ఇషుధిమంతుడు = అమ్ములపొది కలవాడు. తీక్ష్ణేషువు=వాడియైన బాణములు కలవాడు. ఆయుధి = నానా విధాయుధములు కలవాడు. సు+ఆయుధుడు – స్వాయుధుడు = మంచి ఆయుధములు కల వాడు. సుధన్వుడు = మంచి విల్లు కలవాడు. స్రుత్యుడు= కాలినడకన బోవువాడు. పథ్యుడు = రథాశ్వ గజాదుల నెక్కి రాచత్రోవన పోగలవాడు. కాట్యుడు = అల్ప ప్రవాహ జలరూపుడు. నీప్యుడు = కొండమీదనుండి దూకు నీటివెల్లువ కలవాడు. సూద్యము = బురదనీరు. సరస్యము= కొలనిలోని నీరు. నాద్యము = నదీజలము. వైశన్తము = అల్ప సరస్సులోనినీరు. కూప్యము=బావినీరు. అవట్యము= చెలమనీరు. వర్ష్యము = వర్షజలము. అవర్ష్యము= వానలు లేకయే నేలయందూరెడి నీరు. మేఘ్యము = మబ్బులలోని నీరు. విద్యుత్యము = మెఱపులతో గూడినది. ఈధ్రియము= శరత్కాల మేఘములనుండి పుట్టినది. ఆతప్యము = ఎండతో కూడ కురిసినది. వాత్యము = గాలితో సహా కురిసినది. రేష్మియము = ప్రళయకాలమున ఇసుక రాళ్ళతో గూడి వర్షించెడి నీరు. వాస్తవ్యుడు. వస్తువనగా భూ గృహ ధన రత్నాది రూపమైనది. దానియందుండువాడు వాస్తవ్యుడు.

వాస్తుపుడు = వాస్తువనగా నివాసయోగ్యమైన భూమి-గృహము మొదలైనది. దానిని రక్షించువాడు వాస్తుపుడు - అనగా వాస్తోష్పతి అన్నమాట. ఈ వాస్తోష్పతి మంత్రములను మనము ఋగ్వేద దిగ్దర్శనములయందు చదివియే యున్నాము. ఈ అనువాకమున నానావిధధ్వనులు, యుద్ధ సాధనములు, నానావిధ జలములు రుద్ర రూపములే అనియు. కనుక అట్టి ప్రకృతిని అనుభవించు యజమానునును, ఆ యజమానుడు నివసించు వసతిని (గృహాదికమును) రక్షించు వాస్తోష్పతి, సర్వము రుద్ర స్వరూపమే అని సర్వాత్మ భావమే చాటబడినది. ఇట్టి సర్వాత్మ భావముతో పాటు- ఓ మానవుడా ! నీవు దేనినీ చిన్న చూపు చూడవద్దు. ఆ యా వస్తువులు ఆ యా పనులు చేయుటకు తగిన కారణములు ఉండగలవు. అన్నిటి వలన నీకు ఏదో కొంత ఉపయోగము లేకపోలేదు. ఇట్టి స్థితిలో ఇది దుష్టము, ఇది శిష్టము, ఇది మిశ్రము అని భేదము చూపకు. దేనినీ అవమానించకు. నీవు అవమానించు దానితోగూడ నీకొకనాడు అవసరము కలుగవచ్చు. సృష్టిలో ఏదీ నిరుపయోగముకాదు. అన్నిటి వలన ఏదో ఒక అవసరము ఉండి తీరుచున్నది- అనెడి మహా మానవనీతి ఒకానొకటి ఈ రుద్రాధ్యాయములోని వస్తువుల పరామర్శవల్ల తెలియదగినట్లు పొడకట్టుచున్నది. ఇట్టి విశేషములను గూర్చి ప్రతివ్యక్తి మననముచేసి తన కర్తవ్యమును నిర్ణయించుకొని

నడుపవలయును. ఇక అన్యతర నమస్కారములైన 17 యజుస్సులు ఈ అష్టమానువాకమున వివరింప బడుచున్నవి.

8. "నమ స్సోమాయ చ, రుద్రాయ చ; నమ స్తామ్రాయ చారుణాయ చః నమ శ్శఙ్గాయ చ, పశుపత యే చః నమ ఉగ్రాయ చ, భీమాయ చః నమో అగ్రే వధాయ చ, దూరే వధాయ చ; నమో హన్త్రే చ, హనీయసే చః నమో వృక్షేభ్యో హరి కేశేభ్యో, నమ స్తారాయ చ; నమ శ్శంభవే చ, మయో భవేచః నమ శ్శంకరాయ చ, మయ స్కరాయ చ; నమశ్శివాయ చ, శివతరాయ చః (1) నమ స్తీర్థ్యాయ చ, కూల్యాయ చ; నమః పార్యాయ చావార్యాయ చ; నమః ప్రతరణాయ, చోత్తరణాయ చ; నమ ఆతార్యాయ, చాలాద్యా య చ; నమ శ్శష్ప్యాయ చ, ఫేన్యాయ చ; నమ స్సికత్యాయ చ, ప్రవాహ్యాయ చ." (2)

వివరణ :- ఉమాదేవితో గూడినవాడు గనుక అతడు సోముడు. మాయశక్తి సహితుడని తాత్పర్యార్థము. అనగా ప్రకృతి పురుషస్వరూపుడని భావము. దీనినే శంకరులు

"శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,
న చే దేవం దేవో న ఖలు కుశలః స్పందితు మపి."

శివుడు (పురుషుడు) శక్తి (ప్రకృతి) తో గూడిననే కాని సృష్టి జరుగదు. (ప్రకృతి) లేనిచో సృష్ట్యాదులే జరుగవు. ఆ నిర్వికార నిర్గుణ శివ స్వరూపము కదలలేదు, మెదలలేదు; జగత్క్రీడను నడపలేదు- అన్నాడు. సోమ శబ్దమును ఇట్టి దార్శనిక దృష్టితో గ్రహింపవలసి యున్నది. రుద్రుడనగా తన తత్త్వము నెఱింగినవారి దుఃఖములను పోగొట్టువాడని తెలిసికొనియే యున్నాము. తామ్రుడనగా సూర్య రూపమున ఉదయ కాలమున ఎఱ్ఱగానుండు వాడని భావము. అరుణుడనగా ఉదయానంతరము లేత యెఱుపు రంగు కలవాడని భావము. తామ్ర, అరుణ శబ్దములు రెండూ సూర్యరూపుడైన రుద్రునిగూర్చి ప్రయోగింపబడినవి. 'శం' అనగా సుఖము, దానిని భక్తుల కందించు వాడే శంగుడు. పశువులనగా ప్రాణులనియు, వారికి పాలకుడు పశుపతి అని చెప్పికొనియే యున్నాము. శత్రువుల వినాశనమునకు క్రోధమును తాల్చువాడు ఉగ్రుడు. ఇక్కడ విరోధులు అంతశ్శత్రువులైన కామాదులని ఆధ్యాత్మికార్థము. భీముడనగా శత్రు భయంకరుడని భావము. అగ్రేవధుడనగా ఎట్టయెదుటనే శత్రువధ చేయువాడు. దూరేవధు డనగా దూరమునందున్న శత్రువులనుకూడ సంకల్ప మాత్రముననే చంపువాడని భావము. దూరమునందున్నను, దగ్గఱ నున్నను శత్రువులను హతమార్చువాడు హంత. కావుననే గీతలో అర్జునునితో శ్రీకృష్ణుడు —

"మయై వైతే నిహతాః పూర్వ మేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్."

"వీరందఱు ఇదివఱకే నాచే చంపబడినారు. నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము" అనినాడు. ప్రళయకాలమున సర్వమును నశింపచేసి, తనలో లీనమొనర్చుకొనువాడు కాన రుద్రుడు హానీయసుడు. అనగా గొప్ప హంత అని భావము. ప్రళయ రుద్రుడుకదా ఆతడు. పచ్చని ఆకు లనెడి వెండ్రుకలుగల కల్ప వృక్షాదులెల్లను రుద్ర స్వరూప ములే అని హరికేశ వృక్ష శబ్దభావము. తారుడనగా ఓం కారముచే ప్రతిపాదింపబడెడి అర్థ స్వరూపుడని భావము. శం అనగా సుఖమును కలిగించువాడు కాన శంభుడగు చున్నాడు. మయస్సు అనగా సుఖము. అట్టి సుఖము నొసంగువాడు మయోభువుడు. శంకరుడనగా సుఖమును కలిగించువాడు. మయస్కరుడన్నను సుఖమును గూర్చు వాడనియే భావము. శం అనగా విషయ సుఖమనియు, మయస్సనగా మోక్ష సుఖమనియు ఇచ్చట భేదము నెన్న వలె. శివుడనగా నిష్కల్మష కల్యాణ స్వరూపుడని భావము. శివతరుడనగా అధిక కల్యాణకరుడు.

అంతియేకాదు, తన్నుకొలుచు వారికి కూడ కల్మషము నణచి,కల్యాణ(మంగళ) ముల నందించువాడని భావము. ఇక్కడ ప్రయోగింపబడిన 'నమశ్శివాయ' 'నమశ్శంకరాయ'

పదములే తరువాత ఉపాసకులకు పంచాక్షరీ, షడక్షరులుగా జపింపబడినవైనవి. ప్రయాగాది పుణ్యతీర్థములందు సన్నిహితుడై యుండును గాన తీర్థ్యుడు. గంగా గోదావర్యాది నదీ కూలము (తీరము-ఒడ్డు) లందు లింగాది రూపమున ప్రతిష్ఠితుడు కాన కూల్యుడు. సంసార సముద్రపు టావలి యొడ్డున మోక్షార్థులచే ధ్యానింపబడువాడు కాన రుద్రుడు పార్య డగుచున్నాడు. ఏ ప్రాకృత శక్తులు ఆయనను అతిక్రమింపలేవు కాన ఆతడు అవార్యుడు. 'నమ శ్శివాయ' మొదలైన మంత్రముల జపముచేత సంసారమును తరింప జేయును కాన ప్రతరణుడు. తత్త్వ జ్ఞానము కలిగిన వారిని భవసాగరమును తరింపజేయును కాన ఉత్తరణుడు. కామ్య కర్మలంపటులను తత్వజ్ఞానమునకు దూరమందుంచి సంసార సుఖములనే ఒసంగునుగాన రుద్రుడు ఆతార్యుడగుచున్నాడు. శ్రుతికూడ "తయో రన్యః పిప్పలం స్వా ద్వత్తి" అని జీవులు సామాన్యముగా సంసార లంపటులే అని చెప్పినది గదా. ఆలాదుడనగా సంపూర్ణముగా కర్మ ఫలములను కోరెడి జీవుడు. అతనిని కర్మానుగుణముగా ప్రేరేపించు వాడు ఆలాద్యుడు. జీవప్రేరక - ఈశ్వరుడన్నమాట.

శష్పమనగా లేతగడ్డి. దానినారాధించువాడు శష్ప్యుడు. ఫేనమనగా నీటిమీది నురుగు. దానికి తగినవాడు ఫేన్యుడు. సికత అనగా ఇసుక, దానియందు ఆసన ప్రాణాయామము లొనర్చువాడని భావము. ప్రవాహమున

మునుగువాడు ప్రవాహ్యుడు. ఏభక్తుడు గంగాదులలో స్నాన మాడి గడ్డిమీదను, ఇసుక తిన్నెలమీదను కూర్చుండి ధ్యాన యోగాదుల నొనర్చునో అట్టి భక్తుడిచ్చట శష్ప్యాది పద ములచే పేర్కొన బడినాడు. కాగా భగవద్భక్తుడు, సాధ కుడుకూడ భగవత్స్వరూపుడుగానే భావింప బడినాడన్న మాట. ఆధ్యాత్మిక ప్రపంచమున భక్తులకును, భగవం తునికిని అభేదము సామాన్యాంశమే. కొన్ని ఘట్టముల యందు భగవంతుని కంటెను భక్తులే శ్రేష్ఠులని యెన్నబడి నది. అందుకే తదారాధనము (భగవదారాధనము) కంటె తదీయా (భక్తా) రాధనమే గొప్పదని భావించినారు. భగ వంతుని సామాన్య మానవులు దర్శింపలేరు. కాని ఆ భగ వంతుని దర్శనము, సేవ చేసికొన్న భక్తులనయితే ఎల్లరును చూచి, ఆరాధించి, సేవించి ధన్యులు కావచ్చును. దీనిని బట్టియే తదారాధనము కంటెను, తదీయారాధనమే గొప్ప దను భావము మానవులలోను శాస్త్రములలోను ప్రబలి యుండును.

ఈ అనువాకమున జగత్కారణుడైన పరమేశ్వరుని శివ, సోమ, శంభు, శంకర, మయస్కరాది బహుపదములచే పేర్కొనుటయేకాక, శష్పాది ఫేనాది పదములతోను పేర్కొని శ్రుతి సర్వాత్మ భావమును, సమస్త బ్రహ్మ భావ మును ప్రకటించి సాధకుల భేద దృష్టిని, ఉచ్చనీచ దృష్టిని తొలగించుచున్నది. అనగా ద్వంద్వాతీత స్థితిని వారికి

బోధించుచున్న దన్నమాట. భగవంతుని శష్పతుల్యుని గాను- తృణప్రాయునిగాను, నురుగువంటి వానినిగాను, కడకు క్షుక రేణువుగానుకూడ చెప్పి "అణో రణీయాన్ మహతో మహీయాన్" అనెడి సూక్తిని సార్థకము చేసినది. కావున జగద్వస్తువులయందు- నీచము, ఉచ్చము, మంచి, చెడు, మొదలగు భేద భావములను పోగొట్టుకొని సాధకులు సర్వ సమదృష్టి కలిగి సర్వమునందు బ్రహ్మమునే కాంచుటకు అభ్యాసము చేయవలసి యున్నది. ఇట్టి విశాల దృష్టిని కలిగించుటకే శత రుద్రీయము ప్రవర్తించినదని క్షణాక్షణా మును గుర్తించి సాధకులు నడచుకొన్నప్పుడే వారికి శివాను గ్రహమనునది లభించి, ఆధ్యాత్మిక జ్ఞానము కలిగి వారు మోక్షానంద స్వరూపులు కాగలరు. ఆచరణములేని పఠన మాత్రముచే ఎట్టి ప్రయోజనమును కలుగదు.

ఇక 19 యజుస్సులుగల నవమానువాకము ప్రారంభ మగు చున్నది.

9. "నమ ఇరిణ్యాయ చ, ప్రపథ్యాయ చః నమః కింశిలా
యచ, క్షయణాయ చ; నమః కపర్దినే చ, పులస్తయే చః నమో గోష్ఠ్యాయ చ, గృహ్యాయ చః
నమస్తల్ప్యాయ చ, గేహ్యాయ చః నమః కాట్యాయచ,
గహ్వరేష్ఠాయ చ; నమో హ్రదయ్యాయ చ,
నివేష్ప్యాయ చ; నమః పాంసవ్యాయ చ, రజస్యా

య చ; నమ శ్శుష్క్యాయ చ, హరిత్యాయ చ;
నమో లోప్యాయ, చోలప్యాయ చ;(1) నమ ఊర్వ్యా
య చ, సూర్మ్యాయచ; నమః పర్ణ్యాయ చ,
పర్ణశద్యాయ చ; నమోఽపగురమాణాయ,
చాభిఘ్నతే చ; నమ ఆక్ఖిదతే చ, ప్రక్ఖిద
తే చ; నమో వః కిరికేభ్యో; దేవానాం హృద
యేభ్యో; నమో విక్షీణకేభ్యో, నమో విచిన్వ
త్కేభ్యో; నమ ఆనిర్హతేభ్యో,నమ ఆమీవత్కేభ్యః;2.

వివరణ :- ఇరిణమనగా నీరు ఊరని ఊషరక్షేత్రము. అందు కలిగినది ఇరిణ్యము. అనగా నిర్జల ప్రదేశ స్వరూప మని భావము. అనేకులు నడచునది ప్రపథము. అందు కలిగినది ప్రపథ్యము. గులకరాళ్ళు కలిగినది కింశిల ప్రదేశము. కింశిలా ప్రదేశ రూపుడుకూడ అన్నందున సమత్వము తోచుచున్నది. క్షయణ మనగా జనులు నివసింప దగిన భూమి. తత్స్వరూపుడు రుద్రుడని భావము. జటాజూటము కలవాడు కపర్ది. భక్తులయెదుట నుండువాడు పులస్తి.

గోష్ఠమనగా ఆవులుండు ప్రదేశము. గోశాలకు అర్హమైనది గోష్ఠ్యము. తత్స్వరూపుడన్నమాట. గృహము నకు తగినది గృహ్యము. గృహయోగ్య నానావస్తుస్వరూపుడు రుద్రుడు. తల్పమనగా శయ్య. తల్ప్యుడనగా తల్పమున

పయుండదగిన వాడని భావము. దీనికి హృదయ తల్పమున శయనించు జీవుడనియు, ఈశ్వరుడనియు ఆధ్యాత్మికార్థము. గేహామనగా అంతస్తులుగల మేడ, దానిపై నుండదగినవాడు. దీనికి గూడ సహస్రారమని తాత్త్వికార్థము నెన్నవచ్చును. నడచుటకుగాని, ప్రవేశించుటకుగాని వీలుగాని అడవులు మొదలగునవి కలది కాటము. అందుండ దగినవాడు కాట్యుడు. క్రూరమృగాది స్వరూపుడని తెలుచున్నది. గహ్వరమనగా కొండగుహలు, కొండకోనలు మొదలగునవి. వాటియందుండెడి భగవల్లింగ రూపుడని భావము. గహ్వరమనగా కారణ శరీరమందలి హృదయ గుహాయని చెప్పికొన్నచో ప్రాణుల హృదయ గహ్వరమునందు ఉండు వాడు పరమేశ్వరుడని అంతరర్థము. ఇందుకు కఠవల్లి "గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్" అని పలుకుచున్నది.

హ్రదమనగా లోతైన నీళ్ళుకల చెఱువు మొదలైనవి. అందుకు తగినది హ్రదయ్యము. మంచు నీటికి నివేష్పమని పేరు. దానికి తగినది నివేష్ప్యము. పాంసువులనగా అణువులు. వాటికి తగినవాడు పాంసవ్యుడు. అనగా అణు పరమాణువులయందు కూడ అంతర్లీనుడై యుండు వాడని భావము. స్పష్టముగా కనిపించెడి ధూళికి రజస్సని పేరు. దానికి తగినవాడు రజస్యుడు. రజోగుణశాలి అని కూడ ఎన్నవచ్చును. ఈ సందర్భమున పాంసువులనగా కంటికి కనపడని అణువులనియు వాటియందు ఉండువాడు

పాంసవ్యుడనియు, రజస్సు అనగా కంటికగపడెడి దుమ్ము కాన అందుఉండువాడు రజస్యుడనియు భేదమును ఎన్నవలయును. ఎండిపోయిన కొయ్యలు మొదలగు వాటియందుండువాడు శుష్క్యుడు. హరితమనగా ఆర్ద్రము - తడిసినదని భావము. అందు ఉండువాడు హరిత్యుడు. ఇది శుష్క్యపదమునకు వ్యతిరేకమైనది. అనగా వాయ్వగ్ని జల స్వరూపుడని తెలును.

గడ్డికూడ మొలవని ప్రదేశమునకు లోపమని పేరు. దానికి తగినది లోప్యము. ఉలప్యమనగా తృణాదులు పుట్టెడితావు. అందుకు తగినదేమో ఉలప్యము. ఇది లోప్య పదమునకు ప్రతివాది. ఉర్వి అనగా భూమి. అందు కలిగినది ఊర్వ్యము. అనగా నేలనుండి పుట్టిన వన్నియు రుద్రరూపములే అని భావము. ఊర్ములనగా తరంగములు. మంచి ఊర్ములు కలది సూర్మ్యము- నదులు, కొలకులు మొదలైనవి. పర్ణములనగా ఆకులు. వాటితో కూడినది పర్ణ్యము. ఎండిన ఆకులకు పర్ణశదము లనిపేరు. వాటితో కూడినది పర్ణశద్యము.

అపగురమాణుడనగా కత్తి నెత్తినవాడు. అభిఘ్నుడనగా చంపువాడు. ఆక్షిదుడనగా కొలదిపాటి కోపముకల వాడు. ప్రక్షిదుడనగా బాగుగా కోపము కలిగినవాడు. భక్తులకు ధనాదుల నొసంగు రుద్రావతారులు కిరికులు. అట్టివారైన దేవతల హృదయమువంటి మీకు సర్వులకు నమస్కారమని భావము. క్షీణదశలేని శాశ్వతులైనవారు విక్షీ

ణకులు. కోరిన వాటిని సంపాదించి పెట్టువారు విచిన్వ త్కులు. పాపము పూర్తిగా నశించినవారు ఆనిర్హతులు. పూర్తియైన బలుపుగలవారు ఆమీవత్కులు. ఇక్కడ "విక్షీణక. విచిన్వత్క, ఆనిర్హత, ఆమీవత్క - అనెడి నాలుగు పదములను "దేవానాం హృదయేభ్యః" అనెడి పదములతో కలుపవలయునని సాయణు లను చున్నారు.

5వ అనువాకమునుండి 9వ అనువాకము వఱకును జంగమములు, స్థావరములు అయిన అనేకములకు నమస్కారము పలుకబడి, పరమేశ్వరుని సర్వాత్మ భావము వ్యక్తీకరింపబడినది. ఇందు ఒక్కొక్క అనువాకము ఒక్కొక్క మంత్రముగానే లెక్క. వీటి పురశ్చరణాదులు రుద్రకల్పము నందు చెప్పబడియున్నవి. ద్వితీయానువాకము మొదలు కొని తొమ్మిదవ అనువాకము వఱకూ ఉభయ నమస్కారములు, ఏకతర నమస్కారములుగల పెక్కు యజుస్సులు చెప్పబడినవి. ఇక ఈ దశమానువాకమున ఋగ్రూపములైన మంత్రములు చెప్పబడుచున్నవి.

10. "ద్రాపే అన్ధసస్పతే, దరిద్ర న్నీలలోహిత,
ఏషాం పురుషాణా మేషాం పశూనాం,
మాభే ర్మారో మో ఏషాం కించ నామమత్. 1

యా తే రుద్ర శివాతనూ శ్శివా విశ్వాహ భేషజీ
శివా రుద్రస్య భేషజీ తయా నో మృడ జీవసే. 2

ఇమాం రుద్రాయ తవసే కపర్దినే,
క్షయద్వీరాయ ప్రభరామహే మతిమ్
యథా నశ్శమ సద్ద్విపదే చతుష్పదే,
విశ్వం పుష్టం గ్రామే అస్మి (1) న్ననాతురమ్. 3
మృడా నో రుద్రోత నో మయస్కృధి,
క్షయద్వీరాయ నమసా విధేమ తే.
యచ్ఛం చ యోశ్చ మనురాయజే
పితా త దశ్యామ తవ రుద్ర ప్రణీతౌ. 4
మా నో మహాన్త ముత మా నో అర్భకం,
మా న ఉక్షన్త ముత మా న ఉక్షితమ్,
మా నో వధీః పితరం మోత మాతరం,
ప్రియా మా న స్తనువః (2) రుద్ర రీరిషః. 5
మా న స్తోకే తనయే మా న ఆయుషి,
మా నో గోషు మా నో అశ్వేషు రీరిషః.
వీరా న్మా నో రుద్ర భామితోవధీ
ర్హవిష్మన్తో నమసా విధేమ తే. 6
ఆరాత్తే గోఘ్న ఉత పూరుషఘ్నే,
క్షయద్వీరాయ సుమ్న మస్మే తే అస్తు.
రక్షా చ నో అధి చ దేవ బ్రూహ్యథాచ,
న శ్శర్మ యచ్ఛ ద్విబర్హాః స్తుహి (3) 7

శ్రుతం గ ర్తసదం యువానం మృగం
న భీమ ముపహాత్ను ముగ్రమ్
మృడా జరిత్రే రుద్ర స్తవానో
అన్యం తే అస్మి న్నవపన్తు సేనాః. 8

పరిణో రుద్రస్య హేతి ర్వృణక్తు
పరి త్వేషస్య దుర్మతి రఘాయోః,
అవస్థిరా మఘవద్భ్య స్తనుష్వ
మీాఢ్వ స్తోకాయ తనయాయ మృడయ. 9

మీాఢుష్టమ శివతమ శివో న స్సుమనా భవ,
పరమే వృక్ష అయుధం నిధాయ-
కృత్తిం వసాన ఆచర పినాకం (4) బిభ్ర దాగహి. 10

వికిరిద విలోహిత నమ స్తే అస్తు భగవః,
యా స్తే సహస్రం హేతయోఽన్య మస్మ
న్నివపన్తు తాః. 11

సహస్రాణి సహస్రధా బాహువో స్తవ హేతయః
తాసా మీాశానో భగవః పరాచీనా ముఖా కృధి (5)12

టీక :- ద్రాపే=పాపులను నరకమునకు పంపువాడా! అంధసస్పతే=అన్నమునకు అధిపతీ! దరిద్రన్=ఏమిాలేని దరిద్రుడా! భగవంతుడు తాను తప్ప ఇంకేమిా లేనివాడు కనుక దరిద్రుడని భావము. ఏదైనా ఉన్ననూ అది తన

స్వరూపమేకాని భిన్నము కాదు కనుక ఆత డన్నియు ఉన్నను ఏమీ లేనివాడే అని తాత్పర్యము. ఈ అంశమునే "ఏకమే వాద్వితీయం బ్రహ్మ" నేహ నానాస్తి కించ న" అనెడి ఉపనిషద్వాక్యములు స్పష్టము చేయుచున్నవి. తేలిన సారాంశము- రుద్రుడు దేనినిగానీ కోరని విరక్తుడనునది. నీల లోహిత=కంఠమున నలుపు, తక్కిన దేహమున లోహి తత్వము కలవాడా! ఏషాం పురుషాణాం=మాకు సంబం ధించిన పుత్రపౌత్రాదులయొక్క, పశూనాం=గో అశ్వ మహిషాదులయొక్క సమూహమును. మాభేః=భయపెట్ట వద్దు. వారికెట్టి అపకారముగానీ చేయవలదని భావము, ఏషాం=వీరియొక్క. కించన=ఏ వస్తువుగాని. మారోః=నష్ట పడకుండుగాక. మో ఆమమత్=రోగగ్రస్తము కాకుండు గాక! (1)

హేరుద్ర=ఓశివా! విశ్వ అహ భేషజీ=ఎల్లదినము లందు మా రోగ దారిద్ర్యాదులకు మందువంటిదైన. శివా= శాంతమైన. యా తే తనూః=ఏ నీ శరీరము కలదో. రుద్రస్య భేషజీ=రుద్రునియొక్క మందువంటిదైన. తయా=ఆశరీరము చేత. నః=మమ్ములను. జీవసే=హాయిగా జీవించుటకు. మృడ= సుఖపెట్టుము. శివంకరమైన నీ తనువు మమ్మెల్లవేళల సుఖింప జేయు గాతమని ప్రార్థన. శివైక్యమును కోరువారికి జన్మజరా మృత్యురూప రోగములను హరించుటకు భేషజమువంటిది ఆయన తనువు కాన, దానిని శివమని అన్నారు. 2.

యథా=ఏ ప్రకారము. నః=మాయొక్క. ద్విపదే=పుత్రపౌత్రాది బంధువర్గమునకును, చతుష్పదే=గోమహిషాశ్వములకును. శం=సుఖము. అసత్=కలుగునో; అస్మిన్ గ్రామే=ఈ గ్రామమునందలి. విశ్వం=సమస్త ప్రాణి జాతము - లేదా అంతయు. అనాతురం=రోగాద్యుపద్రవములు లేక సౌభాగ్యవంతమయినదీ, పుష్టం=సర్వసంపత్పరిపూర్ణమయినదీ అగునట్లు, తవసే=సర్వసమర్థుడును, కపర్దినే=జటాజూటమును దాల్చిన తాపసుడును, క్షయద్వీరాయ=నశించిన శత్రువీరులు కలవాడును, లేక నశించిన భక్త పాపములు కలవాడును అగు రుద్రాయ=రుద్రునికి, ఇమాం మతిం=పూజాధ్యానార్చనాదులు చేయునట్టి మా బుద్ధిని. ప్రభరామహే=భరింతుముగాక. అనగా మాయొక్క ఐహికాముష్మిక పారమార్థిక ప్రయోజనముల సిద్ధికోసమై, లేక పురుషార్థ లాభముకొఱకై పరమ శివార్చనా తత్పరులమై సదా మెలగుదుముగాక అని భావము. 3.

హేరుద్ర! ఓశివా! నః=మమ్ములను. మృడ=ఈ లోకమునందు సుఖింపజేయుము. ఉత=ఇంకను పరలోకమున గూడ నః=మాకు మయఃకృధి=సుఖములను కల్పింపుము. క్షయద్వీరాయ తే=మా పాపముల నణంచు నీకు, నమసా=నమస్కారముచేత - పూజాధ్యానాదులచే, విధేమ=పరిచర్యలను చేయుదుమని భావము. పితా మనుః=తండ్రియైన మను బ్రహ్మ ("మనుష్పితా" అని బుక్కు) యత్ శం=ఏ సుఖ

మును, యో౽శ్చయత్=దుఃఖభిన్నమైన దేనిని, ఆయజే చేకూర్చునో, తత్=దానినెల్లను, హేరుద్ర! ఓశివా! తవ ప్రణీతౌ=నీ స్నేహము కలుగుచుండగా. అశ్యామ=పొందుదుము- అనుభవింతుము. ఇక్కడ మనుబ్రహ్మను జగత్పితగాను, మానవపితగాను చెప్పినందున మను రుద్రులకు అభేదము సిద్ధమగుచున్నది. కనుకనే స్కాంద నాగరఖండము "మనువు శివుడును, మయుడు రమాధవుండు" అన్నది. 4.

హేరుద్ర=ఓరుద్రుడా! నః మాయొక్క. మహాన్తం=వృద్ధుని. మా రీరిషః=హింసించకుము. ఉత=అట్లే. నః=మాయొక్క అర్భకం=బాలుని. ఉక్షన్తం=యువకుని, ఉక్షితం=గర్భస్థుడైన శిశువును, మా రీరిషః=హింసించవలదు. ఉత=ఇంకను నః=మాకు సంబంధించిన. పితరమ్=తండ్రిని, మాతరం=తల్లిని. మావధీః=చంపవలదు. అట్లే, నః=మాయొక్క ప్రియాః=ప్రియమైన. తనువః=శరీరములను. మా రీరిషః=హింసించవలదు. 5.

ఓరుద్రుడా! నః=మాయొక్క. తోకే=సంతానమునందు. తనయే=కుమారునియందు. నః=మా. ఆయుషి=ఆయుస్సునందు. మా రీరిషః=హింసను చూపవలదు. అట్లే. నః గోషు=మా గోవులయందు. అశ్వేషు=గుఱ్ఱములయందు. మారీరిషః=హింసా స్వభావము నగపఱుపకుము. భామితః=క్రుద్ధుడవై. నః వీరాన్=మా భృత్యులను. మా వధీః=చంప

కుము. వేము, హ విష్మన్తః=హవిస్సులతో గూడుకొని. తే= నీకు. నమసా విధేమ = నమస్కారములతో పరిచర్య లొనర్తుము. 6.

గోఘ్న=గోవులను చంపునట్టి. ఉత పూరుషఘ్న= ఇంకను పురుషులను చంపునట్టి. క్షయద్వీరాయ తే=భృత్యు లను చంపునట్టి నీయొక్క ఘోరరూపమైన తనువు. ఆరాత్ =దూరముగా ఉండుగాక. సుమ్నం=సుఖకరము సౌమ్యము అయిన నీ శివతనువు. అస్మే=మాకు దగ్గఱపై. అస్తు=ఉండుగాక. శివునికి ఘోరము, అఘోరము (శివము) అని రెండు తనువులు కలవని చెప్పికొన్నాము. వాటిలో ఘోరము దూరమునను, శివము సమీపమునను ఉండవలె నని ఇందు ప్రార్థింపబడినది. నః =మమ్ము,రక్ష=అన్నివిధముల రక్షింపుము. హే దేవ=ఓస్వామీ ! అథాచ=ఇంకను. అధి బ్రూహి= దేవతలతో మమ్ముగూర్చి యజమానులలో శ్రేష్ఠుల మని చెప్పుము. అనగా వారి దయనుగూడ సంపాదించి పెట్టు మని భావము. ద్విబర్హాః=ఉభయ లోకముల యందలి ఫలములనొసంగు నీవు. నః శర్మ యచ్ఛ=మాకు సుఖము నిమ్ము. 7.

టీక :- గర్తసదం=గుంట (గుహ) వంటి హృద యమునందు ఉన్నట్టివాడును, యువానం=నిత్యతరుణుడును, భీమం మృగం న=భయంకరమైన సింహమువంటి వాడును, ఉపహత్నుం ఉగ్రమ్=ప్రళయవేళ జగత్తులను నాశము

చేయుటకు ఉగ్రుడైన వాడును అగు రుద్రుని, శ్రుతం=నా మాటను విని, స్తుహి=ప్రార్థింపుడు. ఇచ్చటి గర్తసద పదము ఉపనిషత్తులలోని గుహాహిత పదమువలె ఉన్నది. ఈశ్వరుడు సర్వప్రాణుల హృదయ గుహాలలో నున్నాడని శ్వేతాశ్వతరాద్యుపనిషత్తు లనుచున్నవి. "ఏష దేవో విశ్వకర్మా మహాత్మా, సదా జనానాం హృదయే సన్నివిష్టః." అన్నది శ్వేతాశ్వతరము. "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" అని గీత అన్నది. హేరుద్ర! స్తవానః=నాచే స్తుతింపబడినవాడవై జరిత్రే = క్షీణించు స్వభావముగల శరీరమున, మృడ=సుఖము నింపుము. తే సేనాః=నీ సేనలు. అన్యం=నాశత్రువును. అవపన్తు=నశింపజేయునుగాక. 8.

రుద్రస్య=రుద్రునియొక్క. హేతిః=ఆయుధము. నః= మమ్ములను. పరివృణక్తు=పరిహరించుగాక. దానిచూపు మామీద పడకుండుగాక అని భావము. అనగా రుద్రుడు మమ్ము హింసింపకుండుగాక అన్నమాట. త్వేషస్య=కోపిష్ఠుడును, అఘాయోః=చంపుట అనెడి పాపమును చేయువాడును అగు రుద్రునియొక్క. దుర్మతిః=చంపవలెననెడి దుష్టబుద్ధి. పరివృణక్తు=తొలగుగాక. స్థిరా=స్థిరమైన ఆదుష్టబుద్ధి. మఘవద్భ్యః=హవిరన్న దాతలైన వారినుండి-ఆరాధకులనుండి. అవతనుష్వ=తొలగినదానిని చేయుము. మీఢ్వః= కోరికలనిచ్చువాడా! తోకాయ=మా సంతానమును, తనయాయ=వారి సంతానమును. మృడయ=సుఖపెట్టుము. 9.

మీఢుష్టమ, శివతమ=కోరికలదీర్చుచు సుఖకారుడ వగు నోరుద్రా! నః=మా విషయమున. శివః=శాంతుడవును సుమనాః=మంచిమనస్సు (సౌమనస్యము) కలవాడవును. భవ=అగుము. పరమే వృక్షే=ఎత్తైన చెట్టుమీద. ఆయుధం నిధాయ=నీ త్రిశూలమునుంచి, కృత్తిం=పులిచర్మమును మాత్రమే, వసానః=తాల్చినవాడవై, ఆచర=మా యెదుటకురమ్ము. పినాకం=నీ పినాకమనెడి ధనుస్సుమాత్రమే బిభ్రత్ = అలంకారార్థము తాల్చి, బాణాదులను వీడి, ఆగహి=రమ్ము. 10.

వికిరిద=భక్తులకు ధనాదులను విరజిమ్మువాడా! విలోహిత=తెల్లనివాడా! భగవః=ఓ భగవంతుడా! తే నమః అస్తు=నీకు నమస్కారము. తే యాః సహస్రం హేతయః=నీ వేలకొలది ఆయుధములేవికలవో. తాః=అవి. అస్మదన్యం=నాకు విరోధిఅయిన వానియందు. నివపన్తు=పడును గాక! 11.

ఇచ్చట భగవచ్ఛబ్దమునుగూర్చి కొంత విచారింతము-

"ఐశ్వర్యస్య సమగ్రస్య, ధర్మస్య యశసః శ్రియః
జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరితః."

1. సంపూర్ణమైన ఐశ్వర్యము, 2. ధర్మము, 3. యశస్సు, 4. సంపత్తి, 5. జ్ఞానము, 6. వైరాగ్యము- అను ఆఱింటికి భగమని పేరు. అవి కలవాడు భగవంతుడు. కావుననే

భగవంతుడన షడ్గుణైశ్వర్య సంపన్నుడనుచుందురు. ఇంకొక నిర్వచనము.

"ఉత్పత్తిం చ వినాశం చ భూతానా మాగతిం గతిం,
వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవా నితి."

సృష్టి ప్రళయములు, భూతముల రాకపోకలు, విద్యావిద్యలు ఎవడెఱుంగునో, వాడు భగవంతుడు. ఈ నిర్వచనములు విష్ణు పురాణములోనివి. మఱియొకటి – "భవం నిహత్య యోగం దదాతీతి భగవాన్" సంసారమును వారించి బ్రహ్మయోగము నొసంగువాడు భగవంతుడని యుపనిషత్తు. భవ శబ్దములోని మొదటి అక్షరమును, యోగ శబ్దములోని చివరి అక్షరమును కలుపగా భగ మగును. అది కలవాడు భగవంతుడని దీని భావము. ఇట్టి నిర్వచనము లెన్ని యున్నను, విశ్వముయొక్క సృష్ట్యాది కర్మలను చేయువాడు భగవంతుడనుటలో ఏ విభేదమును ఉండదు. భగవచ్ఛబ్దమును గూర్చి ఇంకను అనుబంధములో చదువగలము.

భగవః=ఓ భగవంతుడా! తవ బాహ్వోః =నీ చేతులయందు. సహస్రధా=పలువిధములైన. సహస్రాణి= వేలసంఖ్యలుగల. హేతయః=ధనుః ఖడ్గ త్రిశూలాదులైన ఆయుధము లేవి కలవో. తాసాం=వాటికి. ఈశానః=ప్రభుడవై – సమర్థుడవై. పరాచీనాః=వాటిని మావైపు చూడని

వాటినిగా, కృధి=చేయుము. అవి మాపై ప్రయోగింప బడ కుండుగాక అని భావము. 12.

ఈ అనువాకమునందు భగవద్భక్తుడగువాడు తనకు తన కుటుంబ సభ్యులకు, తన పశుసంపత్తికి ఏవిధమైన హానియు చేయవలదని పరమేశ్వరుని ప్రార్థించినట్లు స్పష్ట మగుచున్నది. రుద్రుడు లయకారుడు కనుకను, ధనుర్బాణ ఖడ్గ త్రిశూలాద్యాయుధములు కలవాడు కానను, భక్తులగు వారు ఆయనకు భయపడి ఇట్లు ప్రార్థించుటలో ఆక్షేప మేమియు లేదు. రుద్రుడు ప్రాణులకేకాక, జగములకు కూడ మృత్యువే కనుక, ఆయనను కాల రుద్రుడనియు, కాలాగ్ని రుద్రుడనియు, ప్రళయ రుద్రుడనియు వేదములు వర్ణించినవి. అట్టి మృత్యువును తొలగించుకొని ప్రతివాడును మృత్యుంజయుడు కా జూచుటలో అత్యాశ ఏమియు లేదు. మృత్యుంజయుని ఉపాసించినవాడు మృత్యుంజయుడు అగు టలో కూడ వింత లేదు. బ్రహ్మవేత్త బ్రహ్మ మయినట్లు మృత్యుంజయుని తత్వమును ఎఱింగినవాడును మృత్యుం జయుడై అమృతుడై లోకమునకు అమృత మార్గమును చూపవలయును. అప్పుడే నమకములోని అనువాకములకు సార్థకత. నిజమాలోచించిన, జన్మమనునది ఎట్టి భ్రాంతియో మృత్యువనునదికూడ అట్టి భ్రాంతియే. సుఖ దుఃఖాది ద్వంద్వము (జంట)ల లోనివే జన్మ మృత్యువులు. మానవు డందవలసినది ద్వంద్వాతీతమైన అఖండ బ్రాహ్మీస్థితి. ఆ స్థితికి చేరుకొని చూచినచో, జన్మమృత్యువులు రెండూ

మానవుల భ్రాంతిచే సిద్ధములేకాని, యథార్థమునకు లేవు. ఈ అంశము ఋగ్వేద దశమ మండలస్థ నాసదీయ సూక్తములోనూ, అజాత (అచల) వాదములోను లెస్సగా నిరూపింపబడియే యున్నది. మాండూక్య కారికలు కూడ....

"న నిరోధో, న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః,
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా."

జన్మ మృత్యువులుకాని, బద్ధుడు సాధకుడు కాని ముముక్షువు ముక్తుడుకాని లేనే లేరు— ఇట్టి తత్వ జ్ఞానము కలుగుటయే పరమార్థము అన్నది. అదే మృత్యుంజయ స్థితి; మృత్యుంజయము. కనుకనే మిత్రసాహస్రిలో—

"వేద ఋషులు మొదటి విజ్ఞానవేత్తలు,
అవల బుద్ధదేవు నగును చెప్ప.
మఱువదగనివారు మాండూక్యకారుండు,
శంకరారవిందు లింక మిత్ర!

అనుట యైనది.

దశమానువాకమున కొన్ని ఋఙ్మంత్రములు చెప్పబడినవి. ఈ ఏకాదశానువాకమున తక్కిన ఋఙ్మంత్రములు, యజుస్సులు చెప్పబడుచున్నవి. అందు మొదటి పది ఋక్కులు ఇవి —

"సహస్రాణి సహస్రశో యే రుద్రా అధి భూమ్యాం,
తేషాం సహస్ర యోజనేఽవధన్వాని తన్మసి. 1

అస్మిన్మహత్యర్ణవే ఽన్తరిక్షే భవా అధి. 2
నీలగ్రీవా శ్శితికంఠా శ్శర్వా అధః క్షమాచరాః. 3
నీలగ్రీవా శ్శితికంఠా దివం రుద్రా ఉపశ్రితాః. 4
యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః, 5
యే భూతానా మధిపతయో విశిఖాసః కపర్దినః. 6
యే అన్నేషు వివిధ్యన్తి పాత్రేషు పిబతో జనాన్, 7
యే పథాం పథి రక్షయ ఐలబృదా యవ్యుధః, 8
యే తీర్థాని (1) ప్రచరన్తి సృకావన్తో నిషంగిణః. 9
య ఏతావంత శ్చ భూయాంస శ్చ దిశో రుద్రా వితస్థిరే,
తేషాం సహస్రయోజనేఽవధన్వాని తన్మసి. 10

నమో రుద్రేభ్యో యే పృథివ్యాం, యేఽన్తరిక్షే, యే దివి, యేషా మన్నం వాతో వర్ష మిషవ స్తేభ్యో దశ ప్రాచీ ర్దశ దక్షిణా దశ ప్రతీచీ ర్దశోదీచీ ర్దశోర్ధ్వా స్తేభ్యో నమ స్తే నో మృడయన్తు తే, యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తం వో జంభే దధామి. (2)

టీక :- భూమ్యామధి=భూమిమీాద. యే రుద్రాః= ఏ రుద్రులు. సహస్రశః=వేయిరీతులవారు. సహస్రాణి=వేల సంఖ్యలలో కలరో. తేషామ్=వారియొక్క. ధన్వాని=ధనుస్సులు. సహస్రయోజనే=మాకు వేలయోజనముల దూరమున. అవతన్మసి=తగిలింపబడని అల్లెత్రాళ్ళు కలవిగా ఉండునుగాక. 1.

అస్మిన్ మహతి అర్ణవే అన్తరిక్షే=ఈ గొప్ప సము ద్రమువంటి దైన అంతరిక్షమున. అధి=ఆశ్రయించి. భవాః =ఏ రుద్రులుకలరో వారుకూడ మాకు సహస్రయోజన దూరమున ముక్తధన్వు లగుదురుగాక. 2.

నీలగ్రీవాః = కంఠదేశమున ఒక్కచో నలుపుగల వారును తక్కిన తావున తెలుపుగలవారును అగు, శర్వాః = రుద్రులు అధఃక్షమాచరాః=భూమికి దిగువ పాతాళమున చరించుచున్నారో— 3.

అట్టి రుద్రులు, దివం ఉపశ్రితాః=స్వర్గము నాశ్ర యించి యెవరు కలరో— 4

వృక్షేషు=చెట్లయందు. యే=ఎవరు. సస్పింజరాః = గడ్డిరంగు కలవారై, నీలగ్రీవులు, లోహితవర్ణులు అయి యున్నారో వారియొక్క— 5

యే=ఎవరు. భూతానాం=కనులకగపడక జనులకు కీడుచేయు భూతములకు. అధిపతయః=ప్రభువులై, విశిఖాసః =తలలు గొరిగించుకొనియు, కపర్దినః=జడల ముడులుకల వారైన వారియొక్కయు, 6

యే=ఎవరు, అన్నేషు=అన్నములు తినువేళ. పాత్రేషు పిబతో జనాన్ =త్రాగదగిన నీరక్షీరాదులను త్రాగునప్పుడు. వివిధ్యన్తి=హానిచేయుదురో, అట్టివారియొక్కయు, 7.

యే =ఎవరు. పథాః=లౌకిక వైదికమార్గములయొక్క పథిరక్షయే=మార్గరక్షణ కోసమై. ఐలబృదాః=అన్నమును

భరించువారై యున్నారో- అన్నపోషకులో, యవ్యుధః= మన అనిష్టములను నివారింతురో, వారియొక్క- 8.

యే=ఎవరు సృకావన్తః=చిన్నకత్తులు కలవారై, నిషంగిణః=ఖడ్గహస్తులై, తీర్థాని ప్రచరన్తి=కాశీ రామేశ్వ రాది తీర్థములందు తిరుగుచుందురో అట్టివారియొక్క-9.

యే=ఎవరు. ఏతావంతశ్చ=ఈ చెప్పబడిన వేల సంఖ్యలవారు, భూయాంసశ్చ=ఇంతకన్న భిన్నులైన ఇతరు లును అయిన, రుద్రాః=రుద్రులు. దిశః వితస్థిరే=నానా దిక్కులయందును కలరో- తేషాం=వారియొక్క. ధన్వాని =విండ్లు. సహస్రయోజనే=వేయి ఆమడల దూరమున. అవ తన్మసి=అల్లెత్రాడులేనివి అగుగాక- అని అన్నిటికిని కలిపి అన్వయము. 10.

యే=ఏ రుద్రులు. పృథివ్యామ్=భూమిమీదను, యే = ఎవరు. అంతరిక్షే=అంతరిక్షమునను, యే=ఎవరు. దివి= దివమునందును కలరో, యేషాం=ఎవరికి వరుసగా, అన్నం= అన్నము, వాతః=గాలి. వర్షం=వాన. ఇషవః=బాణములో. తేషాం రుద్రేభ్యః నమః=అట్టి భూమ్యన్తరిక్ష ద్యులోకము లందు సంచరించెడి రుద్రులకు నమస్కారము.

దశప్రాచీః = పదివ్రేళ్ళు కలసినప్పుడు నమస్కార మగునుగదా. ఇట్టి నమస్కారములు తూర్పునుండి ఊర్ధ్వము

వలకు జరుగు నన్నమాట. ఇట్టి నమస్కారముల నందు కొన్న ఆ రుద్రులు, నః=మమ్ములను. మృడయన్తు=సుఖ పెట్టుదురుగాక- అని భావము. యం ద్విష్మః=మే మెవరిని ద్వేషింతుమో, యశ్చ నః ద్వేష్టి=ఎవడు మమ్ములను ద్వేషించునో, తం=అతనిని వః=మీయొక్క. జంభే=తెఱ చిన నోటియందు. దధామి=ఉంచెదను.

ఇక్కడ ఒకవిశేషము :- భూమిమీదను, అంత రిక్షమునను, ద్యులోకమునను చరించెడి రుద్రులకు వరుసగా అన్నము, గాలి, వర్షము అనునవి ఆయుధములై యున్నవి. కావున వారు భూచరులయిన ప్రాణులకు అన్నమునే రోగ హేతువుచేసి హింసింతురు. అంతరిక్ష చారులైన ప్రాణు లను వాతోపద్రవముల ద్వారా బాధింతురు. ద్యులోక ప్రాణులను అతివృష్టి అనావృష్టులచే బాధింతురనుట గ్రహిం పదగిన విశేషము. కనుకనే ఇట్టి రుద్రులందఱకు- పంచదిశ లందు నున్నవారికి నమస్కార మొనర్చి వారినుండి సౌఖ్యమే కోరబడినది. కాని ఇక్కడ తమ్ము ద్వేషించువారికిని తాము ద్వేషించువారికిని అపకారమును కోరుట అనునది వేదముల యందు అట నట అగపడుచునే యున్నది. శత్రువులకు మేలు కోరుట వేదములందగపడదు. ఇది అహింసా సిద్ధాం తమునకు, సర్వాత్మ భావమునకు భిన్నముగా నున్నది. ఆలోచనీయము.

## నమక రహస్యము

కృష్ణయజుర్వేద చతుర్థకాండము నందలి రుద్రుడు దేవతగాల గల నమకము "విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖః." అనియు, "సహస్రశీర్షాపురుషః సహస్రాక్ష స్సహస్రపాత్" అనియు ఋగ్వేదమున స్తుతింపబడిన విశ్వకర్మ నుండి- "సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం, విశ్వశంభువమ్," ఇత్యాదిగా పేర్కొనబడిన విష్ణువు, ఇంద్రసూర్యాది దేవతలు, నరులు, చరాచరాత్మక జీవకోటి వఱకు గల అంతయు రుద్ర స్వరూపమే అనెడి మహా అద్వైతార్థమును చాటుటకే ఉద్దేశింప బడినదని గ్రహింపవలసి యున్నది. సర్వ జీవుల హృదయములందును అంతర్యామి స్వరూపుడై ఈశ్వరుడున్నాడని "ఏష దేవో విశ్వ కర్మా మహాత్మా, సదాజనానాం హృదయే సన్నివిష్టః" అని శ్వేతాశ్వరమును, "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" అని భగవద్గీతయు పేర్కొనుచున్నవి. అంతియేకాదు. సర్వ వైదిక గ్రంథములయు పరమ తాత్పర్యము ఇదియే. కనుక చరాచరములలో అన్నింటను త్రిగుణోపాధికమైన జీవతత్వమొకటియు, దానిని సృష్టించిన భగవత్తత్వమొకటియు నిగూఢముగా నున్నవనుట తాత్వికుల అనుభవమును, శాస్త్రములును చాటుచునే యున్నవి.

ఇట్టి సందర్భమున జీవేశ్వరతత్త్వములు వేరు కావని మనము ఋగ్వేద దర్శనములందు అడుగడుగునను చదివియే యున్నాము. "య ఇమా విశ్వా భువనాని.... స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదవరా ఆవివేశ" అని ఋఙ్మంత్రమును, "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అని భగవద్గీతయు వాకొనుచునేయున్నవి. మానవులు అజ్ఞానమువలన ఆ జీవ జగదీశ్వరుల తత్త్వములను భిన్నములని భావించుచున్నారు. ఆ భేదము ఉపాధి వలన కలిగినదను జ్ఞానము సామాన్యులకు లేకున్నది. ఇట్టితటి ఔపాధికములైన నామ రూపములు సచ్చిదానందముల కంటె భిన్నములు కావను పరమ రహస్యమును చాటుటకే రుద్రనమకము బయలుదేఱినది.

అందుకనియే దొంగలుకాని, దొరలుకాని, జ్ఞానులు కాని, అజ్ఞానులుకాని, శిల్పులుకాని, సామాన్యులుకాని, వీరులుకాని, పిఱికివారుకాని, ఎట్టివారుకాని, దేవతలు కాని, మనుజులుకాని- సర్వ ప్రాణులును భగవత్స్వరూపులే అని అందఱికి నమస్కారము చేయబడినది. సమస్త చరాచరాత్మక బ్రహ్మాండమునందలి మంచి చెడులనెడి ద్వంద్వములతో గూడిన సర్వమును పరమేశ్వర స్వరూపమే అని ప్రబోధింపబడినది.

సమస్తమును ఆధారముగా చేసికొని అణు మహత్తుల రూపముననున్న జగత్తును వర్ణించుటకు ఈ రుద్రనమకము

పూనుకొన్నది. కనుకనే మాయా కల్పితములైన ఉపాధు లను వదలినచో ఇక మిగులునది జగత్కర్తయైన పరమేశ్వరుడే అను నంశము ప్రతి పదమున, ప్రతి వాక్యమున, ప్రతి మంత్రమున, ప్రతి అనువాకమున- నమకము నందెల్లెడలను చాటబడినది. కనుక తద్రూపముగా నమక రహస్యమును ఉపాసకులు భావించి ప్రవర్తింపవలసి యున్నది. తమ నడవడిని ఈశ్వరానుకూలముగాను, జగత్కల్పనానుకూలముగాను మలచుకొనవలసి యున్నది. అట్లుకాక కేవలము సస్వరముగా మంత్రోచ్చారణచేసి ధన్యులమైతి మనుకొనుట ఎంత మాత్రమును ప్రయోజనకారి కాజాలదు.

న్యాయ వైశేషిక దర్శనములు ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము - అని ఏడు పదార్థములను పేర్కొన్నవి. వాటిలో ద్రవ్యములనగా - పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు— అనెడివి తొమ్మిది అన్నవి. వీటిలో పృథివినుండి ఆకాశము వఱకును కలవి పంచభూతములు. కాలమనగా క్షణములనుండి యుగముల వఱకు కలది. దిక్కులేమో ప్రదేశములలో చేరునట్టివి. ఈ రెంటినే కాలము, దేశము (దేశ కాలములు) అన్నారు. పంచభూతముల కలయికవలన కలిగెడి వస్తువులు అనేకములు. అవి అణువునుండి మహత్తు వఱకు కలవు. వీటిని కలుపుకొనగా దేశకాల వస్తువులు అనెడి త్రికము ఏర్పడును.

కాగా ఇవి అన్నియు జడములే. వీటిలో చైతన్యమనునదిలేదు. ఆ చైతన్యమనెడి దానినే ఆత్మ అన్నారు. కేవల చైతన్యము, జడము ఉన్నను ఈ రెంటికీ కలయికను కలిగించెడి ఇంకొక వస్తువు కావలసియున్నది-అదే మనస్సు. ఆ మనస్సును అంతరింద్రియ మనియు, అంతఃకరణమనియు పిలుచుచున్నాము. అది మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము— అని నాలుగు వ్యాపారములు కలదై యుండును. ఇదే అంతఃకరణోపాధి, కారణ శరీరము అని సాంఖ్య వేదాంతములు చెప్పుచున్నవి. ఈ అంతఃకరణోపాధియందే ఆత్మ- లేక, ఆత్మ చైతన్యము ప్రతిబింబించి, జీవుడని చెప్పబడును. అనగా సర్వాధిష్ఠాన చైతన్యము, అందు తోచిన అంతఃకరణోపాధి, అందు ప్రతిబింబించిన ఆత్మచైతన్యము- ఈ మూటినికలిపి జీవుడన్నారు. ఈ జీవుడు ఆత్మ ప్రతిబింబ రూపుడేకాన, అంతఃకరణోపాధితోగూడుకొని, అనగా తాదాత్మ్యమునుపొంది (కాల్చిన ఇనుప గుండువలె అగ్నితో విడదీయరాని సంబంధముకల యట్లు) అంతఃకరణోపాధితో, అనగా అహంకారముతో చేయు పనుల నన్నిటిని తానే చేయుచున్నాడని యెంచి శరీరమున బద్ధుడగుచున్నాడు. అతని కెప్పుడుశరీరాంతఃకరణ ఆత్మలయొక్క పరిజ్ఞానము కలుగునో, ఆ నాడతనికి జ్ఞానము కలిగినట్లు. అప్పుడాతడు ముక్తుడు కాగలడు. ఆతనికి కలిగినదీ, కలుగవలసినదీ ప్రకృతి పురుషులయొక్క జ్ఞానము. ఆ జ్ఞానమే మోక్షహేతువు, సుఖమయము. ఆనందరూపము.

ఇట్టి స్థితిలో న్యాయవైశేషికములు ఆకాశమును వీడి, తక్కిన ప్రకృతిని అనగా నాల్గు భూతములను విభజింపరాని పరమాణువుల రూపమున శాశ్వతమే అన్నవి. ఆకాశము విభజింపరానిదని అందఱికీ తెలిసిన విషయమే. అది ఆత్మకు దగ్గఱదై ఒక్క చైతన్యము మాత్రమే లేక, సూక్ష్మత్వ వ్యాపకత్వాది గుణములను కలిగియున్నది. అందుకే ఆత్మతత్త్వమును బోధించునప్పుడు దానికి ఆకాశముతో పోలికనుచెప్పి "ఆకాశవ త్సర్వగత శ్చ నిత్యః" అని దానిని అన్నారు. ఆకాశములో నిత్యత్వములేదు. ఆత్మ వలె సూక్ష్మత్వమును, వ్యాపకత్వమునే కలవు. కనుక అది అణు పరమాణు రూపముగా విభజింపరానిది. ఆత్మయు అంతే కదా. ఆకాశమునకు శబ్దమనెడి గుణముండి సావయవమగుచున్నది. ఆత్మ యేమో నిర్గుణమై నిరవయవమగుచున్నది. సావయవ పదార్థమునకు నాశ ముండును. నిరవయవమునకు నాశములేదు. అందుకే ఆత్మ అవినాశి అగుచున్నది.

పృథివ్యాదులు పరమాణు రూపమున శాశ్వతములు అనెడి వాదమును వేదాన్తశాస్త్రము ఒప్పుకొనదు. ఆపృథివి జలములోను, జలము అగ్నిలోను, అగ్ని వాయువులోను, వాయువు ఆకాశములోనూ, ఆకాశము కాలములోనూ, కాల దిక్కులు మనస్సహితముగా ఆత్మలోనూ లీనమైపోవు నని వేదాంత సిద్ధాంతము. ఇది అనుభవ సమ్మతమైనదికూడ. ఎట్లన ?

మన జాగ్రత్ప్రపంచ మంతయు స్వప్నములో కలసి పోవుచున్నది. అనగా స్థూలరూపమును వీడి కేవల మనో రూపము, మన సంకల్ప రూపము అగుచున్నది. ఆ స్వప్న జగమేమో సుషుప్తి (గాఢనిద్ర)లో లయమగు చున్నది. అనగా కేవల కారణరూపమును పొందుచున్నది. ఆ కారణముకూడ సమాధి అనెడి తురీయావస్థ ప్రాప్తించినప్పటికి ఆత్మలో లీనమై పోవుచున్నది. ఈ జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అనెడి దశలు సర్వప్రాణులు- ముఖ్యముగా మానవులు పొందునట్టివే. సమాధిని మాత్రము- యోగులు, జ్ఞానులు, మనస్తత్వమునుగూర్చి మననసాధనలు చేసినవారు మాత్రమే పొందుచున్నారు. కాగా, ఆ దశలో అణు పరమాణు రూపమునగాని, నామ రూపాత్మకముగాగాని ఏమీ మిగులుట లేదు. కావుననే జగమునకు శాశ్వతసత్తలేదనియు, అది ఆత్మ ప్రతిభాసమే అనియు వేదాన్తము, జ్ఞానుల యోగుల అనుభవములు చాటుచున్నవి. ఇట్టి స్థితిలో జగత్స్వరూపము పరమ కారణమైన పరమాత్మకంటెను భిన్నమా, అభిన్నమా? అను ప్రశ్న బయలుదేరుచున్నది. దానికి సమాధానము చెప్పుటకే ప్రత్యక్షాది ప్రమాణములయు, వేదాది శాస్త్రములయు ప్రవృత్తి.

కారణమునకంటెను కార్యమెప్పుడును భిన్నము కాదనుట న్యాయమొప్పుకొన్న విషయమే. మంటికంటెను కుండ వేఱుకాదు గదా. ఆ మట్టియందే కుండయొక్క సృష్టి

స్థితి లయములు. ఇది అనుభవములో అందరెఱింగిన విషయమే. దీనిని బట్టి చూచినచో, ఏ జగత్కారణము నుండి జగము తోచుచున్నదో, దానికంటెను ఆ జగము విలక్షణముగా తోచుచున్నను, భిన్నమగుటకు వీలులేదు. మననము (తర్కము)చే కలిగిన అనుభవము (నిదిధ్యాసము) వలన ఈ జ్ఞానమే స్థిరముగా నిలుచుచున్నది. దీని నెవరును కాదన వీలు లేదు. జగమునకు ఒక్కటే వస్తువు హేతువు. దానిని ఋగ్వేదస్థ నాసదీయసూక్తము- సత్తనికాని అసత్తనికాని చెప్ప వీలుకాదన్నది. ఇదీనిజమే. అది అసత్తయినను, దానినుండి సత్తనిమన మనుకొను నది రావచ్చును. లేక సత్తయినను మనకగపడెడి అసత్తు దానినుండి రావచ్చును. అట్టిశక్తి జగత్కారణ పదార్థములో ఉన్నదన్నమాట! అందుకే దానినిగూర్చి వేదాదులుకాని, దార్శనికులుకాని ఇన్నివిధములుగా భావించుట, వ్యాఖ్యానించుట జరిగినది. కార్యరూప సర్వపదార్థములు, విలాసములు కడపటికి అందులో లీనముకాక తప్పదు. ఈ రహస్యమునే మానవులనుభవించు జాగ్రత్స్వప్న సుషుప్తి సమాధిదశలు సూచించుచున్నవి. దీని నెవ్వరూ కాదనుటకు వీలులేదు. కనుక ద్వైతవాదులు జీవేశ్వరజగత్తులను మూటిని శాశ్వతములని వాదించినను, ఆమూడు కడకు ఏదో ఒక పరమకారణములోనే ముడుచుకొనక తప్పదు. ఈ రహస్యము- అగ్ని, యమ, వరుణ, విష్ణు, రుద్ర, ప్రజాపతి, హిరణ్యగర్భ, విశ్వకర్మాదుల సూక్తములలోని మంత్రములు తేటతెల్లము చేయుచునే యున్నవి. ఈ రహస్యమును చాటు

టకే ఈ గ్రంథకర్త వేద దర్శనములను వ్రాయబూనినాను. ఆకృషిలో ఇప్పుడతనిదృష్టికి ఈరుద్రాధ్యాయము తగిలినది. దీనిని గూర్చి బాల్యమునుండీ వినుచున్నను, చదువుచున్నను ఇటీవలనే తపస్సు (మననము) చేయవలసి వచ్చినది.

మూర్తిత్రయములో కానిండు, మూర్తి పంచకములో కానిండు రుద్రుడు లయకారుడు. అంతటిని తనలో నిముడ్చుకొను స్వభావము కలవాడు. జగత్తులన్నిటిని తినివేసి గట్టున త్రేన్చువాడు. ఇతనికి మనుబ్రహ్మతోను, విశ్వకర్మతోను సాజాత్యము (సమానత) అధికముగా కలదు. అందుకే విశ్వకర్మ సూక్తము- సృష్టి కార్యాభివర్ణనలతో ప్రారంభము కాక, లయకర్మతో ప్రారంభమగు చున్నది. "య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషి ర్హోతా నిషసాద పితా నః" అన్నది ఆ సూక్తముయొక్క ప్రారంభము. విశ్వబ్రహ్మాంశములను తనలో వ్రేల్చికొనుటయే ఈ సూక్త దైవపతము మొదట చేసినపని. ఇది రుద్రవిశ్వకర్మల యేకత్వరముసకు నిదర్శనము.

తరువాత ఆయన పిత యగుచున్నాడు. పిత జగములను కన్నవాడు, సృష్టికర్త. ఆవల ధాత, విధాతల స్థితి ఆతనికి కలుగుచున్నది. పిమ్మట జగత్తులను సృష్టించి, ఆ సృష్టింపబడిన శరీరోపాధులలో జీవరూపమున ప్రవేశించు చున్నాడీ సృష్టికర్త. ఇదే అద్వైతమునకు ఆద్యసూత్రము. "అహం బ్రహ్మాస్మి" అనెడి అనుభవ వాక్యమునకును,

"తత్త్వమసి" అనెడి ఉపదేశ వాక్యమునకును దారి తీసిన దీ మాటయే, ఈ అనుప్రవేశమే. "తత్సృష్ట్వా, తదేవాను ప్రావిశత్" ఇత్యాది వాక్యములు ఈ సూక్తవాక్యము నాధారముచేసికొని బయలుదేఱినట్టివే. ఇక రుద్రునకూ, మను బ్రహ్మకూ గల పోలికలనూ, కర్మసాదృశ్యమునూ రుద్ర మంత్ర వ్యాఖ్యాన ఘట్టములందు చెప్పికొనియే యున్నాము.

సృష్టి, స్థితి, లయముల క్రీడ అంతయు ఈ రుద్రునిదే అనియు, ఈ రుద్రుడే సర్వమూ అనియూ, అణు పరమాణువుల యందునూ, మహన్మహత్తరములయందును అవి అయి, వాటి అంతర్బహిస్సర్వస్వమూ ఈ రుద్రుడే అయి యున్నాడని మన ఈ శతరుద్రీయము వర్ణించినది. ఇక్కడి శత శబ్దమునకు నూఱని మాత్రమే అర్థము కాదు. సృష్టిలో నగపడు సర్వము అని భావము.

సహస్రశః, సహస్రధా, సహస్ర శబ్దములు రుద్రాధ్యాయమున ఎక్కడ వాడబడినను, వాటి కన్నింటికిని సృష్టిలోగల బహువిధనానాత్వమే అర్థము. ఇంత నానాత్వము, పృథక్త్వమూ ప్రోగుపడ్డనూ అదిఅంతయూ, ఏకత్వమునుండియే. తన లీలను ప్రదర్శించిన పిమ్మట మఱల ఆ ఏకత్వములోనికే దాని ప్రయాణము. ఈ రహస్యమును చాటుటకు రుద్రాధ్యాయద్రష్ట అయిన అఘోరఋషి త్రొక్కిన త్రోవలు చిత్ర విచిత్రములు. అనేకానేకములు. బహు వైవిధ్యముల రాశులు అనుట రుద్రాధ్యాయ పాఠకులు గ్రహింపవలసిన

విశేషము. ఇందు చూపబడని ప్రకృతివైచిత్రి లేనే లేదు. ప్రదర్శించని సృష్టిధర్మము లేనే లేదు. విశ్వప్రకృతియొక్క ఉత్తమాధమ మధ్యమరూపము లన్నియు ఇందు ప్రదర్శింపబడినవి, ఇందు పేర్కొనబడినవి; ఇందు వర్ణింపబడినవి. విశ్వ విశ్వలీల నంతటిని ఋషి ఇందు రాశి పోసి చూపినాడు. మనకు భావనాశక్తి ఉన్నచో, భావించినచో ఎల్ల సృష్టి రహస్యములు, సమంజ స్వభావ ధర్మములు ఇందు చూపబడినవని గ్రహింప గల్గుదుము. దర్శనకారులు చూపిన కార్యకారణ భావములన్నియు ఇందు పేర్కొనబడినవి.

రుద్రుడనగానే ప్రత్యేక ఆకారము, వేషము గల పురుషుడని సామాన్యదృష్టికి తోచవచ్చును. కాని అది అట్టిది కాదు. అది ఒకానొక జగత్కారణమైన శక్తి. శక్తి శబ్దము సంస్కృతములో స్త్రీలింగము. శక్తి ఒక దేవత కూడ కాని అది శక్తి అనుటకును వీలుకాని ఒకానొక వస్తువు: బ్రహ్మము. బ్రహ్మశబ్దము నపుంసక లింగము. జగత్కారణ వస్తువునకు స్త్రీ పుం నపుంసక లింగభేదములు లేవు. భాషకు సంబంధించిన లింగ వచన కారక విభక్తుల కది లోబడునట్టిది కాదు. అది వాటి కతీతము. అయినను అది కాని దేదియును లేదు. అన్నీ అయ్యును- కానిదీ, కాగలదీ రుద్రాది వైదిక దేవతాశక్తుల స్వరూపమూ, స్వభావమూ అని పాఠకులు గమనింపవలయును. ఇట్టి విషయములు నా అత్మ, శిల్ప, యోగాది దర్శనములలో పలుసార్లు ప్రస్తా

వింపబడినవే. నా హృదయమును, నా అనుభూతిని నా గ్రంథము లన్నింటను కాంచగలరు. తత్త్వసూక్తులలోను, మిత్రసాహస్రి పద్యాలలోను- ఈ విశ్వరూపమును కాంచ వచ్చును.

## శ్వేతాశ్వతర సమన్వయము.

ఇట్టి జగత్కారణ వస్తువు రుద్ర శబ్దముతో పేర్కొన బడగా, దానిని ఉపనిషద్వాణి యెట్లు వర్ణించినదో కూడ చూతము. రుద్రుని మహేశ్వరునిగను, ఆయనమాయను ప్రకృతిగాను శ్వేతాశ్వతరము వర్ణించినరీతిని గాంచుడు:—
"మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరం, తస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వ మిదం జగత్." 4-10

జగత్తులకు ఉపాదానకారణమైన ప్రకృతియే ఆయన మాయాశక్తి. ఇక ఆయనయో, ఆ ప్రకృతికి (మాయకు) అధీశ్వరుడైన మహేశ్వరుడే. ఆయనయొక్క అవయవము లని చెప్పదగిన భూతములచేతనే జగమంతయు నిండియున్నది. ఆయన అవయవములు నిండినను, ఆయన నిండినను ఒక్కటియే. రెండును "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అన్న భావమునే తెల్పును. ఇక్కడ న్యాయ వైశేషికములు చెప్పిన పరమాణువులు పరమాత్మయొక్క అవయవములే అని చెప్పి నట్లయినది. భూతములనగా చరాచరములనికూడ భావమే. కనుకనే రుద్రాధ్యాయమైన నమకము సర్వము రుద్రుడే

అని పలికినది. అవయవముల నెడి వర్ణన జ్ఞానులకు సంగతి విశద మగుటకే కాని, జగత్కారణ వస్తువు నిరవయవమే! ఇట్టి ఏకైక జగత్కారణ పరవస్తు పాకృత సృష్ట్యాది యందు కలదని ఇంకొక మంత్ర మనుచున్నది.

"యదా తమ స్తన్న దివా న రాత్రి ర్న స న్న చాస
చ్ఛివ ఏవ కేవలః. త దక్షరం, తత్సవితు ర్వరేణ్యం
ప్రజ్ఞా చ తస్మా త్ప్రసృతా పురాణీ." 4-18.

తా. మన కంటికగపడెడి ఈ జగముకాని, చీకటి కాని, రేయి పవళ్ళుగాని, సత్తు, అసత్తుకాని ఏమీ లేనప్పుడు అక్షరమైన ఒక శివతత్త్వము మాత్రమే యున్నది. దాని నుండియే ప్రాచీనమూ జగదుపాదాన కారణమూ అయిన ప్రజ్ఞ (ప్రకృతి) వచ్చినది. ఈ ప్రకృతిని మాయ అనియు, దానికి హేతువైన దానిని మహేశ్వరుడనియు ఇంతకు ముందు చదివినాము. బ్రహ్మమువలె ఈ మాయయు అనాదియే అని "పురాణీ" అన్నమాట తెల్పుచున్నది. ఈ శివ శబ్ద లక్ష్యమైన తత్త్వమును మూలస్తంభ పురాణము విశ్వకర్మ అని పిలుచున్నది.—

"న భూమి ర్న జలం చైవ న తేజో న చ వాయవః,
న చ బ్రహ్మా, న విష్ణు శ్చ, న రుద్రో, న చ తారకాః,
సర్వశూన్యే విశ్వకర్మా స్వయంభూ రభవ త్తదా."

ఇందు పేర్కొనబడిన బ్రహ్మ విష్ణు రుద్రులు సృష్టి స్థితిలయ కర్మకారులైన త్రిమూర్తులు. సమకమున చెప్పబడిన

రుద్రుడు వారికిని మూలకారణమైన మహారుద్రుడు, లేక విశ్వకర్మ, పరమాత్మ. ఇట్టి మాయకల వాడొకడు సృష్టించు చుండగా, ఆ రహస్యము నెఱుంగని ఇంకొకడు (జీవుడు) అందు తగుల్కొని బద్ధుడగుచున్నాడని ఇంకొక శ్వేతాశ్వతర మంత్ర మనుచున్నది.

"అస్మా న్మాయియా సృజతే విశ్వమేత,
మస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః." 4-9

ఇక్కడ సృష్టికర్త మాయి అయి సృజింపగా, ఆతని ప్రతిబింబము జీవుడై ఆ మాయామయ జగమున బంధింప బడుచున్నాడన్నమాట. మఱొక మంత్రము సకల జీవుల హృదయములయందునుకల ఈ విశ్వకర్త నెఱింగిననే కాని నరుడు అమృతుడుకాడని వక్కాణించుచున్నది.

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా,
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
హృదా మనీషా మనసాభిక్లప్తో
య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి." 4-17

ఈ విశ్వకర్మ అందఱి హృదయములయందు నివసించి యున్నాడు. ఇతని నెఱింగినవారు అమృతు లగుదురు. ఈ మంత్రమునకు వివరణగానే గీతయందలి దిగువ శ్లోక మొప్పుచున్నది.—

"సర్వస్య చాహం హృది సన్నివిష్టో,
మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనం చ,
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః,
వేదాంతకృ ద్వేదవి దేవ చాహమ్." 15.15

నే నందరి హృదయములలో నున్నాను. నా నుండియే జీవులకు పూర్వ విషయస్మృతి, జ్ఞానము, అపోహ (వాటి నాశము) కలుగుచున్నవి. పుణ్యాత్ములకు స్మృతి జ్ఞానములు కలుగగా, పాపులకు వాటి నాశనము కలుగుచున్నది. వేదములన్నిటిచే నన్నే ఎఱుంగవలెను. ఏలన, ఆ వేద విజ్ఞానము నా స్వరూపమే - నాదే - నేనే. ఇందు చెప్ప బడిన భగవంతుడగు విష్ణువును, "ఏష దేవః" అనెడి మంత్ర మున చెప్పబడిన విశ్వకర్మయు, నమకమున చెప్పబడిన రుద్రుడును ఒకే ఒక అఖండ పరమాత్మయే కాని, భిన్నులు కారు. శివ, విష్ణు, విశ్వకర్మ లనెడి నామ రూపములను తొలగించినచో, మిగులునది ఒకే ఒక సత్య జ్ఞానానంత పర బ్రహ్మమే. సాధకులకు కలుగవలసినది ఇట్టి సమదృష్టియే!

ఇంకొక మంత్ర మేమనుచున్నదో చూడుడు —

"నైన మూర్ధ్వం న తిర్యఞ్చం, న మధ్యే పరిజగ్రభత్,
న తస్య ప్రతిమా అస్తి, యస్య నామ మహ ద్యశః."
"న సందృశే తిష్ఠతి రూప మస్య
న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్,
హృదా హృదిస్థం మనసా య ఏన
మేవం విదు రమృతా స్తే భవన్తి". 4-19,20.

తా. ఈ శివతత్త్వము ఊర్ధ్వముగాగాని, అడ్డముగా గాని, మధ్యనేకాని మాత్రమే కలదని యెన్నరాదు. అసగా "అంతర్బహిశ్చ తత్సర్వం" అన్నట్లు లోపల వెలుపల అంతటా వ్యాపించి, అన్నీ అయి ఉన్నదదే! దానితో పోల్చదగినదేదియు లేదు. దానికదియే సాటి. దాని నామము, యశస్సు మిక్కిలి గొప్పవి. దాని రూపము కంటికగ పడదు. ఎవడుకాని దానిని కంటితో చూడలేడు. కంటితోనే కాదు. ఏ ఇంద్రియముతోగాని దానిని తెలియలేము. అనగా అది మనో వాగింద్రియములకు అందనిదీ, వాటిని సృష్టించి ప్రేరేపించుననీ అని భావము. అందుకే పరమతత్త్వమును గూర్చి--

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్,
తథారసం నిత్య మగంధవచ్చ తత్."

అని కఠవల్లి వచించినది. అనగా అది శబ్దస్పర్శ రూపరసగంధాది లక్షణములులేని నిత్యమైనది. అయినను ప్రతి ప్రాణియొక్క హృదయమునందు కల దానిని పరిశుద్ధమైన మనస్సుతో దర్శించ గలిగిన జ్ఞానులు, యోగులు, భక్తులు మృత్యురూప సంసారమును - అజ్ఞాన క్షేత్రమును దాటి అమృతులు కాగలరు. ఆనందమయులై తేజరిల్లుదురు. ఇంకను తన్మహిమనుగూర్చి శ్వేతాశ్వతరము ఇట్లు పేర్కొనుచున్నది—

"ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వ భూతాంతరాత్మా,
కర్మాధ్యక్షః స్సర్వ భూతాధివాసః
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ." 6-11

ఒకే ఒక దేవుడు (తత్త్వము) అన్ని భూతముల యందు నిగూఢమైనదై (కానరాక) యున్నాడు. అది సర్వ వ్యాపకము. సర్వ భూతములకు అంతరమైన స్వరూపమదే; అదే అంతరాత్మ. బాహ్యాత్మ దేహము కాగా అది యేనా అంతరాత్మ అన్న మాట. సర్వకర్మలకు అదియే అధిపతి. అన్ని భూతములందు వసించి, వాటిని చైతన్యవంతము గావించునది అదే. అది సాక్షి మాత్రము, చైతన్య రూపము, కేవలము-ఒక్కటే అయినది; గుణరహితము. ఇంకొక మంత్రమును చూతము

"బహూనా మేకం బీజం బహుధా యః కరోతి,
తమాత్మస్థం యేనుపశ్యన్తి ధీరా స్తేషాం సుఖం శాశ్వతం
నేతరేషాం." 6-12.

తా. మనకు తోచెడి అన్నిటికీ అదొక్కటే బీజము. ఒక్కటే అయినను అనేకములను అనేక విధముల అది సృజింప గలదు. అది ఎక్కడో లేదు. నీ ఆత్మలోనే యున్నది. దానిని దర్శించిన-అనుభూతిపొందినవారికే శాశ్వతసుఖము. తక్కిన వారికా శాశ్వతానందము లేదు. ఇంకొక మంత్రము--

"స విశ్వకృ ద్విశ్వవి దాత్మయోనిః,
జ్ఞః కాలకాలో గుణీ సర్వవి ద్యః,
ప్రధాన క్షేత్రజ్ఞ పతి ర్గుణేశః
సంసార మోక్ష స్థితి బంధ హేతుః." 6-16,

తా. అది ఒక్కటే విశ్వముల నన్నిటినీ చేయు దివ్య శక్తి. విశ్వరహస్యములను ఎఱుంగునదికూడ అది ఒక్కటియే. దానికీ, దానికి భిన్నమైతోచు జగమునకూ అదే కారణము. ఆత్మయోని అనగా ఆత్మయే కారణముగా కలది. యోని అనగా కారణమని భావము. అది సర్వజ్ఞము-అన్నిటిని ఎఱుంగ గలది. కాలమునుకూడ తనలో లీనముచేసికొని వెలుగునది. త్రిగుణములు తనలో కలదయ్యు నిర్గుణము. సంసారము కలుగుటకూ, అందు ఈదులాడుటకూ, దానినుండి ముక్తుడగుటకుగూడ అదే హేతువు. దాని నెఱింగిన మోక్షము, లేకున్న సంసారము అన్నమాట.

"క్షరం ప్రధాన మమృతాక్షరం హరః,
క్షరాత్మానా వీశతే దేవ ఏకః,
తస్యాభిధ్యానా ద్యోజనా త్తత్వ భావాత్
భూయ శ్చాన్తే విశ్వమాయా నివృత్తిః. 1-10

తా. ప్రధానమైనప్రకృతి నశించునదే. అనగా బ్రహ్మమున కలసిపోవునది. అది సముద్రములోని తరంగము వంటిది. అమృతము, అక్షరమైన దొక్కహరతత్వమే. "హరతీతి హరః" హరించువాడు హరుడు- అనెడి వ్యుత్పత్తినిబట్టి

దుల అనుష్ఠానముచేత, తపస్సు- అనగా శ్రవణ, మనన, నిది ధ్యాసలచేత తెలియవలయును. నువ్వులలో అంతట నూనె ఉన్నది. కొయ్యలో అంతట అగ్ని యున్నది. పాలలో నేయి ఉన్నది. అట్లే ఆత్మయు అంతట వ్యాపించి యున్నది. అట్లున్నను దాని అనుభూతి మాత్రము భ్రూ మధ్య స్థానమునందలి హృదయమున మాత్రమే కాగల దనుట రహస్యము.

ఈ విధముగా శ్వేతాశ్వతరోపనిషత్తు రుద్రా ధ్యాయమునకు భాష్య (అర్థ వివరణ)మా అన్నట్లు జగ త్కారణ పరమాత్మ తత్త్వమును తెస్సగా వివరించినది. ఇందు విశ్వకర్మ సూక్త మంత్రములుకూడ చోటుచేసికొని పరమశివ విశ్వకర్మలకుగల అభేదమును చాటులయే కాక "ఏకం సత్" అన్న తత్త్వమునుకూడ నిరూపించుట విశే షము. ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్తములోని "విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖః" (10-81-3) అనెడి మంత్రము శ్వేతాశ్వతరోపనిషత్తు తృతీయాధ్యాయమున మూడవ మంత్రముగా గ్రహింపబడినది. చూడుడు.

"విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో
విశ్వతో బాహు రుత విశ్వత స్పాత్,
సంబాహుభ్యాం ధమతి సంపతత్రై
ర్ద్యావా భూమీ జనయ న్దేవ ఏకః."

తా. ఆ విశ్వకర్మ- లేక, రుద్రుడు (జగత్కారణ వస్తువు) అంతటను కన్నులు. మోములు, చేతులు, పాదములు కల వాడు. ఆ దేవుడొక్కడే అన్యసహాయత లెకుండ బాహువుల చేత దివమును, గమన స్వభావముగల పాదములచేత భూమిని సృష్టించెను. అనగా ఆయన పృథివ్యన్తరిక్షద్యులోక ములతో గూడిన బ్రహ్మాండమును సృష్టించినాడని భావము. ఇట్లే రుద్ర నమకములోని దిగువ మంత్రముకూడ శ్వేతా శ్వతరమున చోటుచేసికొన్నది

"యా తే రుద్ర శివా తనూ రఘోరా పాపకాశినీ,
తయా న స్తనువా శంతమయా గిరిశంతాభిచాకశీహి,
యా మిషుం గిరిశంత హస్తే బిభర్ష్యస్తవే, శివాం
గిరిత్ర తాం కురు మా హింసీః పురుషం జగత్."3-6

వీటి అర్థములను లోగడనే చదివినాము. ఇట్టి మంత్ర ములు పెక్కులు రుద్ర విశ్వకర్మలకూ, జగత్కారణ పర మాత్మకూగల అభేదమును చాటెడిని. దీనిని పోలిన మంత్ర మును శివపరమైన దానిని కాంచుదము

"సర్వానన శిరోగ్రీవః, సర్వభూత గుహాశయః;
సర్వవ్యాపీ స భగవాన్ తస్మాత్సర్వగత శ్శివః."3-11

ఆ శివుడు అందటి ముఖములు, శిరస్సులు, మెడలు తనవిగానే కలవాడు. ఎల్ల భూతముల హృదయ గుహాలలో నుండువాడు. విశ్వకర్మకూడ సదా జనుల హృదయము లందు సన్నివిష్టుడే కదా! (సదా జనానాం హృదయే సన్ని

విష్టః) అంతట వ్యాపించినవాడు కావుననే ఆతడు సర్వ వ్యాపి, సర్వగతుడు అయినాడు. దిగువ మంత్రమును చూడుడు—

"యో దేవానాం ప్రభవ శ్చోద్భవ శ్చ,
విశ్వాధిపో రుద్రో మహర్షిః"—4-11.

"యో దేవానాం నామధా ఏకఏవ" [విశ్వకర్మసూక్తం)
"య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషి ర్హోతా నిష సాద పితా నః" (విశ్వకర్మసూక్తం)

పై మంత్రములు మూడింట, దేవతలకు ప్రభవోద్భవ ములు రుద్రుడనుట, ఆయనను ఋషి యనుట కాంతుము. అట్లే విశ్వకర్మ సూక్తమున, సర్వ దేవతల నామములను తాల్చినది విశ్వకర్మయే అనుట, ఆయనను ఋషి అనుట వారి సాదృశ్యమునకు ఐక్యమునకు నిదర్శనములు !

శ్వేతాశ్వతరమున నమక విశ్వకర్మ సూక్తముల మంత్రములను గ్రహించి, రుద్ర విశ్వకర్మలు అభేదస్వరూ పులూ, పితృ పుత్ర సంబంధము కలవారని తెలుపుటతో పాటు- పురుషసూక్త మంత్రములనుకూడ గ్రహించి విశ్వ కర్మ మహేశ్వరుల ఐక్యము చాటబడినది.

"వేదాహ మేతం పురుషం మహాన్త
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్,
త మేవ విదిత్వాతిమృత్యు మేతి
నాన్యః పన్థా విద్యతేఽయనాయ." 3-8.

జగత్కారణమైన దానిని సాక్షాత్కరించుకొన్న ఒకానొక సిద్ధుని మాట లివి. చిత్స్వరూపుడును, చీకట్లకు దూరమున నున్నవాడును అగు మహా (పరమ) పురుషుని నే నెఱింగినాను. లోకమున ఎవ్వరైనను జనన మరణము లను దాటవలెనన్నచో ఆ జగత్కారణమును ఎఱింగి తీర వలసినదే. అంతకన్న గమ్యమును చేర్చు త్రోవ ఇంకొ కటి లేదు. ఇంకను ఆ సర్వకారణ పరబ్రహ్మ తత్త్వ మును గూర్చి—

"నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరంజనం,
అమృతస్య పరం సేతుం, దగ్ధేన్ధన మివానలమ్" 6-19

జగత్కారణమైన రుద్ర విశ్వకర్మల తత్త్వము-నిష్క లము, నిష్క్రియము, శాన్తము, నిర్దోషము, సాధనాంతర రహితము, కట్టెలను దహించిన అగ్నివంటిది, అమృ తత్త్వమునకు సేతువు (వంతెన) వంటిదని ఈ మంత్రమున వర్ణింపబడినది. నిష్క్రియమనగా అన్నిటినీ చేయుచున్ననూ చేయనిదే అన్నమాట. దానియందు ఏ దోషములు లేవు. దోషములన్నియు ప్రకృతి సంబంధులే. మాయామయ ములే. దోషములే కాదు, గుణములుకూడ లేవని నిర్గుణ శబ్దము చెప్పినది కదా. ఇట్టి పరమ తత్త్వమును తెలియక ఎవరును ముక్తిపొందలేరని దిగువ మంత్ర మనుచున్నది.

"యదా చర్మవ దాకాశం వేష్టయిష్యన్తి మానవాః,
తదా దేవ మవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి." 6-20

మానవులు ఆకాశమును చాపవలె చుట్టగలిగినచో, ఇట్టి దైవతత్త్వమును తెలియకుండనే దుఃఖమును దాటగలరు. ఎవ్వరుకాని చాపవలె ఆకాశమును చుట్టనూ లేరు. జగత్కారణ శివతత్త్వము నెఱుంగకుండ దుఃఖమునుండి ముక్తిని పొందనూలేరు అని దీని భావము. ఈ రహస్యమునే సహస్ర విధముల రుద్రాధ్యాయములోని మంత్రములు, విశ్వకర్మ సూక్త మంత్రములు చాటినవి. అంతయు రుద్రస్వరూపమే, విశ్వకర్మాకారమే- అని చెప్పుటలోని రహస్య మిదియే. ఆ తత్త్వ రహస్యమును శ్వేతాశ్వతరోపనిషత్తు దార్శనిక మార్గము నవలంబించి వివరించి సమన్వయించినది. రుద్రుడు సర్వ యోగేశ్వరుడుకాన, యోగతత్త్వమునుకూడ ఈ ఉపనిషత్తు వివరించినది. శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పిన యోగ మార్గములనుకాని, తదితర తత్త్వసాధన మార్గములనుగాని ఇచ్చట ప్రస్తావింప దలంపలేదు. పాఠకులు వాటిని మదీయ యోగదర్శన, తత్వసాధన, ఉత్తర యోగమార్గాది గ్రంథములయందు కాంచవచ్చును.

రుద్రుని సర్వాత్మ భావమును చెప్పునవి మఱికొన్ని మంత్రములు యజురారణ్యకమున కనబడుచున్నవి.

"ఋతం సత్యం పరం బ్రహ్మ, పురుషం కృష్ణపింగళం;
ఊర్ధ్వరేతం విరూపాక్షం,విశ్వరూపాయ వైనమః." 27-12

ఇందలి ఋత, సత్య, పరం, బ్రహ్మ, విశ్వరూప,పురుష విరూపాక్షాది శబ్దములన్నియు పరమాత్మ వాచకములే. అట్లే

"సర్వో వై రుద్ర స్తస్మై రుద్రాయ నమో అస్తు.
పురుషో వై రుద్ర స్త న్మహో నమో నమః.
విశ్వం, భూతం భువనం చిత్రం బహుధా జాతం
జాయమానం చ యత్, సర్వో హ్యేష రుద్ర
స్తస్మై రుద్రాయ నమో అస్తు." 31-16

తా. అనేక చిత్ర విచిత్ర వస్తువులతో పుట్టిన, పుట్టు చున్న ఈలోక మంతయు రుద్రస్వరూపమే. కావున అట్టి సర్వ భువన రూపుడైన రుద్రునికి పునః పున ర్నమస్కారములు.

రుద్ర విశ్వకర్మ లిరువురును భువన పితలు-జగములను కన్న తండ్రులనుగా వర్ణించుట ఋగ్యజుర్వేదములయందు రెంటను కాంచగలము.

"భువనస్య పితరం గీర్భి రాభీ
రుద్రం దివా వర్ధయా రుద్ర మక్తౌ,
బృహ న్త మృష్వ మజరం సుషుమ్న
మృధ గ్హువేమ కవినేషి తాసః." —ఋ: 6-49-10

తా. భువపితయైన రుద్రుని రేయి పవళ్ళు స్తోత్ర ములచేత స్తుతింతము. బృహత్స్వరూపుడును (మహాతో మహీయాన్) కవియు, జరామరణ రహితుడును, దర్శనీయు డును, సుఖయుక్తుడును అగు రుద్రుని ఎంతో ఎక్కువగా స్తుతింతుము గాక. ఈ మంత్రమున రుద్రుని విశ్వపితృత్వము, సంసారవిమోచకతా, దర్శనీయతలను ఋగ్వేదము కొండాడి

నది. ఇక విశ్వకర్మ సూక్తము ఆ దేవుని భువనపితృత్వమునిట్లు స్తుతించినది.

"యో నః పితా జనితా యో విధాతా
ధామాని వేద భువనాని విశ్వా,
యో దేవానాం నామధా ఏక ఏవ
తం సంప్రశ్నం భువనా యన్త్యన్యా."–ఋ. 10-82-3

ఏ విశ్వకర్మ మనకు జనకుడును, రక్షకుడును అయి యున్నాడో, మనకే అననేల, విశ్వవిశ్వములకే తండ్రి అయి యున్నాడో, ఇంకను సర్వ దేవతల స్వరూపము తానే అయి ఎల్లరి నామములను తానొక్కడే తాల్చుచున్నాడో, అట్టి విశ్వకర్మయందు ప్రళయ కాలమున, అతనినుండి వచ్చిన భూతములు అతనిలోనే లీనమై పోవుచున్నవి అని భావము. రుద్రుడు విశ్వమును హరించి హరుడుకాగా, విశ్వకర్మ హోత అయి (ఋషి ర్హోతా నిషసాద పితా నః) తనలోనే జగములను వ్రేల్చుచున్నాడు. అనగా లీన మొనర్చుకొను చున్నాడన్న మాట. ఇంతేకాదు. రుద్రుడు శంభు నామమును తాల్చి సుఖ కారకుడు కాగా, విశ్వకర్మ విశ్వశంభువయి విశ్వ సౌఖ్యకారకు డయినాడు; "విశ్వ శంభూరవసే సాధుకర్మా" అని, ఋగ్యజుస్సులలోని విశ్వకర్మ సూక్తములనుచున్నవి. (10-81-7)

ఋగ్వేదమునందు సర్వశ్రేష్ఠమైన జగత్కారణ స్తుతిగా ఎన్నబడిన దిగువ మంత్రము యజుర్వేదమునందును కలదు__

"త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం,
ఉర్వారుక మివ బంధనాత్ మృత్యో ర్ముక్షీయ
మామృతాత్. — తై. సం. 1-8-11.

తా. బ్రహ్మ విష్ణు రుద్రులకు నేత్రమువంటివాడును, అనగా తండ్రియు, సర్వత్ర వ్యాపించినవాడును, గాఢశక్తి కలిగి జగత్తులకు బీజమైనవాడును (పుష్టివర్ధనుడనగా పోషకుడు అనియు నెన్నవచ్చును) నగు దేవుని పూజించి సాక్షాత్కరింప జేసికొని మృత్యురూప సంసారమునుండి విడివడుదుముకాక. అంతేకాని అమృత స్వరూప మోక్షమునుండి మాత్రము విడివడము. దూరము కామని భావము. అనగా త్ర్యంబకోపాసనచేసి జ్ఞాన మోక్షముల సాధింతుమని సారాంశము. ఈ మంత్రము శివ పరముగాను, విశ్వకర్మ పరముగాను చెల్లును. కాని, వసిష్ఠమహర్షి - బ్రహ్మ విష్ణు రుద్రులకు గూడ పితఅయిన విశ్వకర్మనే భావించినట్లు "బ్రహ్మ విష్ణు రుద్రాణా మంబకం పితరం యజామహే- ఇతి శిష్య సమాహితో వసిష్ఠో బ్రవీతి" అనెడి సాయణ భాష్యము వలన స్పష్టమగుచున్నది.

"త్ర్యంబక శబ్దమునకు మూడు కన్నులు కలవాడనుట సామాన్యార్థమే. మూడు గుణములు కలవాడని చెప్పికొని, త్రిగుణములచేత - లేదా, త్రిగుణమయ ప్రకృతిచేత సృష్టి వ్యాపారమును, లేక జగత్తుల సృష్టిని చేయువాడనియును చెప్పికొని, అంబకములు - కన్నులు సృష్ట్యుపాదాన కారణ

ముగా కలవాడని భావించి తాత్వికార్థ లాభమును పడయ వచ్చును. అంతేకాదు. అంబకములనగా సాధనములు కాన, మనో వాక్కాయములనెడి త్రికరణములు కల జీవాత్మ అనియు, స్థూల సూక్ష్మ కారణములనెడి దేహత్రయము కలవాడనియు గ్రహింపవచ్చును. అప్పుడు బ్రహ్మాండ పక్షమున ఈశ్వర, హిరణ్యగర్భ విరాట్పురుష స్వరూపుడని తెలగలదు. ఇట్టి వివిధార్థములను చెప్పికొని ఆధ్యాత్మిక భావ లాభము నందుట మంచిదికాని, మూడు కన్నులుకల ముక్కంటి అనీ, త్రిశూలధారిఅని మాత్రమే బాహ్యార్థములను చెప్పికొన్నంత మాత్రమున కామధేనువువంటి శ్రుతిమాత తృప్తి పడదు.

సమస్త రుద్రాధ్యాయమును పుణికి పుచ్చుకొని చెప్పినదా- అనదగిన ఒకమంత్రము కఠవల్లిలో కలదు. అందు ఆత్మతత్వమునేకాక రుద్ర తత్త్వమునుగూడ వివరించినాడా అనిపించుచుండును.

"ఏకో వశీ సర్వ భూతాంత రాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి,
త మాత్మస్థం యే ఽ నుపశ్యన్తి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్. 2-5-12.

దీనిని రుద్రపరముగా అన్వయింతము. వస్తుతః ఆలోచించి చూచినచో రుద్రుడొక్కడే. ఆతడు వశి. అనగా శరీరేంద్రియ ప్రాణ మనోబుద్ధ్యాదులను వశము చేసికొనెడి

శక్తిగలవాడు. అంతేకాదు. బ్రహ్మాండములోని ఆకాశాది భూతములను,సూర్యచంద్రనక్షత్రతారా గ్రహాలమునుకూడ వశీకరించుకొని నడుపగలశక్తి యున్నవాడు. అందుకే ఆతనిని సర్వశక్తి అన్నారు. ఆతడే తనయొక్క ఒకే ఒక రూపమును బహుధా=అనేక రీతులుగా చేయగలడట. అనగా అవ్యక్త మహ దహంకార ఆకాశ వాయ్వగ్ని జల భూములుగాను, వాటి వికారములైన జగములుగాను చేయగల సమర్థుడన్న మాట. ఆతడు తననే నిమిత్తోపాదాన కారణములుగా చేసి కొని సృష్టికార్యమును జరుపుచున్నందున ఎన్ని రూపములై నను ఆయనయే, ఆయనవే. నగలకంటెను బంగారము వేఱు కానట్లు, అన్నియు ఆయనకంటె రవ్వంతైనా వేఱుకావు. నమక మంత్రములు ఈ పరమ రహస్యమునే మనకు చాటు చున్నవి. ఏకైకమగు తన రూపమునే నానావిధ జగద్రూప ముగా తోపజేయుశక్తి ఆతనికి స్వతస్సిద్ధము. అయితే ఇంత శక్తిగలవాడు, ఇంత చేసినవాడు ఎక్కడనో ఏ మబ్బుల మాటుననో, ఏ కైలాస, వైకుంఠ స్వర్గాది లోకములలోనో లేడు. ఆతడు ఆత్మస్థుడే. సర్వ జీవుల హృదయాలలో నిండి ఆతడే ఉన్నాడు. ఎంత వింత. ఒక్కడయ్యును అన్నిటిని చేసి అన్నిటిలోను దూరి కూర్చున్నాడు. దూరి ఎక్కడో ఉండుట లేదు. లోపల, వెలుపల, అంతట- తానే సర్వ పరిపూర్ణుడై ఉన్నాడట. అట్టి ఆత్మ రూపుని ఎవ్వరు కాంతురో, అను భూతికి తెచ్చుకొందురో, ఆతనికీ తమకూ భేదములేదని తెలిసికొందురో వారికిమాత్రమే శాశ్వతానందమట. 'తేషాం

సుఖం శాశ్వతం' అన్నది కఠవల్లి. మతి తక్కిన వారికి అది లేదట. (నేతరేషామ్) వారు ఆనంద సిద్ధికి నోచుకోలేదట. రుద్ర నమకము అంతటికీ నమస్కారములు పెట్టి మనకు బోధించిన పరమ రహస్య మిదియే. ఈ రీతిగా వేదోపనిష ద్గత వాక్యములను సమన్వయించుకొని మానవులు సిద్ధి నందవలసి యున్నారు.

ఏకాదశ రుద్రులు విశ్వకర్మ తనయులే అనెడి యజు ర్వేద వాక్యముకూడ రుద్ర విశ్వకర్మల ఐక్యమునకు నిద ర్శనమే. "ఆత్మా వై పుత్రనామాసి" అనెడి మంత్రవాక్యము తానే పుత్రుడుగా పుట్టునని పితాపుత్రులకు అభేదమును చాటుచున్నది. కావున శివ విశ్వకర్మలు అభేద రూపులే. ఇప్పు డా యజుర్మంత్రమును చూతము—

"ఆపో వా ఇద మగ్రే సలిల మాసీ, త్తస్మి న్ప్రజా పతి ర్వాయు ర్భూత్వాచర, త్స ఇమా మపశ్య, త్తాం వరా హో భూత్వాహర, త్తాం విశ్వకర్మా భూత్వా వ్యమార్ ష్టీత్, సా ప్రథత, సా పృథివ్య భవ, త్తత్ పృథివ్యై పృథివిత్వం. తస్యాం విశ్రామ్య త్ప్రజాపతిః. స దేవా నసృజత- వసూన్, రుద్రా, నాదిత్యాన్...."

—"తైత్తిరీయసంహిత" కాం 7. ప్ర. 1-అను 5.

దీని భావము:— కంటికగపడు ఈ జగమంతయు మొదట కేవలము జల రూపముగానే ఉండెను. అట్టి నీరు నివాస యోగ్యము కానందున ప్రజాపతి వాయురూపుడై

ఆ నీటియందు ప్రవేశించి అందంతటను తిరుగాడెను. ఆయనకు ఆ నీటిలో భూమి కనబడినది. ఆ ప్రజాపతి వరాహ రూపము తాల్చి ఆ భూమిని పైకి తెచ్చెను. పిమ్మట విశ్వకర్మ స్వరూపుడై భూమిమీది నీటిని తుడిచి, దానిని విస్తరించెను. అదియే పృథివియొక్క పృథివిత్వము. అప్పుడా విశ్వకర్మ ప్రజాపతి, భూమిపై విశ్రమించి - వసువులను, రుద్రులను, ఆదిత్యులను సృజించినాడు." దీనినిబట్టి వసు రుద్రాదిత్యాది దేవతలు విశ్వకర్మ తనయులే అని, వారితో ఆయనకు అభేదము సిద్ధించుచున్నది. ఇక్కడ ప్రజాపతి అనగా "ప్రజాపతిర్విశ్వకర్మా" అనెడి యజుర్వాక్యమునుబట్టి విశ్వకర్మయే అని గ్రహింప వలయును. ఈ విషయమును సాయణులే ఇట్లు స్పష్టము చేసినారు. "ప్రజాపతి, ర్విశ్వకర్మా, పరమేష్ఠీత్యేతే త్రయోప్యేకస్యైవ మూర్తి భేదాః." అని సాయణ భాష్యము.

విశ్వకర్మయే వరాహ రూపమును తాల్చినాడన్నది ఈ శ్రుతి. పురాణములు వరాహావతారము విష్ణుమూర్తిదిగా వర్ణించినవి. కనుక విష్ణు విశ్వకర్మలు కూడ అభేద రూపులే అని మనము గ్రహింపవలయును.

పై మంత్రమునుబట్టి రుద్రుడు విశ్వకర్మ తనయుడు- ఆయనతో అభేదరూపుడు అనియేకాక, విష్ణువుకూడ విశ్వకర్మ తనయుడే అని తేలుచున్నది. ఆ మంత్రమునందు ద్వాదశాదిత్యులను సృజించినవాడుకూడ విశ్వకర్మయే అని

చెప్పబడినందునను, ద్వాదశాదిత్యులలో విష్ణుమూర్తి ఉన్నందునను విష్ణువుకూడ విశ్వకర్మ తనయుడే అగుచున్నాడు. ద్వాదశాదిత్యులనగా వీరు—

శ్లో॥ భగ, శ్చై వార్యమాం,ంశ శ్చ, మిత్రో, వరుణ, ఏవ చ,

ధాతా, చైవ విధాతా చ, వివస్వాం శ్చ, మహాద్యుతిః,

త్వష్టా, పూషా, తథై వేంద్రో ద్వాదశో విష్ణ రుచ్యతే.

— బృహద్దేవత, 5వ అధ్యాయం. 147 శ్లోకం.

1. భగుడు. 2. అర్యముడు. 3. అంశుడు. 4. మిత్రుడు. 5. వరుణుడు. 6. ధాత. 7. విధాత. 8. వివస్వంతుడు. 9. త్వష్ట. 10. పూష. 11. ఇంద్రుడు. 12. విష్ణువు. ద్వాదశాదిత్యులలో- మిత్రావరుణ, వివస్వంతులు, ధాతృవిధాతలు, ఇంద్రాదులు ఉన్నారు కాన, వారుకూడ విశ్వకర్మ తనయులే. ఆయనతో అభేదరూపులే. ఈ విషయమును విశ్వకర్మ సూక్తమే ఇట్లు చెప్పుచున్నది—

"ధాతా విధాతా పరమోత సందృక్" అని.

"యత సప్తర్షీ న్పర ఏక మాహుః" అనెడి విశ్వకర్మ సూక్త వాక్యమునందలి సప్తర్షి పదమునకు సప్త కిరణములని అర్థముచెప్పి, అవి సూర్యునినుండి పుట్టుచున్నందున సూర్యుడు విశ్వకర్మయే అని సాయణు లన్నారు. సూర్యుడే కాదు, ఓషధీశుడైన చంద్రుడు కూడ విశ్వకర్మావతారమే అని విశ్వకర్మ సూక్త వాక్యము అనుచున్నది. చూడుడు—

"విశ్వకర్మా హ్యజనిష్ట దేవ ఆది ద్గంధర్వో అభవ
ద్ద్వితీయః, తృతీయః పితా జనితౌషధీనామ్."

విశ్వకర్మ మొదట (బ్రహ్మ) దేవుడై, ఆవల రెండవ వాడుగా గంధర్వుడై, మూడవ వాడుగా ఓషధీశుడైన సోము (చంద్రు) డయినాడు. "ఓషధీశో నిశాకరః" అని నిఘంటువు. కావున సర్వేశ్వరుడైన విశ్వకర్మయొక్క స్వరూపమే జగమంతయు. అందుకే ఆయన విశ్వకర్మ.

ఇక ద్వాదశాదిత్యులలో పేర్కొనబడిన త్వష్ట విశ్వకర్మ తనయుడని పురుష సూక్తమునందలి "విశ్వకర్మణ స్సమ వర్తతాధి. తస్య త్వష్టా విదధ ద్రూప మేతి." అనెడి మంత్రమే స్పష్టీకరించుచున్నది. ఇది ప్రతి వేదపాఠకుడును చదువునట్టి సూక్తమే. బ్రహ్మ విష్ణు రుద్రాదులు విశ్వకర్మ తనయులే అనునంశము వేదములు సంగ్రహముగా ప్రవచనము చేయగా వాటిని విస్తరించెడి ఉపనిషత్తులు విస్పష్టముగానే వాకొన్నవి. దిగువ నుదాహరించెడి విశ్వకర్మో పనిషద్వాక్యములను ఆలింపుడు—

"....అథ పురుషోహ వై విశ్వకర్మా కామ
యత, ప్రజాః సృజేయేయేతి. విశ్వకర్మణః ప్రాణో జాయతే. మన స్సర్వేంద్రియాణి చ. ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ. విశ్వకర్మణో బ్రహ్మ జాయతే. విశ్వకర్మణో రుద్రో జాయతే. విశ్వకర్మణో నారాయణో జాయతే. విశ్వకర్మణః ప్రజాపతయః ప్రజాయన్తే.

విశ్వకర్మణో ద్వాదశాదిత్యా, రుద్రా, వసవ స్సర్వే దేవతా స్సర్వే ఋషయ స్సర్వాణి చ్ఛందాగ్ంసి సర్వాణి భూతాని వా సముత్పద్యన్తే. విశ్వకర్మణి ప్రవర్ధన్తే. విశ్వకర్మణి ప్రలీయన్తే. ఓమ్ అథ నిత్యోదేవ ఏకో విశ్వకర్మా...."

తా. పురుషుడైన విశ్వకర్మ సృష్టి చేయదలంచెను. ఆయన (దివ్యశక్తి) నుండి మనః ప్రాణేంద్రియములు, పంచభూతములు, బ్రహ్మ విష్ణు రుద్రులు, వసు రుద్రాదిత్యులు, సానగాది పంచఋషులు, వసిష్ఠాది సప్తఋషులు, భృగ్వాంగిరః ప్రభృతులు కలిగినారు. వీరందఱు విశ్వకర్మజులే, విశ్వకర్మ స్వరూపులే. ఈ విశ్వమంతయు ఆయననుండియే పుట్టి, ఆయనయందే విశ్వలీలను నడపి, కడకాయనయందే లీన మగుచున్నది. సృష్టిలో భగవంతుడు కానివస్తువేదియు లేనప్పుడు అన్నీ ఆయనయే అగుటలో సందేహాశ్చర్యములకు తావే లేదుకదా. అందుకే "బ్రహ్మణోఽన్యం న కించన." అన్నారు.

ఇంకొక విశేషము. నమక, చమక, విశ్వకర్మ సూక్తములు యజుర్వేదములో ఉన్నట్లే, భక్తులు జపించెడి విశ్వకర్మాష్టాక్షరియు, శివ పంచాక్షరియు యజుర్వేదములోనే ఉన్నవి. యజుస్సంహిత తృతీయకాండ ద్వితీయప్రపాఠకము అష్టమాను వాకమున, విశ్వకర్మమంత్రము ఉన్నది. చూడుడు-

"నమో విశ్వకర్మణే, స ఉ పా త్వస్మాన్."

దీనికి సాయణులు ఇట్లు భాష్యము వ్రాసినారు :- "విశ్వ విషయం కర్మ సృష్ట్యాదిరూపం యస్యాసౌ విశ్వకర్మా ప్రజాపతి స్తస్మై నమోఽస్తు. స ఉ=సోఽపి విశ్వకర్మా స్మాననుష్ఠాన ప్రవర్తనేన పాతు." విశ్వసంబంధములైన సృష్ట్యాది కర్మలు చేయు దేవుడు విశ్వకర్మ. ఆ విశ్వకర్మ ప్రజాపతి మమ్ము కర్మానుష్ఠానమున ప్రవర్తింపజేయుచు కాపాడుగాక, అని భావము. ఈ మంత్రమునకు ఓం అనెడి ప్రణవమును చేర్చినచో "ఓం నమో విశ్వకర్మణే" అనెడి అష్టాక్షరీ మంత్రము కాగలదు. ఈ మంత్రమునందలి విశ్వకర్మ పరాత్పరుడైన జగత్కారణ పరబ్రహ్మమే. ఈ అనువాకమున ఇంకను కొన్నిచోట్ల విశ్వకర్మ ప్రశంస వినబడుచున్నది. ప్రజాపత్యాదులు విశ్వకర్మావతారములే అని పిమ్మట తెలిసి కొందుము.

ఇక శివ పంచాక్షరీ మంత్రమును శతరుద్రీయము (నమకము)యొక్క అష్టమానువాకమున మనము చదివియే యున్నాము. ఆ అనువాకము "నమ స్సోమాయ చ...." అని ప్రారంభమై- "నమ శ్శంభవే చ, మయో భవే చ, నమ శ్శంకరాయ చ, మయస్కరాయ చ, నమ శ్శివాయ చ, శివ తరాయ చ" అన్నది. అందలి "నమ శ్శివాయ" అను దానికి ఓం అనెడి ప్రణవమును చేర్చినచో "ఓం నమ శ్శివాయ" అగు చున్నది. దీనినే శివ పంచాక్షరీ మంత్రమని భక్తులు ఉపాసించుచున్నారు. దీని మహిమను "శివపంచా

క్షరి మంత్రం పర శివయోగులకే జపసూత్రం" అని మహా యోగీశ్వరులు బ్రహ్మంగారు పొగడియున్నారు. ఈ రీతిగా విశ్వకర్మాష్టాక్షరియు, శివ పంచాక్షరియు యజుర్వేదములో ఉండుట విశేషము. విశ్వకర్మ మంత్రము విశ్వకర్మోపనిషత్తులోనూ కలదు.

"ఓ మిత్యేకాక్షరం. నమ ఇతి ద్వే అక్షరే. విశ్వకర్మణ ఇతి పంచాక్షరాణి. ఓం విశ్వకర్మణా ఇతి షడక్షరాణి. ఓం నమో విశ్వకర్మణ ఇత్యష్టాక్షరం పదం. యోహ వై ఓం నమో విశ్వకర్మణ ఇత్యష్టాక్షరం పద మధ్యేతి. అను ప్రబ్రువన్ సర్వ మాయు రేతి. విందతే ప్రాజాపత్యమ్. రాయస్పోషం గౌపత్యం. తతో ఽమృతత్వ మశ్నుతే, తతో ఽమృతత్వ మశ్నుత ఇతి...." ఈ విధముగా వేదోపనిషత్తులు ఉపదేశించినవే ఈ రెండు మంత్రములును.

మనకు నారాయణాష్టాక్షరి ప్రచారములో నున్నది. ఋగ్వేదములో నారాయణపద మగపడుటలేదు. పురుష సూక్తమునకు మాత్రము నారాయణుడనెడి ఋషి ద్రష్టయై యున్నట్లు తెలియుచున్నది. ఇక నారాయణ పదము తైత్తిరీయారణ్యకమున అగపడుచున్నది. నారాయణుని పేరుతో ఒక ఉపనిషత్తుకూడ వెలసినది. అందు "ఓం నమో నారాయణాయ" అనెడి నారాయణాష్టాక్షరీ మంత్రము కలదు. ఈ నారాయణునిగూర్చి భారతీయ తత్వశాస్త్రమున డా॥ యస్. రాధాకృష్ణ పండితుడు వ్రాసిన వాక్యములను ఆలింతము.

భారతీయ తత్వశాస్త్రము ద్వితీయ భాగమున "పౌరాణిక తత్వశాస్త్రము" అనెడి ప్రకరణమును చదివినచో వాసుదేవ నారాయణుల తత్వము విశదమగును. అందు వాసుదేవ తత్వమునుగూర్చి వ్రాయుచు రాధాకృష్ణ పండితుడు ఇట్లన్నాడు- "క్రమముగా వాసుదేవుడే విష్ణువు, నారాయణుడు అయ్యెను. నారాయణ శబ్దము విష్ణుసంబంధము గాకున్నను, మొదటిసారి శతపథ బ్రాహ్మణమున (1. అ. 2-5-5.) పేర్కొనబడెను. తైత్తిరీయారణ్యకమందు "నారాయణుడు శాశ్వత పరమదైవమై హరినామమును బొందెను. (10 అ. 10-1.)మహాభారతమున నారాయణుడొక సనాతనమహర్షి."

శ్రీ బులుసు వెంకటేశ్వర్లు యమ్. ఏ. గారి తెలుగు అనువాదమునుండి ఈ భాగములు గ్రహింప బడినవి. పాఠకులు ఆ గ్రంథమునందలి ఈ పౌరాణిక తత్వశాస్త్రమను భాగమును చదువుట మంచిది. ఇంతమాత్రముచేత నారాయణుని మీద మాకు చిన్న చూపులేదు. వేదాది గ్రంథములు ఎవరిని ఎట్లు ప్రస్తావించినవో వివరించుటే మాలక్ష్యము. ఇందుకే చిర పరిశోధనలు జరిపిన పిమ్మట మిత్ర సాహస్రిలో ఇట్లు వ్రాయుట యైనది—

"మొదటి వేదమందు వెదకిన నారాయ
ణాహ్వయంబె దొరక దతనిపేర,
పిదప మంత్రకాండ వెంపొందె నెంతయో
విశ్వహితచరిత్ర, వినర, మిత్ర." 853

బదరికాశ్రమమున నరనారాయణులనెడి ఋషు లిరువు రున్నారని మనము పురాణాదులలో- అందును ముఖ్యముగా మహాభారతమున చదువుదుము. ఆ నర నారాయలు ఎవరో కాదు. శరీరమునందుకల జీవాత్మ పరమాత్మలే. ఈ అంశ మును ఋగ్వేదములోని 164 వ సూక్తమునందలి మంత్రము ఇట్లు సూచించినది.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరి షస్వజాతే,
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి-
అనశ్న న్నన్యో అభిచాకశీతి."

తా. సమానధర్మములు, స్వరూపములుగల రెండు పక్షులు ఒకచెట్టుమీాద కూర్చుండి యున్నవి. వాటిలో ఒకటి ఆ చెట్టు పండ్లను తినుచున్నది. రెండవది ఏమీా చేయక సాక్షిగా చూచుచున్నది. ఆ చెట్టే సంసార (వృక్ష)ము. రెండు పక్షులే జీవేశ్వరులు. ఈ జీవేశ్వరులే నర నారాయణు లుగా వర్ణింపబడినారు- మన వాఙ్మయమున. ఈ దృష్టితో చూచినప్పుడు నారాయణుడు పరమాత్మ అగుటలో ఆక్షేప మేమున్నది! ఇట్లు తత్త్వార్థములను మనము సమన్వయించు కొనవలసి యున్నది. ఋగ్వేదమునం దగపడని వాసుదేవ నారాయణు లిరువురు తైత్తిరీయారణ్యకము నాటికి విష్ణువుతో సమాన స్థితిని అందుకొన్నారు. ఇందుకు దిగువ మంత్రమే సాక్షి:- "నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి,

త న్నో విష్ణుః ప్రచోదయాత్". ఆ యా మంత్రములలోని ఈ ప్రచోదనము కూడ గాయత్రీ మంత్రములోనిదే. అందు "ధియో యో నః ప్రచోదయాత్" అని యున్నదికదా.

వసు రుద్రాదిత్యులకు- అనగా బ్రహ్మ విష్ణు రుద్రాదులకు విశ్వకర్మ పరమాత్మయే తండ్రి అనుటకు దిగువనుదాహరించెడి యజుర్మంత్రము కూడ ప్రబలమైన సాక్ష్యమే—

"యేన దేవా జ్యోతిషోర్ధ్వా ఉదాయన్,
యేనాదిత్యా, యేన వసవో, యేన రుద్రా
యేనాం గిరసో మహిమాన మానశుః.
తేనై తు యజమానః స్వస్తి, సువర్గాయ
వా ఏష లోకాయ." కాండం 5. ప్రశ్న 7.5.

దేవతలు ఏ అనన్తశక్తిచేత తేజోమయులై ఊర్ధ్వము (స్వర్గము) న ఉన్నారో, ఏ శక్తిచేత రుద్రులు, వసువులు, ఆదిత్యులు, అంగిరః ప్రభృతి మహర్షులు మహిమలుకల వారైనారో, ఆ మహాశక్తిచేత ఈ యజమానుడు శుభములనంది ఉత్తమలోకములను పొందుగాక. ఇట్లనుటచేత ఏ విశ్వకర్మ నామక దివ్యశక్తి వారలను కన్నదో, ఆ శక్తి వారికంటె అధికమైనదని తోచుచున్నదికదా! ఇక్కడ అంగిరసులు అన్నమాటచే, పంచర్షి, సప్తర్షి గణములనుకూడ తీసికొనవలెను. యజ్ఞవేది రక్షణలో పడమటి దిక్కును రుద్రులతో గూడ విశ్వకర్మ రక్షించునని యజుర్వేద షష్ఠకాండ ద్వితీయ ప్రపాఠకమున "రుద్రైః పశ్చా ద్విశ్వకర్మా" (పాతు) అని

చెప్పబడినది- (8). "విశ్వకర్మా త్వాదిత్యై రుత్తరతః పాతు' (1-2-24) అనెడి మంత్రము ఆదిత్యులతో విశ్వకర్మ ఉత్తర దిక్కును రక్షించుగాక- అనుచున్నది. ఇట్టి మంత్రములు అనేకములు వసు రుద్రాదిత్యులకు విశ్వకర్మతోగల సన్నిహిత సంబంధమును సువ్యక్తము చేయుచున్నవి.

ఇంతయేల, తైత్తిరీయారణ్యక చతుర్థ ప్రశ్నము నందలి సద్యోజాతాది మంత్రములుకూడ (ఇవి అయిదు) రుద్ర విశ్వకర్మల ముఖములను గూర్చి ప్రస్తావించుచున్నవి. 1. సద్యోజాత, 2. వామదేవ, 3. అఘోర, 4. తత్పురుష, 5. ఈశానములనెడి 5 ముఖములు విశ్వకర్మకూ కలవు, శివునకూ కలవని వేదశాస్త్రాగమ పురాణ వాక్యములనేకములు సాక్ష్యమిచ్చు చున్నవి. ఈ పంచముఖములు పంచభూతములకు, పంచకృత్యములకూ సంకేతము. వీటినుండియే- సానగ, సనాతన, అహభూవ, ప్రత్న, సుపర్ణు లనెడి ఋషులు- మను, మయ, త్వష్టృ, శిల్పి విశ్వజ్ఞులనెడి బ్రహ్మలూ రూపొందినారని ప్రమాణములను ఋగ్వేద దిగ్దర్శన ప్రథమభాగమున 'పంచర్షులు' అనెడి శీర్షికలో (195 వ పుటనుండి) సవిస్తరముగా నిరూపించుటయైనది. ఆ మంత్రములు ఇవి—

"1. సద్యోజాతం ప్రపద్యామి. సద్యోజాతాయ వై నమః. భవే భవే నాతి భవే భజస్వ మాం భవోద్భవాయ నమః. 2. వామ దేవాయ నమో, జ్యేష్ఠాయ నమో, రుద్రాయ నమః. కాలాయ నమః, కలవికరణాయ నమో, బలవికర

ణాయ నమో, బలప్రమథనాయ నమ, స్సర్వభూతదమనాయ నమో, మనోన్మనాయ నమః. 3. అఘోరేభ్యోఽథ ఘోరేభ్యో ఘోరఘోరతరేభ్య స్సర్వేభ్య స్సర్వ సర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః. 4. తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ ధీమహి, తన్నో రుద్రః ప్రచోదయాత్. 5. ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం, బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతిర్ బ్రహ్మశివో మే అస్తుసదాశివోమ్."

ఈ సద్యోజాతాది ముఖములు రుద్ర విశ్వకర్మలకు సమానములై యుండుటకూడ వారి ఏకత్వమునకు ప్రబల నిదర్శనమే కదా.

శివ, విష్ణు, ఇంద్ర, వరుణ, ప్రజాపత్యాదులను విశ్వకర్మ ప్రతి రూపములన్నను, లేక సంతానమే అన్నను గ్రంథకర్తకు విశ్వకర్మమీద అభిమాన మెక్కువ అని ఎవరును అపార్థము చేసికొనవలదని సవినయముగా మనవి చేయుచున్నాము. వేద శాస్త్రప్రమాణములేని విషయములను గ్రంథకర్త మెక్కడను చెప్పడనీ, చెప్పలేదనీ పాఠకులు అర్థము చేసికొన్నచో, ఇట్టిఅపోహలకు తావే ఉండదు.

"ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు
రథో దివ్య స్స సుపర్ణో గరుత్మాన్,
ఏకం స ద్విప్రా బహుధా వద
న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః."

—ఋ. 1-164-46,

"యో దేవానాం నామధా ఏక ఏవ"-ఋ. 10-82-3

ఇత్యాది మంత్రములను ఆధారము చేసికొనియే ఈ చర్చ చేయబడినది. పంచబ్రహ్మ, పంచమూర్తి సిద్ధాంత మున సర్వదేవతలు, సర్వప్రపంచము విశ్వకర్మ శక్తినుండియే పుట్టెనని ఋగ్వేద దిగ్దర్శనములయందు నిరూపింపబడియే యున్నది. అసలు నామరూపములు ఉపాసనార్థము కల్పింప బడినవే. వాటిచే పొందదగినది పరంధామమైన పరమాత్మ తత్వమే. కావున అఖండ నిర్గుణ బ్రహ్మము విశ్వమునకు కారణమనుకొన్నప్పుడు విశ్వబ్రహ్మమనియు, సృష్ట్యాది కర్మ రూపమున వ్యక్తమైనప్పుడు విశ్వకర్మ అనియు చెప్పబడును. ఇంతకూ యజుర్వేద దర్శనమును వ్రాసెడివ్యక్తి రుద్ర, విశ్వ కర్మల పరమతత్వమునుగూర్చి ఎంతయినా వ్రాయకతప్పదు. దానిని పాఠకులు సరిగా అర్థము చేసికొనవలసి యున్నది. నాకుగాని, సర్వులకుగాని ఉపాస్యమైనదీ పొందదగినదీ పరమ నిర్గుణతత్వమే. దానిని ఋగ్వేదము—

"నాస దాసీ న్నో సదాసీ త్తదానీం
నాసీ ద్రజో నో వ్యోమాపరో యత్." ఋ. 10-129-1.

సృష్ట్యాదిమ కాలమున సత్తుకాని, అసత్తుకాని ఆకా శాదులుకానీ ఏమీ లేవన్నది. ఉన్నదెల్లా వాటికి కారణ మైన అనిర్వచనీయామేయ జగత్కారణమే. అదే ఉపనిషత్తు లలో ఇట్లు కీర్తింపబడినది.

"య త్త దద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ
మచక్షుః శ్రోతం, త దపాణి పాదం

నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం,
తదవ్యయం త ద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః."

— ముండకోపనిషత్తు 1-6.

"నాన్తః ప్రజ్ఞం, న బహిఃప్రజ్ఞం, నోభయతః ప్రజ్ఞం, న ప్రజ్ఞానఘనం, న ప్రజ్ఞం, నాప్రజ్ఞమ్, అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయసారం, ప్రపంచోపశమం, శాన్తం, శివ,మద్వైతం, చతుర్థం మన్యన్తే స ఆత్మా స విజ్ఞేయః."

— మాండూక్యం. 8.

ఇట్టి అవ్యక్తతత్వము నుపాసించువారికి నామరూపాత్మక సగుణ బ్రహ్మమునందు రాగద్వేషము లుండుటకు వీలే లేదు. అట్టి ఆరోపణలు చేయుట న్యాయ్యముకాదు. అయిన ఈ వ్రాతలన్నియు ఎందుకన ? "స్థితస్య గతి శ్చింతనీయా" ఉన్నదానికి సమన్వయోపయోగములు ఆలోచింపవలె ననెడి న్యాయము ననుసరించి, శ్రుతి, శాస్త్ర, పురాణాగమాది వాకృములను సమన్వయించి ఏకైకతత్వమును ప్రతిపాదించుటే గ్రంథకర్త లక్ష్యమని పాఠకులు భావింతురని మనవి. ఏదో ఒకదానిమీాద ప్రత్యేకాభిమానము కలవాడు ఋషిగాని, బ్రహ్మఋషిగాని అగుటకు వీలులేదు. వేదమును తపస్సత్యమూ, నిశితమూ అయిన చూపుతో చూచి లోకమునకు చాటుటే గ్రంథకారుని లక్ష్యము. ఒకానొక అనిర్వచనీయ అతీంద్రియ జ్ఞానమును సాధించి అంతర్దర్శన సిద్ధిని

పొందిననే కాని, సాధకుడు సిద్ధుడై ఇట్టి రహస్యముల ప్రవచింపలేడు. నామ రూపాత్మకమూ, వాచ్యార్థమూ అగు జగము నాధారము చేసికొని, లక్ష్యార్థమైన జగత్కారణ పరమ బ్రహ్మమును ఆరాధించుటయే, పొందుటయే ఈ రచనకు గమ్యము. దాని నర్థముచేసికొని పాఠకులు ఈ గ్రంథములను చదువవలయును.

సత్యమిది కావున- రుద్ర, విష్ణు, ప్రజాపత్యాదులను గూర్చి వేదాది గ్రంథములయందు గల వారి తత్వమును చూపుటయే గ్రంథకర్త కభిమతము. ఒక్కొక్క దేవునే సర్వజ్ఞునిగాను, సర్వశక్తిగాను, సర్వేశ్వరునిగాను నిరూపించి చెప్పెడు సంప్రదాయముకూడ మనకు లేకపోలేదు. పురాణ గ్రంథములు అట్టి పనికే పూనుకొన్నవి. ఈ రహస్యములను మనము రాగద్వేష రహితమైన విశాలబుద్ధితో అర్థము చేసికొనవలయును.

ఇట్లు రుద్ర తత్వమును తెలిసికొన్న పిదప, ఆ అవ కాండములోని విశ్వకర్మ సూక్తములనుబట్టి విశ్వకర్మ తత్వమును గూడ ఆకళించుకొనుట మంచిది. ఆ తత్త్వమును అందుకొనుటకు ముందు, విశ్వరూప కథను ఉదాహరించుకొని దాని పరమార్థమును తెలిసికొన వలసియున్నది.

## విశ్వరూప కథా పరమార్థము

యజుర్వేదము నందుగల కథ (ఆఖ్యాయిక) లలో విశ్వరూపునికథ ఒకటి. ఇది అనేకములయిన ఆధ్యాత్మిక

రహస్యములను సూచించుచున్నది. కృష్ణయజుర్వేద ద్వితీయ కాండమున పంచమ ప్రపాఠకములోని ప్రథమానువాకమున ఈ కథను మనము చదువగలము.

"విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీత్ స్వస్రీయోఽసురాణాం. తస్య త్రీణి శీర్షాణ్యాసన్ యత్సోమపానగ్ం, త్సురాపాన, మన్నాదనం. స ప్రత్యక్షం దేవేభ్యో భాగ మవద త్పరోక్ష మసురేభ్యః. సర్వస్మై వై ప్రత్యక్షం భాగం వదంతి; యస్మా ఏవ పరోక్షం వదంతి తస్య భాగ ఉదిత. స్తస్మా దింద్రోఽబిభేదీదృఙ్వై రాష్ట్రం విపర్యావ ర్తయతీతి. తస్య వజ్ర మాదాయ శీర్షా ణ్యచ్ఛిన ద్యత్సోమపాన మాసీ త్స కపింజలోఽభవ, ద్య త్సురాపాన గ్ం స కలవింకో, య దన్నాదనగ్ం స తిత్తిరి, స్తస్యాంజ లినా బ్రహ్మ హత్యాముపాగృహ్ణాత్." (2-5-1)

తా. త్వష్ట్ర దేవునికి విశ్వరూపుడను కుమారుడు గలడు. అతనికి మూడుతలలున్నవి. అందొకటి సోమపానము చేయును. ఇంకొకటి అన్నము తినును. మఱొకటి సురా పాన మొనర్చును. ఇట్టి విశ్వరూపుడు ఇంద్రాది దేవతలకు పురోహితుడయి ఉండెను. ఇతడు దేవతలకు విరోధులయిన అసురులకు మేనల్లుడయినందున హవిర్భాగములను దేవతలకు ప్రత్యక్షముగాను, అసురులకు పరోక్షముగాను అందించు చున్నాడట. ఈ రహస్యమును దేవేంద్రుడెఱిగి, విశ్వరూపుడు అసుర పక్షపాతముతో కొంతకాలమునకు తన రాజ్యమునే

రక్కసులపాలు చేయునేమోయని భయపడి విశ్వరూపుని తలలను వజ్రాయుధముచేత ఖండించినాడు. అప్పుడు సోమపానము చేయు శిరస్సు కపింజల పక్షిగాను, సురాపానము చేయునది కలవింకము (ఊరపిచ్చుక) గాను, అన్నము తినునది తిత్తిరి పక్షిగాను అయినవట. తరువాత త్వష్ట పుత్రశోకముచేత ఇంద్రునికి అపకారము చేయనెంచి తపస్సుచేసి, వృత్రుని సృష్టించినాడనియు, ఆ వృత్రునుకూడా ఇంద్రునిచేత వధింపబడినాడనియు కథ కొనసాగిపోవును. ఈ కథ సృష్టికి మూలమయిన ఆధ్యాత్మిక పరమ రహస్యమును మనకు చాటుచున్నది. ఎట్లో పరిశీలింతము—

ఈ కథలోని త్వష్ట జగత్కారణమయిన సచ్చిదానందాఖండ పరబ్రహ్మమేకాని ఇతరముకాదు. ఆ బ్రహ్మము నుండి అవ్యక్తమనెడి ప్రకృతి అవతరించినది. దీనినే తమస్సని నాసదీయ సూక్తమును, నీహార (మంచు) మని విశ్వకర్మ సూక్తమును చెప్పినవి. ఈ అవ్యక్తమనెడి ప్రకృతి-సత్వము, రజస్సు, తమస్సు అనెడి మూడు గుణములు కలదని సాంఖ్య, వేదాంత శాస్త్రముల నిర్ణయము. విశ్వరూపుడనగా జగత్కారణమయిన ఇట్టి ప్రకృతియే. విశ్వరూపుని మూడు తలలు సత్వ, రజ, స్తమో గుణములకు ప్రతీకలు (గుర్తులు). అందుకనియే వాటిలో సాత్వికశిరస్సు సోమ (అమృత) పానము చేయుననియు, రాజసిక శిరస్సు అన్నమును తినుననియు, తమోగుణ ప్రధాన శిరస్సు సురాపానము చేయు

ననియు వేదమంత్రము వర్ణించినది. సోమమనగా అమృత మనికూడా భావము. అది సాత్వికమయిన దేవతాసృష్టికి ప్రతీక. తమోగుణము రాక్షస, పైశాచిక, జడప్రకృతికి చిహ్నము. కనుకనే అట్టి శిరస్సు మద్యమాంససేవ మరగి నదై అధమ జీవసృష్టిని సూచించుచున్నది. ఇక రజః ప్రధానమైన శిరస్సు అన్న భక్షణము చేయుచు మానవ సృష్టిని తెలుపుచున్నది. విశ్వరూపుని ఈ కథ ఇట్లు దేవ మానవ రాక్షస తిర్యగ్జడాదుల సృష్టిని సూచించుచూ విశ్వ రూపుడు త్రిగుణాత్మక ప్రకృతికి ప్రతీక అనెడి పరమాధ్యా త్మిక రహస్యమును మనకు చాటుచున్నది. కాగా విశ్వ (నానావిధములయిన) రూపములు ప్రకృతిలో నున్నవి కాన, దానికి విశ్వరూప నామముకూడా సార్థకమే అగుచున్నది. త్వష్ట "ఏకం సత్" అని చెప్పదగిన పరబ్రహ్మమే అని ఋగ్వేద దిగ్దర్శనమున లెస్సగా నిరూపింపబడియే యున్నది. ప్రకృతి, సహజముగా రజస్తమో గుణములను అభిమానించి అల్పవిషయముల మీదికి పరుగులెత్తు చుండునుగాన విశ్వ రూపుడు అసురులకు పరోక్షముగా హవిర్భాగముల నిచ్చు చున్నాడనియు, దేవతలకు ప్రత్యక్షముగా హవిస్సుల నొసగు చున్నాడనియు, వర్ణన చేయబడినది. సామాన్యముగా జనులు మంచిపనులను, అందఱికి తెలియునట్లుగాను, చెడ్డపనులను రహస్యముగాను చేయుచుండుట పరిపాటియేకదా!

ఇంకొక దృష్టితో చూచినప్పుడు, దేవదానవులకు ఐకమత్యము కూర్చునిమిత్తమై విశ్వరూపుడు యత్నించినాడనియు, అందుకే ఒకరికి పరోక్షముగా, ఇంకొకరికి ప్రత్యక్షముగా హవిస్సులనిచ్చుచున్నాడనియు భావింపవలసియున్నది. ఎట్లయినను దైత్యులతోడి పొత్తునకు అంగీకరింపని ఇంద్రుడు విశ్వరూపుని వధింపబూనుకొనుట చారిత్రక సత్యము కావచ్చును.

పిండాండ పక్షముగా ఆలోచించినప్పుడు ఈ కథా పరమార్థము ఇంకొక రీతిగా తోచుచున్నది. "త్రియంబకం యజామహే" అనెడి మంత్రమునందలి త్ర్యంబక శబ్దమునకు మూడు శరీరములుకల ఆత్మ స్వరూపుడని అర్థము చెప్పుకొన్నట్లును, "ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్" అన్నప్పుడు విష్ణు స్వరూప జీవుడు మూడు స్థానములను అనగా మూడు దేహములను మెట్టినాడన్నట్లును, ఇక్కడ సైతము త్రిశిరుడైన విశ్వరూపునకుగూడ స్థూల, సూక్ష్మ, కారణ రూపములయిన మూడు దేహములుకల ఆత్ముడను భావమును చెప్పుకొనవచ్చును. వీటిలో కారణ దేహము సత్వగుణమునకును, సూక్ష్మ శరీరము రజోగుణమునకును, స్థూలదేహము తమోగుణమునకును ప్రతీకలు కాగలవు. ఈ మూడు దేహములతోకూడిన ఆత్ముడే (జీవుడే) విశ్వరూపుడన్నమాట. ఈ అర్థము "యా తే ధామాని పరమాణి యావమా యా మధ్యమా" అనెడి విశ్వకర్మసూక్త వాక్య

మునకును సరిపోవుచున్నది. స్థూల సూక్ష్మ కారణ దేహము లను అధమ, మధ్యమ, పరమ దేహములుగా భావించుకొన వచ్చును. ఈ మూడు ధామములుకూడా మూడు శరీరము లకు ప్రతీకలే. ఆ పక్షమున విశ్వరూపుడనెడి ఆత్మునే ఇంద్రుడై మూడు దేహములను ఛేదించుటకు అనగా తాను శరీర సంబంధములేని సంసారము క్తుడగుటకు యత్నించినాడని గ్రహింపవలసియున్నది. ఈ భావము పిండాండమునందలి ప్రతి జీవునికిని, సరిపోయి శరీర సంబంధముచే కలుగు సంసా రమును, వాటి త్యాగముచేకాని, వాటిని తనలో లీనముచేసి కొనుటచేగాని కలిగెడి బ్రహ్మీభూతస్థితిని సూచించుచున్నవి గదా. తపోనిశితమయిన ఆధ్యాత్మిక దృష్టితో చూచినప్పుడు ఇట్టి పరమార్థ విశేషము లనేకములు తత్వజ్ఞులకు గోచరింప గలవు.

ఇట్టి దృష్టితో చూడగా ఈ కథలోని ఇంద్రుడే పర మార్థ దర్శనముకోసమై పూనిన తత్వసాధకుడు కాగలడు. ఆతడు ప్రకృతి (విశ్వరూపుడు) తన బంధువుల నాదరించు టను సహింపలేక తత్వసాక్షాత్కారేచ్ఛతో ప్రకృతిని మట్టు పెట్టుటకే (అణచివేయుటకే) యత్నించెనని సాధకు లెన్న వలసియున్నది. ఈ రహస్యము సాధకునియొక్క ప్రకృతి విజయాభిలాషను, తద్విజయమును సూచించుచున్నది. ఇదే ఇంద్ర విశ్వరూపుల వైరముగా కథలో సూచింపబడినది. కడకు సాధకుడే (ఆత్ముడే, లేక ఇంద్రుడే) ప్రకృతిని గెలిచి

విశ్వరూపుని సంహరించి ఆత్మసాక్షాత్కార రూప విజయ మును సాధించినాడని తేలుచున్నది. కాని అది కారణముగా సాధకునికి, (ఇంద్రునికి) ఎన్నో నష్టములు - బ్రహ్మహత్యా పాతకాదులు వాటిల్లకపోలేదు. ఆత్మసాక్షాత్కారము నందిన మహనీయులుకూడా ప్రకృతికి సంబంధించిన కొన్ని నష్టము లకు గుఱియగుటను మనము చూచుచునే యున్నాముగదా! ఇట్టి పరమ రహస్యములను తనలో ఇముడ్చుకొన్న విశ్వ రూపునికథ జగత్కథయేగాని, ఇతరముకాదు. ఈ కథ పురా ణాదులలో శాఖోప శాఖలుగా విస్తరింపబడినది—

విశ్వరూప కథావృత్తాంతమును భగవద్గీతలోని ఈ దిగువ శ్లోకము కూడా బలపరచుచున్నది.—

"గుణా నేతా నతీత్య త్రీన్ దేహీ దేహ సముద్భవాన్,
జన్మ మృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృత మశ్నుతే."
— 14-20

తా. సత్వ రజ స్తమస్సులనెడి మూడు గుణములు జన్మజరామృత్యురూప సంసారమునకు హేతువులు. అట్టి సంసారమునుండి బయటపడగోరు నరుడు, ఈ మూడు గుణ ములను దాటి, జన్మాదులులేని— అనగా శరీర ప్రాప్తి లేని అమృతత్వమును పడయవలెనని గీత చెప్పుచున్నది.

ఇంద్రుడనెడి సాధకుడు శిరస్సులను ఖండించుటలోని అంతరర్థము, ఆధ్యాత్మికార్థము ఇదియే! అయితే ఇట్టి పర

మార్థములన్నియూ, రహస్యార్థములన్నియూ, వేదములో ఉన్నవా అని పాఠకులు సందేహింప వచ్చును. ఇట్టి విశేషార్థములు లేకున్నచో అది వేదమే కాజాలదు. మానవోపయోగకరములైన వివిధార్థములను ప్రదర్శించుటయే వేద పురుషుని హృదయము. అందులకే వాక్కును కామధేనువని వేదములోని ఒక మంత్రము చెప్పినది. సామాన్య వాక్కే, కామధేనువైనప్పుడు, వేదవాణి అట్లగుటలో వింత ఏమున్నది! కనుక లౌకిక, ఆధ్యాత్మిక చారిత్రాకాదులైన బహు-అర్థములు మనకు వేదమునుండియే తెలియగలవు. ఈ అంశమును ఋగ్వేదమంత్రముల ద్వారా పరిశీలించి చూతము:

"సక్తు మివ తితఉనా పునన్తో
యత్ర ధీరా మనసా వాచ మక్రత,
అత్రా సఖాయ స్సఖ్యాని జానతే
భద్రై షాం లక్ష్మీ ర్నిహితాధి వాచి." - 10-71-2.

టీక :- యత్ర=ఏ సమయమున (ఎప్పుడు) ధీరాః= బుద్ధిని వశము చేసికొన్న విద్వాంసులు. తితఉనా=జల్లెడచేత, సక్తుం=పేలపిండిని, పునన్త ఇవ=పవిత్రము చేయువారవలె, మనసా=ప్రజ్ఞాయుక్తమైన మనస్సు చేత, వాచమ్=వాక్కును, పునన్తః అక్రత=పవిత్రము చేసి సృష్టించిరో, అత్ర=అక్కడ (అప్పుడు), సఖాయః=ఆ వాక్కులతో మైత్రి కలవారై (లేదా ఆ వ్యక్తులతో మైత్రి కలవారై), సఖ్యాని=స్నేహములను, జానతే=ఎఱుంగుదురు. ఆ వాక్కుల మూలమున మైత్రితో

మెలగగలరని భావము. ఆ మాటల వలన లాభముల నంద గలరని సారాంశము. ఏషామ్=ఇట్టివారియొక్క. వాచి= వాక్కునందు, భద్రా=కల్యాణకరమైన, లక్ష్మీః=లక్ష్మి, అధినిహితా=ఉండును. అనగా పరిశుద్ధ బుద్ధులై మాటలాడు వారి వాక్కులయందు సమస్త సుఖముల నొనగూర్చునట్టి లక్ష్మి నివసించి ప్రజలకు మేలు చేకూర్చునని భావము. వారు జల్లెడ పేలపిండిని జల్లించి పొట్టునెగురగొట్టి సారమును నిల్పునట్లు దోషరహితములైన వాక్కులను మనః ప్రభావముచే సృష్టించి ప్రజలకు మేలుచేకూర్ప గలరని భావము. ఇట్టివారే నిజముగా ధీరులు. వీరినే "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్" అని ఉపనిషత్తు చెప్పినది. "తస్య ధీరాః పరిజానంతి యోనిమ్" ఆ పరమాత్మ స్థానమును ధీరు లెఱుంగుదురని పురుషసూక్తము అన్నది. ఇట్టి ధీరులకు కాని పరావాక్తత్వము బోధపడదు. వారి వాక్కులయందే లక్ష్మి నివసించును. అనగా వారు వేద విజ్ఞాన వేత్తలన్నమాట వారి ఆశీస్సులుకాని, వారి శాపములుకాని తప్పక ఫలించి తీరునని మన మెఱుంగవలయును.

ఇంకొక మంత్రము వేదవాక్కు కామధేనువని ప్రశంసించుచున్నది—

"దేవీం వాచ మజనయంత దేవాః,
తామ్ విశ్వరూపాః పశవో వదంతి,

సా నో మంద్రేష మూర్జం దుహానా
ధేను ర్వా గస్మా నుప సుష్టుతైతు."

టీక :- యాం దేవీం వాచమ్=ప్రకాశించునట్టి ఏ వాక్కును, దేవాః=దేవతలు, అజనయంత=కలదని గ్రహించినారో, తామ్=అట్టివాక్కును, విశ్వరూపాః పశవః=నానా విధములైన ప్రాణులు, వదంతి=పలుకుచున్నవి, సా=అట్టివాగ్దేవి మంద్రా=సంతసించునదై- లేక సంతసింపచేయునదై, సుస్తుతా=మనచే లెస్సగా స్తుతింపబడినదై, ధేనుః=కామధేనువు వంటిదై, నః=మనకు, ఇషం=అన్నమును, ఊర్జం=నేయి, పాలు అనెడి రసమును, దీనికి మోక్షార్థమైనశక్తి అని చెప్పకొనుట లెస్సగానుండును. ఏలయన, అన్నాదులు ఇహమునకు సంబంధించినవికాన, మోక్షసాధనశక్తి పరమార్థసంబంధమైఉభయ తారకమై ఉండును. దుహానా=పిదుకునదై,-ఇచ్చునదై, ఉప ఏతు=(మనలను) పొందుగాక.

ఈమంత్రమునందు వాక్కును కామధేనువుతో పోల్చినందున దానినినుండి అన్ని ప్రయోజనములను సంపాదించుకొనవచ్చునని తెలియుచున్నదికదా. కామధేనువువంటి వేద వాక్కు ఐహిక పారమార్థికాది నానార్థములను ఒసంగుటలో ఆశ్చర్యమేముండును! ఐతే ఇట్టి విశేషార్థములు ప్రతివానికి తెలియవనియు, ఒకానొక తత్వసాధకునికి మాత్రమే ఈ రహస్యార్థము తెలుకపడుననియుకూడా వేదమే చెప్పచున్నది. ఇప్పుడా మంత్రమునుకూడా పరిశీలింతము—

"ఉత త్వః పశ్య న్న దదర్శ వాచ
ముత త్వః శ్రుణ్వన్న శ్రుణో త్యేనాం,
ఉతో త్వస్మై తన్వం విసస్రే
జాయేవ పత్య ఉశతీ సువాసాః." -ఋ. 10-71-4

టీక :- త్వః = ఒకానొకడు, పశ్యన్నపి = చూచు చున్నను, వాచం న దదర్శ = ఈ వేదవాక్కును చూడలేడు. ఉతత్వః = ఇంకొకడు. శ్రుణ్వన్నపి = వినుచున్నను, ఏనాం న శ్రుణోతి = దీనిని వినలేడు. అనగా విద్వాంసుడు కానివాడు దీనిని చూచినను, విన్నను యథార్థము నెఱింగి దానిఫలమును పొందలేడని భావము. ఇక ఇది ఎవరికి తెలియుననగా చెప్పు చున్నాడు :- త్వస్మై = ఒకానొకనికి మాత్రమే (తపోవిద్యలు కలవానికి మాత్రమే ఈ వేదవాణి) సువాసాః = మంచి వస్త్రము లచే అలంకరించుకొన్నదియు, ఉశతీ = సంతానమును కోరు నదియు అగు, జాయేవ = భార్యవలె, పత్యే = భర్తకొఱకు, తన్వం = తన దేహమును, విసస్రే = విస్తరించి చూపును. అనగా సంభోగార్థిని అయిన యువతి తన పతికి తన శరీరావయవము లను సమర్పించునట్లు, ఈ వేదవాణి సైతము అర్హతగల ఒకానొకనికి మాత్రమే తనలోని అంతర్భావములను విశదీక రించునని తాత్పర్యము. "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అని నట్లు, తపశ్శాలియైన జిజ్ఞాసువు మాత్రమే వేదార్థము నెఱుం గునని తేలుచున్నదిగదా! ఈ మంత్రము ననుసరించియే "యమేవైష వృణుతే, తేన, లభ్య స్తస్యైష ఆత్మా వివృ ణుతే తనూం స్వాం" అన్న కఠవల్లి వాక్యము వెలువడినది.

ఇట్టి విశ్వరూపునికథ చారిత్రక సత్యము కాదనుటకు వీలుపడదు. ఏలయన ? త్వష్టపుత్రుడైన విశ్వరూపుడు దర్శించినవిగా ఋగ్వేదములో కొన్ని సూక్తములు, మంత్రములు అగపడుచున్నవి. మనము ప్రతిదినము సంధ్యావందనములో పఠించెడి "ఆపో హి ష్ఠా మయోభువః, తా న ఊర్జే దధాతన—"(10-9) ఇత్యాది మంత్రములు విశ్వరూపుడు దర్శించినవే. ఋగ్వేద దశమ మండలమునందలి 9వ సూక్తమున, 9 మంత్రములు ఆతడు కనుపెట్టినవే. వాటినిబట్టి విశ్వరూపుడు పంచభూతములలో జలములమీద గొప్ప పరిశోధనలు చేసినట్లు తెలియుచున్నది.

వేదము చారిత్రక విషయములను చెప్పదని భావించుట సరికాదు. మానవజీవిత అభ్యుదయమునకు,సంతరణమునకు కావలసిన సమస్తవిషయములను వేదము చెప్పక విడువలేదు. ధర్మార్థ కామమోక్ష- ఐశ్వర్యములకు సంబంధించిన- సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహములకు సంబంధించిన సర్వ విషయములను ప్రస్తావించిన వేదము చరిత్రాద్యంశములను విడిచిపెట్టునా ఏమి? అదియునుగాక, వేదములోని కొన్ని భాగములు మనకు లభ్యము కాలేదనియు, లభించినను నష్టమైనవనియు మన పండితులు చెప్పుచునే యున్నారు. అసలు ప్రణవమను పేరుగల పంచమవేద మొకటి కలదని స్కాందాది పురాణములును, విశ్వకర్మ సిద్ధాంతపరులును చెప్పుచున్నారు. మరి ఆ ప్రణవవేదమేమైనదో తెలియుటలేదు

గదా ! కాన దానికై ఇంకను పరిశోధనలు జరుగవలయునని మనము గుర్తింపవలసి యున్నది. ఇక విశ్వరూపుని కథను కొనసాగింతము.

త్వష్ట తన కుమారుడైన విశ్వరూపుని మరణానంతరము ఒక యజ్ఞమును చేసి వృత్రుని సృష్టించినాడట. ఆ వృత్రుడు భువనము నంతటిని ఆవరించి ఇంద్రుని ప్రతిఘటించినాడట. కడకు ఇంద్రుడు ఆ వృత్రునికూడా సంహరించి, బ్రహ్మ హత్యా పాతకమును మూటకట్టుకొనినాడని కథ కొనసాగినది. ఇంద్రుడు తనకు కలిగిన బ్రహ్మ హత్యా పాతకము నశించుటకై విశ్వకర్మ యజ్ఞము చేసి పాప విముక్తుడైనాడని యీ యజుర్మంత్రము చెప్పుచున్నది.

"ఇంద్రో వృత్ర మహన్. తం వృత్రః హతః షోడశభి ర్భోగై రసినా, త్స ఏతా మగ్నయేనీకవత ఆహుతి మపశ్య త్తా మజుహో త్తస్యాగ్ని రనీకవాన్ త్స్వేన భాగధేయేన ప్రీతః షోడశధా వృత్రస్య భోగా నప్యదహ ద్వైశ్వకర్మ ణేన పాప్మనో నిరముచ్యత. యదగ్నయేఽనీకవత........"

దీనికి సాయణ వివరణ. –కాండం 5. ప్రశ్న. 4. అను-5.

"ఇంద్రో యదా వృత్రం వజ్రేణ ప్రహతవాం స్తదా స వృత్ర అసురమాయయా సహసాషోడశ సర్పాకారాణి శరీరాణి స్వీచకార. స్వీకృత్యచ భోగశబ్దాభి ధేయైస్తై స్సర్పాకార శరీరై స్త మింద్రం హస్తపాదాద్య వయవేషు బబంధ. తదానీం స ఇంద్రః ప్రతీకారం విచార్య "అనీకేన సైన్యేన

యుక్తాయాగ్ని వే "ఏతామగ్నిస్త్విగ్నే" నేతి మంత్రద్వయేన సాధ్యామాహుతిం దత్వా హుతవాన్. తత స్సోఽగ్ని రనీక వాం స్తుతో వృత్రస్య షోడశ సర్పాకారాణి శరీరాణ్య దహాత్. తత ఊర్ధ్వ మింద్రో "య ఇమా విశ్వేతి" సూక్త ద్వయ సాధ్యేన వైశ్వకర్మణహోమేన, వృత్రవధజన్యాత్ పాప్మనో నిర్ముక్తః.... కి మయం వైశ్వకర్మణహోమః ప్రతి మంత్రం పృథక్కార్యః, కింవా సూక్తద్వయం సముచ్చార్య సకృదనుష్ఠేయః, ఆహోస్విదేకైకం సూక్త ముచ్చార్యాను ష్ఠేయః- ఇతి. తత్ర ఆద్యపక్షద్వయం శాఖాంతరగతత్వే నాంగీకరోతి. యం కామయేత చిరం పాప్మనో నిర్ముచ్యేత.... ఏకైక హోమేన శనైశ్శనైః పాపనిర్ముక్తోభవతి. సర్వా నుచ్చార్యైక హోమేన తు తదానీమేవ పాపనిర్మోకః. పృథ క్సూక్తద్వయేపి సామర్థ్యం పృథక్ సంపాదితం భవతి. అపిచ సూక్తద్విత్వం యజమానస్య ప్రతిష్ఠాయై సంపద్యతే. తస్మా దయమేవ పక్షః శ్రేయా నిత్యర్థః"

తా. ఇంద్రుడు వృత్రుని చంపెను. అట్లు చంపబడిన వృత్రుడు "సురమాయచే పదియారు విధములగు సర్పాకార శరీరములనుదాల్చి ఇంద్రుని హస్తపాదాద్యవయవములను బంధించెను. అప్పుడు ఇంద్రుడు ప్రతీకారమును విచారించి "అగ్నిస్త్విగ్నేన" అను మంత్రద్వయముచే అగ్నిహోత్రునికి ఆహుతుల నొసంగెను. అంతట ఆ యగ్ని సంతోషించి ఆ సర్పాకారములగు వృత్రుని పదియారు శరీరములను హరించి

వేసెను. అటుమీదట "య ఇమా విశ్వా" అను సూక్త ద్వయముచే సాధించిన వైశ్వకర్మణ హోమముచే వృత్ర వధవలన కలిగిన పాపమునుండి విడిచిపెట్టబడెను. ఈ వైశ్వ కర్మణహోమము ప్రతి మంత్రముచే వేరు, వేరుగా చేయ వలసినదా, లేక సూక్తద్వయముచెప్పి, ఒక్కొక్క పర్యా యము చేయదగినదా అని ప్రశ్నింపగా, ఇచ్చట మొదటి పక్షద్వయమే శాఖాంతర గతముగుటచే అంగీకార్యమగు చున్నది. దానివలనపాపిచిరకాలికమయిన పాపమువలనవిడిచి పెట్టబడును. ఈ వాక్యములనుబట్టి ఇంద్రుడు బ్రహ్మహత్యా పాతకమునుండి విముక్తుడగుటకు విశ్వకర్మ యజ్ఞమున, వైశ్వ కర్మణహోమముచేసి కృతార్థుడైనట్లు తెలియచున్నది కదా! ఇట్టి విశ్వకర్మేశ్వరునిగూర్చి ఋగ్వేద దిగ్దర్శనమున మనము పదునాలుగు మంత్రములలో (రెండు సూక్తములలో) విశద ముగా చదివియే ఉన్నాము. ఇప్పుడు యజుర్వేదీయ చతుర్థ కాండ షష్ఠప్రపాఠకమున ద్వితీయానువాకమునందు ఆఱు మంత్రములలో విశ్వకర్మ స్వరూప స్వభావ మహిమలను తెలియ గలము.

— విశ్వకర్మ సూక్తము —

"య ఇమా విశ్వా భువనాని జుహ్వ
దృషి ర్హోతా నిషసాద పితా నః,
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః
పరమచ్ఛదో వర ఆవివేశ. 1.

విశ్వకర్మా మనసా యద్విహాయా
ధాతా విధాతా పరమోత సందృక్,
తేషా మిష్టాని స మిషా మదన్తి
యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః. 2.

యో నః పితా జనితా యో విధాతా
యో న స్సతో అభ్యాస జ్జజాన, (1)
యో దేవానాం నామధా ఏక ఏవ
తగ్ం సంప్రశ్నం భువనా య న్త్యన్యా. 3.

త ఆయజన్త ద్రవిణగ్ం సమస్మా
ఋషయః పూర్వే జరితారో న భూనా,
అసూర్తా సూర్తా రజసో విమానే
యే భూతాని సమకృణ్వ న్నిమాని. 4.

న తం విదాథ య ఇదం జజానా
న్య ద్యుష్మాక మంతరం భవాతి
నీహారేణ ప్రావృతా జల్ప్యా
చాసుతృప ఉక్థశాస శ్చరన్తి. 5.

పరో దివా పర ఏనా(2) పృథివ్యా
పరో దేవేభి రసురై ర్గుహా యత్,
కం స్వి ద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమగచ్ఛన్త విశ్వే. 6.

త మి ద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమగచ్ఛన్త విశ్వే,

అజస్య నాభా వధ్యేక మర్పితం
యస్మి న్నిదం విశ్వం భువన మధిశ్రితం. 7.
విశ్వకర్మా హ్యజనిష్ట దేవ ఆది
ద్గంధర్వో అభవ ద్ద్వితీయః
తృతీయః పితా జనితౌషధీనామ్ (3)
అపాం గర్భం వ్యదధా త్పురుత్రా. 8.
చక్షుషః పితా మనసా హి ధీరో
ఘృత మేనే అజన న్నన్న మానే.
య దే దన్తా అదదృగ్ంం హా న్త పూర్వ
ఆ ది ద్ద్యావా పృథివీ అప్రథేతామ్. 9.
విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో
విశ్వతో హాస్త ఉత విశ్వత స్పాత్,
సం బాహుభ్యాం నమతి సంపతత్రై
ర్ద్యావా పృథివీ జనయ న్దేవ ఏకః. 10.
కిం స్వి దాసీ దధిష్ఠాన మారంభణం
కతమత్ స్విత్ కి మాసీత్
యదీ భూమిం జనయ (4) న్విశ్వకర్మా
విద్యా మౌర్ణో న్మహినా విశ్వచక్షుః. 11.
కిం స్వి ద్వనం క ఉ స వృక్ష ఆసీ
ద్యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః,
మనీషిణో మనసా పృచ్ఛ తే దు
త ద్య దధ్య తిష్ఠ ద్భువనాని ధారయన్. 12

యా తే ధామాని పరమాణి యావమా
యా మధ్యమా విశ్వకర్మ న్ను తే మా,
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః
స్వయం యజస్వ తనువం జుషాణః. 13.
వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే (5)
మనో యుజం వాజే అద్యా హువేమ,
స నో నేదిష్ఠా హవనాని జోషతే
విశ్వశంభూ రవసే సాధుకర్మా. 14.
విశ్వకర్మన్ హవిషా వావృధానః
స్వయం యజస్వ తనువం జుషాణః,
ముహ్యన్త్వన్యే అభిత స్సపత్నా
ఇహాస్మాకం మఘవా సూరి రస్తు. 15.
విశ్వకర్మన్ హవిషా వర్ధనేన
త్రాతార మింద్ర మకృణో రవధ్యం,
తస్మై విశః సమనమన్త పూర్వీ
రయ ముగ్రో విహవ్యో యథా సత్. 16.
సముద్రాయ వయునాయ సింధూనాం
పతయే నమః, నదీనాగ్ం సర్వాసాం
పిత్రే జుహుతా విశ్వకర్మణే
విశ్వాహా మర్త్యగ్ం హవిః". (6) 17.

o—o

## విశకర్మ సూక్తార్థ వివరణ

"య ఇమా విశ్వా భువనాని జుహ్వ
దృషి ర్హోతా నిషసాద పితా నః,
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః
పరమ చ్ఛదో వర ఆ వివేశ." 1.

1. టీక :- యః=ఏ విశ్వకర్మ పరమేశ్వరుడు. ఇమా విశ్వా భువనాని=ఈ సమస్తలోకములను. జుహ్వత్=ప్రళయకాలమున భూమ్యాదులైన సర్వభూతములను, లోకములను తన ఆత్మయందు ఆహుతివేసికొన్నట్లు లీనముచేసికొనెనో- అనగా తనలో ఇముడ్చుకొని, ఋషిః=అతీంద్రియద్రష్టయు, అనగా సర్వజ్ఞుడును. హోతా=సంసారహోమకర్తయు, జగములను తనలో హోమము చేసికొన్నవాడును, నః=మనకు, పితా=జనకుడునుఅయి, నిషసాద=ఉండెనో, ప్రళయకాలమున సర్వలోకములను సంహరించి మనకును సంహారకుడై, మఱల సృజించువాడై సర్వము నెఱింగినవాడై ఒక్క విశ్వకర్మపరమేశ్వరుడుమాత్రమే, అనగా తత్తత్వము మాత్రమే ఉండెనని భావము. ఇచట "హోతా" అనుటచేత రుద్రస్వరూపమును, పితా అనుటచేత సృష్టికర్తృ స్వరూపమును దాల్చినవాడును విశ్వకర్మయే అని పాఠకులు భావింపవలసి యున్నది. పై మంత్రమున, వర్ణింప బడినస్థితిని మూలస్తంభమనెడి పురాణము ఇట్లు వర్ణించినది:-

"న భూమి ర్న జలం చైవ న తేజో న చ వాయవః
న చ బ్రహ్మా న విష్ణు శ్చ న రుద్రో న చ తారకాః
సర్వశూన్యే విశ్వకర్మా స్వయంభూ రభవ త్తదా."

తా. భూమ్యాది పంచభూతములుకాని, అందలి లోకములుకాని లోకాధిపతులైన బ్రహ్మ, విష్ణు, రుద్రేంద్రాదులు కాని, సూర్యచంద్ర నక్షత్ర గ్రహతారకాదులుకాని, ఏవియు లేక సర్వశూన్యమై యున్నప్పుడు స్వయంభువని చెప్ప తగిన విశ్వకర్మతత్వ మొక్కటే నిరాధారము, నిష్కారణము, నిరాలంబము స్వయంభువు అయి ఉన్నది. ఇట్టి తత్త్వము పునః సృష్టికి హేతువు కానున్నందువలన దానిని విశ్వకర్మ అనెడి పదముచేత మాత్రమే వేదము పేర్కొన్నది. ఈ తత్వమును గూర్చి భాగవతపురాణము ఇట్లు వర్ణించినది.

"క. లోకంబులు లోకేశులు
లోకస్థులు తెగిన తుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుగు నతనినే సేవింతున్."

ప్రళయానంతర స్థితిని సృష్టికిపూర్వముగల స్థితిని విశ్వోత్పత్తి సూక్తము విశ్వకర్మ శబ్దముచే పేర్కొనగా తైత్తిరీయోపనిషత్తునందలి భృగువల్లి బ్రహ్మపదముతో పేర్కొన్నది. ఎట్లో పరికింతము.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే. యేన జాతాని
జీవన్తి, య త్ప్రయ న్త్యభిసంవిశన్తి.
తద్విజిజ్ఞాసస్వ. తద్బ్రహ్మేతి."

ఈ మంత్రభావమునే భాగవతము దిగువపద్యములో వివరించినది:—

"ఎవ్వనిచే జనించు జగ,
మెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందు, పర
మేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వ డనాదిమధ్యలయు
డెవ్వడు, సర్వము తాన యైనవా
డెవ్వడు, వాని నాత్మభవు
నీశ్వరునే శరణంబు వేడెదన్."

కుండ పుట్టకపూర్వము అది మట్టిలోనేయుండి మట్టి నుండే వెలువడినది. పుట్టినపిదపకూడ మట్టినే ఆశ్రయించి యున్నది. మట్టిలేనిచో దానికి ఉనికియే లేదు. అది నాశమైన పిదపకూడ మట్టిలోనే కలసిపోయినది. పిండ బ్రహ్మాండముల స్థితులుకూడ అట్టివే. బ్రహ్మమును వీడినచో జగత్తునకు ఉనికియే ఉండుటకు వీలులేదు. కావున కుండకు మట్టికి ఎట్లు అభేదమో అట్లే పరమేశ్వరునికి (బ్రహ్మమునకు) జగమునకు అభేదము, అద్వైతము. ఈ స్థితిని. ఈ జగత్కారణమును భాగవతము ఇట్లు కూడ వర్ణించినది:-

క. ఒకపరి జగముల వెలికిని,
ఒకపరి లోపలికి గొనుచు, నుభయము తానై
సకలార్థ సాక్షియగు న
య్యకలంకుని నాత్మమయుని నర్థిఁ దలంతున్.

ఏ దివ్యశక్తి జగములను ఆవిష్కరించుచున్నదో, అదే వాటిని తనలో లీనము చేసికొనుచున్నదని పరమార్థము!

సృష్ట్యాదిమకాలపు ఈ స్థితిని ఋగ్వేద దశమ మండలమునందలి 129వదైన నాసదీయసూక్తము ఇట్లువర్ణించినది.

"నాస దాసీ న్నో స దాసీ త్తదానీం
నాసీ ద్రజో నో వ్యోమాపరో యత్,
కి మావరీవః కుహ కస్య శర్మ
న్నంభః కి మాసీ ద్గహనం గభీరమ్." — 10-129-1.

తా. సృష్టికిపూర్వము, అనగా ప్రళయమేగాక తిరోధానము, అనుగ్రహముకూడా జరిగిన పిమ్మటిస్థితి ఇందు వర్ణింపబడుచున్నది. అప్పుడు సత్తనికాని అసత్తనికాని చెప్పదగిన దేదియులేదు. అప్పటిస్థితి సదసదతీతమై ఇట్టిదట్టిదని చెప్పవీలుకాని దన్నమాట. అప్పుడు ఆకాశాదులుకాని, ఆకాశాదులయందు ఆధారపడిన లోకములుకాని ఏమీ లేవు. అప్పుడు ఆవరించునదీ, ఆవరింపబడునదీ కూడా లేవు. ఈ వర్ణనను బట్టి, జలాదులుకూడా లేవనియే తెలియుచున్నది. అందుకే, ఈ మంత్రమునకు వ్యాఖ్యానమని చెప్పదగిన

మూల స్తంభ ప్రథమశ్లోకమున "న భూమి ర్న జలం చైవ" అని వర్ణింపబడినది. భాగవత పద్యముకూడా సృష్టియొక్క ఈ పూర్వ స్థితినే సత్యసమ్మతముగా వర్ణించినది.

ఇక్కడ ఒక విశేషమును గమనించవలయును. విశ్వకర్మసూక్తము భగవంతుడు ఈ బ్రహ్మాండము నంతటిని ఆహుతివలె తనలో లీనముచేసికొన్నాడని, ప్రళయకాలస్థితిని వర్ణించుచు ప్రారంభమయినది. అంతేకాని, సృష్టిక్రియతో ప్రారంభము కాలేదు. సృష్టితో ఆరంభించినచో సృష్టి అను దానికి (జగమునకు) ఒక ఆరంభమున్నట్లు కాగలదు. ఈ సృష్టికి ఆరంభమన్నది లేనేలేదు. ఇది చక్రమువంటిది. ఈ సంసారము చక్రమువలె ఎల్లప్పుడు ఎడతెగక తిరుగుచునే ఉండును. ఆ చక్రభ్రమణములో సృష్టి స్థితి ప్రళయాదులు అల్పాల్పాంశములు మాత్రమే. అయితే ప్రళయము జరిగిన పిమ్మట పునస్సృష్టి జరుగుట కెట్టి ఆక్షేపణయులేదు. ఈ సృష్టి ప్రళయములు అనాదిసిద్ధములని తత్త్వజ్ఞుల అభిప్రాయము. ఒకవ్యక్తి జీవితములో రాత్రి నిద్రించుట, పగలు మేల్కాంచి ఆ యా పనులుచేయుట ఎట్టివో, విశ్వపురుషుని స్థితిలోను, సృష్టిప్రళయములు అట్టివేకాని భిన్నములు కావు. (ఈ అంశమునే సంసారమనునది అనాది అని వేదాంతులు చెప్పుచుందురు). కనుక, ఈ విశ్వోత్పత్తిసూక్తము ప్రళయ వర్ణనతో ప్రారంభమయి పునస్సృష్టి ప్రకారమును అభివర్ణించుచు కొనసాగినది. దీనినే భగవద్గీత—

"అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే.
భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే."
—గీత 8. 18, 19.

తా॥ అవ్యక్తమైన పరమేశ్వరతత్త్వమునుండి పగటి వేళ సర్వభూతములు పుట్టుచున్నవి. రాత్రివేళ ఆ అవ్యక్తము నందే లీనమగుచున్నవి. ఆ భూతసమూహమే పుట్టుచు మరల పుట్టుచు రాత్రిరాగనే అవశమై ప్రకృతిలో లయించు చున్నది. ఇది చక్రము గిరగిర తిరిగెడి రీతియే కాని, దానికి భిన్నము కాదు. ఇక్కడ విశ్వకర్మ అనియు, బ్రహ్మమనియు, ఆత్మయనియు, సత్తనియు చెప్పబడినతత్త్వము అవ్యక్త శబ్ద ముచే పేర్కొనబడినది. భౌతికవాదము ననుసరించి సాంఖ్యులు చెప్పిన అవ్యక్త నామక ప్రకృతి అనియు భావింప వచ్చును. అతీతస్థితికి పోయిన పిమ్మట భౌతికాధ్యాత్మిక సిద్ధాంతములకు భేదము కన్పట్టదు. కావున విశ్వకర్మసూక్తము ప్రళయముతో జగదుత్పత్తిని వర్ణించుట ఎంతయూ తగి యున్నది.

ఋగ్వేద దశమమండలములోని నాసదీయ, విశ్వకర్మ సూక్తములను రెంటినీ విశ్వోత్పత్తిసూక్తములని కూడా తత్త్వజ్ఞులు పేర్కొనినారు. ఆలోచించిచూడగా ఇవి రెండును ప్రథమ మండలమునందే ఉండవలసినవి. ఈ రెంటికి పిమ్మట

మోక్షాది విషయములను ప్రస్తావించు 164వది అయిన మోక్షసూక్తమున్నచో, క్రమము సరిపోయెడిది. జిజ్ఞాసువులు విచారణకు నాసదీయ, విశ్వకర్మ, మోక్షసూక్తములను క్రమముగా పరిశీలించిననేగాని తత్వరహస్యము బోధపడదు.

ప్రళయానంతరస్థితి ఇట్టిదిగనుకనే, ఉపనిషత్తులు, దానినిట్లు వర్ణించినవి. "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్ కించన మిషత్" (ఐతరేయోపనిషత్తు) "స దేవ సోమ్యేద మగ్ర ఆసీ, దేక మేవాద్వితీయం" (ఛాందోగ్యోపనిషత్తు) ఆత్మఒక్కటే సృష్టికి పూర్వమున్న తత్వము. దానికి భిన్నమయిన ప్రాణులుకాని, అప్రాణులుకాని, అప్పుడేవియు లేవు. సత్తు ఒక్కటి మాత్రమే తొలుత కలదు. దానికి భిన్నమైనది వేరేమియులేదు. అని పై మంత్రముల భావము. అయితే నాసదీయసూక్త మంత్రము, ఇంకొక అడుగు ముందుకువేసి, సృష్ట్యాదిమవస్తువును సత్తనికాని, అసత్తనికాని చెప్పవీలుకాని అనిర్వచనీయమని పేర్కొన్నది. ఈ విషయమునే భగవద్గీత "న స త్త న్నాసదుచ్యతే" జ్ఞేయవస్తువు సత్తనికాని, అసత్తనికాని చెప్పవీలుకాని స్వానుభూతి మాత్రమని పలికినది. ఇట్టి ఆద్యమైన విశ్వకర్మ అను పేరుగల తత్వమును ప్రకృతికి అతీతముగాను, అంతర్యామిత ప్రకృతిగాను, గుణరహితముగాను ఉపనిషదాదులు ఎన్నికపోలేదు.

టీక :- సః = ఇట్టి విశ్వకర్మ పరమేశ్వరుడు. ఆశిషా = బహుఃస్యామ్ ప్రజాయేయ (తైత్తిరీయోపనిషత్తు) నేను

అనేకమగుదును అనెడి పునస్సృష్టి సంకల్పముచేత, ద్రవిణ మిచ్ఛమానః=ధనమని చెప్పదగిన జగత్తులయొక్క భోగ మును కోరినవాడై. పరమచ్ఛదః=స్వకీయమైన అద్వితీయ పారమార్థిక రూపమును ఆవరించినవాడై, ఆవివేశ=తనచే సృజింపబడిన జగత్తులలోపలి ప్రాణుల హృదయ ప్రదేశమున తానే=జీవరూపుడై ప్రవేశించెను. అనగా జగత్సృష్టికారు డైన విశ్వకర్మ ఏ జగములను పిండాండములను సృష్టించెనో, వాటిమధ్యముననే జీవరూపుడై- అవ్యాకృత హిరణ్యగర్భ విరాట్ స్వరూపములతో ప్రవేశించెనన్నమాట. ఇట్లనుట చేత ఏ విశ్వకర్మ భగవానుడు తన మహిమ (మాయ) చేత ఆకాశాదులతో లోకములను సృజించెనో, ఆ విశ్వకర్మయే ఆ పిండ బ్రహ్మాండములయందు ప్రవేశించినాడని గ్రహింప వలసియున్నది. ఈ విషయమునే మంత్రపుష్పము "అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణః స్థితః" లోపల వెలుపల అంతటా ఆ పరబ్రహ్మ స్వరూపమే నిండియున్నదని వర్ణించినది. కాగా శిల్పి ఒక తెరమీద ఒక కథావృత్తాంత మును చిత్రించినట్లు, జగద్వైభవమంతయు బ్రహ్మపదార్థ మనెడి ఆధారమునందే తోచుచున్నదని సాధకులు గ్రహింప వలయును. పైని పేర్కొన్న అనుప్రవేశ తత్వమును ఉప నిషత్తులు ఇట్లు వర్ణించినవి.

"సోఽకామయత బహుః స్యామ్ ప్రజాయేయేతి.

స తపోఽతప్యత. స తప స్తప్త్వా ఇదం సర్వ

మసృజత. య దిదం కించ. తత్ సృష్ట్వా. తదేవాను ప్రావిశత్" (తైత్తిరీయోపనిషత్తు)

తా. ఆ పరమేశ్వరుడు తాను అనేకము కావలెనని కోరి తపస్సొనర్చి అంతటిని (ఆకాశాదులను) సృష్టించి ఆ సృష్టింపబడిన వాటియందే, తాను జీవరూపముగా ప్రవేశించి నాడు. ఇట్లనుటచేత జీవ పరమేశ్వరులకు అభేదము కలిగి అద్వైతభావ మేర్పడుచున్నది. కనుక అద్వైత సిద్ధాంతము ఎక్కడనో లేదు. దాని నెవ్వరో సృష్టించి ప్రచారమునకు తేలేదు. అది ఋగ్, యజుర్వేదములలోని విశ్వకర్మసూక్తము లందే బట్టబయలుగా నిబద్ధమై ఉన్నది. ఇట్లు హృదయమున ప్రవేశించిన పరమేశ్వరుని గూర్చియు, జీవసాక్షినిగూర్చియు శ్వేతాశ్వతరోపనిషత్తు ఇట్లు పేర్కొన్నది.

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః.,
హృదా మనీషా మనసాభిక్లృప్తో
య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి." 4-17.

దీనికి శ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారి తెలుగు అనువాదము.

ఆ. వె. 'ఇతడు విశ్వకర్మ, ఈ దేవుడు మహాత్మ,
డెపుడు నిలుచు జనుల హృదయమందు;
ఎవ్వరీమనీష నెదలోన భావింతు
రమృతు లగుదు రెల్ల రట్టి వారు.'

ఈ రహస్యమును భగవద్గీత ఇట్లు నిరూపించినది—

"ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేஉర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని
మాయయా" — 18-61

శిల్పి యంత్రమువిూది బొమ్మలను ఆడించునట్లు ఈశ్వరుడుసర్వ ప్రాణులయొక్క హృదయప్రదేశములందుండి వారి వారి సుఖదుఃఖాదులను వారిచే అనుభవింప చేయు చున్నాడు. ఈ సందర్భమున విశ్వకర్మ సూక్తము చెప్పి నట్లు హృదయమున ప్రవేశించినవాడును, శ్వేతాశ్వతరము నుడివినట్లు హృదయములందు ఉన్నవాడును, గీత చెప్పినట్లు హృదయములందు ఉండి జీవులను బొమ్మలవలె ఆడించు వాడును ఒక్క విశ్వకర్మ పరమేశ్వరుడే అని సాధకులు గ్రహింపవలయును. వేద పురుషునిచే ఈ విధముగా విశ్వకర్మ సూక్తమున చెప్పబడిన అద్వైత సత్యమునే తరువాతి యజు రాది వేదములుకాని, గీతోపనిషదాది గ్రంథములుగాని అను సరించినవి. ఈ విశ్వకర్మ సూక్తములకు ద్రష్ట భువనదేవుని పుత్రుడైన భావనవిశ్వకర్మ కాబట్టి,అద్వైత సిద్ధాంత ప్రవక్త భౌవన విశ్వకర్మ అని ఎవ్వరును మఱువరాదు.

"విశ్వకర్మా మనసా య ద్విహాయా
ధాతా విధాతా పరమోత సందృక్,
తేషా మిష్టాని స మిషా మదన్తి
యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః." 2.

2. టీక:- యత్=ఎందువలన, విశ్వకారణుడైన విశ్వకర్మ, మనసా=ఆయన సత్యసంకల్పుడు కాన, తన మనస్సంకల్ప మాత్రముచేతనే, విహాయాః = విశేషముగా తాను సృష్టించినవాటినిసంహరించువాడు,ధాతా=పుట్టించువాడును, విధాతా==పోషించువాడునుఅయినాడో,అందువలననే-విశ్వకర్మా=సమస్తమైన సృష్టి,స్థితి,లయ, తిరోధాన, అనుగ్రహాదులైనకర్మలనుచేయు విశ్వకర్మ అనుశబ్దముచే చెప్పదగిన యోగ్యత కలవాడైనాడు. ఇచ్చట హరి, హర, బ్రహ్మేంద్రాది శబ్దములకంటె విశ్వకర్మ శబ్దము సమస్తార్థములను చెప్పునట్టిదై జగత్కారణ వస్తువునకు సరియైన నామధేయమగుచున్నదని తత్వజ్ఞుల భావము. ఉత=ఇంకను, ఆ విశ్వకర్మ, పరమా=తాను సృష్టించిన అందఱి కంటెను, అన్నిటి కంటెను శ్రేష్ఠుడును, సందృక్=అన్నింటినిదర్శించునట్టి సర్వద్రష్టయు, సర్వజ్ఞుడును అయినాడు. యత్ర పరే=ఏ సర్వశ్రేష్ఠ పరమ పురుషునియందు, సప్తర్షీన్=మరీచి మొదలైన సప్తఋషులను, ఏకం ఆహుః = ఒక్కటే అని తత్త్వవేత్తలు చెప్పుదురో,ఏతత్త్వము తెలియనప్పుడు మరీచ్యాదులైన సప్తఋషులు భిన్నులుగా తోచి, ఏ తత్త్వము నెఱింగిన పిమ్మట, ఆ తత్త్వముననే అంతర్భూతులుగా తోచెదరో, ఆ విశ్వకర్మప్రభువు, తేషాం ఇష్టాని=ఆసప్తఋషులయొక్క కోరికలను, ఇషా= తన సంకల్ప మాత్రముచేతనే, తీర్చుచున్నాడు. ఆ కోరికలు తీరిన ఋషులు తమ కోరికలు తీరినందున,మదంతి

=సంతసించుచున్నారు. ఇక్కడ ఈ రహస్యము గమనింపదగ యున్నది—

సృష్ట్యాది సర్వ కర్మలకు, దేవమనుష్యాది సర్వ జీవులకు, బీజభూతుడైనవాడు విశ్వకర్మ పరమేశ్వరుడే. బీజము నుండి, కొమ్మలు, రెమ్మలు, ఆకులు పూలతో గూడిన వృక్షము విస్తరించినట్లు సమస్త జగద్బీజమైన విశ్వకర్మనుండియే దేవ మనుష్యతిర్యగాదులుగాని, పంచఋషులుగాని, సప్తఋషులు కాని జన్మించుచున్నారని ఈ మంత్రవాక్యము నుడువు చున్నది. ఈ రహస్యమునే భగవద్గీతయు "బీజం మాం సర్వ భూతానాం విద్ధి పార్థ సనాతనమ్" (7-10) చరాచరములైన సమస్త భూతములకు, తానే (భగవంతుడే) మూలకారణ బీజమని చెప్పినది. ఈ బీజము సనాతన మనుటచేత అది భూత భవిష్య ద్వర్తమానములనెడు త్రి కాలములయందును సిద్ధమై ఉండు వస్తువని తేలినదిగదా!

సప్త ఋషులను సృష్టించినవాడు విశ్వకర్మయే అని అథర్వవేద మంత్రము వాకొనుచున్నది.

"విశ్వకర్మాణమ్ తే సప్తఋషివంత మృచ్ఛంతు,
యే మాఘాయువ ఉదీచ్యా దిశోఽభిదాసాన్."
(అథర్వకాండము- 19-18-7)

దీనికి వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారి తెలుగు అనువాదము.

తే॥గీ॥ ఎవ్వ రుత్తరదిశనుండి యేగుదెంచి
అఘచయంబుల మముఁ ద్రోతు రట్టిరిపులు
సప్తఋషుల సృజించు ప్రసన్న విశ్వ
కర్మ తేజోఽగ్ని దగ్ధతఁ గాంత్రుతుగాత.

పై మంత్రమునకు భాష్యము వ్రాయుచు సాయణులు "సప్తఋషివంతం = సప్తసంఖ్యా కా ఋషయః సృజ్యత్వేన యస్య సంతి ఇతి మతుప్........" అనినారు. అనగా సప్త ఋషులను సృజించినవాడు విశ్వకర్మయే కనుక,వారు ఆయన నుండియే వచ్చి ఆయనవలననే కోరికలను తీర్చుకొని, ఆయనలోనే లీనమగుచున్నారని యజుర్మంత్రముయొక్క భావము. ఈ "యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః" అనెడి వాక్యము "ఏకం స ద్విప్రా బహుధా వదంతి" అన్న మాటను బలపఱుచుచున్నది.

ఈ సప్త ఋషులు జగత్కారణుడైన పరమేశ్వరుని పుత్రులే అనెడి విషయమును భగవద్గీత ఇట్లు పేర్కొన్నది.

"మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా,
మద్భావా మానసా జాతాయేషాం లోక ఇమాః
ప్రజాః — గీత 10-6

తా. సప్తఋషులు, మనువులు, నా మనస్సంకల్పము వలన కలిగినవారే. ఇట్లనుటచేత భగవంతుని నుండియే వారిపుట్టుక కలిగినదని స్పష్టమగుచున్నది. గీత చెప్పినది కృష్ణ

భగవానుడని మన తలంపు. ఈ భగవ ద్వాక్యమునకు, ఆ విశ్వకర్మసూక్త మంత్రవాక్యమునకు అర్థము సరిపడుట చేత విష్ణు, విశ్వకర్మలు- ఒకే జగత్కారణశక్తిఅని పాఠకు లెఱింగి భేదదృష్టినిపోగొట్టుకొనవలసియున్నది.పురాణాదులు, సప్తఋషులను బ్రహ్మ మానసపుత్రులని పేర్కొనుట మన మెఱింగియే ఉన్నాము. కావున బ్రహ్మకూడ విశ్వకర్మకు భిన్నుడుకాడని స్పష్టమగుచున్నది. దీనినిబట్టి "ఏకం సత్" అనెడి ఒకేఒక జగత్కారణ తత్వము బ్రహ్మ,విష్ణు,రుద్రేంద్ర విశ్వకర్మాది బహుపదములచేత పేర్కొనబడినట్లు విజ్ఞులు తెలియవలెను.

ఈ మూల తత్వమును, ఋగ్వేదీయ నాసదీయ సూక్తము సత్తనికాని, అసత్తనికాని చెప్పవీలుకాదని అనగా, విశ్వకర్మసూక్త మేమో అది సృష్ట్యాది సమస్త కర్మలకు మూలముకాన దానిని విశ్వకర్మ శబ్దముచే పేర్కొన్నది.

ఈ సప్త ఋషులను సప్త కిరణములుగాను, సప్తవర్ణ ములుగాను సప్త చ్ఛందస్సులుగాను, సప్త ప్రాణములుగాను కూడ వైదిక వాఙ్మయము పేర్కొన్నది. చూడుడు—

"సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్
సప్తార్చిషః సమిధ స్సప్త హోమాః,
సప్త ఇమే లోకా యేషు చరన్తి ప్రాణాః
గుహాశయా నిహితా స్సప్త సప్త."

— ముండకోపనిషత్తు- 2-8

ఇక్కడ సప్తప్రాణములనగా పంచ జ్ఞానేంద్రియములు ప్రాణాంతః కరణములును. గాయత్ర్యాందులు సప్తచ్ఛందస్సులు. సప్తార్చిస్సులు అగ్నియొక్క కాళీ కరాళీ మొదలైన సప్త జిహ్వలు, సూర్యుని సప్తకిరణములును. ఆధ్యాత్మిక సాధకులు ఈ సప్తప్రాణములచేత చేయదగిన సాధన ఎంతయో కలదు. ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున- ఆధారము, స్వాధిష్ఠము, మణిపూరము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ, సహస్రారము-అనెడి సప్త చక్రములు సప్త ఋషులకు ప్రతీకలని వ్రాయుట అయినది. ఆ సప్త కమలములమీద చేయవలసిన సాధన (కుండలినీయోగము)పూర్తి అయినప్పుడు, వాటియొక్క స్వరూపములు పరమాత్మలో లీనమై పోవును. దీనినే పై మంత్రము "ఏక మాహుః,"అని చెప్పినది. ఈ విషయము మంత్రములో "మదంతి" అను క్రియాపదముచేత చెప్పబడినది. వేద వాఙ్మయములోని ఏక, త్రి, పంచ, సప్త, నవాది పదముల వలన ఒకే అర్థము స్ఫురింపయునని లేదు. ఆధి భౌతిక, ఆధి దైవిక, ఆధ్యాత్మిక, పరముగా అనేకార్థములను చెప్పికొని మనము పరమార్థ లాభమును పడయవలసి ఉన్నది. అప్పుడుకాని వేదవాక్కు, కామధేనువువంటిదనెడి(ధేను ర్వాగస్మా నుపసుష్టు తైతు) మంత్రమును సార్థకము చేసికొన్నవారము గాము—

సర్వదిక్కులకు ప్రభువైన విశ్వకర్మకు ఉత్తరదిక్కు మిక్కిలి అభిమానపాత్రమైనట్లు తైత్తిరీయ సంహితలోని మఱియొక మంత్రము ఇట్లు వక్కాణించుచున్నది:—

"యజ్ఞపతిః ప్రథతాం ధ్రువాసి దేవేభ్య శ్శున్ధస్వ
దేవేభ్య శ్శున్ధ స్వేంద్రఘోష స్త్వా వసుభిః
పురస్తాత్పాతు. మనోజవా స్త్వా పితృభి
ర్దక్షిణతః పాతు. ప్రచేతా స్త్వా రుద్రైః పశ్చా
త్పాతు. విశ్వకర్మా త్వాదిత్యై రుత్తరతః పాతు."
— కాండం 1. ప్రశ్న 2-అను 23.

తా. ఓ యజమానుడా! నిన్ను ఇంద్రఘోషుడు వసువులతోగూడ తూర్పునుండియు, మనోజవుడు పితృదేవతలతో సహా దక్షిణమునుండియు, వరుణుడు రుద్రులతోకూడ పడమరనుండియు, విశ్వకర్మ ఆదిత్యులతోసహా ఉత్తరమునుండియు రక్షింతురుగాక- అని భావము. దీనినిబట్టి ఇంద్రఘోషుడు, మొదలగువారు ప్రాచీదక్షిణాది దిక్కులకు అధిపతులని తెలియుచున్నది.

పూర్వోత్తర దిక్కులలో పూర్వదిక్కు దిగువ ప్రదేశమునకు సంకేతముకాగా, ఉత్తరదిక్కు ఊర్ధ్వమునకు సంకేతమైనది. పూర్వమునకు ఆధారకమలము చిహ్నముకాగా, ఉత్తరమునకు సహస్రారము గుర్తు. అందుకనియే విశ్వకర్మ పరమాత్మకు ఉత్తరము అభిమానపాత్రమైనది.

"యో నః పితా జనితా యో విధాతా,
యో న స్సతో అభ్యాస జ్జజాన,
యో దేవానాం నామధా ఏక ఏవ
తం సంప్రశ్నం భువనా య న్త్యన్యా." 3.

టీక :- యః=ఏ విశ్వకర్మ, నః=మనకు, పితా=పాలకుడును, కేవలము పాలకుడేకాదు, జనితా=మనలను పుట్టించినవాడును, అంతియేకాదు, యః=ఏ విశ్వకర్మ, విధాతా=సమస్త జగత్తులకును ఉత్పాదకుడును అయిఉండెనో, యః=ఏ విశ్వకర్మ, నః=మనకు కావలసిన అనుభవయోగ్య వస్తుసమూహములను సతః=సత్తునుండి, జజాన=కలిగించినాడో. అనగా తననుండి కలిగిన- పృథివీ, జల, ఓషధులనుండి సృష్టించినాడో, ఇంకను- యః=ఏ విశ్వకర్మ, ఏకః ఏవ= ఒక్కడే అయ్యు, దేవానాం=ఇంద్ర, అగ్ని, మిత్ర, యమ, వరుణాది దేవతలయొక్క, నామధాః = నామరూపములను ధరించుచున్నాడో, ఆ విశ్వకర్మ ఒక్కడే- బ్రహ్మ, విష్ణు, రుద్ర ఇంద్రాగ్న్యాది దేవతల నామరూపములను తాల్చి ఆ యా కార్యములను చేయుచున్నాడని భావము. తమ్= అట్టి విశ్వకర్మను, అన్యా భువనా=ఆయనచే సృజింపబడి, ఆయనకు భిన్నాభిన్నములైన లోకములు, సంప్రశ్నమ్= ఆయనను ప్రశ్నించు చున్నట్లుగా, యన్తి=ప్రళయకాలమున ఆయనలో లీనమగుచున్నవి. అనగా ఆ విశ్వకర్మ తత్వమునందే ఏకీభవించుచున్న వన్నమాట. ప్రళయ కాలమున, భువనములు ఏవి? విశ్వకర్మ ఎవరు, అని అడుగుటకు వీలు లేకుండా అగుచున్నదని సారాంశము. అది "ఏకమే వాద్వితీయమ్" అనెడి స్థితి అన్నమాట. దీనినే శ్రుతి "నాసదాసీన్నోసదాసీత్" అని వర్ణించినది.

సమస్తదేవతల రూపములు, నామములు, ఆ విశ్వకర్మ నుండియే తద్రూపాంతరములుగానే ప్రవర్తించుచున్నవనుటకు ఈ మోక్షసూక్తమునందలి "ఇంద్రంమిత్రం" (125వ పుట చూడుడు) అనెడి మంత్రమే ప్రమాణము. దాని భావమిది—

"ఒకే ఒక జగత్కారణ సద్వస్తువును, (విశ్వకర్మను) మేధావులు, బహు నామరూపములతో ఇంద్రుడనియు, మిత్రుడనియు, అగ్ని, వరుణుడు, గరుడుడు, యముడు, వాయువు- అనియు చెప్పుచున్నారు. ఈ రహస్యము ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున సవిస్తరముగా నిరూపింప బడినది. కన్న తండ్రియే, తాను కన్న బిడ్డలకు కావల సిన ఆహారాది భోగ్య వస్తువులను సంపాదించి ఇచ్చునట్లు మనలను కన్న విశ్వకర్మయే, మనకు కావలసిన సమస్తభోగ్య వస్తువులనుకూడా సృష్టించి, మనము తనను చేరు నిమిత్తమై అందించుచున్నాడని ఈ మూడవ ఋక్కుయొక్క తొలి రెండుపాదములు వక్కాణించినవి.

"త ఆయజన్త ద్రవిణం సమస్మా
ఋషయః పూర్వే జరితారో న భూనా,
అసూర్తా సూర్తా రజసో విమానే
యే భూతాని సమ కృణ్వ న్నిమాని." 4.

4. టీక :- యే = విశ్వకర్మచే సృష్టింపబడిన మొట్ట మొదటి ఏ సృష్టికర్తలు, ఇమాని భూతాని= ఈ ప్రాణులను, సమకృణ్వన్ =సృజించినారో, తే పూర్వే=ఆ పూర్వులైన

సృష్టికర్తలు. అనగా మనుమయాది పంచబ్రహ్మలు- లేదా బ్రహ్మవిష్ణ్వాది పంచమూర్తులు, సానగాది పంచర్షులు. (ఈ ముగ్గురికి అభేదమనియు, బ్రహ్మ, మూర్తి, ఋషి - అనునవి వారి వారి కార్యనిర్వహణమునుబట్టి కలిగిన పేర్లనియు గ్రహింపవలయును) అస్మై=తమచే సృజింపబడిన జగత్తుకొఱకై, ద్రవిణమ్=ధనమని చెప్పదగిన భోగ్యవస్తు సమూహమును, సమాయజంత=సృష్టించిరి. లేక సంసిద్ధము చేసినారని భావము. ఆ ఆదిమబ్రహ్మల విశేషములను, మంత్రమిట్లు చెప్పుచున్నది: ఋషయః = అతీంద్రియ జ్ఞానముకల (సర్వజ్ఞులైన) తే=ఆ ఋషులు భూనా=తమ మహిమచేత, ఎప్పుడుకూడ, జరితారః న=జీర్ణులుకారు - వారు జరామరణాద్యవస్థలులేని శాశ్వతులన్నమాట. ఎన్నిసృష్టులు, ప్రళయములు కలిగినను వారు శాశ్వతులై ప్రతికల్పమునందును పంచభూతములు సృష్టిని నెరవేర్చినట్లు, వారు ప్రాణులకు కావలసినవాటి నన్నింటిని సమకూర్తురని భావము. ఇక ఆ భూతములెట్టివో వివరింపబడుచున్నవి. అసూర్తా = ప్రాణములు కలిగినట్టివియు, రజసో విమానే సూర్తాః=రంజనాత్మకములైన తమతమకర్మలచే ప్రేరేపింపబడినవియు. ఈ నాల్గవ ఋక్కునందు విశ్వకర్మయొక్క పంచముఖములని చెప్పబడుచున్న- మను, మయ, త్వష్ట్ర, శిల్పి, విశ్వజ్ఞులయొక్కయు, లేదా బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర సూర్యులయొక్కయు లేక సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులనువారి యొక్కయు సృష్టికార్యములు జీవులకు ఎట్లు ఉపయోగ

పడుచున్నవో వ్యంగ్యముగాను, గంభీరముగాను వర్ణింప బడుట భావింపదగిన విశేషము. అందుకే వారు, విశ్వకర్మ యొక్క పంచముఖములవంటి వారనియు, పంచక్రియలకు ప్రతీకలనియు, వేదాంత సంప్రదాయ గ్రంథములైన స్కాంద బ్రహ్మాండ మూల స్తంభాదిపురాణములువర్ణించినవి.వారెప్పు డును జీర్ణులు కారనియు, సర్వజ్ఞులనియు, మహిమ కల వారనియు పేర్కొనబడినది. ఇక విశ్వకర్మచే సృజింపబడిన లౌకిక జీవులు, ప్రాణములతో కూడినవారై తాము తాము చేసికొన్న రంజన స్వరూప కర్మలను అనుభవింప సంసి ద్ధులై యున్నారనుటచేత వారు దైవానుగ్రహమునకు పాత్రులు కావలసిఉన్నారనియు, తమ కర్మల ఫలములను అనుభవింపవలసి ఉన్నారనియు, గూఢముగా సూచించ బడినది. ఇట్లు వర్ణించిన వేదమాత ఇంతటి చిత్రవిచిత్ర సృష్టి చేసిన విశ్వకర్మ పరమేశ్వరుని, ఆయనచే సృష్టింపబడిన జీవులు ఎఱుంగలేక ఉన్నారనియు, అందుకు కారణము అజ్ఞానమూలకమయిన కర్మ ఫలవాంఛ అనియు తరువాతి మంత్రము వక్కాణించుచున్నది.

"న తం విదాథ య ఇదం జజానా
స్య ద్యుష్మాక మంతరం భవాతి,
నీహారేణ ప్రావృతా జల్ప్యా
చాసుతృప ఉక్థశాస శ్చరన్తి." 5.

5. టీక :- యః=ఏ విశ్వకర్మ, ఇదమ్=ఈ కనబడు జగ త్తును, జజాన=సృష్టించెనో, తమ్=ఆ విశ్వకర్మను, ఓ మానవు లారా! న విదాథ=మీరు ఎఱుగకున్నారు. యుష్మాకం= మీకు. అన్యత్=మీ శరీరేంద్రియ మనో బుద్ధ్యాదులకంటె భిన్నమయిన ఆత్మతత్త్వమొకటి, అంతరం=లోపలిదై, తెలి యదగినదై, భవాతి=ఉన్నది. దానినే మీరెరుంగలేక ఉన్నారని భావము. ఈ విశ్వకర్మతత్త్వమే సూక్తారంభమున, "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదో వర ఆవివేశ" అని పిండ బ్రహ్మాండములను సృష్టించి వాటిలోపల ప్రవే శించెనని చెప్పబడినది. దానిని ఎఱుంగలేకపోవుటకు కారణ మును, తరువాతి మంత్ర భాగము వివరించుచున్నది. జీవులు, నీహారేణ=మంచువంటి అజ్ఞానముచే, ప్రావృతాః= కప్పబడినవారై, జల్ప్యాచ=నేను దేవుడను, మనుష్యుడను, అనుకొనుచూ జీవనార్థము అనృతపరాయణులై, అసుతృపః =తమ ప్రాణసంరక్షణమే పరమమనితలంచి ప్రవర్తించుచూ, అంతేకాదు. ఉక్థశాసః చరంతి=స్వర్గాది పారలౌకిక భ్రాం తిచే, యజ్ఞాదులను ఆచరించి పరలోకమునకు రాకపోకలు చేయుచు పరమేశ్వరతత్త్వమును ఎఱుంగ లేకున్నారని ఇందలి సారాంశము. ఇక్కడ అజ్ఞానమును నీహారముతో పోల్చినందువల్ల అది జ్ఞానమనెడి ఎండచే నశించునని గ్రహింపవలయును.

"మంచువంటి మాయ మనుజులపై గప్పి
తెలియనీయదయ్యె దివ్యపథము,
ఎండవంటి తెలివి హెచ్చు నద్ది నశించు;
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర. —మిత్రసాహస్రి.

ఈ జగత్తులను సృష్టించి, పోషించి, నమయించు తత్త్వమును ఎఱుంగకున్నారనుటచేత, సర్వాలు ఎఱుంగదగినది జగత్కారణమైన పరమేశ్వర తత్త్వమే అని వ్యంగ్యముగా తెలియుచున్నదిగదా.

ఈ అజ్ఞానమును నాసదీయ సూక్తము తమస్సని పేర్కొన్నది. (తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే) యజ్ఞములు చేసెడివారి స్వర్గాది పరలోక భోగములు అశాశ్వతములని గీతోపనిషత్తుల సిద్ధాంతము. ఛాందోగ్యోపనిషత్తు (8-1-6) ఇట్లన్నది.

"త ద్యథేహ కర్మచితో లోకః క్షీయతే,
ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే."

భూమిపై కర్మలు చేసి, సంపాదించుకొన్న ఫలములు క్షీణించునట్లే, పుణ్యముచే సంపాదించుకొన్న లోకాంతర ఫలములుకూడా క్షీణించుచున్నవి. ఇక భగవద్గీత ఏమన్నదో చూడుడు.

"తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి." (అధ్యా.9.శ్లో-21)

యజ్ఞాదులు చేయువారు స్వర్గభోగములను కుడిచి, ఆ పుణ్యము క్షీణింపగా మరల భూలోకములోనే పుట్టుచున్నారట. ఈ అంశమునే పై మంత్రము "ఉక్థశాస శ్చరంతి" అనువాక్యముచే వివరించినది. కాగా భగవద్విజ్ఞానమొక్కటే మానవులు సంపాదింపదగిన పరమార్థమని వేదమాత హృదయమైనట్లు తేలుచున్నదిగదా! ఈ విషయమునే, "త మేవం విద్వా నమృత ఇహ భవతి" అనెడి పురుషసూక్త మంత్రము కూడా చెప్పినది. ఇక ఆఱవ మంత్రము ఆ విశ్వకర్మతత్వము ఎంతగా సర్వ శ్రేష్ఠమో నిరూపించుచున్నది.

"పరో దివా పర ఏనా పృథివ్యా
పరో దేవేభి రసురై ర్గుహా యత్,
కం స్వి ద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమగచ్ఛన్త విశ్వే." 6.

6. టీక :- యత్ = ఏ విశ్వకర్మతత్వము, గుహా= హృదయమనెడి గుహాయందు కలదో (సదా జనానాం హృదయే స న్నివిష్టః) అది, దివా=స్వర్గమునకంటె, పరః= దూరముగా నున్నట్టిది.ఏనా పృథివ్యాపరః = ఈభూలోకమునకంటె పరమైనది (దూరమునం దున్నది). దేవేభిః, అసురైః, పరః= దేవతలకంటెను, అసురులకంటెను పరమైనది. వీటి అన్నింటికంటెను భిన్నమైనదని భావము. అనగా వారికి కూడా అందరానిదని సారాంశము. ఈ సమస్తమునకన్న విలక్షణమని తెలియవలెను. యత్ర = ఏ గర్భమునందు,

విశ్వే దేవాః=సమస్తమైనశక్తులు,సమగచ్ఛంత=ఇమిడి ఉన్న వో, అట్టి,కం స్విద్గర్భం=ఒకానొక గర్భమును (కారణరూప జగద్బీజమును)ప్రథమమ్=మొదట,ఆపః=ఉదకములుదధ్రే= ధరించినవి.మొదటఉదకములుధరించినఆగర్భమునందుసమస్త దేవ మనుష్యతిర్యగ్జడాది రూపజగత్తు విలసిల్లినదని భావము. దీనినిబట్టి ఉదకములలోనే సమస్త జగద్బీజములు నిక్షిప్తము లని తెలుచున్నది. అందుచేత ఉదకములకుగల ప్రాధాన్యము తేటతెల్లము. పెక్కు వేద మంత్రములలో ఉదకప్రాధాన్యము చెప్పబడుట మా దర్శన పాఠకులకు తెలిసిన విషయమే. ఈ మంత్రమువలన జగత్కారణ బ్రహ్మము. (విశ్వకర్మ) సర్వ జగత్తులకు విలక్షణమనియు, అట్లయినను ఆత్మరూపమే అనియు సాధకులు గ్రహింపలసి యున్నది. ఆ గర్భమును గూర్చి 'కం స్విత్' అన్నందున అది మనో బుద్ధులకుగూడా అందని అనిర్వచనీయ మాయాశక్తి అని తెలియుచున్నది. కంటి కగపడు స్థూలమైన జగత్తత్వమే అంతు పట్టనప్పుడు, సూక్ష్మమైన బీజతత్త్వ మెట్లు తెలియగలదు!

వేదములలో పేర్కొనబడిన విశ్వరూపుడు జలములపై గొప్ప పరిశోధనలుచేసి కొన్ని మంత్రములను రచించినాడని మన దర్శనములలో సూచించుటమైనది. ఋగ్వేదమునందలి "ఆపో హి ష్ఠా మయోభువః", ఇత్యాది మంత్రములు ఆయన సృష్టియే. నీటి ప్రాధాన్యమును గూర్చియు, దాని

గుణములను గూర్చియు నేడింకను పరిశోధనలు జరుగవలయు నని మా సూచన.

"త మి ద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమగచ్ఛన్త విశ్వే,
అజస్య నాభా వధ్యేక మర్పితం
యస్మి న్నిదం విశ్వం భువన మధిశ్రితమ్." 7.

7. టీక :- యత్ర విశ్వే=బ్రహ్మాండములను పొట్టలో నుంచుకొన్న ఏ విశ్వమునందు, దేవాః సమగచ్ఛంత=దేవతలు కూడియున్నారో, తమిత్=ఆగర్భమునే, ఆపః=ఉదకములు, ప్రథమం = మొట్టమొదట, దధ్రే = తాల్చినవి. అజస్య=జన్మములేని విశ్వకర్మయొక్క, నాభా=నాభిస్థానమందు (నడుమ) అనగా భగవత్స్వరూప తత్వమున, ఏకం= ఒకానొక, బీజం=విత్తు, అధ్యర్పితం=ఉంచబడినది. యస్మిన్ = ఏ బీజమున, ఇదం విశ్వం భువనమ్=ఈ సమస్తభువనము, అధిశ్రితమ్=ఆశ్రయింపబడియున్నదో- అట్టి బీజమన్నమాట.

ఈ మంత్రమున చెప్పబడిన గర్భమనునదే బీజమన్న మాట. ఆ బీజము ఆత్మతత్వము నం దంతటా (నాభిస్థానమైన నడుమ) నిండియే యున్నది. అది వాఙ్మనస్సుల కందనిది. అందుకనియే దానిని అనిర్వచనీయము అన్నారు. అయినను, అది తాత్వికులకు అగోచరమేమీ కాదు. కొందఱు ధీరులు, (క శ్చి ద్ధీరః) దానిని తెలిసికొని, జగద్రహస్య విజ్ఞానులు కాగలరు. అంతేకాని, సామాన్యులు దానిని ఇద

మిత్థమని చెప్పలేరు. అట్టివారికి చెప్పినను అది అర్థముకాదు. ప్రతివ్యక్తియు సాధనచే మాత్రమే దాని నెఱుంగవలయును.

"అజస్య, నాభౌ" అనునవి రెండు విడి విడి పదములు. ఆ రెంటినికలిపి సమాసము చేసినచో "అజ నాభము" అని రూపమేర్పడును. అనగా పద్మనాభుడు వంటిది ఈ సమాస మన్నమాట. మన దేశమునకు మొదటిపేరు అజనాభ దేశ మనియే. ఈ సంగతిని భాగవత పురాణము భరతోపాఖ్యాన ములో ఇట్లు చెప్పినది. "అట మున్నజనాభంబనుపేరం బడుగు దేశంబు భరతుండు పాలించుకతన భారతంబునా బరగె" అని. దీనినిబట్టి అజునికి- సృష్టికర్తయైన విశ్వకర్మకు నాభివంటిదైన దేశమని భావము. కాగా సృష్టియొక్క ఆరంభము ఇక్కడే జరిగినదనికూడ భావింపవచ్చును. ఋగ్వేద మంత్రమునందలి "అజ నాభి" పదములు కలసి అజనాభముగా రూపొందుట గమనింపదగిన రహస్యము. ఈ విషయమే విష్ణుమూర్తి నాభికమలమునుండి బ్రహ్మ పుట్టి సృష్టిచేసినాడని పురాణాదులలో వ్రాయబడినది. ఈ విధ ముగా వేద భావములు పురాణాదులలో పలువిధములుగా మార్చబడి వర్ణింపబడినట్లు తేలుచున్నది. ఇంతకూ వేదముల లోని విశ్వకర్మయు, పురాణోక్త విష్ణుమూర్తియు ఒక్కడే అని తెలియుచున్నది.

ఇక తరువాతి మంత్రము విశ్వకర్మావతారములను ఇట్లు వివరించుచున్నది.

"విశ్వకర్మా హ్యజనిష్ట దేవ ఆది
ద్గంధర్వో అభవ ద్ద్వితీయః,
తృతీయః పితా జనితౌషధీనా
మపాం గర్భం వ్యదధా త్పురుత్రా." 8.

8. టీక :- విశ్వకర్మా=దేవ మనుష్య తిర్యక్ స్థావరాది నానా చరాచర భేదములకు కర్తయైన విశ్వకర్మ, దేవ=దేవుడై అనేక దివ్య స్వభావములకు నిలయమై అజనిష్ట=ఉండెను. సాయణులీ సందర్భమున, దేవశబ్దమునకు సత్యలోక నివాసియైన బ్రహ్మదేవుడు ఆ విశ్వకర్మ నాభినుండి కలిగెనని వ్రాసినారు. ఈ భావమే నారాయణుని నాభికమలమునుండి బ్రహ్మ పుట్టినాడనెడి పురాణకథకు మూలమై ఉండును. ఆదిత్=పిమ్మట, ద్వితీయః=రెండవవాడైన, గంధర్వః=గంధర్వుడు, అభవత్=అయినాడు. పిమ్మట, పితా=పోషకుడును, ఓషధీనాం=ఓషధులకు, జనితా=ఉత్పాదకుడైన సోముడు, తృతీయః=మూడువవాడుగా, అభవత్=అయినాడు. పిమ్మట, అపాం గర్భమ్=నీటిలోని బీజమునుండి వెలువడు బ్రహ్మాండమును, పురుత్రా=అనేక రీతులుగా, వ్యదధాత్=సృష్టించెను. ఈ మంత్రము మొదటి దేవుడు విశ్వకర్మ అనియు, ఆయనయే రెండవవాడుగా గంధర్వుడైనాడనియు చెప్పుచున్నది. గంధర్వ శబ్దముచే దేవలోకమయిన స్వర్గసృష్టి కలిగినదని గ్రహింపవలెను. పిమ్మట మూడవవాడు, ఓషధీశుడైన సోముడని (చంద్రుడని) చెప్పినందున

అన్నమునకు తద్ద్వారా ప్రాణులకు మూలకారణమైన ఓష ధులు, వాటి పాలకుడు తెలియబడు చున్నందున భూలోకా దుల సృష్టి జరిగినట్లు గ్రహింపవలసి యున్నది. కాగా దేవ మనుష్యాదులయు, భువనములయు సృష్టికి మూలకారణశక్తి విశ్వకర్మయే అని తేలుచున్నది. మర్త్య, స్వర్గ, సత్యలోక ముల సృష్టి ఇందు సూచితమైనందువలన- అనాహత, ఆజ్ఞా, సహస్రారములిందు చెప్పబడినట్లు గ్రహింపవలయును. విశ్వ కర్మనుండియే, సృష్టిమాత్రమే చేసెడి బ్రహ్మదేవుని పుట్టుక జరిగినదని చెప్పినందువలన, వారిరువురికి అభేదమనికూడ తెలియుచున్నది. కాని మూలమంత్రమున బ్రహ్మశబ్దము వినబడలేదు. అజశబ్దము విశ్వకర్మ పరముగాను, విశేషణము గాను, ఈ సూక్తమున ప్రయోగింపబడుట గమనింపవల యును. దీనిని ఆత్మపరముగా భగవద్గీత- "అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణః" అని చెప్పినది. ఈ అజ శబ్దము, తరువాత బ్రహ్మకు పర్యాయపదమగుట సంస్కృత వాఙ్మయ మున గమనింతుము.

"విశ్వకర్మా హ్యజనిష్ట దేవ ఆదిద్గంధర్వో అభవ ద్ద్వితీయః" అనెడి వాక్యమునకు తాత్త్వికమైన అర్థము నిట్లు చెప్పుకొనవచ్చును. విశ్వకర్మ మొదటి దేవాదిదేవుడైనాడు, లేదా సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడైనాడు. ఆవల రెండవ వాడుగా గంధర్వుడయినాడు అనికదా మూలమంత్రము అనుచున్నది. ఈ గంధర్వుడు మనస్సే అని మఱొక యజు ర్మంత్రము వాకొనుచున్నది. చూడుడు-

"ప్రజాపతి ర్విశ్వకర్మా మనో గంధర్వః,
తస్య ఋక్సామా న్యప్సరసో వహ్నాయః."
— యజుఃకాండము 3-ప్రపా 4- అను 7.

ఈ మంత్రమున, జగముల (ప్రజల)ను సృష్టించిన విశ్వకర్మయొక్క రెండవ రూపము మనోనామక గంధర్వుడయినాడనియు, అతనికి ఋక్సామములనెడి అప్సరసలు భార్యలనియు చెప్పబడినది.జగత్కారణ వస్తువునందు కలిగిన మొదటి చలనము (స్పందము) మనస్సే. ఆ మనస్సును గంధర్వుడుగా మంత్రము పేర్కొన్నది. గంధర్వులు భోగ ప్రియులు. మనస్సుకూడ భోగములను కోరునట్టిదేకాని, త్యాగమును కోరునదికాదు. కావున మనస్సును గంధర్వుడని శ్రుతిమాత పేర్కొన్నది. ఇక అట్టి మనస్సునకు భార్యలు ఋక్కు, సామము-అనెడు రెండు వేదములే అట. ఈ రెండు వేదములు మనస్సు చేయు సంకల్పము, వికల్పము-అనెడి రెంటికి సంకేతములు. సంకల్ప వికల్పములచేతనే మనస్సు రూపముగల దగుచుండును. సంకల్ప వికల్పములు లేనిచో మనస్సులేదనియే చెప్పవచ్చును. ఆ రెంటిని మనో గంధర్వునికి భార్యలని చెప్పుటచేత వారాతనిని ఇష్టము వచ్చినట్లు ఆడింతురని గ్రహింపవలయును. అందును వారిని అప్సరసలని చెప్పి, వారి భోగతృష్ణను మంత్రము వర్ణించినది. భార్యాలోలుడై భోగప్రియుడయినవాడు భ్రష్టుడగునట్లు, మనస్సువెంట దాని కోరికలకు లోబడి పరుగులెత్తు

వాడును భ్రష్టుడగునని సూచింపబడినది. బ్రహ్మమునుండి కలిగిన మనస్సువల్లనే జగము పుట్టుచున్నదికదా! "మనస్సే సర్వప్రపంచము" అని వేదాంతశాస్త్ర నిర్ణయమని మనకు తెలిసిన విషయమే. జగత్కారణ వస్తువును తమస్సు అనియు కామ మనియు నాసదీయ సూక్తము చెప్పినది- "తమ ఆసీత్తమసా గూఢమగ్రే" "కామ స్తదగ్రే సమవర్తతాధి మనసో రేతః ప్రథమం య దాసీత్" అని మనస్సును శరీరోత్పత్తికి హేతువైన రేతస్సును (శుక్రము) గా పేర్కొన్నది. ఈ అంశమునే విశ్వకర్మ సూక్త మంత్రము గంధర్వ శబ్దముచే పేర్కొన్నది. ఆ గంధర్వుడు మనోరూపుడని ఇంకొక మంత్రము చెప్పి మనకు తత్వార్థమును విస్తరించినది. ఈ గంధర్వుడు సూర్యుడని పిమ్మట తెలిసికొందుము. తరువాతి ఓషధీపాలకుడైన సోముడు, నానావిధములుగా విస్తరించి అనుభవయోగ్యమైన జగత్తే అన్నమాట. ఇట్టి గంభీరార్థములు తపోనిశితమైన మనస్సుతో ఆలోచించిన కొలది తోచి మనకు తారకమార్గమును చూపగలవు.

ఈ సందర్భమున విశ్వకర్మనుండి సత్యలోక నివాసి అయిన సృష్టికర్త (బ్రహ్మ) పుట్టినాడనియు, ఆవల రెండవవాడైన గంధర్వుడు, మూడవవాడైన ఓషధీపతి ఉదయించినారనియు చెప్పుకొన్నను విరోధమేమియు ఉండదు. అయితే రాగద్వేష రహితమైన సమన్వయ దృష్టి మాత్రము అవసరము. ఈ ఎనిమిది మంత్రములతో మొదటిసూక్తము

ముగిసినది. ఇక రెండవ సూక్తమున మొదటి మంత్రము భూమ్యాకాశముల సృష్టినిగూర్చి ఇట్లనుచున్నది—

"చక్షుషః పితా మనసా హి ధీరో
ఘృత మేనే అజన న్నన్నమానే,
య దే దన్తా అదదృంహన్త పూర్వ
ఆది ద్ద్యావా పృథివీ అప్రథేతామ్." 9.

9. టీక :- చక్షుషః=నేత్రాది ప్రాణసముదాయము నకు అని సాయణులు, కాని చక్షుస్థానీయమైన ఆజ్ఞా చక్రాదులకు అనికూడ చెప్పికొనుట యోగపక్షమున ప్రయోజనకారి. ఏలయన, సహస్రారము తరువాతివి ఆజ్ఞాదిచక్రములే. పితా= ఉత్పాదకుడును, (సృష్టికర్త) ధీరః=ధీరుడును అగు విశ్వ కర్మ, మనసాహి=నిర్మలమైన తన మనస్సుచేతనే, ఘృతం= నేయివలె ప్రాణులచే అనుభవింపదగిన, ఏనే=ఈ ద్యావా పృథువులను (భూమ్యాకాశములను) నన్నమానే=ఒకదాని కొకటి అనుకూలపడునట్లు (పరస్పరమును లోబడునట్లు) అజనత్=సృష్టించెను. ఆకాశము వర్షించిననే కాని, భూమి పండదు. భూమి పండిననేకాని, భూత తృప్తి జరిగి యజ్ఞాది కర్మలు సాగవు. భూప్రజలు యజ్ఞములొనర్చి దేవతలను ఆరాధింపవలసి యున్నారు. దేవతలేమో ప్రజలను అనుగ్ర హింపవలసి యున్నారు. ఇదియే భూమ్యాకాశములకు స్వర్గ మర్త్యలోకములకుగల పరస్పర ఉపకారభావము యదేత్ =ఎప్పుడయితే, పూర్వే=మొదటివైనవియు, అంతాః=

స్ర్పాణములై పనిచేయునవియు అగు చక్షురాది ప్రాణములు (ఆధారాదిచక్రములు) అదదృంహాంత=స్థిరతరములైనవో, ఆదిత్=అప్పుడే, ద్యావాపృథివీ=ద్యావాభూములు, అప్రథేతాం=విస్తరింపబడినవి. ద్యావాపృథువులకు స్వర్గ మర్త్య లోకములనెడి ప్రసిద్ధి కలిగి, అవి అన్నింటిచే పరిపూర్ణములైనవన్నమాట. ఈ మంత్రమున బ్రహ్మాండమున జరిగిన ఆకాశాది జీవపర్యంతమైన సృష్టియు, బ్రహ్మాండమున జరిగిన స్థూల, సూక్ష్మ, కారణములతోను, సప్త చక్రములతోను గూడిన సృష్టియు, నిగూఢముగా వర్ణింపబడినది. ఇట్టి ద్యావా పృథువుల సృష్టి జరిగి భగవంతుడు విశ్వరూపధరుడైన పిమ్మట ఆ విశ్వకర్మేశ్వరుని విశ్వరూపము దిగువ మంత్రమున ఇట్లు వర్ణింపబడుచున్నది.

"విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో
విశ్వతో హ స్త ఉత విశ్వతః పాత్,
సం బాహుభ్యాం నమతి సంపతత్రై
ర్ద్యావా పృథివీ జనయ న్దేవ ఏకః." 10.

10. టీక :- ఆ విశ్వకర్మ, విశ్వతః - చక్షుః = అంతటను కన్నులు కలవాడు. పరమేశ్వరుడు ఎల్లప్రాణులకు ఆత్మ తానే గనుక అందఱి కన్నులును, ఆయనవే అయి ఆతడు విశ్వతశ్చక్షుడైనాడన్నమాట. అంతేకాదు, ఉత= ఇంకను, ఆయన, విశ్వతః హస్తః = అంతటను చేతులు కలవాడును, విశ్వతః పాత్ = అంతటను పాదములు కలవా

షును. ఇంతయేల ? ఆయన అంతటను అన్ని అవయవములు కల విశ్వరూపుడైనాడని సాధకులు భావించి, విశ్వమును విశ్వకర్మగా సాక్షాత్కరింపచేసికొని ఆరాధించి, అమృతులు కావలయునని శ్రుతిమాత ఈ మంత్రముద్వారా అనుశాసించుచున్నది. ఇట్టివాడైన, సః దేవః = ఆ దేవుడొక్కడే, ద్యావాపృథివీ=భూమ్యాకాశములను, జనయన్ = పుట్టించుచున్నవాడై, బాహుభ్యాం=చేతులవంటి వయిన ధర్మాధర్మములచేత, అనగా జీవుల ధర్మాధర్మరూప కర్మలను నిమిత్త కారణముగా చేసికొని, సంనమతి = లోకమునందలి జీవుల నెల్లను స్వాధీన మొనర్చుకొనుచున్నాడు. ఆ యా జీవుల కర్మానుసారము వారిని సృష్టించి సంసారచక్రమున త్రిప్పుచున్నాడని భావము. అత్లై పతత్రైః= నశించు స్వభావము కల ఉపాదానకారణములైన పంచభూతములచేత కూడా జగత్తును లోబరచుకొని తాను నిమిత్తకారణుడై ఉన్నాడనియు భావము. ఈ మంత్రమున "దేవః ఏకః" అని చెప్పుటచేతను, "యో దేవానాం నామధా ఏక ఏవ" అనుట చేతను విశ్వకర్మ ఒక్కడే సర్వేశ్వరత్వాది లక్షణములుగల దేవాదిదేవుడని సువ్యక్తమగుచున్నది. బ్రహ్మ, విష్ణు, రుద్రేంద్రాదులు ఆయన అంశలని తెలియుచున్నది. వేదసూక్తము లేవియు, విశ్వకర్మను వర్ణించినంత గొప్పగాను, వివరముగాను, ఆధ్యాత్మికముగాను ఏ దేవుని గూర్చిగూడ వర్ణించినట్లు కనబడదు. "సహస్ర శీర్షా పురుషః" అనెడి పురుష సూక్తముగాని, "సహస్రశీర్షం దేవం విశ్వాక్షంవిశ్వశంభువం"

అనెడి మంత్రపుష్పముగాని, ఈ విశ్వకర్మ సూక్త మంత్రములను ఆధారము చేసికొనియే వెలువడినట్టివని పరిశీలించి సులభముగానే గ్రహింపవచ్చును.

"కిం స్వి దాసీ దధిష్ఠాన మారంభణం
కతమత్ స్విత్ కి మాసీత్,
యదీ భూమిం జనయ న్విశ్వకర్మా
వి ద్యా మౌర్ణో న్మహినా విశ్వచక్షాః". 11.

11. టీక :- యది=ఆ పరమేశ్వరుడొక్కడే అన్య సహాయత లేకుండ ద్యావాపృథువులను సృష్టించినచో, ఆయనకు, అధిష్ఠానం=నివాసగృహము- లేదా ఆధారస్థలము, కిం స్విత్ ఆసీత్=ఏది అయినది? అట్లే ఆరంభణం=ఉపాదానకారణ పదార్థము, కతమత్ స్విత్, కి మాసీత్=ఏది, ఎట్టిది, అయినది? అని అడుగవచ్చును. కాని సర్వశక్తిశాలి అయిన అతనికి ఆధార ఉపాదానాది కారణములతో అవసరములేదని దిగువవాక్య మనుచున్నది. విశ్వచక్షాః=సర్వద్రష్ట, సర్వజ్ఞుడు అగు, విశ్వకర్మా=ఆ విశ్వకర్మ, మహినా=తన మహిమచేతనే, భూమిం=భూలోకమును, జనయన్=కనినవాడై - సృష్టించినవాడై, ద్యామ్=స్వర్గలోకమును, విఔర్ణోత్=విశేషముగా సృష్టించి వ్యాపించినాడు. అనగా భూమ్యాకాశములను, అందలి భువనములను సృష్టించి తాను వాటన్నింటియందును పరిపూర్ణుడై నిండినాడని సారాంశము. నిమిత్తోపాదాన సహకారి కారణములన్నియు, ఆయనయే

అనియు,తనకంటె భిన్నమైన దేదియు సృష్టిక్రియలో వాడబడ లేదనియు,అసలట్టి పదార్థమేదియు అప్పుడుగాని, ఇప్పుడుగాని లేదనియు, పాఠకులు గమనింపవలయును. ఈ రహస్యమునే పురుషసూక్తము నందలి "పురుష ఏ వేదగ్ం సర్వం య ద్భూతం య చ్చ భవ్యమ్" ఆయనకంటె భిన్నమైనది, ఇది వఱకు లేకపోవుటయేకాదు, ఇకముందుకూడా ఉండదనియు, సర్వమూ ఆతడే అనియు చెప్పుచున్నది. ఇక్కడ మహిమ అనగా ఆయన యొక్క శక్తి అని తాత్పర్యము. ఆ శక్తినే మనము గాయత్రినిగా ఆరాధించుచున్నాము ఆ శక్తిని గూర్చి శ్వేతాశ్వతరోపనిషత్తు ఇట్లు చెప్పినది.

"న తస్య కార్యం కరణం చ విద్యతే
న త త్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే,
పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞాన బల క్రియా చ." 6-8.

తా. అతనికి శరీరముకాని, ఏ ఇతర సాధనములుకాని లేవు. అతనితో సముడుకాని, అధికుడుగాని లేడు. అతనికి స్వాభావికమైన పరాశక్తి (మాయ) వివిధ రీతులు గలదై జ్ఞాన బలక్రియలతో ఒప్పుచుండును. ఇట్టి మహిమ, లేదా శక్తియే జగత్క్రీడకు మూలభూతము. శక్తికినీ, శక్తిగల వానికినీ అభేదమని ఇక్కడ సాధకులు భావింపవలసియున్నది. వీరినే శివశక్తులనిగూడ శైవగ్రంథములు వర్ణించినవి.

"కిం స్విదాసీ దధిష్ఠాన మారంభణం కతమత్స్వి త్కథాసీత్" - no

"కిం స్వి ద్వనం క ఉస వృక్ష ఆసీ
ద్యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః,
మనీషిణో మనసా పృచ్ఛ తే దు
త ద్య దధ్య తిష్ఠ ద్భువనాని ధారయన్." 12.

12. టీక :- హేమనీషిణః=ఓ పండితులారా! మీరు, మనసా=మీమనస్సుతో పర్యాలోచించి ఆ విశ్వకర్మ, యతః = దేనినుండి, ద్యావాపృథివీ=ఆకాశమును, భూమిని, నిష్టతక్షుః=శిల్పముచే సృజించెనో అట్టి, వనం=అడవి, కిం స్విత్ = ఏది ? సవృక్షః=అట్టి వృక్షము, ఉ ఆసీత్=ఏదై ఉండును ? భువనాని=లోకములను, ప్రాణులను, ధారయన్=సృష్టించుచు, యత్=దేనిని, అధ్యతిష్ఠత్ = అధివసించినాడు ? ఎక్కడనుండి, వేటితో ఈ సృష్టి నంతటిని చేసెనో, అవి ఏవి? అని, పృచ్ఛ తే దు=అడుగదలచినచో, అడుగుడు అని భావము. దానికి సమాధానముగానే 11 వ మంత్రమున, "విశ్వ చక్షాః విశ్వకర్మా మహినా ద్యాం వి ఔర్ణోత్." సర్వ ద్రష్ట (అన్నిటినీ చూచువాడు) సర్వజ్ఞుడు, సర్వశక్తి యయిన విశ్వకర్మ తన మహిమచేతనే, తాన నే పదార్థముతోనే ద్యావాభూములను, అందలి సర్వమును సృష్టించినాడని చెప్పబడినది. సాధనాంతరముల అపేక్షలేని పరమేశ్వరునికి, సృష్టి విషయమున తనకంటె భిన్నమైన దేదియు అక్కర లేదని దీని సారాంశము. ఈ విషయమునే ఇంకొక శ్వేతాశ్వతర మంత్రము ఇట్లు పేర్కొన్నది.

"అపాణిపాదో జవనో గ్రహీతా
పశ్యత్యచక్షు స్స శృణో త్యకర్ణః,
స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా
త మాహు రగ్ర్యం పురుషం మహాంతమ్." 3-10

తా. ఆ విశ్వకర్మ పరమాత్మ, పాదములు లేకున్నను వేగముగా నడువగలడు. చేతులు లేకున్నను పట్టుకొనగలడు. చెవులు లేకున్నను వినగలడు. ఇంత ఏల? తెలియదగిన దానినెల్ల అతడు తెలిసికొనగలడు. కనుకనే సమస్త జీవుల పుణ్యాపాపముల నెఱింగి వాటికితగిన ఫలములను ఒసంగు చున్నాడు. కాని ఇట్టి సర్వజ్ఞుడైన అతనిని మాత్రము పూర్ణ ముగా ఎఱుంగువారు లేరు. ఎవరైన ఎఱుగుదు మన్నచో, ఆ ఎఱుక కొంతవఱకే అని తెలియవలయును.

అట్టి పరమ పురుషునే సర్వశ్రేష్ఠునిగాను, మహాను భావునిగాను తత్వజ్ఞులు చెప్పుదురు. ఈ శ్వేతాశ్వతర మంత్ర ములు రెండును విశ్వకర్మ ద్వితీయ సూక్తమునందలి ఈ 3,4. మంత్రములకు వ్యాఖ్యానముల వంటివని చెప్పవచ్చును. అంతేగాదు. విశ్వకర్మ సూక్తమునకే శ్వేతాశ్వతరోపనిషత్తు వ్యాఖ్యానము వంటిదని విజ్ఞుల అభిప్రాయము. ఈ రెండు మంత్రముల రహస్యమును 'మిత్రసాహస్రి' ఇట్లు పేర్కొన్నది.

"కనులు లేక చూచు, విను కర్ణములు లేక,
అవయవములు లేక అన్ని పనులు

చేయు నీశ్వరుండు, చిత్ర మాతని స్థితి!
విశ్వహిత చరిత్ర వినర; మిత్ర" 414.

సాధనములు లేక, సాధింప కార్యంబు
లెవని కగునో, వాడె ఈశ్వరుండు
చోద్య మతని మహిమ చూడ నాలోచింప
విశ్వహిత చరిత్ర వినర మిత్ర. 415.

సాధనములచేత పనులను సాధించువాడు సామాన్యుడు. సాధనములతో అవసరములేకయే పనులు నెరవేర్చువాడు విశిష్టుడు. అట్టివాడు భగవంతుడే. అందుకే అతనిని "ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః" అని సంకల్ప మాత్రము చేతనేపనులు చేయువాడని అన్నది శ్రుతి.

"యా తే ధామాని పరమాణి యావమా
యా మధ్యమా విశ్వకర్మ న్ను తే మా,
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః
స్వయం యజస్వ తనువం జుషాణః." 13.

**13.** టీక :- విశ్వకర్మన్=ఓ విశ్వకర్మా, తే=నీయొక్క- పరమాణి = శ్రేష్ఠములైన (దేవాదుల) ఉత = ఇంకను, మధ్యమా=నడిమిరకములైన(మానవాదుల) అధమా=అధమములైన (తిర్యగాదుల) ధామాని=స్థానములు (శరీరములు) ఏవి కలవో, ఇమా=ఇట్టి వీటినన్నింటిని, సఖిభ్యః=నిన్నారాధించుటచే నీకు సఖులవంటివారమైన మాకు, యజించు నిమిత్తమై, హవిషి=హవిర్దానమునకై, శిక్షా=ఉపదేశింపుము -

ఇమ్ము. హేస్వధావః=స్వధాలక్షణమైన హవిస్సనెడిఅన్నము కలవాడా! నీవు, స్వయమ్=స్వయముగా, తనువంజుషాణః= యజమానశరీరమును పొందినవాడవై, యజస్వ=యజింపుము. యజ్ఞముచేయుమని భావము. ఈ మంత్రమున మంత్రద్రష్టయైన భౌవనవిశ్వకర్మఋషి, విశ్వకర్మదేవుని యజమాన శరీరమున ప్రవేశించి స్వయముగా నీవే యజింపుమని, చెప్పుట చేత యజమానునకు, విశ్వకర్మానుగ్రహము కలుగుటయే గాక అతనితో అభేదముకూడ సిద్ధించుచున్నదని తెలియవలెను. భగవదనుగ్రహము లేనిది ఎవ్వడు కాని సత్కార్యములు చేయజాలడనియు, భగవంతునితో ఐక్యముకానిదీ సంసారము నుండి ముక్తుడు కాడనియు దీనిచే సూచితమగుచున్నది. ఇంకను లోతుగా ఆలోచించినచో, శరీరమున జీవరూపుడై ప్రవేశించినది ఈశ్వరుడే, కావున, సూక్తారంభమున చెప్పబడిన అద్వైతానుభూతికూడా ఇక్కడ సూచితమగుచున్నది. దేవ మానవ తిర్యగ్జాదులైన ఉత్తమ మధ్యమాధమ శరీరములన్నింటియొక్క తృప్తికోసమై మేము చేయు యాగాది సత్కర్మలు విశ్వరూపుడవైన నీ సేవయే అనియు తెలుపబడినది. అనగా జీవుల ప్రవర్తన విశ్వమునందలి సకల చరాచరములయొక్క క్షేమముకోసమై ఉపయోగింపవలెననియు ఇందలి పరమార్థము. ఒక్క యజ్ఞమే అననేల? వైదిక లౌకికములైన సర్వకర్మలుకూడ విశ్వమంగళకరములు కావలయుననుట ఈ విశ్వకర్మ సూక్తముయొక్క లక్ష్యమైనట్లు ఇందువలన తెలియుచున్నది. ఈ ద్వితీయ

సూక్తముయొక్క ఒకటవ మంత్రమున ముజ్జగములసృష్టిని చెప్పి, రెండవ మంత్రమున ఆ విశ్వముయొక్క విరాడ్రూప వర్ణనము చేసి, ఈ మంత్రమున ఆ విశ్వము నారాధించి సేవింపవలసిన పద్ధతిని పేర్కొనుటచే ఈ సూక్తములు, మానవ జీవితము సార్థకమగుటకు ఎంతగా ఉపయోగించు చున్నవో గ్రహింపవచ్చును. ఇట్టి సూక్తములను, మనకు ప్రసాదించిన శ్రుతిమాత, వాటిని దర్శించిన భావన విశ్వ కర్మ ఋషి ఎంతటి దయావంతులో చెప్పజాలము. ఇంకను ఇందలి మఱికొన్ని విశేషములను ఆరయుదము.

ఈ మంత్రమున పరమ, మధ్యమ, అవమములనెడి మూడుస్థానములను పేర్కొనుటచేత స్వర్గ, మర్త్య, పాతాళ లోకములు, లేదా పృథివ్యంతరిక్ష ద్యులోకములు సూచి తములగుచున్నవి. అట్లే సత్వగుణప్రధానములయిన దేవతా శరీరములు, రజోగుణప్రధాన మానవ శరీరములు, తమః ప్రధానములైన మృగ, పక్షి, కృమి, కీట, స్థావరాది శరీర ములు సూచితములైనవి. ఇవి అన్నియు భగవంతునిసృష్టియే. వీటిఅన్నిటియందును భగవంతుడు అధివసించియే ఉన్నాడు. కనుక ఈ మూటిచేతను సృష్టినంతటిని పేర్కొన్నట్లే అయి నది. ఇవి తప్ప అవయవరహితుడైన పరమేశ్వరునికి, వేఱు శరీరము లేవియు లేవు. ఈ అంశమునే, "న తస్య ప్రతిమా అస్తి." ఆ పరమేశ్వరునికి దేహము (విగ్రహము) లేదు. అంతేకాదు. అతనికి సాటియైన వస్తువుగూడ లేదని ఇందలి

భావము. చైతన్యరూపుడైన భగవానునికి, జడమే విపరీత లక్షణముకలది. జడము సాధనమేకాని సాధ్యము కాదుగదా! విశ్వకర్మయొక్క ఈ మూడు ధామములనే విష్ణు మంత్రములలో —

"ఇదం విష్ణు ర్విచక్రమే
త్రేధా నిదధే పదమ్" — ఋ. 1-22-17.

"త్రీణి పదా విచక్రమే." — ఋ. 1-22-18.

అని చెప్పబడినది. విష్ణువు ముల్లోకములను మెట్టినాడని ఇందలి బాహ్యార్థము. ఈ వర్ణనమువలన విష్ణు విశ్వకర్మలకు అభేదము సిద్ధమగుచున్నది.

తాత్త్విక దృష్టితో చూచినప్పుడు ఈ పరమ మధ్య మానవ స్థానములు- సహస్రారము, ఆజ్ఞ, అనాహతములని భావింపవలయును. యోగసాధకుడు ప్రాణాయామాదులను అనాహతమునుండియు, ధ్యానాదులను, ఆజ్ఞా చక్రము నుండియు, అసంప్రజ్ఞాత సమాధిని సహస్రారమునను కొన సాగింపవలసియున్నది. కనుక ఇవి మూడే జీవుని ఉన్నత భూమికారోహణమునకు సాధనములగుచున్నవి. ప్రాణాయామాదులచేత నికృష్టస్థితిని వదలుటయు, ధ్యానాదులచేత విజ్ఞానప్రధాన మానవదేవతా స్థానముల కేగుటయు, సమాధి వలన- అనగా సహస్రారారామ విహారమువలన అతిదేవ మానవ స్థాయినేకాక, పరబ్రహ్మ సామ్యము నందుటయు తటసించును. ఈ స్థితి సాధకులలో ఈశ్వరాభివ్యక్తి కలిగిననే

కాని సంభవింపదు. ఈ రహస్యములను లౌకిక, వైదిక యజ్ఞాది దృష్టాంతములతో కలిపి వేదమాత మనకు ఉపదేశించినది. విష్ణుదేవుని త్రివిక్రమములకుగల నిగూఢార్థము కూడా ఇట్టిదే యని మఱువ జనదు.

ఇంకొక పరమ రహస్య మేమన. పరమస్థాన మనగా కారణశరీర మనియు, మధ్యమస్థానమనగా సూక్ష్మ శరీర మనియు, అవమస్థానమనగా స్థూలశరీరమనియు భావించుట. వీటిలో కారణము కారణమే గనుక పరమము. అనగా సత్వ గుణముకలది. సూక్ష్మ దేహమేమో మధ్యమస్థానము గనుక అది సత్వరజస్సులతో కూడినట్టిది. ఇక స్థూలదేహ మన్నచో తమోగుణమయములైన పంచీకృత పంచభూతములతో ఏర్పడిన భోగశరీరము. ఈ మూటియందును, భగవానుడే ప్రవేశించి, వాటిని చైతన్యవంతము లొనర్చి తాను జీవుడని చెప్పబడుచున్నాడు.

కనుక జీవుడుగా వేషము వేసికొనిన ఈశ్వరునికి కారణ, సూక్ష్మ, స్థూలదేహములు పరమ, మధ్యమాధమ స్థానము లగుచున్నవి. ఈ శరీరములతో జీవుడు సుషుప్తిని కారణముతోను, స్వప్నమును సూక్ష్మముతోను, జాగ్రదవస్థను స్థూలముతోను, అనుభవించుచున్నాడు. ఈ మూడు ధామముల (శరీరముల) యందును జీవభావము నశించి, ఈశ్వరభావము కలిగిననేకాని నాల్గవదయిన తురీయదశ (సమాధి) చేకూరదు. అప్పుడుకాని జీవునికి, అమృతత్వము

ప్రాప్తించదు. ఈ అంశమునే మంత్రముయొక్క ఉత్తరార్థము ఇట్లు చెప్పినది- "ఓ విశ్వకర్మా! నీవు స్వయముగా సాధకుని శరీరమున ప్రవేశించి (అనగా వ్యక్తమయి) అతని జీవ భావము నణచివేసి, అతనిచేత తురీయానందమును అనుభవింపచేయుమనుటయేకాక, ఆ ఆనందరూపునిగానే అతనిని శిక్షింపుము-(తీర్చుము) అనుటలోని పరమార్థము అతి గంభీరమును, రహస్యమును అయినది. కనుక తాత్త్విక దృష్టితో చూచినప్పుడు, విశ్వకర్మ (జీవుడు) అధిష్ఠించిన స్థానములు మూడు దేహములేకాని, భిన్నములు కావు. మంత్రము చివర నున్న- "యజస్వ" అన్నపదమునకు బాహ్యయజ్ఞమును చేయుమని అర్థము చెప్పుకొని తృప్తిపడరాదు. శివజీవైక్య రూప తాత్త్వికయజ్ఞమును చేయుమనెడి అర్థమును చెప్పికొనుమని శ్రుతిమాతయొక్క నిక్కమయిన ప్రబోధము. అట్లు గాక, లౌకికార్థమును మాత్రమే చెప్పికొన్నచో భోజనసిద్ధి కలుగునే కాని, మోక్షసిద్ధి మాత్రము కలుగదు. ఇంతటి లోతైన అర్థమును సమర్పించిన విశ్వకర్మ సూక్తమహిమను ఏమని స్తుతింపగలము! పిమ్మటిదైన 14 వ మంత్రము విశ్వకర్మను వేదజనకుడని చెప్పుచున్నది. ఎట్లో చూతము.

"వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే
మనోయుజం వాజే అద్యా హువేమ,
స నో నేదిష్ఠా హవనాని జోషతే
విశ్వశంభూ రవసే సాధుకర్మా." —14

14. టీక :- అద్య=ఈనాడు, వాజే = అన్నవిషయమైన కార్యము జరుగుచుండగా, వాచః పతిం = వేదమంత్ర రూపవాక్కులకు పాలకుడైనవాడును, మనోయుజమ్=మన మనస్సులకు యోగమును కూర్చువాడును, లేక మనలను యోగ్యమనస్సులు కలవారిని చేయువాడును అయిన, విశ్వ కర్మాణం = విశ్వకర్మ పరమేశ్వరుని, ఊతయే = సర్వము యొక్క రక్షణార్థమై, ఆహువేమ=పిలుతుముగాక. విశ్వ శంభూః=విశ్వమునకు సుఖమును కూర్చువాడును, సాధు కర్మా=జగత్సంబంధములైన సృష్ట్యాది యోగ్యకర్మలు గల వాడును అగు, సః = ఆ విశ్వకర్మ, అవసే = మన రక్షణ కోసమై, నేదిష్ఠా హవనాని = మనకు సమీపమునందుగల అనగా ఇప్పుడు మన మాచరించుచున్న యజ్ఞాదికార్యములను, జోషతే=సేవించును. ఇప్పుడు మనము చేయుచున్న సత్కార్య ములనన్నిటిని ఆమోదించి తగిన ఫలములను ఒసగుగాకయని భావము. వేదపాలకుడును, విశ్వమునకు సుఖంకరుడును సాధుకార్యశీలుడును అయిన విశ్వకర్మ,జీవులమయిన మనము తనను తెలిసికొనుటకు చేయునట్టి ప్రతి సత్కర్మను ప్రోత్స హించుచు మన మనస్సులను యోగయుక్తములగునట్లు చేసి మనలను రక్షించుగాక, అని ఇందలి పరమార్థము. పూర్వ మంత్రమున ఏ యోగకార్యము సూచింపబడెనో, దానిని రక్షించుటకోసమై భక్తుడు భగవానుని ఈ మంత్రమున సవిశేషముగా ప్రార్థించినాడన్నమాట. ఈశ్వరుడెప్పుడును, మా హృదయములందు నివసించుచు, మమ్ము ప్రేరేపించుచూ

మమ్ము తత్వజ్ఞాన సంపన్నులను చేయుగాతమనిసారాంశము. 15వ మంత్రమునకూడా ఇట్టి ప్రార్థనయే వినబడుచున్నది.

"విశ్వకర్మన్ హవిషా వావృధానః
స్వయం యజస్వ తనువం జుషాణః,
ముహ్యన్త్వన్యే అభిత స్సపత్నా
ఇహాస్మాకం మఘవా సూరి రస్తు." —15

15. టీక :- విశ్వకర్మన్=ఓ విశ్వకర్మా, నీవు, హవిషా= మేమర్పించెడి హవిస్సులచే, వావృధానః=వృద్ధి పొందుచున్నవాడవై, తనువం=నాశరీరమును, జుషాణః=పొందినవాడవై, స్వయం=నీవే స్వయముగా (నేనై) యజస్వ=ఈ యజ్ఞమును చేయుము - ఆరాధింపుము. ఇహ=ఈ సత్కార్యమునందు, అస్మాకమ్=మా యొక్క, అన్యేసపత్నాః=మా భావములకు విఘ్నములు కల్పించు శత్రువులు, అభితః=అంతట, అన్ని విధముల, ముహ్యంతు=మోహము చెందుదురుగాక. అనగా పరాజయముపాలగుదురుగాక అని భావము. యోగ విఘ్నకరములైన ప్రతిపక్షులు నశించుగాక అని భావము. మఘవా=ధనవంతుడును, సూరిః=జ్ఞానవంతుడును అగు పుత్రుడు, అస్మాకం అస్తు=మాకు కలుగునుగాక. ఇక్కడ లౌకిక పుత్రు డనియేకాక, జ్ఞానపుత్రుడనియు తాత్వికార్థమునుగూడ భావింపవలయును. మే మొనర్చిన ఈ సత్కార్యము మాకు జ్ఞాన లాభమును చేకూర్చుగాక అని సారాంశము.

"విశ్వకర్మన్ హవిషా వర్ధనేన
త్రాతార మింద్ర మకృణో రవధ్యం,
తస్మై విశ స్సమనమ న్త పూర్వీ
రయ ముగ్రో విహవ్యో యథా సత్." —16

16. టీక :- విశ్వకర్మన్=ఓ విశ్వకర్మ పరమేశ్వరా, హవిషా=మేమర్పించు హవిస్సుచేత, వర్ధనేన=వృద్ధి పొందిన వాడవై, అనగా మా మనస్సులలో ఎడబాయక తోచుచున్న వాడవై ఈ యజమానుని-లేదా యోగసాధకుని, త్రాతారం= ఇతరులను రక్షించువానినిగాను, అనగా లోకారాధనకు త్రికరణముల నర్పించువానినిగాను, ఇంద్రం = పరమైశ్వ ర్యము కలవానినిగాను, అవధ్యం=ఇతరులకు లోబడనివానిని గాను, అకృణోః=చేయుము. తస్మై=ఇతని కొఱకు. పూర్వీః విశః = గొప్ప గొప్పవారుకూడ, సమనమంత = లోబడుదురు గాక. ఇతనికి శిష్యభూతులై ఇతని మార్గములను అను సరింతురుగాక అని భావము. అయం=ఈ యజమానుడు- లేదా సాధకుడు, ఉగ్రః = ఇతరులకు అణపరానివాడును, విహవ్యః=విశేష యజ్ఞ (సత్) కార్యములు చేయువాడును, యథాసత్=ఎట్లు కాగలడో, అట్లు చేయుమని భావము. యజు ర్వేదము యజ్ఞకర్మలు ప్రధానముగా కలది కావున, యజ్ఞ కారులకు కావలసిన ఐహికాభ్యుదయము ఈ రెండు మంత్రము లలో కోరబడినది. ఇంకొక చివరి మంత్రము "సముద్రాయ వయునాయ" అనునది. విశ్వకర్మ జగద్బీజమును జలముల

యందే ఉంచినాడు కావునను, ఆ బీజమునుండియే ద్యావా పృథువులు మొదలైన బ్రహ్మాండము కలిగినది కావునను, అట్టి జలములకు నివాసమయిన నదులకు సముద్రములకు తండ్రి విశ్వకర్మయని ఇందు జలాధిదేవతగా విశ్వకర్మ ప్రార్థింపబడుచున్నాడు.

"సముద్రాయ వయునాయ సింధూనాం పతయే నమః,
నదీనాం సర్వాసాం పిత్రే జుహుతా విశ్వకర్మణే
విశ్వాహా మర్త్యగ్ం హవిః." 17

17. టీక :- సింధూనాం=ప్రవహించునట్టి నదములకు, పతయే = పాలకుడును, సముద్రాకారుడై భరించు భర్త అన్నమాట. విశ్వకర్మాకారుడై, సర్వాసాం నదీనాం=సమస్త నదులకు; పిత్రే = తండ్రి అయిన వాడును, వయునాయ= కాంతుడును, అనగా చిత్స్వరూపుడన్నమాట. సముద్రాయ= జలరాశి స్వరూపుడయిన విశ్వకర్మకు, నమః=నమస్కారము. ఈ లక్షణములు గల విశ్వకర్మ ప్రభునకు ఓ మానవులారా! విశ్వాహా=ఎల్లవేళలయందును (ప్రతిదినమును) అమర్త్యం= నాశనములేనట్టి, హవిః = పూజా ద్రవ్యమును, జుహుత = హోమము చేయుడు-అర్పింపుడు అని భావము. సాయణులు విశ్వకర్మ సూక్తములు రెంటికి భాష్యములువ్రాసి కడపట వినియోగ విధానమును ఇట్లు సంగ్రహించినారు.

"య ఇమా, చక్షుషో ద్వాభ్యాం
సూక్తాభ్యామాహుతి ద్వయం,
సముద్రేతి జలే హోమా
మంత్రా స్సప్త దశేరితాః."

తా. "య ఇమా విశ్వా భువనాని....తో ప్రారంభించి "అపాం గర్భం వ్యదధా త్పురుత్రా" వఱకు ఒక సూక్తము "చక్షుషః పితా" నుండి "విహవ్యో యథాసత్" వఱకు రెండవ సూక్తము. వీటితో 16 హోమములు చేయవలయును. ఆవల" సముద్రాయ వయునాయ సింధూనాం పతయే నమః" అనెడి మంత్రముచేత జలములందు హోమములు చేయవలెనని, మొత్తము 17 మంత్రములని చెప్పినారు.

శుక్ల యజుర్వేద సంహితలోకూడ పూర్వ వింశతిలో 17 వ అధ్యాయమున విశ్వకర్మను గూర్చి, 2. సూక్తములున్నవి. ఆ రెంటియందుకూడ 16 మంత్రములే కలవు. అందలి మంత్రములు ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్తమంత్రములతో పోలికగలవై యున్నవి.

సృష్టిస్వరూపమును, విధానమును తెల్పు విశ్వకర్మ సూక్తములు ఋగ్వేదమునను, శుక్ల కృష్ణయజుర్వేదములందును, అథర్వవేదమున కొన్ని మంత్రములందును ఉండుట వైదిక ఋషులకు విశ్వకర్మదేవుని యెడగల భక్తిప్రపత్తులకు నిదర్శనము. దేవతావాచకములైన పదములలో రుద్ర, విష్ణు, పురుష, ప్రజాపతి, హిరణ్యగర్భాది పదములకుగల

వ్యుత్పత్త్యర్థములకంటెను, విశ్వకర్మ పదమునకుగల వ్యుత్పత్త్యర్థవిశేషము వారి నాకర్షించుటయే ఇందుకు కారణము. విశ్వ-'సమస్తములైన కర్మలు కలవాఁడు, అనికదా విశ్వకర్మ పదమునకు అర్థము. అగ్ని, యమ, వరుణ, రుద్ర, విష్ణు, హిరణ్యగర్భాదిపదములు ఇంతసమగ్రమైన అర్థవిశేషము నొసంగవు. వాటి అర్థము పరిమితము. ఇదేమో అపరిమితము. సృష్టిలో ఎన్నెన్ని విశేషములు కలవో, వాటి నన్నింటిని విశ్వకర్మ పదము-తనవే అని చెప్పుచున్నది. అందుచే విశ్వకర్మశబ్ద మహిమము ఇంతింత యని చెప్పజాలము. బ్రహ్మ చేసెడు సృష్టి, విష్ణువొనర్చు పోషణ, రుద్రుడొనర్చు లయము - తక్కిన సర్వ దేవతలుచేయు సర్వ కార్యములు విశ్వకర్మ లోనూ, విశ్వకర్మ పదముయొక్క అర్థములోనూ ఇమిడి యున్నవి. బ్రహ్మాండమున జరుగు ప్రతి చలనము, స్పందన, క్రియ, అన్నియు ఇందిమిడిపోవలసినదే. అందుకనియే సృష్టి సూక్తములలో నాసదీయ సూక్తము తర్వాతి స్థానము ఈ విశ్వకర్మ సూక్తములకే దక్కినదని గ్రహింపవలయును. పాశ్చాత్యవిమర్శకులు ఈసూక్తములను విశ్వోత్పత్తిసూక్తము లనినారు. తత్వశాస్త్ర విద్యార్థులు ఈ రెండు విశ్వకర్మ సూక్తములమీాదనే పరిశోధనచేసి, పి. హెచ్. డి. ని (డాక్టరేట్) పొందదగినన్ని విషయము లిందు ఇమిడి యున్నవి. ఇప్పుడు శుక్ల యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తములను చదువుదము.

## ప్రథమ సూక్తము

య ఇమా విశ్వా భువనాని జుహ్వ
దృషి ర్హోతా న్యసీద త్పితా నః,
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః
ప్రథమ చ్ఛద వరా ఆవివేశ. 1 (1)

కిం స్విదాసీ దధిష్ఠాన మారంభణం
కతమత్ స్విత్ కథా సీత్,
యతో భూమిం జనయన్ విశ్వకర్మా
విద్యా మౌర్ణో న్మహినా విశ్వచక్షాః. 2 (11)

విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో
విశ్వతో బాహు రుత విశ్వత స్పాత్,
సం బాహుభ్యాం ధమతి సంపతత్రై
ర్ద్యావా భూమీ జనయ న్దేవ ఏకః. 3 (10)

కిం స్వి ద్వనం క ఉస వృక్ష ఆస
యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః,
మనీషిణో మనసా పృచ్ఛతే దు తద్య
దధ్యతిష్ఠ ద్భువనాని ధారయన్. 4 (12)

యా తే ధామాని పరమాణి యావమా
యా మధ్యమా విశ్వకగ్మ న్నుతేమా,
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః
స్వయం యజస్వ తన్వం వృధానః. 5 (13)

విశ్వకర్మన్ హవిషా వావృధానః
స్వయం యజస్వ పృథివీ ముత ద్యామ్,
ముహ్యం త్వన్యే అభిత స్సపత్నా
ఇహాస్మాకం మఘవా సూరి రస్తు. 6 (15)

వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే
మనో జువం వాజే అద్యా హువేమ,
స నో విశ్వాని హవనాని జోష
ద్విశ్వ శంభూ రవసే సాధుకర్మా. 7 (14)

విశ్వకర్మన్ హవిషా వర్ధనేన
త్రాతార మింద్ర మకృణో రవధ్యమ్,
తస్మై విశ స్సమనమన్త పూర్వీ
రయ ముగ్రో విహవ్యో యథా సత్. 8 (16)

ద్వితీయ సూక్తము

చక్షుషః పితా మనసా హి ధీరో
ఘృత మేనే అజన న్నమ్నమానే,
య దేదన్తా అదదృహన్త పూర్వ
ఆది ద్ద్యావా పృథివీ అప్రథేతామ్. 9 (9)

విశ్వకర్మా విమనా ఆద్విహాయా
ధాతా విధాతా పరమోత సందృక్,
తేషా మిష్టాని స మిషా మదన్తి
యత్ర సప్త ఋషీ న్పర ఏక మాహుః. 10 (2)

యో నః పితా జనితా యో విధాతా
ధామాని వేద భువనాని విశ్వా,
యో దేవానాం నామధా ఏక ఏవ
తం సంప్రశ్నం భువనా యన్త్యన్యా. 11 (3)

త ఆయజన్త ద్రవిణం స మస్మా
ఋషయః పూర్వే జరితారో న భూనా,
అసూర్తే సూర్తే రజసి నిషత్తే
యో భూతాని సమకృణ్వన్నిమాని. 12 (4)

పరో దివా పర ఏనా పృథివ్యా
పరో దేవేభి రసురై ర్యదస్తి.
కం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమపశ్యన్త పూర్వే. 13 (6)

త మిద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమగచ్ఛన్త విశ్వే,
అజస్య నాభా వధ్యేక మర్పితం
యస్మి న్విశ్వాని భువనాని తస్థుః. 14 (7)

న తం విదాథ య ఇమా జజా
నాన్య ద్యుష్మాక మంతరం బభూవ,
నీహారేణ ప్రావృతా జల్ప్యా
చాసుతృప ఉక్థశాస శ్చరన్తి. 15 (5)

విశ్వకర్మా హ్యజనిష్ట దేవ
ఆది ద్గంధర్వో అభవ ద్ద్వితీయః,

తృతీయః పితా జనితౌషధీనా
మపాం గర్భం వ్యదధా త్పురుత్రా. 16 (8)

కృష్ణయజుర్వేదములోని విశ్వకర్మ సూక్తమంత్రముల క్రమము, శుక్లయజుర్వేద మంత్రక్రమముకంటె భిన్నము. వాటి సంఖ్యలను బ్రాకెట్లలో ఇచ్చుటయైనది. ఋగ్వేదీయ మంత్రక్రమమును, శుక్లయజుర్వేదీయ మంత్ర క్రమమును సరి పడుచున్నవి. శుక్లయజుర్వేదములోని-8, 16 సంఖ్యల మంత్రములు ఋగ్వేదమున లేవు. అందుకనియే ఋఙ్మంత్ర సంఖ్య 14 కాగా, వీటి సంఖ్య 16 అగుచున్నది. ఈ 16 సంఖ్య కృష్ణయజుర్వేదమునను కలదుకాని, అందు "సముద్రాయ వయునాయ సింధూనాం పతయే నమః" అనెడి మంత్రము-17వది అధికముగా ఉన్నది. అందుకు కారణము సాయణులు వ్రాసియే యున్నారు. ఋగ్వేద, కృష్ణ యజుర్వేద విశ్వకర్మ సూక్తమంత్రములలో కొన్ని పదములు భేదముగా ఉన్నను, అర్థములో పెద్ద భేదమేమియు నగ పడదు. అందుకనియే వీటికి అర్థము వ్రాయబడలేదు. అర్థ వివరణ కావలెననుకొన్నవారు ఋగ్వేదదిగ్దర్శన ప్రథమ భాగమును చూడవచ్చును.

## విశ్వకర్మా జగద్గురుః

విశ్వకర్మ అనగానే పురాణములు చదివినవారికి, ఆతడు దేవశిల్పి అని మాత్రమే తెలియును. ఇందుకు కారణము మన లౌకిక వాఙ్మయమున విశ్వకర్మ దేవశిల్పిగా

వర్ణింపబడి ఉండుటయే. నిఘంటువులుకూడ "విశ్వకర్మణ్యపి త్వష్టా" అనియు, విశ్వకర్మార్క సురశిల్పినోః." అని అమర నిఘంటువును (3-265) అన్నందువలన, త్వష్టృశబ్దము విశ్వకర్మకును చెల్లుననియు, విశ్వకర్మ అనగా సూర్యునియందును, దేవశిల్పియందును వర్తించుననియు మనము భావించు చుందుము. ఇది సాధారణాభిప్రాయము.

కాని వేదములను, బ్రాహ్మణారణ్యకోపనిషత్తులను పరిశీలించినచో, జగత్కారణ పరబ్రహ్మము (పరాత్పరుడు) నుండి-విశ్వకర్మ ఎన్నెన్ని అవతారములను తాల్చినదియు, సర్వ సృష్టికి మూలకారణుడైనదియు మనకు విశదముగా తెలియగలదు ఇట్టి విశేషముల నెన్నిటినో పరిశీలించి తెలిసికొన్నందుననే ఈగ్రంథకర్త విశ్వకర్మనుగూర్చి యీపాటిగా నైనను లోకమునకు పరిచయము చేయబూనినారు. ఈ ప్రకరణమున విశ్వకర్మ జగమునకు బ్రహ్మ విద్యోపదేశము చేసిన ఆద్యగురువులకుగూడ గురువైన (గురూణాంగురుః) మహాగురుడని తెలిసికొనగలుగుచున్నాము.

తత్త్వసాధకులు బ్రహ్మవిద్యా గురు పరంపరను ధ్యానించునప్పుడు దిగువశ్లోకమును చదువుచుందురు.

"విశ్వకర్మ సమారంభాం, విశ్వరూపార్య మధ్యమాం,
అస్మదాచార్య పర్యన్తాం, వన్దే గురు పరంపరామ్."

ఇందు వర్ణింపబడిన మొట్టమొదటి గురువు విశ్వకర్మ. ఆయనతోనే లోకమున బ్రహ్మవిద్యోపదేశము ప్రారంభ

మయినదట. ఇందాశ్చర్య మేమున్నది. విశ్వ విశ్వములను సృజించి పోషించెడి దేవుడుకాక, తనబిడ్డలకు బ్రహ్మవిద్యోపదేశముచేయువా రింకెవ్వ రుందురు? లోకసృష్టికి ఆయన ఆదికర్త అయినట్లే, బ్రహ్మవిద్యా సృష్టికిని ఆద్యోపదేశికుడగుట ఎంతయు సమంజసమే. అందుకే స్తోత్ర శ్లోకము "విశ్వకర్మ సమారంభాం" అన్నది. ఇక మధ్యకాలపు గురువు విశ్వరూపాచార్యుడట. ఈయన త్వష్టృ బ్రహ్మ కుమారుడనియు, దేవేంద్రాదులకు పురోహితుడనియు-"విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీత్." (యజుః కాండం. 2-5-1) అనెడి మంత్రము చెప్పుచునే యున్నది. త్వాష్ట్రి డనగా త్వష్టయొక్క కుమారుడని వ్యుత్పత్త్యర్థము. ఈ త్వష్టను వేదము పరమేష్ఠి, బ్రహ్మ-అని పేర్కొన్నది. విశ్వరూపునికథను కొంతవఱకు మనము "విశ్వరూప కథాపరమార్థము"లో చదివియే యున్నాము. త్వష్టకూ, అహభూన బ్రహ్మర్షికికూడ అభేదమే. ఇకపోగా ఈ విశ్వకర్మ, త్వష్టృ, విశ్వరూపుల బ్రహ్మవిద్యోపదేశకత్వమునుగూర్చియు, పౌరోహిత్య ప్రభావమును గూర్చియు ప్రమాణములను ఆరయవలసి యున్నది.

దశోపనిషత్తులలో ఒకటియు, బ్రహ్మ విద్యానిధానమును అయిన బృహదారణ్యకోపనిషత్తు ప్రముఖమైనది. అందు యాజ్ఞవల్క్యుడు, జనకుడు, గార్గి, ఉద్దాలకుడు, శ్వేతకేతువు-మున్నగు మహనీయులు దర్శనమిత్తురు. మధువిద్య

ఆ యుపనిషత్తులోనిదే. మధువిద్య అనగా బ్రహ్మవిద్యలో చివరి కెఱుంగదగిన విద్య అని యెన్నవచ్చును. ఇది త్వష్ట నుండి లోకమునకు సంక్రమించినట్టిది. ఇంద్రుడు, అధర్వుడు, దధ్యఙ్ఋషి, అశ్వినీదేవతలు, యముడు-మున్నగువారు దీని నుపాసించి ధన్యులయినారు. దీనినిగూర్చి బృహదారణ్యక ద్వితీయాధ్యాయ పంచమ బ్రాహ్మణాంతమున చెప్పబడినది. ఇది ముగిసిన పిమ్మట బ్రహ్మవిద్యాచార్యుల పరంపర చెప్ప బడినది. ఈ పరంపర చతుర్థ, షష్ఠాధ్యాయాంతములందు గూడ కొలదిపాటి భేదముతో ప్రస్తావింపబడినది. మూడ ధ్యాయాంతములును మొట్టమొదటి గురువు స్వాయంభువైన విశ్వకర్మతోనే ప్రారంభమగును. ఆ పరంపర ఇది. స్వయంభు బ్రహ్మ-అనగా విశ్వకర్మ మొట్టమొదటి బ్రహ్మవిద్యోప దేశికుడు. తరువాత పరమేష్ఠి. అనగా త్వష్ట, లేక బ్రహ్మ దేవుడు. ఆవల సనగుడు, సనాతనుడు, సనారువు, వ్యష్టి, విప్రచిత్తి, ఏకర్షి, ప్రధ్వంసనుడు, ప్రాధ్వంసనుడు, మృత్యువు (యముడు) దైవుడు, అథర్వుడు, ఆథర్వణుడు, దధ్యఙ్, అశ్వినులు మొదలగువారు దాదాపు 60 మంది వరకు గలరు. వీరిలో చివరివాడు పౌతిమాష్యుడు.

ఈ గణములో ప్రథమాచార్యుడు స్వయంభుబ్రహ్మ. అనగా విశ్వకర్మ అన్నమాట. స్వయంభుబ్రహ్మ అనగా విశ్వకర్మయే అనుటకు నిదర్శనము. "విశ్వకర్మాహ్య జనిష్ఠ దేవః...." అనెడి విశ్వకర్మ సూక్తవాక్యమే. విశ్వకర్మ

యొక్క మొదటి అవతారము త్వష్ట, లేక బ్రహ్మ. ఈ అంశ మును సాయణులే తన భాష్యములో స్పష్టము చేసినారని వ్రాసినాము (11వ పుట). స్వయంసిద్ధుడయినవాడు-పుట్టుక లేనివాడు ఒక్క-విశ్వకర్మ పరమాత్మయే. అందుకే ఆయనను అజుడు అన్నది శ్రుతి. (అజస్య నాభా వధ్యేకమర్పితం) అనగా పుట్టుట అనెడి వికారము లేకుండ ఎల్లప్పుడు స్వయంసిద్ధుడై యుండు వాడని భావము. కావున స్వయంభు శబ్దము విశ్వ కర్మకే చెల్లుచున్నది. దీనికి తగినట్లు మూలస్తంభమనెడి తాత్విక గ్రంథముకూడ బ్రహ్మరుద్రాదులు, భూతములు, ఏమీ లేనప్పుడు స్వయంభువయిన విశ్వకర్మ యొక్కడే కల డన్నది. "సర్వశూన్యే విశ్వకర్మా స్వయంభూ రభవ త్తదా" అని మనము లోగడ (147వ పుటలో) చదివే యున్నాము. కావున ఆద్యబ్రహ్మవిద్యోపదేష్ట విశ్వకర్మ భగవానుడే కాని ఇతరు డెవ్వడును కాడు. అథర్వవేదమీ విశ్వకర్మను "జ్యేష్ఠబ్రహ్మ" అని పేర్కొన్నది. అసలు వేదములే ఆ పరమపితనుండి వెలువడగా, బ్రహ్మవిద్య ఎట్లు, ఏల రాకుం డును? విశ్వకర్మ భగవానుడు ఇట్టి ప్రథమాచార్యుడు కనుకనే పురాణాగమాదులు ఆయనను "విశ్వకర్మా జగద్గురుః" అని పొగడినవి. ఆ పరంపరలోనివారే అయిన, త్వష్టయు, విశ్వరూపుడును, సానగసనాతనులును, యముడును, అథర్వా థర్వణులును, అశ్వినీ దేవతలును బ్రహ్మవిద్యా గురువులే అని బృహదారణ్యకము స్పష్టముగానే చెప్పినదికదా. మధు విద్యకు త్వాష్ట్రిమనికూడ పేరు. త్వష్టనుండి వచ్చినదికాన

త్వాష్ట్రి)మైనది. ఆ బృహదారణ్యక మంత్రపు చివరి భాగ మును ఇట నుదాహరించుట యగుచున్నది. "ఆంగిరస-ఆభూతేస్త్వాష్ట్రా, ద్విశ్వరూపస్త్వాష్ట్రిః-అశ్విభ్యా, మశ్వినా-దధీచఆథర్వణా, ద్దధ్యఙ్ఙాథర్వణో - అథర్వణో దైవా, దథర్వా దైవో-మృత్యోః ప్రాధ్వంసనా, న్మృత్యుః ప్రాధ్వం సనః-ప్రధ్వంసనాత్, ప్రధ్వంసన-ఏకర్షే, రేకర్షి-ర్విప్రచిత్తే, ర్విప్రచిత్తి-ర్వ్యష్టే, ర్వ్యష్టిః-సనారోః, సనారుః-సనాత నాత్, సనాతనః-సనగా, త్సనగః-పరమేష్ఠినః, పరమేష్ఠీ-బ్రహ్మణో, బ్రహ్మ స్వయంభు బ్రహ్మణే నమః." (బృహ.2-6)

ఈ గురు పరంపర స్వయంభువుతో ప్రారంభమయి పరమేష్ఠి, (త్వష్ట, లేక బ్రహ్మ) సనగుడు, సనాతనుడు, సనారువు, వ్యష్టి, విప్రచిత్తి, ఏకర్షి, ప్రధ్వంసనుడు, ప్రాధ్వంసనుడు, మృత్యువు, దైవుడు, అథర్వుడు-ఇత్యాదిగా కొనసాగినది. ఇందలి సనగుడు పంచఋషులలోని సానగుడే. సనాతనుడును పంచర్షి గణములోనివాడే. కనుక ఆద్యోపదేశకు లలో విశ్వకర్మ, త్వష్ట (పరమేష్ఠి) సానగ సనాతనులు ఉండగా మధ్యమాచార్యుడుగా విశ్వరూపుడు కలడన్నమాట. కావుననే "విశ్వకర్మ సమారంభాం, విశ్వరూపార్య మధ్యమాం" అని గురుస్తుతి శ్లోకము ప్రవర్తించినది. మృత్యువు (యముడు) నచికేతువునకు బ్రహ్మవిద్యోపదేశము చేసినట్లు కఠోపనిషత్తులో మనము చదువుచున్నాము. ఇక ముండ కోపనిషత్తు అథర్వునిగూర్చి ఇట్లు ప్రస్తావించుచున్నది.

"బ్రహ్మా దేవానాం ప్రథమ స్సంబభూవ విశ్వస్య కర్తా, భువనస్య గోప్తా. స బ్రహ్మవిద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠ పుత్రాయ ప్రాహ. అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మా, అథర్వా తాం పురోవాచాంగిరే బ్రహ్మ విద్యాం. స భారద్వాజాయ సత్యవహాయ ప్రాహ. భారద్వాజోఽంగిరసే పరావరామ్."

తా. విశ్వకర్తయు, భువనరక్షకుడును అయిన బ్రహ్మ దేవతలలో మొదటివాడు. ఆయన సర్వవిద్యలకు మూలమయిన బ్రహ్మవిద్యను తన పెద్దకొడుకయిన అథర్వనకుపదేశించినాడు. అథర్వుడు దానిని అంగిరునికిని, ఆతడేమో భారద్వాజుడైన సత్యవహునికిని, ఆతడు మఱల దానిని అంగిరసునికిని ఉపదేశించినారట. ఆ అంగిరసుడు శౌనకునికి ఉపదేశించినదే ముండకోపనిషత్తులోని బ్రహ్మవిద్య. దీనిని బట్టి చూచినచో ముండకమున పేర్కొనబడిన విశ్వకర్త, భువనగోప్త అయిన బ్రహ్మదేవుడు స్వయంభూవిశ్వకర్మ అగుటకు అభ్యంతరము లేదు. ఆతడు విశ్వములను సృష్టించిన విశ్వకర్తయు, భువన రక్షకుడుకూడ గదా! కావున ఇట్టి శ్రుతివాక్యము లనేకములు విశ్వకర్మయొక్క బ్రహ్మవిద్యా-జగద్గురుత్వమునే కాక, విశ్వగురుత్వమునుగూడ విశదము చేయుచున్నవి. వేదోపనిషత్తులు చెప్పిన గురుపరంపర ఇట్లుండగా శంకరవేదాంతానుసారులు దిగువరీతి గురుపరంపరాధ్యానము చేయుచున్నారు.

"నారాయణం, పద్మభువం, వసిష్ఠం,
శక్తించ, తత్పుత్ర పరాశరంచ,
వ్యాసం, శుకం, గౌడపదం మహాన్తం,
గోవిందయోగీంద్ర, మథాస్య శిష్యం
శ్రీశంకరాచార్య, మథాస్య పద్మ
పాదం చ, హస్తామలకం చ శిష్యం,
తం త్రోటకం, వార్తికకార, మన్యా
నస్మ ద్గురూ న్సంతత మానతోఽస్మి."

తా. నారాయణుడు, పద్మమునుండి పుట్టిన బ్రహ్మ, వసిష్ఠుడు, శక్తి, పరాశరుడు, వ్యాసుడు, శుకుడు, గౌడపాదుడు, గోవిందయోగి, శంకరాచార్యుడు, ఆయన శిష్యులైన పద్మపాద, హస్తామలక, త్రోటక, విశ్వరూపులనెడి గురుపరంపర ఇందు వినబడుచున్నది. ఇందలి విశ్వరూపునికే వార్తికకారుడు, సురేశ్వరాచార్యుడు అనికూడా పేర్లు.

ఇందు నారాయణుడు ఆద్యోపదేశికుడుగా వర్ణింపబడినాడు. రెండవవాడు ఆయన నాభికమలమునందు పుట్టినాడనెడి బ్రహ్మ. నారాయణనామమే వేదములందు అగపడుటలేదు. విశ్వకర్మ నామము సమస్త-సంహితా, బ్రాహ్మణారణ్యకోపనిషత్తులయందును ప్రసిద్ధము. అంతేకాక, విష్ణునకుకూడ విశ్వకర్మయే జనకుడని మనము వేదాదుల సాక్ష్యమును చూచియున్నాము. (114-118 పుటలు) వసురుద్రాదిత్యులు, ఎల్లదేవతలు విశ్వకర్మనుండి కలిగినవారే అని

"శ్వేతాశ్వతర సమన్వయము" అనెడి ప్రకరణమున మనము చదివియున్నాము. కావున ఆద్యబ్రహ్మవిద్యోపదేష్ట విశ్వకర్మయే. నారాయణ, బ్రహ్మాదులు తరువాతివారే. అదీ కాక "నారాయణం పద్మభువం వసిష్ఠం" అనెడి శ్లోకములు శంకరుల కాలమున వెలువడినట్టివికాని, శ్రుతి ప్రమాణములు కావు. అన్నిటికిని మొదటి ప్రమాణము శ్రుతికాని, ఇంకొకటి కాదు. అది త్రోసిపుచ్చరాని పరమప్రమాణము. అందుకే "దేవీం వాచ మజయన్త దేవాః" వాగ్వై గాయత్రీ" వేదము దైవసంబంధమనియు, గాయత్రీ స్వరూపమనియు, అన్నది ఋక్కు. ఇట్టి విశ్వకర్మయే ఆదిమ జగద్గురుడు. ద్వాపరమున జగద్గురుడుగా ఎన్నబడినవాడు శ్రీకృష్ణపరమాత్మ. అందుకే ఆయనను—

"కృష్ణం వన్దే జగద్గురుం"

అన్నారు. ఆయన గీతలో 10, 11 అధ్యాయములలో తన జగద్విభూతులను చెప్పి, 13వ అధ్యాయమున 1, 2 శ్లోకములలో ఇట్లన్నాడు.

"ఇదం శరీరం కౌంతేయ, క్షేత్ర మి త్యభిధీయతే,
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః." 1.

"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి, సర్వక్షేత్రేషు భారత,
క్షేత్ర క్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ." 2.

తా. ఈ శరీరమునకు క్షేత్రమని పేరు. ఇందుండి, దీనిని తెలిసికొనువాడే క్షేత్రజ్ఞుడు (జీవుడు). ఎల్ల శరీరములందుకల క్షేత్రజ్ఞుని నన్నుగానే ఎఱుంగుము. ఈ క్షేత్ర, క్షేత్రజ్ఞుల పరిజ్ఞానమే నిజమైన పరమార్థ జ్ఞానము ఇట్లనుటచేత జీవేశ్వరులకు అభేదము సిద్ధించి "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి" అనెడి మహావాక్యములు సార్థకములగుచున్నవి. గీత, ఉపనిషత్తులు చెప్పిన ఈ పరమజ్ఞానమునే మొట్టమొదట విశ్వకర్మ సూక్తమునందు "య ఇమా....స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదో వర ఆవివేశ," ఆ విశ్వకర్మ పరమాత్మయే శరీర సృష్టిచేసి, అందు జీవుడై ప్రవేశించినాడని చెప్పబడినది. ఇదే గీతలో "శరీరములందుగల క్షేత్రజ్ఞడను నేనే" అని వాక్రువ్వబడినది. దీనినే అనుప్రవేశ సిద్ధాంతమని ఉపనిషత్తులు వచించినవి. ఈసిద్ధాంతము మొట్టమొదట విశ్వకర్మ సూక్తమునందే చెప్పబడినందున, అందే అద్వైత సిద్ధాంతము కలదని మనము చెప్పికొన్నాము. భగవానుడు (శ్రీకృష్ణుడు) కూడ ఈ పరమరహస్యము నెఱింగియే, 15వ అధ్యాయములో "వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః, వేదాంతకృ ద్వేద విదేవ చాహమ్" అన్ని వేదములచేతను నేనే ఎఱుగదగిన పరమార్థము ననియు, ఆ వేదాంతమును లోకమునకు తెలిపిన వేదవిజ్ఞానిని తానే అనియు అన్నాడు. కావున భగవానుడు చెప్పిన వేదవిజ్ఞానము విశ్వకర్మ సూక్తములోని సారమే అన్నమాట. అందుకే ఆయన లీలామానుషవిగ్రహుడైన

సాక్షాత్తు విశ్వకర్మ (విష్ణు) పరమాత్మయే అయి "కృష్ణం వందే జగద్గురుం" అని లోకుల నమస్కృతులను అందుకొన్నాడు. భగవానుడు చెప్పినట్లు మానవులు ఎఱుంగదగినది క్షేత్ర, క్షేత్రజ్ఞులయొక్క పరిపూర్ణమైన జ్ఞానము మాత్రమే. తక్కినవి ఎన్ని ఎఱింగినను, మానవునికి భయసందేహములు తీరి, అమృతుడు కాడు. ఇంకను గీతలో-

"ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయం,
వివస్వా న్మనవే ప్రాహ,మను రిక్ష్వాకవేఽబ్రవీత్." 4-1.

ఏవం పరంపరా ప్రాప్త, మిమం రాజర్షయో విదుః,
స కాలేనేహ మహతా, యోగో నష్టః పరంతప! 4-2.

స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః" 4-3.

తా. అవ్యయమైన యీ యోగమును నే నేనాఁడో వివస్వంతునికి చెప్పినాను. ఆతడు మనువునకు, మనువు ఇక్ష్వాకునకు ఉపదేశించినాడు. ఇట్లు రాజర్షులద్వారా ఇది లోకమున వ్యాపించినది. కాలక్రమమున అది నశింపగా, దానినే మఱల నేను నీకిప్పుడు ఉపదేశించినాను. ఇట్లనుటచే విశ్వకర్మ సూక్తప్రోక్త అద్వైతయోగమునే భగవానుడు అర్జునునకుపదేశించినాడన్నమాట. దీనినిబట్టి విష్ణు విశ్వకర్మ లొక్కరే కాన, ఆ తొలి జగద్గురువే ద్వాపరమున కృష్ణుడుగా

లోచించి, కడకు మోక్షసూక్తముతో ముక్తుడగుట మానవుని లక్ష్యము కావలయును. ఇట్టితటి విశ్వకర్మసూక్త వివరణ సందర్భమున నాసదీయాది సూక్తముల హృదయమును గూడ తెలిసికొనుట సముచితముగా నుండును. ఈ నాసదీయ సూక్తము సృష్టికి పూర్వము-బ్రహ్మ విష్ణ్వాది దేవతలు కాని, పంచభూతములు కాని, ఏవీ లేవని చెప్పుచున్నది. అంతేకాదు. వీటన్నింటికి మూలమైన సత్తుకాని అసత్తుకాని లేని, కాని- ఒకానొక అనిర్వచనీయ స్థితియే అది అనుట నాసదీయసూక్త హృదయము. దీనిని స్వానుభవపరులు లెస్సగా గ్రహింతురు. కాన వారే వివరించుటకు సమర్థులు.

నాసదీయ సూక్తము చెప్పిన ప్రకారము సృష్టికి పూర్వకాలపు స్థితి, లేదా ప్రళయానంతరస్థితి సత్తుకు అసత్తుకు అతీతమైనదన్నమాట. అనగా అప్పుడున్న పదార్థము సత్తును కాని, అసత్తునుగాని తననుండి సృష్టించుటకు- ఆవిష్కరించుటకు వీలైనదని భావించుట సమంజసము. అట్లు భావించుట వలన అది సత్తు, అసత్తు- అనెడి లక్షణములుకల జగత్తునకు మూలకారణమగుటకు వీలు కలుగును. అంతేకాక, సదసద్విభాగము ఏర్పడిన పిదప సత్తునుండి అసత్తుకాని, అసత్తునుండి సత్తుకాని వ్యక్తమగుటకు కూడ వీలు కలుగును. ఇక్కడ పుట్టుట అనునది లేనేలేదు. దానిని వ్యక్తమగుట, లేక తోచుట అనెడిపదములతోనే మనము వ్యవహరించుకొందము. పుట్టుట అని వాడబడినను దానికి వ్యక్తమగుటయే అని భావము.

సృష్టి రహస్యమును విచారించి చూచినచో, అసత్తు అయిన ప్రకృతినుండి సదాత్మకములయినవి పుట్టుచుండుట కాంచుచున్నాము. ఈ అంశమునే తైత్తిరీయోపనిషత్తు "అస ద్వా ఇద మగ్ర ఆసీత్, తతో వై స ద జాయత" మొదట ఇది అంతయు అసత్తుగానే ఉన్నదనియు, దాని నుండియే సత్తు కలిగినదనియు చెప్పినది. "అన్నా ద్వై ప్రజాః ప్రజాయన్తే" "అన్నా త్పురుషః" అనెడి వాక్యములుకూడ అసద్వస్తువునుండి- అనగా జడమునుండియే సద్రూపములు (చేతనములు) వెలువడినట్లు చెప్పుచున్నవి. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయం" అనెడి వాక్యములు సద స ద్రూపవస్తువునుండియే సత్తు పుట్టుటను వ్యక్తీకరించుచున్నవి. భగవద్గీతకూడ నాసదీయ సూక్త మార్గమునే అనుసరించి జ్ఞేయ వస్తువును "న స త్త న్నాస దుచ్యతే" (13వ అధ్యాయం) అది సత్తనికాని, అసత్తనికాని చెప్పవీలుకాదన్నది. కనుక సత్తు, అసత్తు అని చెప్పవీలుకాని (అనిర్వచనీయము) దానినుండి - సత్తు, బ్రహ్మము, ఆత్మ, పురుషుడు, విశ్వ కర్మ - ఇత్యాది పదములచే పేర్కొనబడిన సద్వస్తువు తోచెనని తెలియుచున్నది. మఱల ఆ సదాత్మ నుండియే ఆకాశాది జడజాతము పుట్టినది. ఈ అంశమునే తైత్తిరీయో పనిషత్తు "ఆత్మన ఆకాశ స్సంభూతః...." ఇత్యాదిగా మొదలిడి "పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోఽన్నం, అన్నా త్పురుషః" అని చెప్పినది. ఇక్కడ పురుషశబ్దముచే చెప్పబడినది

శరీరముతో కూడిన జీవుడన్నమాట. ఈ వర్ణన, వివరణలు మదీయశిల్పదర్శనమునసవిశేషముగాకాంచవచ్చును ఈస్థితినే చిజ్జడముల సమ్మేళనముగా పేర్కొనవలసియున్నది. దీనినే "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య" సద్వస్తువు కలదని మంత్రములు పేర్కొన్నవి.

కాగా జీవోత్పత్తి అనునది అహరాగమము (పగలు) వంటిది అన్నమాట. ఇదే వ్యక్తస్థితి; బ్రహ్మముయొక్క ప్రతిభాసము తోచినదశ. తొలుత చెప్పికొన్న "నా సదాసీ న్నో సదాసీత్" అన్నట్టిది రాత్ర్యాగమము. ప్రళయా నంతర స్థితి. దీనినే అవ్యక్తదశ అన్నది గీత.

"అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః, ప్రభవ న్త్యహరాగమే,
రాత్ర్యాగమేప్రలీయన్తేతత్రైవావ్యక్త సంజ్ఞకే."8.18

తా. పగలు ప్రారంభకాగానే అవ్యక్తమగు దాని నుండి ఆకాశాదులు, జీవులు అనెడి వ్యక్తులు తోచుచుందురు. రాత్రి రాగనే అవి అన్నియు ఆ అవ్యక్తములో కలసిపోవు చుండును. కాగా, ఇప్పుడు చూడుడు. జాగ్రద్దశ (పగలు) సృష్టి, స్థితులు, సదసత్తులు వ్యక్తమైన స్థితి. స్వప్నసుషుప్తులు నిద్రాదశ (రాత్రి). అది ప్రళయమునకు సంకేతము. ఆదశలో సదసత్తులు నిద్రావస్థలో ఉండునన్నమాట. కేవల సన్మాత్ర దశ సమాధిస్థితి. దీనినే తురీయ మనవలెను. ఇక అవ్వలిది "నా సదాసీ న్నో సదాసీత్" అన్నట్టి తురీయాతీతస్థితి. కాగా ఇప్పుడు- మొదటిదైన సృష్టి(జాగ్రత్తు)నుండి, రెండు మూడు

అయిన స్వప్నసుషుప్తులు (ప్రళయము) అనెడి లయ దశకు పోయి, ఆవల నాల్గవదైన సమాధిస్థితినుండి, తురీయాతీత స్థితికి పోవుట పరమార్థము. దీనినే విశ్వకర్మ సూక్తము "న తం విదాథ య ఇదం జజాన" ఈ జగత్కారణ రహస్యమును మానవు లెఱుంగకున్నారు-అన్నది. విశ్వకర్మ నెఱుంగుట అనగా పిండ, బ్రహ్మాండములయందు జరిగెడి సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహములను, జాగ్రత్స్వప్న, సుషుప్తి, తురీయ, తురీయాతీతములను ఎఱుంగుటయే. విశ్వమునందు జరుగు విశ్వకర్మలు అన్నియు ఈ అయిదింటి లోనే ఇమిడి యున్నవి. కనుక విశ్వకర్మ జ్ఞానమనగా-విశ్వ, విశ్వకారణ, విశ్వరూప పరిజ్ఞానమేకాని, ఇతరము కాదు. దాని నెఱింగిననేకాని, అమృతత్వము సిద్ధింపదని పురుష సూక్తము "త మేవం విద్వా నమృత ఇహ భవతి" అని గంటకొట్టినట్లు చెప్పినది. నాసదీయ, విశ్వకర్మ, పురుష సూక్తములలో ప్రారంభమయిన సృష్టి విధానము మఱల ఆ సృష్టికారణ వస్తువును చేరిననేకాని పరిసమాప్తము కాదు. మానవజీవి సాధింపవలసిన ప్రగతి, ఉద్గతి, ఊర్ధ్వప్రయాణము ఇదియే. దీనినే "త ద్విష్ణోః పరమం పదం, సదా పశ్యన్తి సూరయః" (ఋ. 1-22-20) ఆ జగత్కారణవస్తు రహస్యమును పండితులు ఎల్లప్పుడు లక్ష్యముగా దర్శించు చున్నారు- అని ఒక విష్ణుమంత్రమన్నది. ఈ రహస్యమునే-సృష్టిసూక్త, విశ్వకర్మ, పురుష, మోక్షసూక్త మంత్రములును చాటుచున్నవి.

ఏ పరమ కారణమునుండి జీవునిరాక ప్రారంభమయి నదో, మఱల ఆ పరమకారణమును చేరుకొన్ననాడే దానికి పరిసమాప్తి. అంతవఱకు చేయు ప్రయాణమే సంసారము, లేక భవము-దీనినే భవాబ్ధి,సంసారచక్రముఅని వర్ణించినారు కఠవల్లి "సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్." (1-3-9) దీని నెఱింగిన విజ్ఞుడుమాత్రమే మార్గ మునకు చివరనున్న గమ్యమును చేరుచున్నాడన్నది. దీనినే "సదా పశ్యన్తి సూరయః" అని ఋఙ్మంత్రముకూడ చెప్పినది. గీతయేమో—

"మా ముపేత్య పునర్జన్మ, దుఃఖాలయ మశాశ్వతం,
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః"
— 8-15

తా. జగత్కారణ పరమాత్మనైన నన్ను చేరిన మహనీయులు దుఃఖ నివాసమైన సంసారమున తిరుగరు-అన్నది. కఠవల్లిలోని "సోఽధ్వనః పారమా ప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" అన్నవాక్యమున కీ గీతా శ్లోకము ప్రతి ధ్వనియే. "త మేవం విద్వా నమృత ఇహ భవతి" అన్న వాక్యము కూడ ఇట్టిదే. ఇంతకూ తేలిన సారాంశము జనుడు తానెద్దానినుండి వచ్చెనో, అట్టి దాని నెఱింగి తద్రూపుడు కావలసియున్నాడు. ఇట్టి జ్ఞానము కలుగనిదే అతని భయసందేహములు తీరవు. అవి తీరనంతవఱకు శాంతిసుఖా నందములు కలుగవు. అందుకే వేదమును చదువవలెను. అర్థము నెఱింగి అనుష్ఠించవలెను. గమ్యమును చేరవలెను.

ఈ సందర్భమున ఇంకొక విషయముకూడ ఆలోచింప వలసియున్నది. సదసదతీత వస్తువుమీద జగత్తు త్రాటిమీద పామువలె తోచుచున్నదా? లేక, అది పరిణామవిధి ననుసరించి ఆకాశాది భూత భౌతిక వస్తువులుగా మారుచున్నదా, అనునదే ఆ విషయము. జగన్మాయావాదులు రజ్జుసర్పభ్రాంతిని ఉదాహరణముగాచెప్పి బ్రహ్మము జగత్తుగా తోచుచున్నదనుచున్నారు. వారి దృష్టినిబట్టి "బ్రహ్మ సత్యం జగన్మిథ్య" కావలసియున్నది. దివ్య పరిణామవాదులైన అరవిందులు జగము మిథ్యకాదనీ, మూల పదార్థము సర్వశక్తులు కలది కనుక, అది పరిణామము చెందినను, దానికి కలిగెడి నష్టమేదియు లేదనుచున్నారు. అనేకులు పరిణామ సిద్ధాంతమునే అనుసరించుచున్నారు. భౌతిక వాదులుకాని, హేతువాదులుకాని పరిణామ వాదమునే అనుసరింతురు. జగత్తు సత్యమేకాని, అసత్య మెన్నటికీ కాదనుట వారికి ఇష్టము. అనగా జగమునకు ఉపాదాన కారణములైన పంచభూతములుకాని, వాటినుండి కలిగిన పదార్థములుకాని ఎప్పటికీ నశించక జగత్క్రీడను నడుపుచునే ఉండుననుట వారి సిద్ధాంతము. ఈ అంశమును వారు శాస్త్రీయముగాను, ప్రయోగ పూర్వకముగాను, అనుభవ సహితముగాను నిరూపింపగలరు.

ఈ రెండువాదముల కనటుంచి వివర్త సిద్ధాంతాను

సారము జగద్వైచిత్రిని ఇంకొక రీతిగా నిరూపించుట కొందఱు తాత్త్వికులకు ఇష్టము. ఇష్టమే కాదు. వారి అనుభూతి అట్టిది. జగత్తు మూలపదార్థముయొక్క వివర్తము అనుటకు వారు చెప్పురీతి ఇది. మూలవస్తువు పరిణమించినను, ఆ పరిణత వస్తువు తాను కాకుండ పోలేదు. పరిణామమునకు ముందును, పరిణమించిన తరువాతనుకూడ ఆ రెంటియందును మూలవస్తువే ఉండునుగాని, వేఱొకటి ఉండదు. మనకంటికి అగపడునప్పుడు రూపాంతరము తోచినను, ఆ రూపాంతరము మూలవస్తువుదే కాని, వేఱొకదానిది కాదు. తాను తానుగా ఉండియే అది మార్పులను చూపుచున్నది. దీనికి సువర్ణ భూషణ న్యాయమే దృష్టాంతము. బంగారము బంగారముగానుండియే నానావికారములు గలనగల రూపముల నందునట్లు, ఇనుము ఇనుముగానుండియే పలు వస్తువులుగా రూపొందునట్లు, మట్టి మట్టిగానుండియే కుండ, చట్టి, బాన, ప్రమిద, మూకుడు - మొదలగునవి అగునట్లు జగత్కారణ వస్తువుగూడ తాను తానుగా నుండియే ఆకాశాది రూపములను తాల్చుచున్నది. "గరిమన్ స్వర్ణ మనేక భూషణములై కన్పట్టు చందంబునన్, పరమాత్ముం డఖిల ప్రపంచమయుడై భాసిల్లు" అని దీనిని గ్రహింపవలసియున్నది.-బంగారము బంగారముగా తోచుట సామాన్యము. అది తన అస్తిత్వమును కోల్పోకయే నానాభూషణ విశేషములుగా తయారగుచున్నది. ఈ విశేషాకారదర్శనమే విశేషముగా కన్పట్టుచున్న వివర్తము. అనగా సామాన్యము విశే

షముగా నగుట వివర్తమని భావము. "విశేషేణ వర్తత ఇతి వివర్తః."

అంతేకాదు. అది విపరీతముగాగూడ కాగలదు. బ్రహ్మవస్తువు- జగత్కారణ పదార్థము సత్తు, చిత్తు, ఆనందము స్వరూపముగాగలది. అది అసత్తు, జడము, దుఃఖము అయిన జగత్తుగా తోచుచున్నది. సత్తునకు విపరీతమైనది అసత్తు. చిత్తునకు విపరీతము జడము. ఆనందమునకు విపరీతము దుఃఖము. కనుక బ్రహ్మము విశేషముగానే కాక, విపరీతముగా కూడ అనుభవింపబడు చున్నందున, విపరీతముగా వర్తించి వివర్తవాద సిద్ధాంతమునకు బలము చిక్కుచున్నది. (విపరీతేన వర్తత ఇతి వివర్తః) మూలవస్తువు విశేషముగా తోచినను, విపరీతముగా తోచినను, అది మూలవస్తువే. దాని స్వధర్మము నది వీడలేదు. అందుకే దానిని సత్తనియేకాని, అసత్తనియేకాని వచింప వీలుకాదని నాసదీయ సూక్తమన్నది. అన్ని దశలలోను నగలయందు బంగరమే ఉన్నదికాని, వేఱొకటేదియు లేదు. ఈ రహస్యమునే "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అనెడి మంత్ర పుష్పాదుల వాక్యములు నిరూపించుచున్నవి. కనుక ఈశ్వరునియొక్క సర్వవ్యాపకత్వమునకు, సర్వజ్ఞత్వమునకు భంగము వాటిల్లదు.

ఉపనిషద్రాజమగు ఛాందోగ్యము ఈ విషయమును "యథాసోమ్యైకేన మృత్పిండేన సర్వంమృన్మయం విజ్ఞాతం

స్యాత్, వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం," (6-14) కుండకు కలిగిన నామరూపములు శాశ్వతము కావనియు, ఆ కుండకు కారణమైన మట్టియే సత్యమనియు చెప్పినది. ఇంకను "స య ఏషోఽణిమా ఏతదాత్మ్యం, ఇదం సర్వం. తత్సత్యం. స ఆత్మా. తత్త్వమసి శ్వేతకేతో" (6-8-7) ఓ శ్వేతకేతూ! ఆ జగత్కారణతత్త్వము అణుస్వరూపమయ్యా! ఇది అంతయు అదియే. అదే సత్యము. అదే ఆత్మ. అట్టి ఆత్మవు నీవే సుమా! అనికూడ ఉపదేశించినది.

బంగారము బంగారముగానే ఉన్నప్పుడు వాడుకకు పనికిరాదు. నగగా మారినప్పుడు దానిని ధరించవచ్చును. సత్తు సత్తుగానే ఉన్నచో దానివలన జగము పుట్టదు. అది అసద్వస్తు సంయోగమువలననే జగముగా నగుచున్నది. అప్పుడే దానికి అనుభవయోగ్యదశ కలుగుచున్నది. సృష్టి లేనిది జీవులుకాని, లోకములుకాని, భోగములుకాని లేనే లేవు కదా. ఈ జగత్క్రీడా విలాసమునే గీత --

"అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిం,
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ." 9-21

అవ్యక్తము రెండు విధములు. ఒకటి జగత్తులకు మూలభూతమైన మూలప్రకృతి. ఇది పరిణమించునదని సాంఖ్యమనుచున్నది. బ్రహ్మవాదుల మతముకూడ ఇదే. వారి దృష్టిలో మఱొక అవ్యక్తము అక్షరాత్మక పర

బ్రహ్మమే. అదే ప్రకృత్యాదులకుగూడ పరమగతి యైనది. దీనిని బ్రహ్మశక్తి అనుట బ్రహ్మవాదుల కిష్టము. ఇది తనలో సకలమును లీనము చేసికొనగలదు. ఆవిష్కరింపనూగలదు. దానినే ఈ శ్లోకము సర్వులు పొందదగిన పరమగతి అని చెప్పినది. దానిని పొందినవారు తిరిగి రాడనికూడ శ్లోక మనుచున్నదికదా. ఈ అవ్యక్తమునే నాసదీయ సూక్తము మొదటి జగత్కారణముగా వచించినది.

కేనోపనిషత్తు ఈ జగత్కారణమును ఇంక సుందరముగా చెప్పినది—

"కేనేషితం పతతి ప్రేషితం మనః ?
కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః ?
కేనేషితాం వాచ మిమాం వదన్తి ?
చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి ? 1.

తా. గురువర్యా ! జీవులలోని మనస్సు దేనిచేత ప్రేరేపింపబడి సంకల్ప వికల్ప రాగద్వేషాదులను చేయుచున్నది ? దేనితోగూడినదై ప్రాణము చలించుచున్నది ? జీవులు దేని ప్రేరణచేత వాక్కుతో మాటాడగలుగుచున్నారు? కంటిని చూచునట్లును, చెవిని వినునట్లును ఏ దేవుడు నియోగించుచున్నాడు ? అని ప్రశ్నింపగా గురువుల సమాధానమిది-

"శ్రోత్రస్య శ్రోత్రం, మనసో మనో
యద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య

ప్రాణశ్చక్షుష శ్చక్షు రతిముచ్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి." 2.

తా. చెవులకెల్లా చెవీ, మనస్సులకెల్లా మనస్సు, వాక్కులకెల్లా వాక్కు, ప్రాణములకన్నిటికీ ప్రాణము, కన్నులకెల్లా కన్ను అయినట్టి తత్వమొకటి దేహమున కలదు. దాని ఉనికిచేతనే ఈ మనో వాక్ప్రాణ చక్షుః శ్రోత్రాదులు తమ తమ పనులను చేయజాలుచున్నవి. అదే ఆత్మ. ఈ రహస్యము నెఱింగి సాక్షాత్కరించుకొన్న ధీరులు అమృతులు కాగలరు. కనుక పరమాత్మతత్వ మనుదానిని గుర్తించుట కష్టమేమీ కాదు. శ్రవణ మనన నిదిధ్యాసలు చేసినచో అది సుగమము కాగలదు. ఈ విధమైన మనోహర భావములతో ఈశ్వరతత్వము ఇందు వర్ణింపబడినది.

ఇక్కడ వాడబడిన-బ్రహ్మము, ఆత్మ, చిత్తమొదలైన పదములు ఉపనిషత్పరిభాషకు సంబంధించినట్టివి. వేదము వీటికి పర్యాయముగా విష్ణు, రుద్ర, పురుష, విశ్వకర్మ, హిరణ్యగర్భాదిపదములను వాడి సూక్తములను వెలువరించినది. మనము సదాదిపదములకు పురుషవిధత్వమునారోపించి వర్ణనలు సాగించినాము. కాని దార్శనికమైన-శాస్త్రీయమైన దృష్టితో చూచినప్పుడు అవి విశ్వములోని ఆ యా కార్య కారణ స్వరూపములే కాని, భిన్నములు కావు.

విష్ణువనగనే మనకొక రూపము తోచునేకాని, అది ఒకానొక పనిచేయుశక్తి, లేక వస్తువని స్ఫురింపదు.

ఇందుకు కారణము వారినికూడ మనము మనవంటి వారినే చేసి ఆలుబిడ్డల నంటగట్టి సంసారులను చేయుటయే. ఈపని పురాణవాఙ్మయమున ఎక్కువగా జరిగినది. వీటి ఆధారముతోనే వేదమునకు అర్థవివరణ చేసినవారు శ్రమించిరి. నామ రూపములకు ప్రాధాన్యము నీయక, అవి సంకేతములని యెఱింగి దార్శనిక దృష్టితో, కార్యకారణ భావమునుబట్టి మంత్రములకు వ్యాఖ్యాన మొనర్చుటకు యత్నము సాగవలసి యున్నది. అట్టి ప్రయత్నమే ఇప్పుడీ గ్రంథకర్త చేయుచున్నది. ఈ ప్రయత్నములో ఎన్నెన్నో సత్యములు బయలుపడగలవని గుర్తించవలయును.

"బ్రహ్మ సత్యం జగన్మిథ్య" అనువారు బ్రహ్మమును, జగత్తును రజ్జు సర్పములతో పోల్చి అజ్ఞానమువలన త్రాటి యందు పాము తోచినట్లు, బ్రహ్మమునందు జగము తోచుచున్నదని ఉదాహరణము నిత్తురు. కాని జ్ఞానము కలిగినప్పుడు సర్పభ్రాంతిపోగా, త్రాడే మిగులుచున్నది. ఇక ఆ త్రాటిమీద పాము తోచనే తోచదు. కాని, ఇక్కడ బ్రహ్మజ్ఞానము కలిగిన వానికి, జగము బ్రహ్మమని తెలిసిన తర్వాత, జగత్తు కనబడకుండ పోవుటలేదు. జగము జగముగానే ఉండి వ్యవహారము కొనసాగుచున్నది సువర్ణభూషణ న్యాయమును ఆధారముగా చేసికొని జగత్తు భూషణము వంటిది, బ్రహ్మము బంగారువంటివాడు అని చెప్పకొన్నచో, సువర్ణ జ్ఞానము కలిగినను, భూషణము నాశమగుటలేదు.

వ్యవహారము కొనసాగవచ్చును. నగ నగగా కనబడినను, అది బంగారమే కాన, వ్యవహారలోపము జరుగకున్నను సరి పోవును. కనుక రజ్జుసర్పభ్రాంతి అను నుదాహరణములో నున్న దోషము సువర్ణభూషణన్యాయ సందర్భమున కలుగ నేరదు. వివర్తవాదమునకుభంగమునురాదు. కనుక బ్రహ్మము నందు విశేషముగాను, విపరీతముగాను తోచుశక్తి కలదని చెప్పికొనుటలో సర్వదోషములు తొలగుటయేకాక, ప్రయో జనములుకూడ కలుగుచున్నవి. బ్రహ్మజ్ఞానము, లేక, బ్రహ్మ సాక్షాత్కారము కలిగిన సిద్ధునికి, జగము జగముగానే అగపడినను, అది బ్రహ్మమే కాని, దానికి భిన్నము కాదు. జగము నశింపకున్నందున, దానిని ఆతడు బ్రహ్మమయము గానే యెంచి ఆరాధించుచు, జగద్వ్యవహారమును కొనసాగిం చుచు లోకోపకారము చేయుచు అమృతుడు కావచ్చును.

## సగుణ బ్రహ్మము

మనవారు సగుణ బ్రహ్మారాధకులు. సగుణ మెప్పు డును ఒకానొక సంకేతమేగాని, యథార్థముకాదు. విశ్వ కర్మకు ఐదు మోములు అన్నచో, వాటివలన పంచభూత ములు, పంచ బ్రహ్మలు, పంచ క్రియలు — మొదలగునవి తోచవలయునేకాని, ఐదు తలలుగల ఒక దేవతకాదు. ఆసాకార దేవత మందబుద్ధుల ఆరాధనార్థమే కాని, సత్య ప్రకటనమునకు కాదు. ఈ రహస్యమునే క్రింది తంత్రవాక్య ములు నుడువుచున్నవి.

"చిన్మయ స్యాద్వితీయస్య, నిష్కలస్యాశరీరిణః,
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"
"సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా."
— కులార్ణవ తంత్రము.

జ్ఞానమే స్వరూపముగా గలవాడును, ఏ అవయవ ములు, శరీరము లేనివాడును, అద్వితీయుడును అగు పర బ్రహ్మమునకు రూపమును కల్పించుట ఉపాసకుల ప్రయో జనము కోసమే కాని, యథార్థమునకు కాదు. సాధకుల మేలు కోసమే నిర్గుణ నిరాకార బ్రహ్మమునకు నానా రూపములను కల్పించుచున్నారు. అని శ్లోకవాక్యముల భావము. దీనిని బట్టి నిర్గుణము, నిరాకారము అయిన జగత్కారణ వస్తువు నకు కరచరణాదులతో గూడిన రూపకల్పన సాధకుల సౌక ర్యార్థమే కాని, సత్యమును చెప్పుటకు కాదని స్పష్టమగు చున్నది కదా.

సర్వ పరిపూర్ణమును, సర్వ కారణమును అయిన ఆదిమ తత్త్వము సర్వాతీతమయ్యును, సర్వమును తనలో ఇముడ్చుకొను శక్తి గలిగినట్టిదే కాని, సామాన్యమైనది కాదు. దానికి సామాన్య విశేషములు, సదసత్తులు - మొదలగు ద్వంద్వములతో సంబంధము లేదు. అది సర్వమును అంత ర్భుక్తము చేసికొన్న అద్వితీయఅనిర్వచనీయ నిరంజనమైనది. అది సదసత్తులకు అతీతము కావున, ద్వైతాద్వైతాది భేద ములకుగూడ తావీయని సర్వ పరిపూర్ణము. ఈ అంశమునే

ఒకానొక శివాగమము ఇట్లు చెప్పినది.

"అద్వైతం కేచి దిచ్ఛన్తి, ద్వైత మిచ్ఛన్తి కే చన
మమ తత్త్వం న జానన్తి, ద్వైతాద్వైత వివర్జితమ్."

ఇది పార్వతితో శివుడు పలికినపలుకు. ఓ పార్వతీ! కొందఱు ద్వైత సిద్ధాంతములను, మఱికొందఱేమో అద్వైతమును ప్రతిపాదించుచుందురు. కాని ఆరెండు తెగలవారు కూడ ద్వైతాద్వైతములనెడి ద్వంద్వముల (జంటల) గంధము (వాసన) లేని పరమ మూల పరిపూర్ణతత్త్వము నెఱుంగరు. కనుక పరిపూర్ణము, అచలము, నిర్గుణము అయిన మూల తత్త్వమును నాసదీయసూక్తమూ, విశ్వకర్మ, పురుష సూక్తములు లెస్సగానే వర్ణించినవి. వాటిని తఱచి తఱచి, వాటి తత్త్వము నెఱుంగుటకు సాధకులు సర్వదా కృషి చేయుచుండవలసినదే. ఎవరో చేసినదానిని గ్రహించి, ఇంకను ఇంకను, తపస్సుచేసి అన్వేషణ కొనసాగింపవలసినదే!

## పరమోపాసన

ఇచ్చట మఱొక రహస్యము చెప్పదగినది కలదు. సాధకులు సామాన్యముగా దేవతామంత్రములను జపించు చుందురు. "ఓం నమశ్శివాయ, ఓం నమో నారాయణాయ, ఓం నమో విశ్వకర్మణే" ఈ మొదలైన (సప్తకోటి) మహా మంత్రములను జపించు వారెవ్వరైనను సరియే, వారికి 'ఓం నమశ్శివాయ', అనగా ఒక్క శివుడుమాత్రమే గోచరింప రాదు. అట్లే ఓం నమో విశ్వకర్మణే, అనగానే ఒక్క విశ్వ

కర్మ మాత్రమే స్ఫురింపరాదు. ఏ నామమును ఉచ్చరించి నను, ఏ నామము మనస్సున తోచినను సర్వదేవతలు, శక్తులు తోచవలయును. శివాది దేవతలందరూ సర్వ దేవతా మయులే. సర్వబ్రహ్మాండములు వారి స్వరూపములే. కనుక శివ విష్ణు విశ్వకర్మాది పదములలో ఏ పదముచే నైనను జగత్కారణ పరబ్రహ్మమే, జపించు వారికి బుద్ధి గోచరము కావలయును. అంతియే కాదు. చైతన్యయుక్తుడైన దేవుడే కాక, సమస్త జగద్రూపము - విశ్వరూపముకూడ వారికి తోచిననాడే వారి మంత్రమునకు సార్థకత, పరిపూర్ణత చేకూరినట్లు. నారాయణ అన్నప్పుడు విష్ణువు మాత్రమే గోచరించి శివుడాతనికి భిన్నుడని తోచినను, 'శివ' అన్న ప్పుడు శివుడు మాత్రమే తోచి, విష్ణ్వాదులు వానికి భిన్నులని తోచినను, జగము ఆ శివవిష్ణ్వాదులకంటె వేఱని తోచినను, అది సమగ్రమైన మంత్రజపము కానట్లే లెక్క. ఏ నామో చ్చారణము జరిగినను దృశ్యమానమైన విశ్వమంతయును, దానికి కారణమైన పరమాత్మ తత్వమునూ స్ఫురించిననాడే వారి జపము సర్వసంపూర్ణమైనట్లు; సర్వేశ్వరుడైన విశ్వ రూపుని- విరాడ్రూపుని ఆరాధించినట్లు. చరాచరాత్మక పరమాత్మను దర్శించినట్లు లెక్క! అయితే ఇట్టి విశాల విశ్వమును ఒక్కమాటలో ఇముడ్చుకొన్న మంత్రజపము సాధ్యమా? అని పాఠకులు భావింపవచ్చును. ఏల కాదు? ఊది తప్పక సాధ్యమే అని సమదృష్టి, సమగ్రతగల పండి తుల అనుభవములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఈ రీతిగా

మంత్రజపమున్ను చేసి కృతార్థులైన వారెందరో కలరు. అసలు ఇట్టి కృత్స్నదృష్టి, సమ్యగ్భావన కలుగనిదే విశ్వరూప సాక్షాత్కారముకాని, విశ్వపురుష దర్శనముకాని కలిగినట్లు కాదు. ఇట్టి సమగ్రోపాసనా విధానమును బోధించుటకే "సర్వం ఖల్విదం బ్రహ్మ, ఏకం సత్, బ్రహ్మైవేదం విశ్వం" ఇత్యాది మహావాక్యములు బయలుదేరినవి. శంకరులు, బ్రహ్మంగారు మొదలైన మహాయోగులు దీనిని ప్రచారమొనర్చుటకే అవతరించినారని గ్రహింపవలెను.

"ఏకం స ద్విప్రా బహుధా వదన్తి" "యో దేవానాం నామధా ఏక ఏవ" అనెడి మన ఋగ్వేద మంత్రములు ఈ రహస్యమును చాటుటకే బయలుదేరినవి. ఆ రహస్యములను ప్రచారము చేయుటకే మన ఋగ్యజుర్వేదాది దర్శనములు బయలుదేరుచున్నవి. వ్యష్టిజగత్తును సమష్టిలోనికి నడిపి "యత్ర విశ్వం భవ త్యేక నీడమ్" విశ్వము నంతటిని ఒక్క గూటిల్లోనికి ఆహ్వానించుటకే మన ప్రయత్నము! ఈ ప్రయత్నములో గాయత్రినిగూర్చియు, ఆమెకు విశ్వకర్మేశ్వరునితోగల సమానత్వమును గూర్చియుకూడ యజుర్వేదమేమనుచున్నదో పరిశీలింతము.

## గాయత్రి

దార్శనిక దృష్టితో జగత్తునకు కారణమైన తత్త్వములను ప్రకృతి అనియు, పురుషుడనియు వేదాదులు వక్కాణించినవి. ఈ ప్రకృతినే మాయ,మూల ప్రకృతి, అవ్యక్తము-

అనికూడ అన్నారు. ఇక పురుషునిగూర్చి- పరమాత్మ, పర బ్రహ్మము, తత్ప్రతిబింబమే అయిన జీవాత్మ అన్నారు. పురుషునియొక్క శక్తియే ప్రకృతి; పరమాత్మశక్తియే మాయ. ఈ జంటను శివశక్తులనుటకూడ మన వారికి ఇష్టమే. జగత్సృష్టి జరుగుటకు ఈ ఉభయముల సంయోగమే ముఖ్యము. కనుకనే "శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం, న చే దేవం దేవో నఖలు కుశలః స్పందితు మపి" అన్నారు శంకరులు సౌందర్యలహరిలో. ఈ అంశమునే గీత—

"యావత్సంజాయతే కించి,త్సత్త్వం స్థావర జంగమం,
క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగా, త్తద్విద్ధి భరతర్షభ." 13.26

చరముకాని, అచరముకాని అయిన- ఏది పుట్టవలెనన్నను, దానికి క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగము అవసరమన్నది. అనగా మనము ప్రకృతి పురుషులనుగా భావించిన తత్వములను భగవద్గీత క్షేత్ర క్షేత్రజ్ఞులు అన్నదన్నమాట. క్షేత్ర క్షేత్రజ్ఞులను - క్షరాక్షర పురుషులనికూడ అన్నదీగీత.

"ద్వా విమౌ పురుషౌ లోకే, క్షర శ్చాక్షర ఏవచ,
క్షర స్సర్వాణి భూతాని, కూటస్థోఽక్షర ఉచ్యతే."
15-16

ఇట్టి పురుషులకంటె ఉత్తముడైన పరమ పురుషుడే విశ్వకర్మ. ఆ పరమ పురుషుని తత్త్వమును, ఆ తత్త్వము నుండి విస్తరించిన జగత్తునుగూర్చియే ఋగ్వేద దశమ

మండలమునందలి, 90వ దైన పురుషసూక్తమును, యజుర్వేదమునకు చెందిన యజురారణ్యకములోని పురుషసూక్తమును గంభీరముగా ప్రవచించినవి. అందు జగదుపాదానమైన ప్రకృతినే గాయత్రినిగా వేదవాఙ్మయము పేర్కొన్నది. గాయత్రి అనునది 24 అక్షరములు, 3 పాదములుగల ఛంధస్సు ఒకటి కలదు. అంతియేకాక, జగత్కారణభూతమైన దివ్యశక్తి స్వరూపిణినిగాను, ఒక దేవతనుగానుకూడ ఆమెను వైదికవాఙ్మయము వర్ణించినది. మన సంస్కృత వాఙ్మయము సగుణారాధనకోసమై విశ్వకర్మను అయిదు ముగములు గల వానినిగా వర్ణించినది. ఈ అయిదు మోములు పంచభూతములకు, మన్వాది పంచబ్రహ్మలకు, విష్ణ్వాది పంచమూర్తులకు, సానగాది పంచ ఋషులకు, జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, తురీయము (సమాధి) తురీయాతీతము - అను పంచావస్థలకు, సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాములకు సంకేతములని మనకు తెలిసిన విషయమే. విశ్వకర్మవలె గాయత్రికూడ అయిదు ముఖములుగల దేవతయే. అవికూడ ఆకాశాదులైన పంచభూతములు మొదలయినవాటికే సంకేతములు. సృష్టిలో ఈ పంచసంఖ్యా ప్రాధాన్యమునుగూర్చి సృష్టికర్త మన కాలుసేతులకు అయిదేసి వ్రేళ్ళను సృష్టించి సూచించియే యున్నాడు. కాగా గాయత్రీ విశ్వకర్మలు ప్రకృతి పురుషస్వరూపు లన్నమాట. ఇరువురికి స్త్రీ పురుష భేదము తక్క, ఇంక ఏ భేదమును లేదు. పంచసామ్యములుకూడ ఉభయులకు కలవు. ఆ ఉభయులు జగత్ప్రవృత్తికి కారణ

భూతులైన ఆదిమ దంపతు లన్నమాట. మన పురాణము లలో వర్ణితుడైన శివుడు తన సతికి అర్ధ శరీరమును మాత్రమే ఒసగి అర్ధాంగిని చేసికొనగా, విశ్వకర్మ ఒక్క పుంస్త్వమును తప్ప తన సర్వస్వమును ఆమెనుగా నేచేసి, దాంపత్యమనునది అద్వైతమే కాని, ద్వైతమెంత మాత్రమునుకాదని లోకము నకు చాటినాడు ఈ గాయత్రీ విశ్వకర్మల పరమాద్వైత భావమును యజుర్వేదములోని దిగువ మంత్రము ఇట్లు వక్కాణించుచున్నది. గాయత్రీమాత విశ్వకర్మనామముతో పిలువబడిన సందర్భము నిచ్చట కాంచగలము.

"దేవాసురా స్సంయత్తా ఆసన్. తేషాం గాయ త్ర్యోజో, బల, మింద్రియం, వీర్యం, ప్రజాం, పశూన్ — సం గృహ్యాదాయాపక్రమ్యాతిష్ఠత్. తేఽమన్యన్త - యత రాన్వా ఇయ ముపావర్త్స్యతి, త ఇదం భవిష్యన్తీతి. తాం వ్యహ్వయన్త- విశ్వకర్మన్నితి దేవా, దాభీ త్యసురాః. సా నాన్యతరాంశ్చ నోపావర్తత, తే దేవా ఏత ద్యజు రపశ్య న్నోజోఽసి, సహోఽసి, బలమసి, భ్రాజోఽసి, దేవానాం ధామనామాసి, విశ్వమసి, విశ్వాయుః, సర్వమసి, సర్వాయు రభిభూ రితి వా అసురాణా మోజో, బల, మింద్రియం, వీర్యం, ప్రజాం, పశూ నవృంజత...."

— యజుః కాండం. 2. ప్రశ్న- 4.11.

గాయత్రీష్టి, లేక - సంవర్గేష్టి సందర్భములోనిది ఈ

మంత్రము. సోదరులకు కలహము వచ్చినప్పుడు ఈ యజ్ఞ మునుచేసి విజయసిద్ధి నందుదురు.

దేవాసురు లొకసారి యుద్ధమునకు సిద్ధమైనారు. అప్పుడు గాయత్రీదేవి దేవాసురుల-ఓజస్సు,బలము,ఇంద్రియ శక్తి, ఉత్సాహము, ప్రజ, పశుసంపద - అను ఆఱింటిని హరించివైచెను. అప్పుడు దేవాసురులిరువురు గాయత్రిని సంస్తుతించిరి. ఆ స్తుతిలో దేవతలు ఆమెను "విశ్వకర్మ" అనెడి మాటతోను, అసురులు "దాభి" అనుమాటతోను సంబోధించినారు. దేవతలింకను ఓజస్సు మొదలైన దివ్యశక్తులు ఆతల్లియొక్క స్వరూపములే అని తలంచి, ఆమెనట్లే స్తుతించి, ఆమె హరించిన తమ ఓజోబలాదులాఱింటిని మఱల సంపాదించుకొని, అసురులను నిర్వీర్యులఁ జేసి, వారిని గెలిచినారు. దీనినిబట్టి గాయత్రి ఓజో బలాదులనిచ్చు తల్లియని తెలియుచున్నది. అందుకే సంధ్యావందనము చేయునప్పుడు- "ఓజోఽసి, సహోఽసి, బల మసి, భ్రాజోఽసి, దేవానాం ధామ నామాసి"— ఇత్యాదిగా మనము ఆతల్లిని ప్రార్థించుచున్నాము. ఈ మంత్రమునందలి విశ్వకర్మ, దాభి అను పదములకు సాయణులిట్లు భాష్యము వ్రాసియున్నారు.

"హే విశ్వకర్మన్నితి దేవానా మాహ్వానం, దాభీత్యసురాణా మాహ్వానం. విశ్వాని కర్మాణి యస్యాః సా విశ్వకర్మా, తత్సంబోధనం హే విశ్వకర్మన్నితి. దభ్నోతి- వినాశయతి హినస్తీతి దాభీ. తత్సం బోధనం హే దాభీతి."

విశ్వమునకు సంబంధించిన సమస్తములైన కర్మములు ఏతల్లి చేయునో, ఆమె విశ్వకర్మ అన్నమాట. ఇది దేవతల పిలుపు. శత్రువులను హింసించునది కనుక దాభి. ఇదేమో అసురుల పిలుపు. సాయణులు విశ్వకర్మ సూక్తములలోని విశ్వకర్మ శబ్దమునకు భాష్యము వ్రాయుచు "విశ్వ విష యాణి సృష్టిస్థితి సంహారరూపాణి యస్యాసౌ విశ్వకర్మా" అని వ్రాసినారు. వేదములో ఎచ్చట విశ్వకర్మ పదము వచ్చినను దానికి సమస్త కర్మాధినాథుడైన పరమేశ్వరుడే అని సాయణులు భాష్యము వ్రాయుచుందురు.

యజుర్వేదములోని ఈ మంత్రము గాయత్రిని విశ్వ కర్మ అని సంబోధించి గాయత్రీ విశ్వకర్మలకుగల పరమైక్య స్థితిని, జగన్మాతాపితృ భావమును మహాగంభీరముగా, వ్యంగ్యరీతిలో వక్కాణించినది. వేదమెప్పుడును ఇట్టి రహ స్యములను వ్యంగ్య మార్గముననే బోధించు చుండునని వేద వేత్తలకు చెప్పపనిలేదు. దీనినిబట్టి గాయత్రీ విశ్వకర్మలకు స్త్రీ పుం భేదముతప్ప, మఱి ఏ యితర భేదములేదని విజ్ఞులు, ఉపాసకులు, తత్త్వసాధకులు ఎఱుంగవలసి యున్నది. ప్రకృతి స్వరూపిణియగు గాయత్రియు, పురుషపదముచే చెప్పబడిన విశ్వకర్మయు విశ్వ సృష్ట్యాది సమస్తకర్మల నొనర్చువారే అని దీనినిబట్టి గ్రహించి మనము వారి నారాధించి కృతార్థు లము కావలయును.

గాయత్రీ విశ్వకర్మల ఐక్య(దాంపత్య)మునకు ఇంకొక

ప్రమాణమునుకూడ చూతము. "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అని 2వ విశ్వకర్మ సూక్తమునందలి 6వ మంత్రములో మనము చదివియే యున్నాము. దానికి - వాచః= మంత్రాదులైన వాక్కులకు, పతిః = అధినాథుడైనవాడని అర్థము. ఆ మాటకు భాష్యము వ్రాయుచు సాయణులు - "మంత్రరూపాయాః వాచః పాలకమ్" అనినారు. ఇక్కడ వాక్కులనగా లౌకికవాక్కులేకాక, తొలి పలుకులనియు గ్రహింపవలెను. కాగా వేదాధిపతి అన్నమాట. అట్టి వేదాధిపతి, వాచస్పతియగు విశ్వకర్మయే-అని మంత్రభావము.

గాయత్రికి సావిత్రి, సరస్వతి అనికూడ నామాంతరములున్నవి. మూడు సంధ్యలయందు మూడు నామములతో నొప్పు ముగురమ్మలను ఆరాధించుచుందుము. కాన గాయత్రి అనగా సరస్వతి అనికూడ తెలియవలెను. వాక్కు సరస్వతి స్వరూపమని దిగువ యజుర్మంత్రము చెప్పుచున్నది.

> "వాగ్వై సరస్వతీ. సరస్వతీమేవ స్వేన భాగధేయే
> నోపధావతి. సైవాస్మి న్వాచం దధాతి. ప్రవదితా
> వాచో భవత్యపన్నదతీ భవతి. తస్మా న్మనుష్యా
> స్సర్వాం వాచం వదన్తి." తైత్తి. 2. కాం. ప్రశ్న- 1.3

ఈ మంత్రము, వాక్కును సరస్వతిఅని చెప్పుచున్నది. అట్టి- వాచః=సరస్వతికి, పతిః=భర్తయే- వాచస్పతి. ఈసరస్వతిని గూర్చి ఋగ్వేద దిగ్దర్శనము ద్వితీయ భాగమున 175వ పుటనుండి 189 వఱకు ఋగ్వేద మంత్రములద్వారా సవిస్త

రముగా నిరూపింపబడియున్నందున,ఇచ్చటవి స్తరింపబడ లేదు. అయినను ముఖ్యమైన ఒక్క మంత్రమును ఉదాహరింతుము.

"ప్రణో దేవీ సరస్వతీ
వా జేభి ర్వాజినీవతీ
ధీనా మవిత్ర్యవతు." ఋ. 6-61-4.

తా. తనను ధ్యానించువారిని రక్షించునదియు, జ్ఞాన రూపాన్న దానము చేయునదియు అగు సరస్వతీదేవి జ్ఞానాన్న దానములచేత మమ్ము రక్షించుగాక.'ధీనాం అవిత్రీ' అన్నందు వలన ఆమె, బుద్ధులను రక్షించునది అని గ్రహింపవలయును. అనగా బుద్ధి ప్రేరకురాలని భావము. ఇక గాయత్రియే సర్వ మనెడి విషయమును ఛాందోగ్య మంత్రముద్వారా తెలిసి కొందము—

"గాయత్రీ వా ఇదగ్ం సర్వం భూతం య దిదం
కిం చ. వా గ్వై గాయత్రీ. వాగ్వా ఇదగ్ం సర్వం
భూతం గాయతి చ త్రాయ తే చ."

— 3వ అధ్యాయం. 12వ ఖండం.

చరాచరాత్మకమగు జగమంతయు గాయత్రియే. దీనినే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనికూడ అన్నారు. విశ్వకర్మ కూడ సర్వవ్యాప్త బ్రహ్మమే కావున రెండు తత్త్వములు ఒక్కటే అన్నమాట. ఇక గాయత్రి వాగ్రూపిణియై అన్నిం టిని పేర్కొనుచున్నది. రక్షించుచున్నదికూడ. ఛాందోగ్య మంత్రమునకు భాష్యము వ్రాయుచు శంకరులు "గాయత్రి

ఛందోరూపముగానేకాక, వాగ్దేవతారూపముగాకూడ ఉండి, గాన ప్రాణములనెడి కార్యములను చేయుచున్న"దనినాకు దీనినిబట్టి గాయత్రి- పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ రూపములతోనున్న వాగ్దేవి, లేక సరస్వతియే అని స్పష్ట మగుచున్నది. కనుకనే ఆమె వేదమాతకూడ. కాన 'నమామి వేదమాతరమ్ అనుట పరిపాటి. అట్టి వాగ్దేవికి పతి కనుకనే విశ్వకర్మను "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అన్నవి ఋగ్యజుర్వేద మంత్రములు కావున గాయత్రిఅనగా వాక్కు, వాగ్దేవికి ఆ వాగ్దేవికి పతి వాచస్పతి - విశ్వకర్మ. వారి సంబంధము ప్రకృతి పురుషుల సంబంధమేకాని, ఇతరము కాదు. వారు జగజ్జనకులు. వారి ఉపాసనము పూజాపుర స్కారాదులు, శ్రవణ, మనన, నిదిధ్యాసలు- జగత్తత్త్వమును తెలుపుచు ముక్తిహేతువు లగుచున్నవి. గాయత్రీ విశ్వకర్మల తత్త్వమునుగూర్చి యజురారణ్యక మంత్రములద్వారా ఇంకను ఆలోచించిచూతము.

## చతుష్పాద్విభూతి

జగత్ప్రసిద్ధమగు పురుషసూక్తమునందు ప్రస్తుతింప బడిన దేవుడు ఈ విశ్వకర్మయేఅని సర్వులు ఎఱింగిన విష యమే. పురుషసూక్త ప్రారంభమునుండి పలుసారులు పురు షుడుగా పేర్కొనబడిన జగత్కారణ తత్త్వము చివరకు—

"విశ్వకర్మణ స్సమవర్తతాధి
తస్య త్వష్టా విదధ ద్రూప మేతి."

అని విశ్వకర్మయనెడి విశేషనామముచే పేర్కొన బడినది. విశ్వకర్మ స్వరూపుడగు ఈ పురుషుడు నాలుగు పాదముల విభూతి (ఐశ్వర్యము) కలవాడు అగుచున్నాడు. ఈ నాలుగుపాదములు మాండూక్యోపనిషత్తులో ఓంకారము నకు చెప్పబడిన పాదములనియు భావింపవచ్చును. అనగా ఇది పిండాండపక్షమున జీవులు తరించుటకు ఉపయోగించు నట్టి స్థితి. పురుషుని నాలుగుపాదములలో సమస్త బ్రహ్మాండములుకూడ ఒక్క పాదము మాత్రమే. ఈ అంశమే "పాదోఽస్య విశ్వా భూతాని" అని మంత్రములో చెప్పబడి నది. ఈ పాదమాత్రమైన బ్రహ్మాండము భగవంతునియొక్క వాస్తవ (ఋత) స్వరూపముకాదు. ఇంతకంటెను ఘనిష్ఠ మైనదియు సత్యమైనదియు, అనంతమైనదియు ఆయన స్వరూపము. తైత్తిరీయానందవల్లి "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" అని చెప్పినది. దానిని పురుషసూక్త వాక్యమేమో "త్రిపా దస్యామృతం దివి" ఒక్కపాదమైన బ్రహ్మాండము కాక, తక్కిన మూడు పాదములు స్వర్గమును, దానికి మించిన అమృతమును అయియున్నవన్నది. దీనిని సృష్టిసూక్తము "నాస దాసీ న్నోస దాసీత్" అని వర్ణించినది. విశ్వకర్మ సూక్తమేమో—

"పరో దివా పర ఏనా పృథివ్యా
పరో దేవేభి రసురై ర్గుహాయత్."

అది ద్యావాపృథువులకంటెను, దేవాసుర మనుష్య మృగ పక్షి క్రిమి కీట జడాదులకంటెను పరమైనదని అన్నది. ఏతావతా తేలిన సారాంశము-అట్టి శాశ్వతాఖండ నిర్వికార చిదచిదతీతపరమాత్మరూపమును నాలుగు పాదములని చెప్పుట పురుషసూక్త హృదయము. యథార్థమున పరమాత్మ స్వరూపమును నాలుగు పాదములుగా వర్ణించుట అజ్ఞానమే. ఏలయన, అది పరిమాణము (కొలత) ల కందనంతటి అపరిమితము, అపరిమేయము. అయినను సాధకుల బోధ సౌకర్యమునకై బ్రహ్మస్వరూపమును దృష్టిలో ఉంచుకొని చూచినప్పుడు బ్రహ్మాండమొక పాదమే - స్వల్పమేఅని సూచించుట కట్లు చెప్పబడినదని పాఠకులు గమనింపవలయును. శ్రుతితాత్పర్యమును అదియే! పురుషుడు చతుష్పాదాత్మకు డనునంశము పురుషసూక్తములోని—

"పాదోఽస్య విశ్వా భూతాని, త్రిపాదస్యామృతం దివి" అను మాటలలో చెప్పబడినది. జగము నాలోని ఒక అంశముమాత్రమే అనెడి ఈ విషయమును గీతలలో భగవానుడు "విష్టభ్యాహ మిదం సర్వమేకాంశేన స్థితో జగత్" నేనీ జగత్తున, నా ఒక్క-అంశము (పాదము)తో మాత్రమే వ్యాపించియున్నాను. అని స్పష్టము చేసినాడు.

ప్రణవము (ఓంకారము) యొక్క- నాలుగు పాదములు లేక, మాత్రలు- (అకార, ఉకార, మకార, అమాత్రలు-)

జాగ్రత్స్వప్న, సుషుప్తి, సమాధులకు సంకేతములు. ఏతద్రూప చతుష్పాదవిభూతి కలవాడు పరమాత్మ. కాగా, ఒక్క పాదము మాత్రమే సమస్త బ్రహ్మాండములు అన్నప్పుడు- మొదటి పాదమైన జాగ్రదవస్థ సూచింపబడు చున్నది. జీవుడు సుఖదుఃఖాదిక సంసారము ననుభవించునది జాగ్రద్దశలోనే కావున, జాగ్రద్దశజగత్తునకు సూచకమని తత్త్వార్థమును భావింపవలెను. అయితే స్వప్నమునందును సుఖదుఃఖాదులు కలవుకదా అన్నచో అవి కేవలము ప్రతిభాస మాత్రములు, మనోమయములు మాత్రమే కావున మిథ్యాభూతములే.

విశ్వకర్మయొక్క ప్రతిరూపమే అయిన గాయత్రీ దేవియు చతుష్పాదములతో ఒప్పునట్టిదే అని ఛాందోగ్యోపనిషత్తు పలుకుచున్నది—

"సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ,
త దేతదృచాభ్యుక్తం- తావా నస్య మహిమా.
తతో జ్యాయాగ్ంశ్చ పూరుషః. పాదోఽస్య
సర్వా భూతాని, త్రిపాదస్యామృతం దివి."

— 3వ అధ్యాయం. 12వ ఖండం.

గాయత్రిని బ్రహ్మసమ్మిత (బ్రహ్మమయి) అగు చతుష్పాద దేవతగా దర్శించినప్పుడు, విశ్వ భువనము లన్నియు ఒక పాదముగను, తక్కినదంతయు మూడు పాదములుగను ఎన్నవలయును. శ్రీమద్గాయత్రీ మంత్రము ఇరువదినాలుగు

అక్షరములు కలది కావున, ఆ ఆరేసి అక్షరములను ఒక పాద ముగా ఎన్నుకొన్నచో, నాలుగు పాదములు ఏర్పడగలవని శ్రీ శంకరులు తన ఛాందోగ్య మంత్ర భాష్యములో విశదీక రించినారు.

బ్రహ్మసూత్ర శ్రీభాష్యమునందు జ్యోతిరధికరణ ములో శ్రీరామానుజులు ఈ విధముగా వ్రాసినారు- "ఇచట గాయత్రి యనునది సర్వాత్మకముగా చెప్పబడుచున్నది. ఇట్లు సర్వాత్మకముగానుండుట ఛందోమాత్రమగు గాయత్రికి అసంభవముగాన, ఫలమునకై పరబ్రహ్మమును గాయత్రీ సదృశునిగా ధ్యానింపవలయునని ఈ పై శ్రుతి విధించు చున్నది. "పాదోఽస్య సర్వా భూతాని" ఇత్యాది వాక్య ములచే, పరబ్రహ్మము నాలుగు పాదములతో గూడుకొని నదిగాను చెప్పబడుచున్నది. గాయత్రీ ఛ్ఛందస్సునకు నాలుగు పాదములును గలవు కాబట్టి ఈ విషయమున పరబ్రహ్మము నకు గాయత్రి (ఛందస్సు) తో సామ్యము సంభవమే. ఏల యనిన, వేదములయందు కొన్ని తావుల గాయత్రీఛ్ఛందస్సు నకు నాలుగు పాదములు కానబడుచున్నవి—

"ఇంద్ర శ్శచీపతిః, వలేన పీడితః,
దుశ్చ్యవనో వృషా, సమిత్సుసాసహిః."

ఛందోగులు-1 భూత, 2 పృథివీ, 3 శరీర, 4 హృద యములను నిర్దేశించి "సైషా చతుష్పదా" అనువాక్య మున, ఆ నాల్గింటిని గాయత్రికి పాదములనుగా పఠించి

యున్నారు. అట్లు భూతాదులను పాదములుగా కలిగియుం నది కేవల ఛందస్సుగాదు. కాబట్టి ఈ వాక్యమున గాయత్రీ శబ్దము పరమాత్మ పరమని చెప్పుటయుక్తము."

— ఆంధ్రీకృత శ్రీభాష్యము

శంకరులు బ్రహ్మసూత్ర భాష్యములో ఈ అధికరణ మును "జ్యోతి శ్చరణాధికరణ" మన్నారు. ఆ భాష్య ములో శంకరులుకూడ గాయత్రి చతుష్పాదయుక్త బ్రహ్మ ముతో తుల్యమే- బ్రహ్మమే, అని నిర్వచించినారు. విస్తరము నెఱుంగదలచినవారు ఆ యా భాష్యములను తిలకించి ఆ తత్వమును గ్రహింపవచ్చును. దీనికంతటికి సారాంశము నాలుగు పాదములను కలిగియుండుట గాయత్రీ విశ్వాత్మలకు తుల్యమే అని. ఒక పక్షమున గాయత్రిని త్రిపదగా ఎన్న నను, ఆ జగన్మాత సాక్షాత్తు త్రిపాదవిభూతిమయి అయిన పరబ్రహ్మమే కాగలదు. ఆమె సాకారమున విశ్వాత్మ స్వరూపయే అని పంచశీర్షాది లక్షణములు తెల్లము చేయు చునే యున్నవి.

## సావిత్రి

గాయత్రీ నామములలో "వాచస్పతిం విశ్వకర్మాణ-" అనెడి మాటనుబట్టి గాయత్రి వాగ్రూపిణి అయిన సరస్వతి యని తెలిసికొన్నాము. గాయత్రీ నామచర్చ కూడ చక్కగా చేసినాము. ఇకపోగా సావిత్రి అనెడి మాటనుగూర్చి విచా రింపవలసియున్నది. సవితృదేవునికి సంబంధించినది సావిత్రి

అని భావము. గాయత్రీ మంత్రములో "ఓం తత్ సవితుః వరేణ్యం" అనిసవితవినబడుచున్నాడు. ఈ సవిత సహస్రారము నందలి విశ్వకర్మ బ్రహ్మమే అని ఋగ్వేదదిగ్దర్శన ద్వితీయ తృతీయ భాగములయందు వివరింపబడియే యున్నది. ఇట్టి సవితృసంబంధముకల సావిత్రినిగూర్చి ఇప్పుడు విచారింతము.

వైఖానసాగమము 20వ పటలమున- తృతీయావరణములో గంగాది దేవతల స్థానములను చెప్పుచు త్వష్టృ దేవుని గూర్చి ఇట్లు చెప్పబడినది—

"త్వష్టా ష్లోతవస్త్రోత్తరీయాది సంచయః, స్థానే హేమాభ, శ్శుకపింఛాంబరధర, శ్చతుర్భుజః, కలశాక్షమాలాపాణి, ర్జటాధరో, హంసవాహనో, ఘూపాద్యక్షరబీజ, స్సావిత్రీపతి, రభిజిజ్జాతః, కమండలుధ్వజో, హుంకారరవ, స్త్వష్టా.... త్వష్టారం రూపజాతం నిధిజం ష్లోతాధిపతి మితి."

ఇందు త్వష్టృదేవుని స్వరూపాది విశేషములను నిర్దేశించుచు ఆయన సావిత్రీపతి అని చెప్పబడినది. త్వష్ట అనగా విశ్వకర్మ అనికూడ వేదహృదయము. భాష్యకారులు కూడ అట్లు భావించియున్నారు. అంతియేకాక పురుష సూక్తము "విశ్వకర్మణ స్సమవర్తతాధి, తస్య త్వష్టా విదధ ద్రూపమేతి." త్వష్ట విశ్వకర్మయే అనియు, లేదా విశ్వకర్మావతారమే త్వష్టఅనియు చెప్పుచున్నది. ఈ అంశమును మిత్రసాహస్రి ఇట్లు పేర్కొన్నది.

"త్వష్ట విశ్వకర్మతనయుడే అనియును,
ఇరువు రొక్క వ్యక్తియే యటంచు,
శ్రుతులు, భాష్యములును నుతియించుచున్నవి;
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర, 861.

విశ్వకర్మ తాల్చు వివిధావతారాల
త్వష్టరూపు తొలిది తథ్య మింక;
పురుషసూక్త మిచట పరమప్రమాణంబు;
విశ్వహిత చరిత్ర వినర మిత్ర! 853.

ఇక సావిత్రి అనగా గాయత్రి అని సుప్రసిద్ధమే కదా. కనుక గాయత్రీ విశ్వకర్మలకు (ప్రకృతి పురుషులకు) పత్ని పతి ధర్మము, జగత్పితృత్వమును సుస్పష్టము. [illegible] మును ఈ వైఖానసాగమముకూడ వాచ్యముగానే [illegible] శ్రుతిమార్గమును బలపఱచినది. ఇరువురును పంచముఖములు, దశబాహువులు కలవారగుట- మొదలగు అంశములు కూడ సరిపోవు చున్నవి. త్వష్ట్ర దేవుడు హంసవాహను డనుటకూడ ఆయన సావిత్రి పతిత్వమునకు [illegible] బ్రహ్మయు, విశ్వకర్మయు హంసవాహనుడే. [illegible] ఉచ్ఛ్వాస నిశ్శ్వాసరూప ప్రాణమే హంస అనగా. [illegible] ఆ హంసను ఎక్కియే జీవాత్మ ప్రయాణము చేయును. ప్రాణమే మో సూక్ష్మ శరీరములోని భాగము [illegible] గుణమువల్ల కలిగినట్టిది. స్థూలదేహమునందలి ప్రాణము తమోగుణమయము. జీవుడు స్థూల దేహమును [illegible]

నప్పుడు ఆ పంచ ప్రాణములతోనే ప్రయాణముచేయును కావుననే జీవస్వరూప విశ్వకర్మకు (త్వష్ట పరమాత్మకు) ప్రాణమే వాహనమని తత్వజ్ఞులు తెలియవలసి యున్నది. ప్రాణము లేకుండ ఏ జీవియొక్క జీవుడును ఉండదు. హంస అనగా జీవుడనియు, మనస్సనియుకూడ వేదాంతులు భావింపకపోలేదు. "రావే పోదాము మానస హంస" ఇత్యాది తత్వములలో మనస్సును హంస అని ఎంచినారు. "హంస లేచిపోయినది" అన్నప్పుడు జీవుడనియే భావము. విశ్వకర్మ మేఘవాహనుడనియెడు భావము పురాణకాలమున ప్రచారమైనది. ఈ విధముగా త్రినామములచే పేర్కొనబడిన గాయత్రీ సావిత్రీ సరస్వతులు విశ్వకర్మ పరమేశ్వర తత్త్వమున అంతర్భూతలై జగన్మాతలు, వేదమాతలు అయి "నమామ వేదమాతరమ్." అనెడి సూక్తికి లక్ష్య మైనారు.

## పంచవిధ సామ్యములు

గాయత్రీ విశ్వకర్మలకు పంచవిధ సామ్యములుకూడ ఉన్నవి.

1. నామ సామ్యము :- విశ్వకర్మ పదము గాయత్రీ విశ్వకర్మలకు ఇద్దఱికిని చెల్లినదని యజుర్వేదమంత్రమే చెప్పినది కదా !

2. రూప సామ్యము :- అయిదు తలలు, పదిచేతులు, సచ్చిదానంద స్వరూపములు మొదలయిన రూప సామ్యములు ఇరువురికిని గలవు.

3. అవస్థాన సామ్యము :- అవస్థానమనగా సచ్చిదానందానంతత్వాదులు. ఇవి ఉభయులకును కలవు. ఇరువురును అనంతమహిమలు కలవారే.

4. అనుష్ఠాన సామ్యము :- అనుష్ఠానమనగా వారు చేసెడి కర్మలని అర్థము. గాయత్రీ విశ్వకర్మలిరువురును జగత్తులయొక్క సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాదులను చేయుచునే ఉన్నారుకాన, వారికి అనుష్ఠాన సామ్యము ఉన్నది.

5. అధిష్ఠాన సామ్యము :- అనగా ఆధార సామ్యము. గాయత్రీ విశ్వకర్మలిరువురు జగత్తులు తోచుటకు ఆధారభూతులే కనుక, వారికి అధిష్ఠాన సామ్యముకూడ ఉన్నది. ప్రకృతి పురుష స్వరూపులైన గాయత్రీ విశ్వకర్మలనెడి ఆధారము లేకుండ బ్రహ్మాండములు పుట్టి గిట్టనేరవు. ఈ పంచసామ్యములేకాక, పురుషసూక్త, ఛాందోగ్యోపనిషత్తులు చెప్పిన చతుష్పాద్విభూతి సామ్యము అనునది గాయత్రీ విశ్వకర్మలకు ఎక్కువ (విశేషము)గా కలదు. యజుర్వేద వాక్యమునకు అనుకూలముగా స్కాందపురాణ నాగర ఖండము దిగువరీతిని పలుకుచున్నది—

"ఓంకారస్తు పరంబ్రహ్మా, విశ్వకర్మా పరశ్శివః,
పరాత్పర తరోంకారః, పరాదూర్ధ్వం, పరాత్పరః.
అగ్నిస్తు విశ్వకర్మైవ, తదర్థం వహ్నిదైవతమ్,
తస్య బ్రహ్మ ఋషిశ్చైవ, గాయత్రీ ఛంద ఉచ్యతే.

స్వరూపం పరమాత్మాచ, ప్రణవస్యైవ తస్యహి,
లోకమాతా చ సావిత్రీ, త్ర్యక్షరం బ్రహ్మ సమ్మితం.
వేద శ్చ లోకమాతా స్యా, ద్గాయత్రీ వేదమాతృకా,
జాతా౽సౌ దేవతానామ్నా, విశ్వకర్మేతి కీర్తితా."

— ఇతిస్కాందపురాణే నాగరఖండే బ్రాహ్మణ్య గాయత్రీ నిర్ణయోనామ చతుర్దశో౽ధ్యాయః.

తా. పరమశివుడును, విశ్వకర్మయు, పరబ్రహ్మమును ఓంకారమే అగును. పర స్వరూపమున కంతటికిని ఊర్ధ్వమున నున్నది అదియే. అగ్నిగూడ విశ్వకర్మ రూపమే. అందుకే అది వహ్నిదైవతము కలదయ్యెను. ఆ ప్రణవమునకు (ప్రణవరూపము నందిన గాయత్రికి) బ్రహ్మ ఋషియు, గాయత్రి ఛందస్సును, పరమాత్మ స్వరూపమును అగును. లోకమాతయైన సావిత్రి మూడక్షరములు గలదియు, బ్రహ్మ సమ్మితయు అగుచున్నది. శ్రుతి (వేదము) లోకమాతయే అట్టి వేదమునకు తల్లి గాయత్రి. ఆ గాయత్రీదేవత విశ్వకర్మ నామముతో కీర్తింపబడినది." ముందు ఉదాహరించిన వేదాదుల అభిప్రాయమునే ఈ పురాణ వాక్యములు దృఢపఱచి విస్తరించి చెప్పినవి. దీనినిబట్టి గాయత్రీ విశ్వకర్మలకు స్త్రీ పుం భేదము తక్క, పంచముఖ, దశబాహుత్వాది బాహ్య స్వరూప సామ్యమును, సచ్చిదానంద స్వరూప-సృష్ట్యాదిక్రియాకరణ ఆంతరంగిక రూప సామ్యమును కలిగి. వా రుభయులు అద్వైత స్వరూపులని స్పష్టమగుచున్నది.

"బ్రహ్మ సత్యం జగ ద్బ్రహ్మ" అనెడి సూత్రము ననుసరించి, బ్రహ్మస్వరూప విశ్వకర్మ, జగత్స్వరూప గాయత్రియేకాని వేఱుకాదు. ఇదియే గాయత్రీ విశ్వకర్మల పరమాద్వైతము.

## గాయత్రీ మంత్రార్థము

ఇంకను ఆలోచించినచో గాయత్రీ మంత్రముచే ఉపాసింపదగినవాడు విశ్వకర్మయే అని తెలియగలము. గాయత్రి పదము స్త్రీ లింగములో ఉన్నను, గాయత్రీ మంత్రార్థము మాత్రము పుంలింగ పరమయియే యున్నది. ఎట్లోచూతము:- గాయత్రీమంత్రము ఋగ్వేదములో తృతీయ మండలమున 62వ సూక్తములో పదవ ఋక్కు. ఇది గాయత్రి అనెడి ఛందస్సులోనే ఉన్నది. దీనికి సాయణుల భాష్యము ననుసరించి అర్థమిట్లున్నది :—

"ఓం తత్సవితు ర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్." ఋ. 3.62-10

టీక :- యః సవితా దేవః = ఏ సవితృదేవుడు, అస్మాకం=మనయొక్క, ధియః=కర్మలను, లేదా, ధర్మాధర్మాది విషయములైన బుద్ధులను, ప్రచోదయాత్=ప్రేరేపించునో, తత్=ఆ సవితృదేవునియొక్క, అనగా సర్వాంతర్యామిగా ప్రేరకుడైన ఆ జగములను సృష్టించిన పరమేశ్వరునియొక్క, వరేణ్యం భర్గః=అందఱకును ఉపాస్యముగను,

జ్ఞేయముగను భజింపదగిన భర్గమను పేరుగల తేజమును, (అవిద్యా తత్కార్యములను అది పొందుటంబట్టి దానికి భర్గ మనిపేరు కలిగినది) అనగా పరబ్రహ్మాత్మకమును, స్వయం జ్యోతియునగు తేజమునని భావము. ధీమహి=ధ్యానించు చున్నాము.

## సవిత

సవితృ శబ్దము "షూ ప్రేరణే" అను ధాతువునుండి పుట్టినది. "సువతి-సుప్తం ప్రేరయతీతి సవితా" నిద్రించు వానిని మేల్గొలుపువాడని సవితృపదమునకువ్యుత్పత్తి-అర్థము. సాయణులు సవితృ శబ్దమునకు సూర్యుడనియు, భర్గశబ్దము నకు అన్నమనియుకూడ అర్థము చెప్పినారు. అవి కేవలము బాహ్య (ఆధిభౌతికార్థములు) ర్థములు మాత్రమే. అంత రర్థమును పర్యాలోచించినచో నిద్రనుండి మేల్కొలుప్రుట, అనగా అజ్ఞాననిద్రనుండి మేల్కొల్పుట అనియే భావము. అట్లు మేల్కొలుపువాడు బాహ్యసూర్యుడుకాక, అంతరంగమున ఉన్నవాడును, పరమాత్మయు అగు అంతర్యామిరూప సూర్యుడే కావలయును. వేదమంత్రములకు ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికములైన మూడర్థములుకూడ ఉండు నని వేదార్థ వేత్తలకు చెప్పపనిలేదు. ఆ పక్షమున ఇచ్చట ఆంతరమగు ఆధ్యాత్మికార్థమును కూడ మనము భావింప వలయును. బుద్ధులను ప్రేరేపించు దేవుడు సూర్యేంద్ర వరుణాదిరూపుడు కాడు. అతడు సర్వభూతములలోనుండు

పరమాత్మయే- విశ్వకర్మయే. ఈ అంశమును శ్వేతాశ్వతరో పనిషన్మంత్రమున—

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నిష్టః."
"ఇతడు విశ్వకర్మ ఈదేవుడు మహాత్ము
డెపుడు నిలుచు జనుల హృదయమందు."

అని చదివియే యున్నాము. ఈఅంశమునే భగద్గీత-

"సర్వస్యచాహం హృది సన్నివిష్టః" (15-15) అనీ,
"ఈశ్వర స్సర్వభూతానాం, హృద్దేశేఽర్జున తిష్ఠతి."
— 18-61.

అని చెప్పినది. కావున గాయత్రీ మంత్రోపాస్యుడు సర్వకర్మలకు ప్రభువును, హృదయస్థితుడును, బుద్ధి ప్రేరకుడును అగు విశ్వకర్మ పరమాత్మయే! కనుక బాహ్యార్థమున గాయత్రీమంత్రార్థముగా బాహ్యసూర్యునిచెప్పుకొన్నప్పటికీ, అంతరర్థమున అంతఃకరణ వృత్తులనుప్రేరేపించి, ముక్తినిచ్చు జ్ఞేయస్వరూప విశ్వకర్మ పరమాత్మనే చెప్పుకొనుట సమంజసము. సాయణులుకూడ తన భాష్యములో సవితను సర్వాంతర్యామిఅయినపరమాత్మనుగాపేర్కొన్నారు. వానినిజగత్స్రష్ట, పరమాత్మఅనియు అన్నారు. అంతియేకాదు. "త ఆ యజన్త ద్రవిణగ్ం సమస్మా ఋషయః పూర్వే జరితారో న భూనా' అనెడి మంత్రమునకు భాష్యము వ్రాయుచు- "తే పూర్వ

ఋషయో-ద్రష్టారో రశ్మయో అస్మా ఆదిత్యాత్మకాయ విశ్వకర్మణే ద్రవిణం తేజ ఆయజన్త" అని విశ్వకర్మ ఆదిత్య స్వరూపుడే అనినారుకదా! (ఋ. మండలం 10- సూక్తం81) కావున గాయత్రీ మంత్రమునందు 'సవిత' అను పేరుతో చెప్పబడిన దేవాదిదేవుడు ఈ విశ్వకర్మయే అని సాధకులు భావించి, ఆ జగముల తండ్రి నుపాసించి ముక్తి పొందవలసి యున్నది.

ఇంతవఱకు వ్రాసిన గ్రంథమునుబట్టి గాయత్రికి విశ్వకర్మతో ఐక్యమునుగూర్చి బహువిధ సామ్యములను చెప్పి, గాయత్రీ మంత్రార్థ లక్ష్యభూతుడు విశ్వకర్మయే అని నిరూపించుట అయినది. వ్రాయబోవు దానిని బట్టియు ఇదియే నిర్ణీతమగుచున్నది. శ్రీ బి. (బిండిగనవిలె) నారాయణ అయ్యంగారను కర్ణాటక విద్వాంసుడు 20వ శతాబ్ది ప్రారంభమున INDO ARYAN MYTHOLOGY అను గ్రంథమును ఆంగ్లమున వ్రాసియున్నాడు. ఆయన తద్గ్రంథారంభమున గాయత్రీ మంత్రార్థమును వివరించుచు—

"సవితృశబ్దమునకు జనకుడని అర్థమనియు, ఋగ్వేద కాలమున ఈ అర్థము ప్రచురముగా ఉన్నదనియు, గాయత్రీ మంత్రములోని 'సవితృ' శబ్దమునకు అండ పిండ బ్రహ్మాండములను సృజించిన జగజ్జనకుడని అర్థమనియు, అట్టి జగముల తండ్రి విశ్వకర్మయే అనియు, ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్తములోని "యో నః పితా జనితా యో విధాతా"

"చక్షుషః పితా మనసా హి ధీరో" అనెడి వాక్యములను చూపి, గొప్ప అర్థవివరణ సమన్వయములను చేసినారు. శ్రీ నారాయణ అయ్యంగారి వివరణను చదివిన పిమ్మట నా పరిశోధనమున క్రింది సత్యములు బయట పడినవి.

"షు" అనెడి సంస్కృతధాతువునకు ప్రేరణమొక్కటే అర్థము కాదు. "షు ప్రసవైశ్వర్యయోః" అని కూడ అర్థములు కలవు. ప్రసవించుట అనగా కనుట అని అందరకు తెలిసినదే. దీనినిబట్టి సవిత అనగా జగములను కన్న జగత్పిత అని అర్థము సిద్ధమగుచున్నది. ప్రేరణ చేయువాడను అర్థమే కాక, "అండ పిండ బ్రహ్మాండములను కనిన తండ్రి" అనికూడ సవితృ శబ్దమునకు అర్థము లభించును. అప్పుడు "లోకములను కన్న యే తండ్రి మా బుద్ధులను ప్రేరేపించు చున్నాడో, అట్టి తండ్రియొక్క సచ్చిదానంద ఘనతేజమును ధ్యానించుచున్నాము- ఉపాసించుచున్నాము అని అర్థము సిద్ధించును. కనుకనే సవిత అనగా జనకుడు - ఉత్పాదకుడు- పుట్టించినవాడు అని అర్థసిద్ధి కలుగును. అప్పుడు "యో నః పితా జనితా" "చక్షుషః పితా" అన్న మంత్రముల ప్రకారము- సవితయు, విశ్వకర్మయు ఒకే ఒక దివ్య జగత్కారణ శక్తి కాగలరు. నారాయణ అయ్యంగారు చెప్పిన అర్థమును దిగువ నుదాహరించెడి యాస్కాచార్య నిరుక్తవాక్యములు కూడ బలపఱచుచున్నవి—

'సవీమని' పదమునకు అర్థము తెలుపుచు సవితృ శబ్ద మునుగూర్చి యాస్కాచార్య నిరుక్తము ఇట్లనుచున్నది.

1. "సవీమని ప్రసవే" "దేవస్య వయం సవితుః సవీమని ఇత్యపి నిగమో భవతి"- నిరుక్తం 6వ అధ్యాయం.

వ్యాఖ్య :- సవీమని అనవగతమేతత్. ప్రసవే ఇత్యవగమః "దేవస్య వయం సవితుః" సవీమని ఇత్యపి నిగమః. సర్వార్థ ప్రసవితుః దేవస్య సవీమని=ప్రసవే— సర్వాక్షాభ్యను జ్ఞానే వయం సదా స్యామేతి యోజనా."

దీని కంతటికిని అర్థము :- మనము సర్వమునకును ఉత్పాదకు (జనకు)డగు దేవునియొక్క ఆజ్ఞలో ఉందుము గాక, అని. దీనినిబట్టి సవిత అనగా పుట్టించినవాడు, తండ్రి అని స్పష్టమగు చున్నది.

2. "హోతృజప స్త్వగ్ని ర్వైశ్వానరీయో భవతి. "దేవ-సవిత రేతం త్వా వృణతేఽగ్నిం హోత్రాయ సహ పిత్రా వైశ్వానరేణ" ఇతి. ఇమ మేవాగ్నిం సవితార మాహ. సర్వస్య ప్రసవితారమ్-...." — నిరుక్తం, 7వ అధ్యాయం. వ్యాఖ్య :- సవితః దేవ=హే సకల జగదుత్పాదక దేవ !"

దీనినిబట్టి కూడ సవిత అనగా సకల జగత్తులను కన్న దేవుడని స్పష్టమగుచున్నది కదా. సాయణులు "షూ ప్రేరణే" షూ ధాతువునకు ప్రేరణార్థమును సామాన్య

ముగా గ్రహించినారు. అందుకు కారణము గాయత్రీ మంత్రములో "ప్రచోదయాత్" = ప్రేరేపించునో, అని యుండుటయే. కాని వేదమంత్రార్థ నిర్ణయములో అతి పూర్వు డగు యాస్కాచార్యునిదే మఱియొక ప్రబలతర ప్రమాణ మును చూతము—

"దేవ స్త్వష్టా సవితా విశ్వరూపః
పుపోష ప్రజాః పురుధా జజాన,
ఇమా చ విశ్వా భువనా న్యస్య
మహద్దేవానా మసురత్వ మేకమ్." —ఋ. 3-55-16.

వ్యాఖ్య - సవితా=సర్వేషా ముత్పాదయితా.

— నిరుక్తం 10 వ అధ్యాయం.

త్వష్టృసూక్తములోనిది ఈ మంత్రము. దీని భావము ఇది. సర్వమును పుట్టించినవాడును, విశ్వరూపములు కల వాడును, దేవుడును అగు, త్వష్ట (విశ్వకర్మ) నానావిధ ప్రాణులను సృష్టించి పోషించుచున్నాడు ఈ సమస్తలోక ములు ఆ దేవుని ఐశ్వర్యమే. ఆయనసొత్తే అన్నమాట. ఇట్లనుటచేత సవిత సాక్షాద్విశ్వకర్మయే అని తేలుచున్నది కదా! ఈ మంత్రములో త్వష్ట, సవిత - అనెడి రెండుపద ములు ప్రయోగింపబడి ఆ ఇరువురు ఒకే తత్త్వమని చెప్పుట జరిగినది. ఇది ఒక గొప్ప విశేషము. "ఏకం సత్" అనెడి సూక్తికి ఇది నిదర్శనము. సవితనుగూర్చిన పెక్కు విశేష

ములు ఋగ్వేద దిగ్దర్శనము 2వ భాగమున గలవు. ఇంకను పరిశోధన సాగుచున్నది.

త్వష్ట, లేదా విశ్వకర్మ ద్యావా పృథువులను సృష్టించిన దేవుడని ఇంకొక మంత్రము అనుచున్నది.

"య ఇమే ద్యావా పృథివీ జనిత్రీ
రూపై రపింశ ద్భువనాని విశ్వా,
త మద్య హోత రిషితో యజీయాన్
దేవం త్వష్టార మిహాయక్షి విద్వాన్." ఋ.10-110-9

"ఓ యజమానుడా! ఏ త్వష్ట్ర దేవుడు ద్యావాపృథువులను సమస్త భువనములు - దేవతిర్యఙ్నరాది నానారూపములు కలవానినిగా సృష్టించినాడో, అట్టి త్వష్ట్ర దేవుని స్తుతులచేతను, హవిస్సుల చేతను పూజింపుము. అనగా తపో దాన యజ్ఞ తత్వచింతనలచేత ఆ జగత్కారణ తత్త్వమును తెలిసికొని ధన్యుడవుకమ్మని తాత్పర్యము. ఇక్కడ జగత్కారణ వస్తువును చింతించి తెలిసికొమ్మనుట చేత, దాని రూపమే అయిన జగమునుకూడ సేవింపు మనియే భావము. ఈ మంత్రములలో సవితయు, విశ్వకర్మయు జగములను కన్నతండ్రులని చెప్పుటచేత ఆ ఉభయులకు ఐక్యము సిద్ధించి వారి అద్వైతభావము సుస్పష్టమగుచున్నది. వేద మంత్రముల తాత్పర్యమును ఇంత గంభీరముగా ఆలోచించి నిర్ణయింపవలయునేకాని, పై పైని చూచి మోహపడి నానాత్వమునకు, భేద దృష్టికీ దాసులుకారాదు. కనుక గాయత్రీ

మంత్రములో జగజ్జనకుడుగా పేర్కొనబడిన సవిత, విశ్వకర్మ సూక్తములో జగత్పితగాను, జనితగాను పేర్కొనబడిన విశ్వకర్మయే అని నిర్బాధముగా సిద్ధాంతమగు చున్నది. అసలు మనము వైదిక వాఙ్మయ పరిశోధనము చేయునప్పుడు లౌకిక వాఙ్మయ పరిధులనుదాటి వైదిక వాఙ్మయమునకు సంబంధించిన నిఘంట్వాదులను అనుసరింపవలయునని మఱువరాదు. ఇంతకంటెను స్వానుభవమును పరమ ప్రమాణముగా తీసికోవలయును.

శంకరులు సౌందర్యలహరిలో లలితాదేవిని "పరబ్రహ్మ మహిషి" అని సంబోధించినారు. అనగా ఆమె మాయాశక్తిరూపిణి అనియే భావము. ఆయన దృష్టిలో శివుడు సాక్షాత్పరబ్రహ్మమే అన్నమాట. కాళిదాసుకూడ-

"వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే,
జగతః పితారౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ."

అని పార్వతీపరమేశ్వరులను జగత్పితలని స్తుతించినాడుకదా! గాయత్రీ విశ్వకర్మలును అట్టివారే. పార్వతి శివుని అర్ధాంగి మాత్రమేకాగా, గాయత్రీదేవి సాక్షాద్విశ్వకర్మ స్వరూపిణియే అయి పరమాద్వైతమును ప్రకటించినది. శివునికి, విశ్వకర్మకు, బ్రహ్మకు అభేదమును పాటించిన ఘట్టములు లౌకిక వైదిక వాఙ్మయములో పెక్కులున్నవి. కొన్నింటిని ఋగ్వేద దిగ్దర్శనమున నిరూపించుట యైనది

## విశ్వశంభువు

శివునకు శంభుడని మాత్రమే పేరుకలదు. విశ్వకర్మను విశ్వశంభువని సూక్తము పేర్కొన్నది.

"విశ్వశంభూ రవసే సాధుకర్మా" (ఋ 10-81-7)
"విశ్వశంభూ ర్విశ్వస్య సుఖస్యోత్పాదకః" అని భాష్యము.

అనగా అఖండ పరిపూర్ణానందమును కలిగించువాడని భావము. ఈ మాట శివునికంటెను విశ్వకర్మకుగల ఆధిక్యమును తెలుపుచున్నది. శివ విష్ణ్వాదులీ దేవదేవుని అంశములనుటను సంస్కృత వాఙ్మయమున స్కాందాది బహుపురాణములందు కాంచగలము. (చూడు — విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము) కొందఱు శైవులు శివుని పరశివ విశ్వకర్మ అని ఆరాధింతురు. "పరశివ విశ్వకర్మాగమము" అని ఒక ఆగమగ్రంథమును కలదు. మైసూరు మహారాజాస్థాన శిల్పాచార్యులు శ్రీ శ్రీ సిద్ధలింగేశ్వరస్వామివారు పరశివ విశ్వకర్మోపాసకులే. ఆయన విశ్వకర్మ విగ్రహమును కూడ నిర్మించి మైసూరులో ప్రతిష్ఠించినారు. బ్రహ్మ, శివుడు, విశ్వకర్మ అను ముగ్గురు సాకారమున పంచశిరస్కులుగానే వాఙ్మయమున వర్ణింపబడినారు. సృష్ట్యాది సర్వకర్మ కర్తలుగా చెప్పబడుటయు వారి ఐక్యమునకు నిదర్శనమే. అయినను గాయత్రికీ విశ్వకర్మకు సామ్యమున్నట్లు, గాయత్రీ శంకరులకుగాని, గాయత్రీ బ్రహ్మలకుగాని లేకుండుట గమనింపదగినది. ఈ గాయత్రీ విశ్వకర్మల పరమాధ్యాత్మికతత్వ

మును గూర్చి శ్రీ కోలవెన్ను పరబ్రహ్మ తీర్థులవారు తమ "జగచ్ఛిల్పము" అను గ్రంథమున విస్తరముగా వివరించినారు. పాఠకులు దానినికూడ చదువుట మంచిది.

"గాయన్తం త్రాయతే ఇతి గాయత్రీ" అనువ్యుత్పత్తిని బట్టి చూచినచో, తనను ధ్యానించు వారిని రక్షించునట్టి తల్లిఅని తేలుచున్నది. గాయత్రీదేవి ప్రకృతికి ప్రతీక అని అనుకొన్నాము కావున గాయత్రీ ధ్యానమనగా ప్రకృతి యొక్క పరిశీలన అనియు తేలుచున్నది ఇక్కడ ధ్యానోపాసన శబ్దములచేత పరిశీలన, పరిశోధన - అని అర్థము చేసికొనవలయును. అనగా చరాచరాత్మక ప్రకృతిని గాయత్రీ స్వరూపముగా భావించి, అందలి అణు పరమాణు మహాదాది వస్తుసముదాయములను పరిశీలించియు, పరిశోధించియు వాటిని, తనకు లోకమునకుగూడ ఉపయోగించునట్లు మలచుకొనుట, ఉపయోగించుకొనుట కూడ గాయత్రీ ఉపాసనమే అగుచున్నదన్నమాట. పిండ బ్రహ్మాండరూప ప్రకృతిని పరిశోధించి ఉపాసించువాడు వాటి రహస్యములను తెలిసికొని వాటిని ఆత్మాభివృద్ధికినీ, విశ్వ కల్యాణమునకునూ ఉపయోగించుకొన జాలుచున్నాడని సారాంశము. ఇట్టి గాయత్రి కూడ తనను ఉపాసించు వారికి తన రహస్యముల నెఱింగించి, ప్రకృతి సేవా ద్వారమున వారిని పరమాత్మాభిముఖులను చేయుచున్నది. ఇట్టి విశేషార్థములనుగూడ భావించుటలో ఎంతయో ప్రయోజ మున్నదని పాఠకులు ఎఱుంగవలెః

యున్నది. కేవలము మనశ్శుద్ధిని మాత్రమే కోరువారు 24, అక్షరములుకల మంత్రముయొక్క అర్థమును భావించుచు దానిని వాచిక, ఉపాంశు, మానసిక రూపములుగా జపించి సిద్ధినిపొందవచ్చును. పూర్ణముగాగాయత్రీ విశ్వకర్మలతత్వము నెఱుంగగోరువారు ఈ గ్రంథకర్త వ్రాసిన "గాయత్రీ విశ్వకర్మలు" అనెడి గ్రంథమును చదివినచో పలు రహస్యములు తెలియగలవు.

ఇంకను విశ్వకర్మనుగూర్చి యజుర్వేదము—

"ఓం నమో విశ్వకర్మణే స ఉ పా త్వస్మా
ననన్యాన్తో్స్మ పాన్మన్యమానః." — 3-2-30.

అన్నది. అనగా శ్రీమ ద్విరాడ్విశ్వకర్మకు నమస్కారము. ఆ భగవంతుడు మమ్ములను రక్షించుగాక! అని భావము. శతరుద్రీయములో "నమ శ్శివాయ చ, భవాయచ" అనెడి వాక్యములనుండి "నమశ్శివాయ" అనెడి పంచాక్షరీమంత్రమును భగవదుపాసకులు గ్రహించినట్లే, యజుర్వేదములోని "ఓం నమో విశ్వకర్మణే స ఉ పాత్వస్మాన్" అను మంత్రమునుండి "ఓం నమో విశ్వకర్మణే" అనెడి విశ్వకర్మాష్టాక్షరీ మంత్రమును పరబ్రహ్మోపాసకులు గ్రహించినారు. ఈ సందర్భమున ఓంకారమును వీడిననేకాని, "నమ శ్శివాయ" పంచాక్షరి అగుటలేదు. ఇక అష్టాక్షరిలో-ఓంకారమును కలుపుకొన్ననేకాని "ఓం నమో విశ్వకర్మణే" అని ఎనిమిది అక్షరములు అగుటలేదు. అట్లే నారాయణ

మంత్రములోకూడ ఓంకారమును కలిపిననే ఎనిమిది అక్షరములు అగును. "ఓంనమోనారాయణాయ" అని. మంత్రాక్షర సంఖ్య కుదురుటకు ఓంకారమును కలుపుకొన్నను, కలుపుకొనకున్నను కలిగెడి నష్టమేమియు లేదు. ఈ విషయమున ఉపాసకులు సందేహింపబనిలేదు. గాయత్రీ మంత్రములోకూడ ఓంకారమును కలుపుకొన్ననేగాని 24 అక్షరములు కావని గ్రహింపవలయును. కేవల హల్లునకు అక్షరముగా లెక్క లేదు. అచ్చుతోగూడిన హల్లునకే అక్షరమని లెక్క. మఱొక విశ్వకర్మ ప్రార్థనమును యజుర్వేదమునుండియే గ్రహింతము —

"విశ్వకర్మా దిశాం పతి స్స నః పశూ న్పాతు.
సోఽస్మాన్ పాతు, తస్మై నమః."

— యజుః కాండం 5.5.5.

దిగ్రూపమైన ప్రపంచమునకు ప్రభువగు విశ్వకర్మ మాపశుధనాదులను, మమ్మును రక్షించుగాక అని భావము. ప్రపంచమనునది దిక్కులనువిడిచి లేదుకనుక విశ్వకర్మ భగవానుడు దిక్కులయందుగల బ్రహ్మాండములకు అధీశ్వరుడని వర్ణింపబడినది. పూర్వ దక్షిణ పశ్చిమోత్తరములు నాలుగు, మూలలు నాలుగు, ఊర్ధ్వదిక్కు అధర (దిగువది-భూమి) దిక్కు- మొత్తము పది దిక్కులగుచున్నవి. వీటినే పురుషసూక్తము అంగులశబ్దముతో పేర్కొన్నది- "అత్యతిష్ఠద్దశాంగులమ్" అని. అనగా ఆ విశ్వకర్మ పరమాత్మ క్రింద

పైనగల భూమ్యాకాశములను, చుట్టునుగల ఎనిమిది దిక్కులను అతిక్రమించి (దాటి) వాటికి ఆవలగూడ వెలుగుచున్నాడన్నమాట. అనగా అనంతుడై దిక్కాలములను దాటి సర్వ పరిపూర్ణుడై ప్రకాశించునది ఆ దివ్యశక్తిఒక్కటే అని భావము.

ఈ రహస్యమును భర్తృహరి కవీంద్రుడు తన సుభాషిత త్రిశతి ప్రార్థనాశ్లోకమున పరమసత్యముగా చెప్పినాడు-

"దిక్కాలా ద్యనవచ్ఛిన్నానంత చిన్మాత్ర మూర్తయే,
స్వానుభూ త్యేకమానాయ, నమ శ్శాన్తాయ తేజసే."

తా॥ స్థల కాలములకు లోబడక-అనగా ఈ కాలమునం దున్నాడు, ఈకాలమున లేడు, ఈ తావున గలడు, ఈ తావున లేడు, ఈ వస్తువున ఉన్నాడు, ఈ వస్తువున లేడు - అనెడి భావములకు తావీయక అంత ర్బహి స్సర్వత్ర ఆకాశమువలెను, పాలలో నేయివలెను వ్యాపించియున్న జ్ఞాన స్వరూపుడే భగవంతుడు,లేక పరమాత్మ. అయితే ఆతత్త్వము స్వానుభవముచే ఎఱుగదగినదేకాని, ఇంకొక మార్గమున తెలియబడనట్టిదనికూడ స్పష్టముచేసినాడు కవి. అట్టి శాంతమయ తేజమునకు నమస్కారము. అనగా తాను దానినే సర్వప్రాప్యముగా ఉపాసించుచున్నా డన్నమాట. వేద ఋషులు ఇట్టి ఋతము (ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణ పింగళం) ను అనుభూతి పొందియే సృష్టిసూక్త, విశ్వకర్మసూక్త, పురుషసూక్త, మోక్షసూక్తాదులను వ్రాసి

యున్నారు. వాటి ఆంతర్యము నెఱుంగుటకే మన దర్శన నిర్మాణ ప్రయత్నము.

ఈ విరాడ్విశ్వకర్మ యజుర్వేదమునకు సంబంధించినదే అయిన యజురారణ్యకమునందలి పురుషసూక్తములో లెస్సగా వర్ణింపబడినాడు. అందలి ముఖ్యమంత్రముల అర్థమును పర్యాలోచించి చూతము.

## పురుషుడు

"సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్ర పాత్
స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్."1

పురుషసూక్తమును మొట్టమొదట ఋగ్వేదమునందే కాంతుము. అది, అందు 16 మంత్రము (శ్లోకము) లలో 64. పాదములుగానున్నది. పిమ్మట యజురారణ్యకమున- 99 పాదములలో విస్తరింపబడినది. మొదటి మంత్రమునకు తాత్పర్యము- సమస్త చరాచరముల సమష్టియే రూపముగా గల బ్రహ్మాండ దేహుడు, విరాట్పురుషుడు అగు పరమేశ్వరుడు భూస్వర్గముల నావరించి యుండుటయేకాక, వాటిని మించికూడ సర్వత్ర వ్యాపించి సర్వ పరిపూర్ణుడై యున్నాడు — అని.

"పురుష ఏ వేదగ్ం సర్వం,య ద్భూతం యచ్చ భవ్యం,
ఉతామృతత్వ స్యేశానో, య దన్నే నాతిరోహతి." 2

తా॥ కనిపించెడి- కనిపించని ఈ జగత్తంతయు ఆ పురు

షుడే. ఇంతకు ముందు ఏ జగము పుట్టి నశించినదో, ఏది ఇప్పుడు నడుచుచున్నదో, ఇకముం దేది రానున్నదో - అది అంతయు ఆ పురుషుడేకాని ఇతరముకాదు. అనగా భూత, వర్తమాన, భవిష్యములయందలి సర్వ బ్రహ్మాండములును ఆయన నిమిత్తోపాదాన కారణములుగా గలదేకాని, తది తరము కాదని భావము. ఇదంతయు పురుషతత్వమే అన్నప్పు డిక దానికంటె ఇతరమేముండును? బంగారము నానావిధ భూషణములయినట్లు, ఆతడే ఆకాశాదిభూత భౌతిక జీవ విశే షము లగుచున్నాడన్నమాట. అంతేకాదు. ఆతడే స్వర్గము నకు మోక్షమునకుగూడ దాత. స్వర్గమోక్ష ప్రదాత అన్న మాట. ఆత డీబ్రహ్మాండసృష్టి యేల చేయుచున్నాడన్నచో, తనకోసము కాదు. జీవులయొక్క కర్మ ఫలములు వారికి భోగ్యమగుటకోసమై, వారి మోక్షము నిమిత్తమై, వారిని తనలో లీనమొనర్చుకొనుటకై ఈ జగత్తుగా తానురూపొందు చున్నాడని మంత్రమనుచున్నది. కారణ స్వరూపుడైన తాను కార్యరూపుడుగా అగుటయే సృష్టి యన్నమాట. కావున లోకమున కార్యము శాశ్వతముకాక, కారణముయొక్క నామరూప వికారమేఅయి, చివరకు కారణములోనే కలియు నట్లు, పరమేశ్వరునియొక్క బ్రహ్మాండ స్వరూప కార్యము కూడ శాశ్వతము కాదన్నమాట.

"ఏతావానస్యమహిమా,అతోజ్యాయాగ్ంశ్చపూరుషః
పాదోఽస్య విశ్వా భూతాని, త్రిపాదస్యామృతందివి.3.

తా॥ భూత భవిష్య ద్వర్తమానరూప జగమంతయు ఆ పరమ పురుషుని మహిమయే, ప్రభావమే, శక్తియే! కాని ఈ మహిమకంటె ఆ పురుషతత్వము ఎంతయో గొప్పది. దానిని దృష్టిలో పెట్టుకొని చూచినప్పుడు, ఈ జగమంతయు దానిలో ఒక పాదము మాత్రమే కాగలదు. తక్కిన మూడు పాదములు ఆ పురుషుడే. మాటవరుసకు మూడు పాదము లనుటయే కాని, ఆతడసలు అనంతుడు. ఈ అంశమునే తైత్తిరీయోపనిషత్తు "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" బ్రహ్మము సత్యజ్ఞాన స్వరూపమైన అంతులేని తత్వమన్నది. పిమ్మట మంత్రములలో సృష్టి ప్రకారము వర్ణింపబడినది. అవిస్తరము ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున వివరింపబడినందున ఇక్కడ వ్రాయుటలేదు. పురుషసూక్త ప్రారంభమునుండి పురుషశబ్దముతో వ్యవహరింపబడినతత్త్వముచివరి భాగమున-

"అద్భ్యస్సం భూతః పృథివ్యై రసాచ్చ,
విశ్వకర్మణ స్సమ వర్తతాధి.
తస్య త్వష్టా విదధ ద్రూప మేతి."

73 వ పాదమునందుండి ఈ పురుషుడు విశ్వకర్మ యని నిర్వచింపబడినాడు. విశ్వకర్మ త్వష్టలకు అభేదముకాని, పితా పుత్రత్వముకాని ఈ మంత్రమునందే చెప్పబడినది. కనుక పురుషసూక్తమున వర్ణింపబడిన జగత్కారణతత్వము విశ్వకర్మయే అనుట సుస్పష్టము. ఈ అంశము మిత్రి హావ్రసిలో ఇట్లు పేర్కొనబడినది—

"పురుష సూక్తమందు పొగడిక గన్నది
విశ్వకర్మ యనుచు విశద మగును;
విశ్వకర్మ నాదివేదమే పొగడగా
అన్యములు నుతింపవా! సుమిత్ర." 845.

ఇట్టి విశ్వకర్మను ఎఱింగిననేకాని, అమృతత్వము (మోక్షము) లేదని పురుషసూక్తమే అనుచున్నది—

"త మేవం విద్వా నమృత ఇహ భవతి,
నాన్యః పంథా అయనాయ విద్యతే."

అట్టి జగత్సృష్టికర్తయు, జగత్కారణుడును, అయిన పరమపురుషుని- విశ్వకర్మ నెఱింగినవాడు అమృతుడు- జన్మ జరామరణములనుండిముక్తుడు కాగలడు. గమ్యమును చేరుటకు ఇంతకంటె వేఱు మార్గము లేదు. ఇదే వాక్యము మఱొక సారికూడ పురుషసూక్తమున ఇట్లు చెప్పబడినది.

"వేదాహ మేతం పురుషం మహాన్తం, ఆదిత్యవర్ణం
తమసః పరస్తాత్, త మేవం విద్వా నమృత
ఇహ భవతి, నాన్యః పన్థాఽయనాయ విద్యతే."

ఒకానొక తత్వవేత్త ఇట్లు పలుకుచున్నాడు. చీకట్లకు (అజ్ఞానమునకు) అవ్వల వెలింగెడి మహానుభావుడగు ఆ పరమ పురుషుని—సూర్యునివలె జ్ఞానతేజమే రూపముగాగల వానిని నే నెఱుంగుదును. ఏలయన, అతని నెఱింగినవాడే ఈ లోకమున అమృతుడు కాగలడు. ఆ తండ్రి నెఱుంగుటకంటెను

గమ్యమును చేరుకొనుట కింకొక మార్గమేదియు లేనేలేదు. కనుక నే నా జగత్కారణతత్వము నెఱింగి అమృతుడ నయినానని_ ఆతత్వజ్ఞుడు లోకమునకు చాటిచెప్పుచున్నాడు. తరువాతి మంత్రమున ఈ పురుషు డెవరో కాదు. అందఱి హృదయములందు నివసించియున్న విశ్వకర్మ స్వరూప ప్రజాపతియే అనుచున్నది సూక్తము. "ప్రజాపతి ర్విశ్వకర్మా" అని మనము ఇంతకుముందు చదివియే యున్నాము. ఆత డెక్కడో దూరమున లేడనుట మంత్రతాత్పర్యము.

"ప్రజాపతి శ్చరతి గర్భే అంతః
అజాయమానో బహుధా విజాయతే,
తస్య ధీరాః పరిజానన్తి యోనిం
మరీచీనాం పద మిచ్ఛన్తి వేధసః."

తా. జగత్కారణుడై ప్రజాపాలకుడైన ఆ విశ్వకర్మ బ్రహ్మాండముయొక్క, జీవులయొక్క లోపల చరించుచున్నాడు. ("ఏష దేవో విశ్వకర్మా మహాత్మా, సదా జనానాం హృదయే సన్నివిష్టః అని మనము చదివియే యున్నాము) ఆతడు పుట్టకుండగనే అనేక విధముల రూపొంద గలడు. అట్టి మహాతత్త్వముయొక్క కారణమును ధీరు లెఱుంగజాలుదురు (క శ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్" అని కఠవల్లి). బ్రహ్మలు, లేక బ్రహ్మవేత్తలు వెలుగులకెల్ల వెలుగైన ఆమహాతేజస్సు(ను) కోసమై కోరుచుందురు. ఇట్లనుటచేత సర్వులు కోరునట్టిదీ, ఎల్లరూ కోరదగినట్టిదే పురుష

సూక్త, విశ్వకర్మ సూక్తములయందు అభివర్ణింపబడిన తత్వమని సిద్ధాంత మగుచున్నది. తరువాతి మంత్రము ఇట్టి పరమతత్వము నెఱింగిన వానికి సర్వదైవ శక్తులు వశీభూతములే అనుచున్నది.

"య స్త్వైవం బ్రాహ్మణో విద్యాత్.
తస్య దేవా అసన్ వశే."

సర్వులచే ఉపాసింపదగిన ఇట్టి పరమ పురుషోత్తముని స్వరూపమును గూర్చియు అతనినుండి కలిగిన సృష్టిని గూర్చియు పుషసూక్తము ఇంకను ఇట్లు వర్ణించినది.

"య త్పురుషం వ్యదధుః. కతిధా వ్యకల్పయన్ ? ముఖం కి మస్య, కౌ బాహూ,కా వూరూపాదావుచ్యే తే?11. బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్, బాహూ రాజన్యః కృతః, ఊరూత ద స్య య ద్వైశ్యః, పద్భ్యాం శూద్రో అజాయత; 12. చంద్రమా మనసో జాతః, చక్షో సూర్యో అజాయత, ముఖా దింద్ర శ్చాగ్ని శ్చ, ప్రాణా ద్వాయు రజాయత. 13. నాభ్యాఆసీ దంతరిక్షం, శీర్ష్ణో ద్యౌ స్సమవర్తత, పద్భ్యాం భూమి ర్దిశః శ్రోత్రాత్,తథాలోకానకల్పయత్"14

తా. ఆవిరాట్పురుషుని ఎట్లు విభజించినారు ? ఎన్ని విధములుగా కల్పించినారు ? ఆతనికి ముఖము, చేతులు, తొడలు, పాదములు ఏవి- అని ప్రశ్నించుకొని, దిగువరీతి సమాధానము చెప్పబడినది. అతనికి బ్రాహ్మణుడు ముఖ

మయినాడు. రాజన్యుడు చేతులు. తొడలు వైశ్యుడు. పాదములనుండి శూద్రులు కలిగిరి. కలిగిరి, అయినారు అనగా అయినారనియే భావము. ఇక చంద్రుడు మనస్సునుండి, సూర్యుడు కంటినుండి, ఇంద్రాగ్నులు ముఖమునుండి, వాయువు ప్రాణమునుండి, బొడ్డునుండి అంతరిక్షము, శిరస్సునుండి ద్యులోకము(స్వర్గము) కలిగెనని భావము. అట్లే ఆ భగవంతుడు లోకములను గూడ కల్పించినాడు. ఇక్కడ కలిగినారని, పుట్టినారని చెప్పుటలోని అంతరర్థము, ఆ యా తత్వములు ఆయనయొక్క ముఖాదులైన అంగములే అని చెప్పుటయే కాని, ఇతరము కాదు. వేదము అయినది, ఉన్నది అను పదములకు "అజాయత" ఇత్యాదులైన పుట్టినారనే పదమును వాడుచుండును. కనుక ఆ పురుషునికి బ్రహ్మజ్ఞాన సంపన్నుడే ముఖము, బలము-శక్తి కలిగిన రాజన్యుడే చేతులనియు, ఊర్ధ్వ శరీరమును నిలువుతొడలే వైశ్యుడనియు, నడచు సాధనములైన పాదములు జగత్ప్రవృత్తికి హేతువులైన వ్యక్తులగు శూద్రులే అనియు భావింపవలెను.

ఇట్టి విరాడ్విశ్వరూపునికి చంద్రుడే మనస్సు, సూర్యుడే కన్నులు, ఇంద్రాగ్నులే ముఖము. వాయువే ప్రాణము, అంతరిక్షమే నాభి (బొడ్డు), దిక్కులే చెవులు, భూమియే పాదములు, లోకములే ఆయన సమష్టి స్వరూపము. ఈ వర్ణననే ముండకోపనిషత్తు ఇట్లు అనువదించి సుందరతరము చేసినది.

"అగ్ని ర్మూర్ధా, చక్షుషీ చంద్రసూర్యౌ
దిశ శ్శ్రోత్రే, వాగ్వివృతా శ్చ వేదాః,
వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య
పద్భ్యాంపృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా." 2.2.4

ఆ విశ్వకర్మకు అగ్ని శబ్దముచే చెప్పదగినదియు, తేజః ప్రధానమును అగు స్వర్గలోకమే శిరస్సు. సూర్య చంద్రులే కన్నులు. దిక్కులే చెవులు. ఆయన మాటలే వేదములు. వాయువే ప్రాణము. ఈవిశ్వమే ఆ దేవదేవుని హృదయము. పాదములే భూమి. ఇట్టివాడైన ఆ దేవుడే సర్వభూతములకు అంతరాత్మ. ఎంత చక్కని వర్ణనము! ఎంతగా భావించి ఉపాసింపదగిన సత్యమో నిశితముగా ఆలోచించి చూడుడు. ఇట్టి వర్ణనలు సత్యమును ఆవిష్కరించునవి వేదోపనిషద్వాఙ్మయమున కోకొల్లలుగా కలవు. మనము వాటిని రాగద్వేషములులేని సత్యబుద్ధితో చదివి మననము చేయవలయును.

భగవద్గీత యేమో పురుషుని క్షరుడు, అక్షరుడు, ఉత్తముడు అని ముర్విధములుగా పేర్కొన్నది—

"ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ,
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే,
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః,
యోలోకత్రయ మావిశ్యబిభ ర్త్యవ్యయ ఈశ్వరః 15 అ.

నశించు స్వభావముగల సర్వభూతములు క్షరపురుషుడు. శరీరాంతర్గతుడై యుండు కూటస్థుడు అక్షరపురుషుడు. ముల్లోకములందు వ్యాపించి, వాటిని భరించువాడే ఉత్తమ పురుషుడు.వాడే ఈశ్వరుడు, పురుషోత్తముడు. శివ, విష్ణు, విశ్వకర్మాది పదములచే పేర్కొనబడిన వాడీతడే,

కొందఱు పురుషసూక్త ప్రస్తుతుడు నారాయణుడని తలంతురు. ఋగ్యజురాది వేదములలో నారాయణపదమే కనబడకపోగా, అట్టివాడు పురుషసూక్త ప్రస్తుతుడెట్లగునో ఆలోచించవలయును. పురుషసూక్తమునకు నారాయణుడు ద్రష్ట అనిమాత్రమే చెప్పబడినది. అందుకే-

"అవ్యక్త మహదాది విలక్ష శ్చేతనో యః పురుషః, స దేవతా." అని వ్రాయబడినది. అవ్యక్తము,మహత్తు,అహంకారము- అనువాటికంటె విలక్షణుడైన చైతన్యరూపుడు అన్నమాట. కఠవల్లి యందు "పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః"అనిచెప్పబడిన హృదయస్థిత విశ్వకర్మయేఇందుస్తుతింపబడినాడని గ్రహించుటసులభమే. వేమన్న వేదములు చదివినాడో లేదో మనకు తెలియదుకాని, వేమన్న వాక్కులు మాత్రము వేదములే. అందుకే ఆ మహానుభావుడు "విశ్వకర్మ లేక విశ్వంబు తా లేదు." అని విశ్వకర్మ దేవుని విశ్వమయత్వమును ఒక్కమాటలో చాటినాడు.

ఇట్టి విశ్వకర్మయొక్క బాహ్యాకారమును వాయుపురాణము ఇట్లు వర్ణించినది—

"చింతయే ద్విశ్వకర్మాణం, శివే వటతరో రథః,
దివ్య సింహాసనాసీనం, మునిబృంద నిషేవితమ్.
ఉపాస్యమాన మమరైః, స్తూయమానం మహర్షిభిః,
పంచవక్త్రం దశభుజం, బ్రహ్మచారి వ్రతే స్థితమ్.
లక్ష్మి సరస్వతీ భ్యాంచ, సంక్షాళిత పదద్వయం,
వక్షస్థలే చ బిభ్రాణం, బ్రహ్మవిద్యా ముమాతనుమ్.
హార కేయూర కటక కుండలాద్యై స్సుశోభితం,
భస్మాంగరాగం దేవేశం వరదం సుస్మితాననమ్.
కుద్దాల కరణీ వాస్యా మయీయంత్రం కమండలుం,
బిభ్రాణం దక్షిణై ర్హస్తై రవరోహక్రమా త్ప్రభుమ్.
మేరుం టంకం స్వనం భూషాం వహ్నించ దధతంకరైః,
అవరోహ క్రమేణైవ వామై ర్వామవిలోచనే!
ఏవం ధ్యాయే న్మహాదేవి, విశ్వకర్మాణ మవ్యయమ్."
— వాయుపురాణ భూఖండ విశ్వకర్మోపాఖ్యానమ్.

తా. పార్వతితో శివుడిట్లు చెప్పుచున్నాడు :- ఓ పార్వతీ, మఱ్ఱిచెట్టుక్రింద దివ్యసింహాసనముమీద కూర్చుండి మహర్షులచే సేవింపబడుచు, దేవతలచే ఉపాసింపబడినవాడై అయిదు మొగములు, పది చేతులు కలిగి లక్ష్మి సరస్వతులు పాదములు కడుగుచుండగా, హృదయమున ఉమా స్వరూప బ్రహ్మవిద్యను తాల్చి, రత్నమాలలు, కర్ణభూషలు,

బాహుపురులు ధరించి, శరీరమున విభూతి పూసికొని, ముఖములందు చిఱునగవు చెంగలింపగా, కుద్దాలము, కరణి, వాస్య, ఘటికాపాత్ర, కమండలువు, మేరువు, టంకము, స్వనము, భూష, అగ్ని-అను వాటిని వరుసగా కుడి యెడమ చేతులతో పైనుండి దిగువకు, దిగువనుండి పైకి ధరించి, దేదీప్యమానముగా వెలుగుచున్న శ్రీమద్విశ్వకర్మభగవానుని ధ్యానింపవలయును. విశ్వకర్మయొక్క సగుణస్వరూపమిందు విగ్రహముగా రూపొందించి ధ్యానముచేయుటకు వీలుగా నున్నది. సాధారణముగా విశ్వకర్మ పరమేశ్వరునిమూర్తిని ఇట్లే శిల్పాచార్యులు నిర్మించుచుందురు. ఈ రూపమంతయు ఆధ్యాత్మిక భావములకు ప్రతీకగానే ఉన్నదని గ్రహింపవలయును. పంచముఖములు- పంచభూతములు మొదలగు సృష్టిలోని పంచతత్వములకు ప్రతీకలే. ఇక విశ్వకర్మనుండి కలిగిన పంచవిధ సృష్టి ప్రకారమును పరిశీలింతము.

## పంచతత్త్వములు

ఇంతవఱకు విశ్వకర్మసూక్త, పురుషసూక్తములు వర్ణించిన సృష్టిప్రకారమును తైత్తిరీయోపనిషత్తు ఇట్లు వివరించుచున్నది.

"ఆత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశా ద్వాయుః,
వాయో రగ్నిః, అగ్నే రాపః అద్భ్యః పృథివీ,
పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యో ఽన్నమ్.
అన్నా త్పురుషః."

జగత్కారణవస్తువగు ఆత్మనుండి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి - అనెడి పంచభూతములు కలిగినవని భావము. ఈ ప్రకారముగానే సృష్టిఅంతయు పంచతత్త్వముల తోనే విస్తరించినట్లు మనము తాత్త్విక దృష్టితో గ్రహింప వచ్చును. ఆకాశాదులయొక్క గుణములు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడివి. అట్లే ఆ భూతలముయొక్క సాత్త్వికాంశల యొక్కఫలముగా ఏర్పడినవి-శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణములనెడి జ్ఞానేంద్రియములు. వాటియొక్క సమష్టిగా ఏర్పడినదే మనోబుద్ధి చిత్తాహంకార జ్ఞాతలతో గూడిన అంతః కరణము. ఇక పంచభూతముల రజోగుణాంశలచేత వరుసగా వాక్కు, పాణి, పాదము, ఉపస్థ, పాయువులనెడి పంచ కర్మేం ద్రియములు కలిగినవి. వాటియొక్క సమష్టి సృష్టియే ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనెడి పంచప్రాణములు. ఈ అయిదింటిలో ప్రాణమునకు ముఖ్య ప్రాణమని కూడ పేరు. అది శరీరమునందు ఉన్నంతవఱకే తక్కినవన్నియు ఉండును. అది పోయినప్పుడు దానితో గూడ తక్కినఅపానాదులు నాలుగును, సూక్ష్మ, కారణశరీర, జీవసహి తముగా లేచిపోవుచున్నవి. జ్ఞానేంద్రియములు శబ్ద స్పర్శ రూప రసగంధములను గ్రహించుచుండగా, కర్మేంద్రియములు వచన, ఆదాన, గమన, విసర్గ, ఆనందములనెడి పనులను ఒనర్చుచు కర్మేంద్రియములని చెప్పబడుచున్నవి. అట్లే జగత్తులో జరిగెడి కార్యములుకూడ- సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము- అని అయిదే ముఖ్యములు.

ఆ కర్మలను చేయుటకు పంచబ్రహ్మలు,పంచమూర్తులు ఉందు రని తరువాత తెలిసికొనగలము.

ఇట్లే మానవులు పొందు దశలుకూడ 1. జాగ్రత్తు, 2, స్వప్నము, 3. సుషుప్తి, 4. సమాధి (తురీయము) 5 తురీయాతీతము అని అయిదే. ప్రకృతి పురుషులు కూడ – సత్తు, చిత్తు, ఆనందము, నామము, రూపము - అనెడి పంచాంశములతో కూడినవారే. అందు సచ్చిదానందములు బ్రహ్మస్వరూపము.నామరూపములు ప్రకృతిరూపము (జగద్రూపము). ఈ అంశమును వేదాంతపంచదశి ఇట్లు పేర్కొన్నది.

"అస్తి, భాతి, ప్రియం, రూపం, నామచేత్యంశ పంచకం,
ఆద్యత్రయం బ్రహ్మరూపం,జగద్రూపంతతోద్వయం."

ఇంతయెందుకు. మన యజుర్వేదమున కూడ_ ప్రాజాపత్యము. 2. సౌమ్యము. 3. ఆగ్నేయము. 4. వైశ్వదేవము. 5. స్వాయంభువము- కలవు. తైత్తిరీయ శీక్షావల్లి-"పంచస్వధికరణేషు" అని 1. అధిలోకము. 2. అధిజ్యోతిషము. 3 అధివిద్యము, 4. అధిప్రజము, 5. అధ్యాత్మము - అని అయిదు అధికరణములనే పేర్కొని వాటి స్వరూపములను నిర్వచించినది.

భౌద్ధమతము ఈ పంచతత్త్వములనే గ్రహించి -1. రూపము. 2. వేదన. 3. సంజ్ఞ. 4. సంస్కారము. 5. విజ్ఞానము- అనెడి పంచస్కంధములనే ఆత్మస్థానమున నిర్వచించినది. అట్లే లోకకల్యాణార్థమై పంచశీలములను ప్రచారము

చేసినది. ఏ సిద్ధాంతమునంగైనను ఈ పంచతత్త్వములు ఏదో ఒక రూపమున చోటుచేసికొనుట మనము పరిశీలనచే తెలియ వచ్చును. పంచతత్త్వ ప్రణాళిక సృష్టికే మూలముకాన, దాని నెవ్వరును కాదనుటకు వీలులేదు. అది దార్శనికమైన హేతు బుద్ధి తిరస్కరింపలేనిదియు, అనుభవమునకు, సత్యమునకు, ఆచరణకు తగినదనియు పాఠకులు గ్రహింపగలరు.

జగమంతయు ఇట్టి పంచతత్త్వములతో గూడినదని చెప్పుటకే భగవంతుడు మన కాలు చేతులకు అయిదేసి వ్రేళ్ళనే సృష్టించి, సృష్టిరహస్యమును మనకు బోధించినాడు. ప్రస్తుతమైన తైత్తిరీయ సంహిత ఇట్లు బోధించుచున్నది—

"పంచభి ర్ధాతా వ్యదధా విదం య
త్తాసాగ్ం స్వస్రారజనయ త్పంచ పంచ,
తాసా ము యన్తి ప్రయవేణ పంచ
నానా రూపాణి క్రతవో వసానాః." — 4-3-11-22

ఈమంత్రమునకు సాయణులు యజ్ఞపరముగా అర్థము చెప్పినారు. ధాతా=సృష్టికర్త, పంచభిః=అయిదింటిచేత (పంచభూతాదులు) ఇదం=ఈజగత్తును, విదధే=సృష్టించెను. అనికూడ సృష్టిపరముగా అర్థముచెప్పి ఇష్టసిద్ధిని పొంద వచ్చును. క్రతు శబ్దమునకు సామాన్యమైన కర్మమని అర్థము చెప్పి, మానవులొనర్చెడి సర్వకార్యములు అని భావింప వచ్చును. లేదా, సృష్టియజ్ఞ మనుకొన్నను ఎట్టి విరోధము

రాదు. ఇట్లు బహ్వర్థములను ఇచ్చుటయేకదా వేదవాణి లక్ష్యము. దీని పిమ్మటి మంత్రముకూడ—

"పంచ వ్యుష్టీ రనుపంచ దోహా
గాం పంచ నామ్నీం ఋతవోఽను పంచ,
పంచ దిశః పంచదశేన క్లృప్తాః
సమాన మూర్ధ్నీ రభిలోక మేకమ్." **4-3-11-24.**

1. అగ్నిహోత్ర, 2. దర్శ, 3 పూర్ణమాస, 4. ఔపవసథ్య, 5. సుతులనెడి పేర్లుగల కర్మలను నిష్పాదించునట్టి పంచోషస్సులని సాయణ వ్యాఖ్యానము. చీకటి, వెన్నెల, ఉభయ సంధ్యలు, పగలు అనెడి పంచదోహాలనిసాయణులు. భూమిని వసంతాది ఋతువులయందు - పుష్పవతి, తాపవతి, వృష్టిమతి, జలప్రసాదవతి అనిచెప్పి, హేమంత శిశిరముల యందు శైత్యవతి - అనినారు. వేదమున కొన్నిపట్ల పంచ ఋతువులే చెప్పబడును. అప్పుడు హేమంత శిశిరములను ఒక్కటిగానే లెక్కింతురు. పంచదిక్కులు, పంచఋతువులు, పంచ వాతములు (ప్రాణములు) ఇత్యాది విషయములను, యజుర్వేదీయమంత్రమింకొకటి ఇట్లు నిరూపించుచున్నది.

"పంచానాం త్వా వాతానాం యంత్రాయ ధర్త్రాయ
గృహ్ణామి.పంచానాం త్వర్తూనాంయంత్రాయధర్త్రాయ
గృహ్ణామి. పంచానాం త్వా దిశాం యంత్రాయ
ధర్త్రాయ గృహ్ణామి. పంచానాం త్వా పంచజనా
యంత్రాయ ధర్త్రాయ గృహ్ణామి...."

— కాండం 1. ప్రపా. 6. అను

ఈ మంత్రమునందు స్మరింపబడిన పంచ వాయువులు. పంచఋతువులు, పంచదిక్కులు (ఊర్ధ్వదిక్కుతో) పంచ జనులు (మను,మయ, త్వష్ట్ర, శిల్పి, విశ్వజ్ఞులను వారు)పంచ ఋషులతోగూడ పిమ్మట "ప్రాచీదిశా" మొదలగు మంత్రము లలో గమనింపబడుదురు. ఈ విధముగా పంచసంఖ్య వేదము లందు పరమ ప్రాధాన్యమునంది సృష్టి స్వరూపమును తత్త్వ రహస్యములను చాటుచున్నది.

ఆధ్యాత్మికముగా తీసికొన్నచో సృష్టి కారణములైన పంభూతములు, వాటిచే నిర్వహింపబడెడి పంచకృత్యములు అగుటలో ఆక్షేపముండరాదు. ఇట్టి పంచసంఖ్యను ఆధా రము చేసికొనియే పంచ జనులకును, పంచక్షితులు అనెడి పద మునకును ఆధ్యాత్మికార్థమును సాధించుట, భావించుట తాత్త్వికమార్గ మగుచున్నది. ఈ మార్గము ననుసరించి చూచి నచో పంచభూతములకు, పంచకర్మలకు అధినాథులుగా పంచ బ్రహ్మలు, పంచమూర్తులు, పంచఋషులు మనకు అగపడు చున్నారు. వారే సృష్టిక్రియకు అధిపతియైన బ్రహ్మ, లేక త్వష్ట్రబ్రహ్మ. పాలనకర్మకు ప్రభుడైన విష్ణువు, లేక మయ బ్రహ్మ. లయకారుడైన రుద్రుడు లేక, మనుబ్రహ్మ, తిరో ధానమునకు కర్తయైన ఇంద్రుడు, లేక శిల్పిబ్రహ్మ, అను గ్రహ క్రియకు అధిపతియైన సూర్యుడు, లేక విశ్వజ్ఞబ్రహ్మ అనెడివారు. వీరిలో బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, సూర్యు లనువారు పంచమూర్తులు. మను, మయ, త్వష్ట్ర, శిల్పి, విశ్వజ్ఞులనువారుపంచ బ్రహ్మలు. వీరే విశ్వకర్మ పరమేశ్వరు

నిచే సృష్టింపబడిన ఆదిమ పురుషులు, లేక ఋషులు. ఈ విషయమును విశ్వకర్మ సూక్తమంత్రము ఇట్లు తెలిపినది—

"త ఆయజన్త ద్రవిణగ్ంసమస్మా
ఋషయః పూర్వే జరితారో న భూనా,
అసూర్తా సూర్తా రజసో విమానే
యే భూతాని సమకృణ్వన్నిమాని."—4

ఈ మంత్రమునకు భాష్యము వ్రాయుచు సాయణులు ఇట్లనినారు.త "ఆయజన్త సమకృణ్వన్నిమానీతి....పూర్వో దాహృతేన విశ్వకర్మణా ప్రథమ ముత్పాదితా యే స్రష్టారః, ఇమాని భూతాని=సర్వానేతాన్ ప్రాణినః, సమకృణ్వన్సమ్యగుత్పాదితవన్తః. తే పూర్వే స్రష్టారః, అస్మై=సృష్టాయ జగతే,ద్రవిణం=ధనరూపం భోగ్యజాతం, సమాయజన్త=సమ్యక్సంపాదితవన్తః. కీదృశాః ఋషయః=అతీంద్రియ ద్రష్టారః, సర్వజ్ఞా ఇత్యర్థః భూనా జరితారో న=భూమ్నా స్వకీయేన మహత్త్వేన న కదాచిదపి జీర్ణా=నశ్వరా భవన్తి.కీదృశానిభూతాని?అసూర్తాః=అసుభిఃప్రాణైరీరితాని, ప్రాణయుక్తాఇత్యర్థః. తథా రజసో విమానే సూర్తా-రంజనాత్మకస్య విశేషేణప్రమితౌ స్వ స్వ కర్మభిః సుష్ఠు ప్రేరితాః" దీనిభావము. సూక్తారంభమునందు (పూర్వము) చెప్పబడిన విశ్వకర్మచే సృష్టింపబడిన వైశ్వకర్మణులగు ఆదిమస్రష్టలు (బ్రహ్మలు) గాని, సానగాదులుగాని, మనుమయాదులు గాని, బ్రహ్మవిష్ణ్వాదులుగాని ధనమని చెప్పదగిన- అనుభవింపదగిన వస్తుసముదాయమును లెస్సగా సృష్టించిన అతీం

ద్రియద్రష్టలును, సర్వజ్ఞులును అయి,స్వీయమైన మహిమచే ఎప్పుడును నశింపక శాశ్వతులై రంజకములైన తమకర్మలచేత ప్రేరేపింపబడు ఈ సమస్తభూతములను ప్రాణములతో కూడినవానినిగా పుట్టింపజేసిరి. ఈ మాటచేత బ్రహ్మాదుల సృష్ట్యాదికార్యములు తెలుయుచున్నవి. ఆ సృష్టికర్తలను ద్రష్టలనియు, వారు జగత్సృష్టి చేసిరనియు, జీర్ణులు కార నియు అనుటలో సాయణుల విశాల దృష్టియు, వివిధ వేద విజ్ఞానమును వ్యక్తము లగుచున్నవి.ఉదాహరింపబోవుఅథర్వ వేదమంత్రము "త ఆయజన్త" అనెడి ఋక్కునకు వివరణ గానేయున్నది. అందుకే విశ్వకర్మచే సృజింపబడిన ఆస్రష్టలు వైశ్వకర్మణులని పేర్కొనబడుచున్నారు.

"వాచస్పత ఋతవః పంచ యే నో వైశ్వకర్మణాః,
పరి యే సంబభూవుః. ఇహైవ ప్రాణ స్సఖ్యేనో అస్తు.
తం త్వా పరమేష్ఠిన్, పరి రోహిత ఆయుషా
వర్చసా దధాతు."—కాండం.13 సూక్తం 1.మంత్రం18.

ఈ సూక్తమునకు రోహిత సూక్తమని పేరు. దీని విని యోగముచేత రాజునకు రాష్ట్రభరణ సామర్థ్యము. కలుగ గలదు. ఇందు వర్ణింపబడిన దేవతలు రాజునకట్టి శక్తి నిత్తు రన్నమాట. ఈ మంత్రము వాచస్పతిని సంబోధించి చెప్ప బడుచున్నది. ఇందు పంచ వైశ్వకర్మణులు (విశ్వకర్మ పుత్రులు) పంచఋతువులు, ఆయుస్సును, వర్చస్సును రాజున కొసగి కాపాడుదురుగాక అనుటచేత ఈ పంచవైశ్వకర్మణులు మన్వాదులుగాని, పంచమూర్తులుగాని, సానగాదులుగాని

కావచ్చుననుట స్పష్టము. ఇందుకు వారు విశ్వకర్మపుత్రులని నిరూపింపవలయును. మను, మయ, త్వష్ట, శిల్పి (దైవజ్ఞ) విశ్వజ్ఞులనువారు విశ్వకర్మయొక్క తనయులని శ్రీకాళసాస్త్రి మునీశ్వర కృత విశ్వకర్మపురాణము నుడువుచున్నది—

"భూత్వాథ పురుషాకారో విశ్వకర్మాదిపూరుషః,
ప్రతీకే ష్వస్పృజ ద్దేవా న్విశ్వోత్పత్తి చికీర్షయా.
ముఖేభ్యో బ్రహ్మాణ స్తస్య,జాతామన్వాదయః క్రమాత్
మను, ర్మయ శ్చ, త్వష్టా చ, శిల్పీ, విశ్వజ్ఞ ఏవచ."
— విశ్వకర్మ పురాణం. 5వ అధ్యాయం.

తా. ఆదిమ తత్వమైన విశ్వకర్మ పురుషసూక్తమున చెప్పబడిన పురుషాకారము కలవాడై విశ్వమును సృష్టింప దలచి, తన అంగములయందు దేవతలను సృజించినాడు. ఆయన పంచముఖములనుండి మనువు, మయుడు, త్వష్ట,శిల్పి, విశ్వజ్ఞుడు – అనెడి అయిదుగురు బ్రహ్మలు ఉదయించినారు. అనగా సంకల్పమాత్రమున జనించినారన్నమాట. ఇది సగుణము, సాకారము అయిన వర్ణన. దీనినే దార్శనికదృష్టితో చూచినప్పుడు- పంచభూతములు, వాటిచే వెలసిన నానావిధ వికారములు అయిన విశ్వసృష్టి అని సూక్ష్మదృష్టితో గ్రహింపవలయును. మనవారు పరమ సత్యమైన దార్శనిక భావాలను, కథలుగాను, ఆఖ్యాయికలుగాను వివరించినారు. ఈవిద్య వేదములనుండి నేర్చినట్టిదే.

ఈ పంచబ్రహ్మలనుగూర్చి శైవాగమము పాంచాల బ్రాహ్మణోత్పత్తి ప్రకారమునగూడ ఇట్లు వర్ణింపబడినది—

"అస్త్యేషాం దేవతాః పంచ విశ్వకర్మ ముఖోద్భవాః,
మను, ర్మయ, స్తథా త్వష్టా, శిల్పిక శ్చ, తథైవ చ,
దైవజ్ఞః పంచమః ప్రోక్తాః స్వర్గస్థా యజ్ఞపోషకాః."

తా. విశ్వకర్మ ముఖోద్భవులైన మను, మయ,త్వష్ట, శిల్పి, దైవజ్ఞులనెడివారు స్వర్గమునందుండి యజ్ఞపోషకులై యొప్పుచున్నారు.

విశ్వకర్మసుతులైన మనువు మొదలగు అయిదుగురు సృష్టిప్రవర్తకులని స్కాందపురాణ నాగర ఖండము కూడ అను చున్నది—

"మను, ర్మయ, స్తథా త్వష్టా, శిల్పీ, విశ్వజ్ఞ ఏవ
విశ్వకర్మసుతా, హ్యేతే పంచ సృష్టిప్రవర్తకాః."

మనువు, మయుడు, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞుడు-అనువారు విశ్వకర్మయొక్క అయిదుగురు పుత్రులు. వారే సృష్టిని ప్రవర్తింపజేయువారు. వీరిలో త్వష్ట, జగత్సృష్టిని, మయుడు జగత్పాలనను, మనువు జగత్తుల లయకర్మను, శిల్పి బ్రహ్మ తిరోధానకార్యమును, విశ్వజ్ఞుడు అనుగ్రహాకర్మమును చేయగలరు. అనగా వీరియొక్క సమష్టియైన విశ్వకర్మయే అన్నిటిని చేయువాడైనను, వ్యష్టిగా మన్వాదులు ఆ యా కార్యములకు కర్తలనియు, వారే సృష్టిప్రవర్తకులైన ఆద్యస్రష్టలనియు "త ఆయజన్త" అనెడి మంత్రభావము. దానిని అథర్వవేదమువైశ్వకర్మణపదముచేస్పష్టముచేసినది. ఆ వైశ్వకర్మణులను గూర్చియే మఱొక అథర్వమంత్రము ఇట్లను చున్నది—

"యస్యాం వేదిం పరిగృహ్ణన్తి భూమ్యాం,
యస్యాం యజ్ఞం తన్వతే విశ్వకర్మాణః,
సా నో భూమి ర్వర్ధయ ద్వర్ధమానా."

అథర్వవేదము. 12-1-13.

ఇది పృథివీసూక్తములోని మంత్రము. దీనిభావము ఏ భూమియందు విశ్వకర్మ సుతులైన సానగాదులు, వారి సంతానమైన వైశ్వకర్మణులు యజ్ఞము లొనర్చి లోకకల్యాణమును చేకూర్తురో, అట్టి భూమి తాను వృద్ధిపొంది మనలను వృద్ధిపొందించుగాక- అని భావము. ఇందు భూవృద్ధియే - అనగా దాని సస్యాదిసమృద్ధియే భూప్రజల కల్యాణమనుట గమనింపదగియున్నది.

ఇందు పేర్కొనబడిన మను మయ త్వష్టృ శిల్పి విశ్వజ్ఞులనెడి పంచబ్రహ్మలే బ్రహ్మ విష్ణు రుద్ర ఇంద్రసూర్యులనెడి పంచమూర్తులని ఆ ఉభయులకు అభేదమునే స్కాంద పురాణ నాగరఖండముచెప్పుచున్నది—

తే. గీ. మనువు శివుడును, మయుడు రమాధవుండు,
త్వష్ట పరమేష్ఠి శిల్పి వృద్ధశ్రవుండు,
తక్ష భానుండనగు, నీరు దైవగురులు
విశ్వకర్మాగ్రనందనుల్ వినుతపుణ్య."

— ఆంధ్రనాగర ఖండము. 3-43.

ఇందు పేర్కొనబడిన బ్రహ్మ విష్ణు రుద్ర ఇంద్ర సూర్యులే వరుసగా సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాము లనెడి కర్మల నొనర్చెదరని మన పురాణ వాఙ్మయము

ఘోషించుచున్నది కదా. ఇక పోగా సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణులనెడి పంచఋషులను గూర్చి వివరింపవలసి యున్నది. ఈ సానగాదులు విశ్వకర్మ పరమేశ్వరుని తనయులే అని యజుర్వేదమే అనుచున్నది. వసిష్ఠాది సప్తఋషులు విశ్వకర్మ సుతులే అయినట్లు, సానగాది పంచఋషులును విశ్వకర్మతనయులే అని స్కాంద, బ్రహ్మాండ, వసిష్ఠాది పురాణాదులు పేర్కొన్నవి. చూడుడు. విశ్వకర్మ నుండి సానగాదులు ఎట్లు కలిగినారని శౌనకుడు అడుగగా వసిష్ఠుడు చెప్పుచున్నాడు.

"సుపర్ణ స్సానగ శ్చైవ సనాతన ఇతి స్మృతః,
గురుశ్రేష్ఠోఽహభూన శ్చ ప్రత్నో ధాత్రీ సురక్షకః, 12
విశ్వకర్మ ముఖోద్భూతాః బ్రహ్మణాః పంచ కీర్తితాః."

ఈ సుపర్ణాదిమునులు విశ్వకర్మ ముఖోద్భూతులని శ్లోకభావము. వీరు విశ్వకర్మయొక్క సద్యోజాతాది ముఖమంములనుండి జన్మించినారని తరువాతి శ్లోకములనుచున్నవి. అనగా వారు ఆ దేవదేవుని సంకల్ప మాత్రముచే కలిగి ముఖమువలె సృష్టి కార్యమునకు ముఖ్యభూతులైనారని భావము. "విశ్వకర్మా మనసా యద్విహాయా" అనెడి మంత్రముభగవానునిమనస్సంకల్పమాత్రముననే సృష్టి జరిగినదన్నదికదా! దానికి ముఖోత్పన్నులని కవితాత్మకవర్ణనము. అనగా యోనిసంభూతులుకాక మనోజనిత- మానసపుత్రులన్నమాట. విశ్వకర్మకు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములని అయిదు ముఖములు. వాటినుండియే సానగాదుల జననమని దిగువశ్లోకముల వర్ణన.

"సద్యోజాతముఖే జాత స్సానగో విశ్వకర్మణః. 14
వామదేవముఖో జాతో బ్రహ్మర్షిస్తు సనాతనః,
అఘోరముఖసంజాతో ఽహాభూనో విశ్వకర్మణః. 15
తత్పురుషముఖేజాతః ప్రత్నోఽసౌ విశ్వకర్మణః,
తస్యేశానముఖేజాత స్సుపర్ణో విశ్వకర్మణ. 16

— వసిష్ఠోపపురాణం.కాండం 3 అధ్యాయం.5.

విశ్వకర్మ ముఖములకు సద్యోజాతాదినామములు కలవనియు ఈశ్లోకములు చెప్పుచున్నవి. తైత్తిరీయారణ్యకము 4 వ ప్రశ్నమున ఈ సద్యోజాతాదిమంత్రములు కలవు. వీటిని ఈ గ్రంథమున - 124, 125 పుటలలో చదివినాము

ఈ మంత్రములందు వరుసగా సద్యోజాజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములనెడి ముఖములు పేర్కొనబడుటయు, వాటికి నమస్కరించుటయు గమనింపదగినది. ఈ మంత్రములకు పంచబ్రహ్మమంత్రములనియు పేరు కలదు. ఈపంచముఖములనుండియే సానగాది పంచఋషులు, లేదా మన్వాది పంచబ్రహ్మలు, బ్రహ్మాది పంచమూర్తులు పుట్టినారని ప్రమాణములు కలవు ఈ సద్యోజాతాది ముఖములు శివునికిగూడ కలవని గ్రంథములు చెప్పుచున్నవి. శివ విశ్వకర్మలకు అభేదమును మూలస్తంభాది గ్రంథములు పేర్కొనుచున్నవని తెలిసికొనియే యున్నాము.

## పంచఋషులు

సానగాది పంచఋషులు యజుర్వేదములో ఇష్టకోపధాన మంత్రములందు పేర్కొనబడినారు. ఆ మంత్రము

లను చూతము :— అగ్నిచయన సందర్భమున పంచదిక్కుల యందును, "సువర్ణేష్టకా ఉపదధాతి" బంగారు ఇటుకలను సమంత్రకముగా తీర్చవలయును. వీటిని ప్రాచీ, దక్షిణా, ప్రతీచీ, ఉదీచీ, ఊర్ధ్వములనెడి పంచదిక్కులయందు పేర్చవలయును. అప్పుడీ మంత్రములను పఠింతురు. ఈ మంత్రములలోనే తూర్పుదిక్కు మొదలుకొని ఊర్ధ్వదిక్కువఱకు వరుసగా సానగ, సనాతన, అహాభూన, ప్రత్న, సుపర్ణులనెడి పంచ ఋషులు వినబడుదురు. పంచర్షులు వరుసగా వినబడినట్లు మఱెవ్వరును వరుసగా వినబడుట కానము.

1. ప్రాచీ దిశాం, వసన్త ఋతూనా, మగ్నిర్దేవతా, బ్రహ్మద్రవిణం, త్రివృత్ స్తోమ, స్స ఉ పంచదశవర్తని, స్త్ర్యవి ర్వయః, కృత మయానాం, పురోవాతో వాత, స్సానగ ఋషిః.

2. దక్షిణా దిశాం, గ్రీష్మ ఋతూనాం, ఇంద్రో దేవతా, క్షత్రం ద్రవిణం, పంచదశ స్తోమ, స్స ఉ సప్తదశ వర్తని, ర్దిత్యవా డ్వయః, త్రేతాయానాం, దక్షిణాద్వాతో వాత, స్సనాతన ఋషిః.

3. ప్రతీచీ దిశాం, వర్షా ఋతూనాం, విశ్వే దేవా దేవతా, విడ్ద్రవిణగ్ం, సప్తదశ స్తోమ, స్స ఉ వేకవింశ వర్తని, స్త్రివత్సో వయో, ద్వాపరోఽయానాం, పశ్చా ద్వాతో వాతోఽహాభూన ఋషిః.

4. ఉదీచీ దిశాం, శరదృతూనాం మిత్రావరుణౌ దేవతా పుష్టం ద్రవిణ, మేకవిగ్ంశ స్తోమ, స్స ఉ త్రిణవ వర్తని స్తుర్యవాడ్వయ, ఆస్కందోఽయానా ముత్తరా ద్వాతో వాతః ప్రత్న ఋషిః.,

5. ఊర్ధ్వా దిశాం, హేమన్త శిశిరా వృతూనాం. బృహస్పతి ర్దేవతా, వర్చో ద్రవిణం త్రిణవ స్తోమ, స్స ఉ త్రయస్త్రింగ్ం శవర్తనిః, షష్ఠవా డ్వయోఽభిభూ రయానాం, విష్వగ్వాతో వాత స్సు పర్ణ ఋషిః.

— తైత్తిరీయ సంహిత. 4-3-5-6.

వీటి భావమిది. 1. ఓ ఇష్టకా : నీవు దిక్కులలో ప్రాచివి. ఋతువులలో వసంతమవు. దేవతలలో అగ్నివి. ధనములలో బ్రాహ్మణుల ధనమవు. స్తోమములలో త్రివృత్తవు. పంచదశస్తోమమును ప్రవర్తింపజేయు శక్తివి నీవే. వయస్సులలో అర్ధసంవత్సరమవు. యుగములలో కృతయుగమవు. వాయువులలో తూర్పుగాలివి. ఋషులలో సానగఋషివి. ఇట్లనుచు దిక్కునకు పదిచొప్పున ఇటుకలను పేర్తురు. దక్షిణాది దిక్కులయందును ఇదియే ప్రకారము ఇటుకలపేర్పు జరుగును. విస్తరభయమున తక్కిన మంత్రముల అర్ధము వ్రాయుటలేదు. ఈ అయిదుమంత్రములలోను _ వరుసగా అగ్ని, ఇంద్ర, విశ్వేదేవ, మిత్రావరుణ, బృహస్పతులనెడి దేవతలు, సానగ, సనాతన, అహాభూన, ప్రత్న, సుపర్ణులనెడి బ్రహ్మఋషులు, వసంత, గ్రీష్మ, వర్షా, శరత్, హేమంత శిశిరములనెడి ఋతువులు, బ్రాహ్మణాది ధనములు, కృత,

త్రేతా, ద్వాపర, కలి, అభిభూ- అనెడి యుగములు పేర్కొనబడుట గమనించవలసి యున్నది. యుగములు నాలుగే అని అనుకొందురుగాని, దీనినిబట్టి అభిభూర్యుగ మొకటి అయిదవది కలదని వేదమే చెప్పుచున్నది. ఇది కలియుగాంతమున కృతయుగము రాబోవు సంధిలో వచ్చు నని వేదవాక్యము. ఇందలి ఋషులు విశ్వకర్మయొక్క సద్యో జాతాది పంచ ముఖభూతులే, విశ్వకర్మ మనస్సంభవులేఅని సప్రమాణముగా తెలిసికొనియే యున్నాము.

ఈ ఇటుకలు ప్రాణభృత్సంజ్ఞ కలవనియు, అపాన భృత్సంజ్ఞ కలవనియు రెండువిధములు. "ప్రాచీదిశా" మొాది మంత్రములలోనివి అపాన భృత్సంజ్ఞకలవి. "అయంపురోభు" వాది మంత్రములతో పేర్చునవి ప్రాణభృత్సంజ్ఞ కలవి. ఆ మంత్రముల నిప్పుడు చూతము—

వసిష్ఠాది ఋషి పంచకము

1. అయం పురోభువ స్తస్య ప్రాణో భౌవాయనో వసన్తః ప్రాణాయనో గాయత్రీ వాసన్తీ గాయత్రియై గాయత్రం గాయత్రా దుపాగంశు రుపాగంశో స్త్రివృ త్త్రివృతో రథన్తరగ్ం రథంతరా ద్వసిష్ఠ ఋషిః ప్రజాపతి గృహీతయా త్వయా ప్రాణం గృహ్ణామి ప్రజాభ్యః

2. అయం దక్షిణా విశ్వకర్మా తస్య మనో వైశ్వకర్మణం గ్రీష్మో మానస స్త్రిష్టుగ్గ్రైష్మీ త్రిష్టుభ ఐడ మైడా

ద_న్తర్యామోఽ_న్తర్యామా త్పంచదశః పంచదశా ద్బృహ ద్బృహతో భరద్వాజఋషిః పజాపతి గృహీతయాత్వయా మనో గృహ్ణామి ప్రజాభ్యః.

3. అయం పశ్చా ద్విశ్వవ్యచా _స్తస్యచక్షుర్వైశ్వవ్య చసం వర్షాణి చాక్షుషాణి జగతీ వార్షి జగత్యాఋక్షు మమృ క్షమా చ్ఛుక్ర శ్శుక్రా త్స_ప్తదశా త్సప్తదశా ద్వైరూపం వైరూపా ద్విశ్వామిత్ర ఋషిః ప్రజాపతి గృహీతయా త్వయా చక్షుర్ గృహ్ణామి ప్రజాభ్యః.

4. ఇద ము_త్తరా త్సువ _స్తస్య శ్రోత్రగ్ం సౌవ్యగ్ం శరచ్ఛ్రోత్ర్యనుష్టుప్ఛారద్యనుష్టుభ స్స్వారగ్ం స్వారాన్మంథీ మంథినఏకవింశా ద్వైరాజం వైరాజాజ్జమదగ్నిర్,ఋషిః ప్రజా పతి గృహీతయా త్వయా శ్రోత్రం గృహ్ణామి ప్రజాభ్యః.

5. ఇయ ముపరిమతి _స్తస్యై వాఙ్మతీ హేమన్తో వాచ్యాయనః పఙ్త్రిర్హైమన్తీ పంక్త్యై నిధనవన్నిధనవత ఆగ్రయణ ఆగ్రయణాత్త్రిణవత్త్రియస్త్రింగ్శౌ శాక్వర రైవతేశాక్వరరైవతాభ్యాం విశ్వకర్మ ఋషిః ప్రజాపతి గృహీతయా త్వయా వాచం గృహ్ణామి ప్రజాభ్యః.

— తైత్తిరీయకాండం 4. ప్రశ్న 3. అను 1.

ఈమంత్రములలో పూర్వాది దిక్కులయందు వరుసగా 1 వసిష్ఠుడు, 2 భరద్వాజుడు, 3 విశ్వామిత్రుడు. 4. జ దగ్ని, 5.విశ్వకర్మ అనువారుప్రస్తావింపబడినారు.నాల్గుదిక్క యందును వసిష్ఠాదిఋషులనుప్రస్తావించి ఊర్ధ్వమున

నాలుగు దిక్కులకునూ, నల్వురు ఋషులకునూ పాలకునిగా సృష్టికర్తయైన విశ్వకర్మఋషిని ప్రస్తావించుట ఆయన యొక్క సర్వశ్రేష్ఠతను చాటుచున్నది. అసలు విశ్వకర్మ అన్ని దిక్కులకూ, దిఙ్మయమైన ప్రపంచమునకూ ('విశ్వకర్మా దిశాంపతిః') పాలకుడని 257వ,పుటలో చదివినాము. ప్రాచీదిశా మాది మంత్రములలో కూడ ఊర్ధ్వ దిక్కునందు సుపర్ణ ఋషి స్మరింపబడినాడు సుపర్ణఋషి అనగా బ్రహ్మలలో విశ్వజ్ఞబ్రహ్మయు, మూర్తులలో సూర్యభగవాడును అనిమనకు తెలిసినవిషయమే. ఆయనదివమునకుఅధిపతికదా! అంతేకాదు. సవితగాఆయనకుగల ప్రశస్తిప్రభావములుఋగ్దర్శన తృతీయ భాగమున మనము చదివియే యున్నాము. ఇక అయం పురో భువాది మంత్రములలో వరుసగా 1 ప్రాణము, 2 మనస్సు, 3 చక్షువు 4 శ్రోత్రము, 5 వాక్కు అనెడి ఇంద్రియములు ప్రస్తావింపబడుటకూడఆధ్యాత్మికమైన విశేషము. ప్రాణమను నదిశరీరమునజీవుడు నిలుచుటకుహేతువైన ముఖ్యసాధనము. అది ప్రాణాపాన వ్యానోదాన సమాన రూపములతో హృదయాది ప్రదేశములందు ఉండి దేహమును నడుపుచూ సజీవము చేయుచున్నదని మన మెఱుగుదుము. ఇక మనస్సు అంతరింద్రియమై సంకల్ప వికల్పములు చేయుట మొదలగు అన్ని కార్యములకు ముఖ్యమై యున్నందునను, సూక్ష్మ కారణ శరీరములకు ప్రతీకయై యున్నందునను అది స్మరింప బడినది. ఇక చక్షుః శ్రోత్రములనునవి జ్ఞానేంద్రియము లలో అతిముఖ్యములు. కనుటకు, వినుటకు అవి సాధనములు.

అసలు జగత్తుకూడ నామరూపములతో కూడినదే కదా. నామ (శబ్ద)ములను వినుటకు శ్రోత్రము (చెవి), రూపములను చూచుటకు చక్షువు (కన్ను) అవసరమే గదా. అందుకే శ్రుతికూడ "యచ్చ కించి జ్జగ త్సర్వం దృశ్యతే, శ్రూయతేఽపివా" జగమున ఏదైనను కనబడుచునో, వినబడుచునో ఉండును, అన్నది. కాబట్టి జ్ఞానేంద్రియముల లో చక్షుః శ్రోత్రములు ముఖ్యములు. ఇక అయిదవది వాక్కు. ఇది వాక్పాణి పాదపాయూపస్థలనెడి పంచకర్మేంద్రియములలో ముఖ్యమైనది. ఆకాశ భూతముయొక్క రజోగుణాంశచే కలిగినట్టిది. అంతేకాదు. మనుజులకుగల త్రికరణములైన మనోవాక్కాయములనెడి మూటిలోను నడిమిదై ప్రాచుర్యమునందినట్టిది. "యన్మనసా మనుతే, తద్వాచావదతి, తత్కర్మణాక్రియతే" మనుజులు మనస్సులోని సంకల్పములను మాటలతో బయటివారికి చెప్పవలెను ఆవల వాటిని శరీరముద్వారా చేయవలెను. కనుక వాక్కు ప్రధానమై కర్మేంద్రియములకు ప్రాతినిధ్యము వహించుచున్నది. ఇక ఈ మంత్రముల భావమును పరిశీలింతము—

ఇందు ఒక్కొక్కమంత్రములోను- 1. ప్రజాపతి. 2. ఇంద్రియము. 3 ఋతువు. 4 ఛన్దస్సు 5. సామవిశేషము. 6. గ్రహము 7స్తోమము. 8 పృష్ఠస్తోత్రము. 9 సామఋషి అనెడి తొమ్మిది అంశములు ప్రస్తావింపబడినవి. ఈ ఇష్టకలు తద్రూపములని ఇందలి భావము. మొదటిమంత్రము ఉదాహరణముగా చూతము.

1 పురోభువుడు ప్రజాపతి. ఇష్టక తద్రూపమైనదని భావము. 2. అతనినుండిపుట్టినది భౌవాయనము ప్రాణము. ఇది ఇంద్రియ మన్నమాట. ఇష్టక తద్రూపమన్నమాట. 3. వసన్తము ఋతువు. 4. గాయత్రి ఛందస్సు. 5.గాయత్రీస్తోమము. 6. ఉపాంశుగ్రహము. 7. త్రివృత్ స్తోమము. 8. రథంతరముసామము .9. వసిష్ఠుడుఋషి. ఇష్టకలుతద్రూపములు. యజుర్వేదమున "ప్రాచీదిశా" మాదిమంత్రములో వరుసగా పేర్కొనబడిన సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణలనెడి పంచబ్రహ్మఋషులు విశ్వకర్మయొక్క తనయులే అని స్కాంద, బ్రహ్మాండ, మూలస్తంభాది పురాణములు వక్కాణించుచున్నవి. వీరు విశ్వకర్మయొక్క ముఖభూతులు, ముఖోత్పన్నులు అనికూడ పురాణాగమములందు వర్ణింపబడినారు. ఎట్లో చూతము — వసిష్ఠమహర్షి విశ్వకర్మ తత్వమును లెస్సగా ఎఱింగినవాడు. కనుకనే ఆయన "త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం"అనెడి మంత్రమునకు "బ్రహ్మ విష్ణు రుద్రాణా మంబకం పితరం యజామహే" అని శిష్య సమాహితుడై పలికినాడు. కాగా ఆయన దృష్టిలో బ్రహ్మ విష్ణ్వాది దేవతలకు నేత్రభూతుడైన జనకుడు విశ్వకర్మ పరమాత్మయే అని స్పష్టమగుచున్నది. వసిష్ఠ విరచితములైన యోగ, జ్ఞాన వాసిష్ఠములుకూడ ప్రపంచతత్వమునుగూర్చి అత్యపూర్వ ఫక్కికలో వివరించినవి. వ్యాసరచిత పురాణములకన్నను, వసిష్ఠరచిత వసిష్ఠ పురాణమే పరమప్రమాణము. అందు సానగాదుల జననమునుగూర్చి శౌనకుడడుగగా

వసిష్ఠుఁడు చెప్పినరీతిని లోఁగడ చదివియే యున్నాము (పుటలు 280,281).విశ్వకర్మనందనులైన వీరు (సానగాదులు, మన్వాదులు,బ్రహ్మాదులు)వైశ్వకర్మణులు. విశ్వకర్మజగముల సృష్టికర్త, తండ్రి - అనుకొన్నప్పుడు జనులందఱును వైశ్వకర్మణులే కాఁగలరు. ఈ వైశ్వకర్మణుల ప్రభావమునుగూర్చి అథర్వవేద మంత్రములలో ఇతః పూర్వము 276 వ పుట నుండి చదివియే యున్నాము. ఇక శిల్పోపనిషత్తు, పంచ బ్రహ్మోపనిషత్తుల ప్రమాణములను చూతము—

"....యదా తదా భవ జ్జగ ద్విజ్ఞానశూన్యం-సోఽకామయ తాత్మానం పంచాస్యం. తద్దైవావిరాసీత్ప్రవృత్త్యై. తస్యైవ తేజోఽంశాదభవన్ బ్రహ్మణోమను,ర్మయ, స్త్వష్టా, శిల్పి, విశ్వజ్ఞ ఇతి పంచ. తా సేవం హోవాచ విశ్వకర్మా ప్రవర్తయత లోకం పంచకర్మభి రితి". —శిల్పోపనిషత్తు.

తా. జగదాదియందు విశ్వకర్మ భగవానుడు తన మోములనుండి మను, మయ, త్వష్ట్ర, శిల్పి, విశ్వజ్ఞులనెడి పంచబ్రహ్మలను సృష్టించి, వారిచేత సృష్టిస్థితిలయ తిరోధానానుగ్రహములనెడి కర్మలను చేయించినాడట. ఇట్టి ప్రమాణములు పెక్కులు. ఇక పంచబ్రహ్మోపనిషద్వాక్యముల నాలింతము.

"పంచముఖేభ్యః పంచశీర్షస్యాస్య మనుః ప్రథమః. మయో ద్వితీయః. త్వష్టా తృతీయః. శిల్పీ చతుర్థః విశ్వజ్ఞః పంచమ ఇతి. స ఏవార్కో విధీయతే. సానగ స్సనాతనోఽ

హాభూనః ప్రత్న స్సుపర్ణ ఇత్యేతే చ సర్వే గోత్రపురుషాః." విశ్వకర్మ సూక్తమునందు— "త ఆయజన్త ద్రవిణం సమస్మా ఋషయః పూర్వే జరితారో న భూనా" అనెడి మంత్రము నాధారము చేసికొనియే ఈ ఉపనిషత్తులు బయలుదేరి యుండును. ఋఙ్మంత్రమున పేర్కొనబడిన - తే=వారన బడినవారే ఆదిమ వైశ్వకర్మణ ఋషులు, బ్రహ్మలు, లేక మూర్తులు. ఈ విషయమును పురాణములుకూడ అనుస రించినవి.

వేదములేకాక, ఉపనిషత్తులు, పురాణాగమములును సానగాది పంచర్షుల, మన్వాది పంచ బ్రహ్మల, బ్రహ్మాది పంచ మూర్తుల విషయములను ప్రస్తావించుచు సృష్టి పంచభూతా త్మకము, పంచకర్మాత్మకము, పంచబ్రహ్మాత్మకము, పంచ ఋష్యాత్మకము, అని చాటినవికదా! ఇక పురాణ వాక్య ములను చూతము—

"మను, ర్మయ, స్తథా త్వష్టా, శిల్పీ, విశ్వజ్ఞ ఏవ చ,
విశ్వకర్మ ముఖోద్భూతా బ్రహ్మాణః పంచకీర్తితాః."
— స్కాంద నాగరఖండము.

దీనికి అయ్యంకి బాలసరస్వతి, తురాక రాజకవుల తెలుగు నాగరఖండ పద్యమును చూతము.

క. మనువన, మయుఁడన, త్వష్టన
విను శిల్పియనంగ విశ్వవిదుడన మహిమన్

ఘనులైరి లోకముల మీ
తనయులు; వీరలు సమస్త తత్త్వజ్ఞులిలన్.

— ఆంధ్రనాగరఖండము. 3-9.

వీరికిని సానగాదులకును దిగువశ్లోకములు అభేదమును చెప్పుచున్నవి—

"మను స్సానగ గోత్రశ్చ, సనాతన మయః స్మృతః,
అహభూన స్తు త్వష్టుః స్యాత్, శిల్పి ప్రత్నః ప్రకీర్తితః,
విశ్వజ్ఞ స్తు సుపర్ణ స్స్యా, దేవం గోత్ర ముదీరితమ్.

— స్కాంద నాగరఖండం.

మన్వాదులు సానగాదిగోత్రములు కలవారనుటచేత ఇరువురికిని అభేదము సిద్ధమగుచున్నది. ఇక మనుమయాదులే బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, సూర్యులనెడి పంచమూర్తులని స్కాందనాగరఖండ పద్యమును 279 వ పుటలో చదివినాము. మనము రాగద్వేష రహితులమై సమన్వయించుకొనలేకపోవుట మన దోషమేకాని, శాస్త్రము చేసిన యెగ్గేమియులేదు. వీరు విశ్వకర్మ అని చెప్పబడిన పురుషుని నుండి కలిగినవారు కావున వీరిని పౌరుషేయులనియు శాస్త్రములు పేర్కొన్నవి. కాగా సానగాదులు ఋషులు, పౌరుషేయులుకూడ. బ్రహ్మాండపురాణ ద్వితీయ పటలమునందలి విశ్వకర్మోపాఖ్యానమున ఈ సానగాదుల మహిమ లెస్సగా వర్ణింపబడినది. విస్తర భయమున వ్రాయనైతిని. వాటిని

వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారు వ్రాసిన "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము" శిల్ప కాండమునందలి 161 వ పుటలో కాంచవచ్చును.

సానగాది పంచర్షులు మాత్రమే విశ్వకర్మనుండి పుట్టుట కాదు. వసిష్ఠాది సప్తర్షులుకూడ విశ్వకర్మ సంభూతులే అని ఋగాదివేదములే వక్కాణించినవి. చూడుడు—

"విశ్వకర్మా మనసా ఆద్విహాయా
ధాతా విధాతా పరమోత సందృక్,
తేషా మిష్టాని సమిషా మదన్తి
యత్ర సప్తర్షీ న్పర ఏక మాహుః". ఋ. 10-82.2.

ఈమంత్రముయజుర్వేదీయ విశ్వకర్మసూక్తమున 2వ దిగా ఉన్నది. ఏ విశ్వకర్మ తత్త్వమునందు సప్తఋషులను ఏకీభూతులైనవారినిగా వేదవేత్తలు చెప్పుదురో, ఆవిశ్వకర్మ ఆ సప్తఋషుల వాంఛలను తీర్పగా, వారు సంతోషాతిశయముతో నొప్పినారని మంత్రపుటుత్తరార్థపు భావము. దీనిచేత విశ్వకర్మనుండి సప్తర్షులుకూడ పుట్టినారని తెలియుచునేయున్నది. ఇంతకన్న స్పష్టమైన మంత్రము అథర్వవేదమున కలదు. దానిని, భగద్గీతా శ్లోకమును 157, 158వ పుటలలో చదివియే యున్నాము. ఇంకొక శ్లోకము సృష్టికంతటికిని భగవంతుడే మొదటి మూలకారణమని చెప్పుచున్నది—

"న మే విదు స్సురగణాః, ప్రభవం న మహర్షయః,
అహమాది ర్హి దేవానాం,మహర్షీణాం చ సర్వశః.10-2.

నా ప్రభావాదులనుగూర్చి సుర సమూహములుగాని, మహర్షులుగాని ఎఱుంగరు. నేనే దేవతలకును, మహర్షులకును ఆదియైన సృష్టికర్తను. కనుక సమస్తసృష్టి విశ్వకర్మ పరమేశ్వరునినుండియే అని తెలియవలయును. గీత చెప్పినది విష్ణుని అవతారమైన కృష్ణుడుగదా, విశ్వకర్మతో సమన్వయ మెట్లు ? అందురేమో. విశ్వకర్మ విష్ణువులు, రుద్ర విశ్వకర్మలు మొదలగువారికి అభేదము మా గ్రంథములందు మొదటినుండియు చూపబడుచునే యున్నది. ఈ అంశమును అథర్వవేద మంత్రభాష్య సందర్భమున సాయణులును స్పష్టముచేసియే యున్నారు.

సప్తర్షులకు విశ్వకర్మతోడి సంబంధమును ఇంకొక అథర్వవేద మంత్రముకూడ చాటుచున్నది—

"విశ్వకర్మా మా సప్తఋషిభి రుదీచ్యా దిశః పాతు."

— అథర్వ - 19-17-7.

విశ్వకర్మ సప్తర్షులతోగూడి ఉత్తరదిక్కునుండి కలుగు ఆపదలనుండి నన్ను కాపాడుగాక అని భావము. వేదము విశ్వకర్మనుండి సప్తర్షులు కలిగినారని చెప్పినందున, విష్ణు విశ్వకర్మలకుగల అభేదము తెలియుచున్నది. అట్లే రుద్రాధ్యాయము (నమకము) సర్వము తన స్వరూపమే అని చెప్పగా విన్నాముకదా! కనుక దేవ నానాత్వ మనునది పరమార్థ దృష్టికి లేనేలేదు. పరమార్థమున సర్వం ఖల్విదం బ్రహ్మమే. బ్రహ్మైవేదం సర్వమే. ఏకంసత్తే.

ఇంతయేల, సర్వమునకు ముందు ఉన్నది. ఆ విశ్వకర్మయే అనియు, ఆశక్తికి వెఱచియే సమస్తము ప్రవర్తించుచున్నదనియు, ఎల్లరికీ ఆ దేవదేవుడే పురోహితుడనియు అనేక వేద, వేదాంతవాక్యములు స్పష్టము చేయుచున్నవి. అట్టి వాటిలో యజురారణ్యక పురుషసూక్తమునందలి చివరి మంత్రము లేమనుచున్నవో గమనింతము —

"యో దేవేభ్య ఆతపతి, యో దేవానాం పురోహితః,
పూర్వో యో దేవేభ్యో జాతః, నమో రుచాయ
బ్రాహ్మయే."

తా. దేవతలను తన ఆజ్ఞానువర్తులను చేసికొని ఆ యా పనులు చేయించువాడును, దేవతలకుగూడ పురోహితుడై వారి మేలుకోరువాడును, అందఱికంటెను ముందే స్వయంసిద్ధుడై ఉన్నవాడును, జ్ఞాన స్వరూపుడును అగు ఆ విశ్వకర్మకు నమస్కారము. ఇందలి దేవేభ్య ఆతపతి అను వాక్యమునకు వ్యాఖ్యానమే తైత్తిరీయానందవల్లిలోని—

"భీషాస్మా ద్వాతః పవతే, భీషోదేతి సూర్యః,
భీషాస్మాదింద్ర, శ్చాగ్నిశ్చ, మృత్యుర్ధావతిపంచమః." 8.

అనెడి మంత్రము. దీని భావము :- ఆతనికి వెఱచియే గాలి వీచుచున్నది. సూర్యుడు వెలుగుచున్నాడు. ఇంద్రాగ్నులు తమ తమ పనుల నొనర్చుచున్నారు. అనగా ఎల్ల దైవశక్తులు పనిచేయుట ఆయన ఆజ్ఞవల్లనే అన్నమాట. ఇంతయేల, మృత్యుదేవతకూడ ఆయనకు భయపడియే నియమిత

కాలమున ప్రాణులను కబళించుచున్నది. ఇట్టి వేలకొలది మంత్రములు ఆ విశ్వకర్మ భగవానుని దివ్యశక్తులనే ప్రకటించుచున్నవని తెలియవలయును.

## అవతారములు

### (మూర్తి భేదములు)

విష్ణుమూర్తి దశావతారములనెత్తిన కథలను మనము పురాణములలో చదువుచుందుము. 27 అవతారములనెత్తి నాడనికూడ భాగవతమను చున్నది. వాటిలో కపిలావతారము కూడ ఒకటియే. మత్స్యకూర్మ వామనావతారముల రహస్యము, వాటి అంతరర్థములను అటుంచి, అట్లే హిరణ్యాక్ష, హిరణ్య కశిపుల విషయములనుగూడ అటుంచి చూచినచో, రామావతారమునుండిగల పురుషులు- అనగా రామ కృష్ణ పరశురామావతారములు చరిత్రకు ఎంతో దగ్గరవే అని తెలియుచున్నది. రామావతారకథను (రామాయణమును) వాల్మీకి వ్రాసినాడు. ఇక 18 పురాణములను వ్రాసెనని చెప్పబడు వ్యాసులవారు భారతములో కృష్ణకథను ప్రస్తావించియే యున్నారు. ఆయన కుమారుడైన శుకమహర్షి భాగవతమును పరీక్షిత్తునకు చెప్పెనని అనుచున్నారు. వ్యాస శుకు లిద్దఱును శ్రీకృష్ణునికి సమకాలికులే. అట్లే రామాయణ కథా చిహ్నములు అయోధ్యనుండి మన భద్రాది హంపీలవఱకు వ్యాపించి మనకు నేటికీ సాక్ష్యమిచ్చుచునే యున్నవి. విష్ణువు నానావతారముల నెత్తినట్లే విశ్వకర్మకూడ

అనేకావతారములనెత్తి, అనేక మూర్తి భేదములతో ఆ యా సృష్టి కార్యములను జరిపినట్లు ఋగ్యజురాది వేదములు అనుచున్నవి. ఈ వేదములలోని విశ్వకర్మావతారములను మూర్తి భేదములనికూడ వేదవ్యాఖ్యాతలు, భాష్యకారులు భావించినారు. అందు విశ్వకర్మ త్వష్టృరూపమును తాల్చినట్లు యజురారణ్యకము అనుచున్నది. ఇందుకు పురుషసూక్తము లోని దిగువమంత్రమే తార్కాణము.

"విశ్వకర్మణ స్సమవర్తతాధి
తస్య త్వష్టా విదధ ద్రూప మేతి."

విశ్వకర్మనుండి జగము కలిగినది. త్వష్ట ఆ విశ్వకర్మ నుండియే రూపొందినాడు- అని మంత్ర భావము. ఈ అంశ మును అనేక వేదమంత్రములు చాటుచున్నవి. ఈ విషయ మును ఋగ్వేదదిగ్దర్శనమున వివరించుటయైనదికూడ. ఈ విశ్వకర్మనే విష్ణువును చేసి, ఆయన నాభికమలమునుండి బ్రహ్మ (త్వష్ట) పుట్టినాడని పురాణముల కథనము. ఇందుకు విశ్వకర్మసూక్త మంత్రమే ప్రమాణము.

"అజస్య నాభా వధ్యేక మర్పితం,
యస్మి న్నిదం విశ్వం భువన మధిశ్రితమ్."

ఏ బ్రహ్మయందు ఈ విశ్వభువన ముదయించి ఆధార పడియున్నదో అట్టి విశ్వకర్మయొక్క నాభి స్థానమున జగద్బీజ ముంచబడినది. అని భావము. ఇందలి అజునినాభియే విష్ణు దేవుని బొడ్డు. అందు పుట్టినవాడే సృష్టికర్త అయినబ్రహ్మ.

దీని నింకొక మంత్రమున కూడ కాంచగలము.

"విశ్వకర్మా హ్యజనిష్ట దేవ ఆది
ద్గంధర్వో అభవ ద్ద్వితీయః,
తృతీయః పితా జనితౌషధీనామ్."

— తైత్తిరీయ విశ్వకర్మసూక్తం.

ఈ మంత్రమునకు భాష్యము వ్రాయుచు సాయణులు "విశ్వకర్మా దేవతిర్యగాది విశ్వభేదస్య కర్తా, సత్యలోక నివాసీ చతుర్ముఖో దేవోఽజనిష్ట ఉత్పన్నః. ఆదిత్-అనంతర మేవ తదపేక్షయా ద్వితీయో గంధర్వోఽభవత్-ఉత్పన్నః. తత ఊర్ధ్వ మోషధీనాం పితా పాలకః, పితా చోత్పాదకః సోమః పూర్వోక్త ద్వితీయాపేక్షయా తృతీయోఽభవత్." అనినారు. బ్రహ్మండమున దేవతిర్యగాది జీవభేదములకు కర్త అయిన విశ్వకర్మ, సత్యలోకనివాసి అయిన చతుర్ముఖు (బ్రహ్మ) డయినాడు. అనగా బ్రహ్మవతారమును తాల్చినాడన్నమాట. విశ్వకర్మ బ్రహ్మ అగుట ఆయన తొలి అవతారము. ఈ బ్రహ్మయు, త్వష్టయు ఒక్కరే. ఇక రెండవవాడుగా గంధర్వుడయినాడు. మూడవవాడుగా ఓషధీపాలకుడు పిత అయిన సోముడయినాడని భాష్యవాక్యముల భావము. ఈ గంధర్వుడే మనస్సనుపేరు గలవాడని దిగువ యజుర్వేద మంత్రమనుచున్నది.

"ప్రజాపతి ర్విశ్వకర్మా మనో గంధర్వ
స్తస్య ఋక్సామా న్యప్సరసో వహ్నయః."
— యజుఃకాండం. 3-4-7.

ప్రజాపతియైన విశ్వకర్మ మనోనామక గంధర్వుడయి నాడు. అతనికి ఋక్సామములు అనెడి అప్సరసలు భార్యలు, అని మంత్రభావము. కనుక విశ్వకర్మావతారములలో మొదటిది సృష్టికర్తఅయిన బ్రహ్మ. ఆవల అనేకవిద్యలకు నిలయుడైన గంధర్వుడు. ఆవల సోముడు (చంద్రుడు) అని తేలినది. సృష్టికి మొట్టమొదటివైన ఈ అవతారములకునూ రామ కృష్ణాద్యవతారములకునూ పోలికయెక్కడ ? గంధర్వుడనగా ఆదిత్యుడని దిగువ ప్రమాణము పలుకుచున్నది.

"సూర్యో గంధర్వ స్తస్య మరీచయో౽ప్సరసః."
— తైత్తిరీయ సంహిత. 3-4-7-1.

సూర్యుడనగా గంధర్వుడు. అతని కిరణములే అప్సరసలు. "గావో రశ్మయః, తాన ధరతీతి గంధర్వః ఆదిత్యః. మఱియొక వ్యుత్పత్తిప్రకారము- "గాం వేదలక్షణం ధారయతీతి గంధర్వః" వేదరూప వాక్కులను ధరించువాడు గంధర్వుడు - సూర్యుడే. సూర్యుడు వేదత్రయ స్వరూపుడను మంత్రములుకూడ ఈ అంశమును సమర్థించుచున్నవి. తైత్తిరీయ బ్రాహ్మణ గ్రంథవాక్యము సూర్యుని వేదమయత్వమును ఇట్లు పలికినది. "ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే. (3-12-9) పూర్వాహ్ణమున సూర్యుడు ఋక్సహి

తుడై ఉదయించుచున్నాడు. ఇక మధ్యాహ్న సాయంవేళల యజుస్సామాకారుడై ఉదయించునని తెలియవలయును. ఇంతేకాదు. యాజ్ఞవల్క్యునికి శుక్లయజుర్వేదమును ప్రవచించినదికూడ సూర్యుడేకదా. కనుక అయన వేదజనకుడైన విశ్వకర్మ స్వరూపుడే అనుటలో అనుమానము లేదు. సూర్యుడు వేదత్రయ స్వరూపుడను విషయమును "అసావాదిత్యో బ్రహ్మ" అనెడి వాక్యమునైతము బలపఱచుచున్నది. దాని భావము—ఈ ఆదిత్యుడు బ్రహ్మస్వరూపుడు. బ్రహ్మమనగా వేదము. తైత్తిరీయారణ్యకములోని చతుర్థ ప్రశ్నమునందలి దిగువ మంత్రము ఆదిత్యుడు వేదస్వరూపుడే అనుచున్నది.

"ఆదిత్యో వా ఏష ఏత న్మండలం తపతి. తత్ర తా ఋచ స్త దృచాం మండలం, స ఋచాం లోకోఽథ య ఏష ఏతస్మి న్మండలేఽర్చి ర్దీప్యతే తాని సామాని. స సామ్నాం మండలం, స సామ్నాం లోకోఽథ య ఏష ఏతస్మి న్మండలేఽర్చిషి పురుష స్తాని యజూగ్ంషి, స యజుషాం మండలం, స యజుషాం లోక స్సైషా త్రయ్యేవ విద్యా. తపతి య ఏషోఽ న్త రాదిత్యే హిరణ్మయః పురుషః." (28-13)

తా. ఆదిత్యు డీ మండలమున వెలుగుచున్నాడు. అక్కడే ఋక్కులున్నవి. అందుచేత అది ఋఙ్మండలమూ, ఋక్కుల లోకమూ అగుచున్నది. ఈ మండలమున వెలిగెడి

దీప్తియే సామములు. కాన అది సామమండలము, సామ లోకము. ఈ మండలమునగల తేజోరూప పురుషుడే యజుస్సులు. అదియే యజుర్మండలమూ, యజుస్సుల లోకమూను. ఈ మొత్తమే త్రయీవిద్య. ఈ ఆదిత్యాంతర్గతుడైన హిరణ్మయ పురుషుడు- "సహస్రశీర్షా పురుషః" అని చెప్పబడిన విశ్వకర్మస్వరూప పురుషుడే.

"ప్రజాపతి ర్విశ్వకర్మా మనో గంధర్వః."

అన్నవాక్యమునందలి మనశ్శబ్దమునకు ఆధ్యాత్మికమైన దార్శనిక దృష్టితో కొంత చెప్పికొన్నాము. మఱికొంత ఇప్పుడు చెప్పికొందము. జీవస్రష్ట అయిన విశ్వకర్మ అనగా జగత్కారణ బ్రహ్మమే. దానినుండి అవ్యక్త (ప్రకృతి) మనెడి మనస్సు తోచినది. బ్రహ్మమున తోచిన అవ్యక్తమే మనస్సయి జగత్తులసృష్టికి కారణముయినదనికదా వేదాంత మనుచున్నది. ఆ మనస్సును గంధర్వుడుగా చెప్పుటయన భోగలాలసత్వమునకు సంకేతము. గంధర్వులు నృత్త గీత వాద్యాది కళాప్రియులు కదా. అట్లే మనస్సుకూడ భౌతిక భోగలాలసమై ఈశ్వరాభిముఖముగా ఉండదుకదా. ఇంతకూ సారాంశము— అవ్యక్త బ్రహ్మము జగత్కారణ ద్రవ్యము (మనస్సు)గా తోచినదనుట. జీవుడనువానినుండి మనస్సును తొలగించినచో ఇక మిగులునది అఖండ పరబ్రహ్మమే; జగత్కారణ విశ్వకర్మయే. భౌతికుడైన ఆదిత్యుడు కూడ మాయాంతర్గతుడేకాన అతనిని ఆ మనస్సుగా ఎన్నుట సమం

జనమే. ఇది అంతయు సూక్ష్మతరాలోచనచే భావింపవలసిన పరమార్థము. మనస్సు ఉన్నప్పుడే జాగ్రత్స్వప్నములు కలుగును. ఆ మనస్సు సుషుప్తిలో మ్రగ్గినప్పుడు ప్రాజ్ఞుడొక్కడే మిగులుచున్నాడు. సుషుప్తినుండి ఈవలకు రాగానే జీవుడు మనో భూమికనే అధిష్ఠించును. కావున అఖండపరమాత్మ యొక్క రెండవమెట్టు (స్వప్నజాగరములు) మనస్సేకాని ఇంకొకటి కానేరదు. కాన మనస్సు జగత్తులను సృష్టించు బ్రహ్మమే అగుచున్నది. ఇది తత్త్వజ్ఞుల అనుభవమునుబట్టియు రూఢియగుచున్న శ్రీ రమణ మహర్షి సూక్తులందు ఈసత్యము తెల్లమగుచుండును.

## మూర్తుల సమైక్యము

ఇంకను యజుర్వేద పంచమకాండములోని మంత్ర మొకటి ఇట్లనుచున్నది.

"ఆపో వా ఇద మగ్రే సలిల మాసీ త్స ఏతాం ప్రజాపతిః ప్రథమాం చితి మపశ్య త్తా ముపాధ త్త. త దియ మభవ త్తం విశ్వకర్మాబ్రవీ దుప త్వా యానీతి-నేహ లోకోఽ స్తీతి(3) అబ్రవీ త్స ఏతాం ద్వితీయాం చితి మపశ్య త్తా ముపాధ త్త. త దంతరిక్ష మభవ త్స యజ్ఞః ప్రజాపతి మబ్రవీ దుప త్వా యానీతి. నేహ లోకోఽ స్తీత్యబ్రవీ త్స విశ్వకర్మాణ మబ్రవీ దుపత్వా యానీతి. కేన నోపైష్య తీతి. దిశ్యాభి రిత్యబ్రవీ త్తం దిశ్యాభి రుపై త్తా ఉపాధ త్త. తా దిశః (4) అభవన్ త్స పరమేష్ఠీ ప్రజాపతి మబ్రవీ

దుపత్వా యానీతి. నేహ లోకోఽస్తీత్య బ్రవీత్స విశ్వ కర్మాణం చ యజ్ఞం చాబ్రవీ దుపత్వాయానీతి. నేహ లోకోఽస్తీ త్య బ్రూతాం, స ఏతాం తృతీయాం చితి మపశ్య త్తా ముపాధత్త. త దసా వభ త్స ఆదిత్యః ప్రజా పతి మబ్రవీ దుపత్వా, (5) ఆయానీతి నేహలోకోఽస్తీత్య బ్రవీ త్స విశ్వకర్మాణం చ యజ్ఞం చాబ్రవీ దుపవా మాయా నీతి. నేహ లోకోఽస్తీ త్యబ్రూతాం స పరమేష్ఠిన మబ్రవీ దుపత్వాయానీతి. కేన మోపైష్యసీతి. లోకం పృణయే త్యబ్రవీ త్తం లోకం పృణయా ప్ర త్తస్మా దయాతయామ్నా లోకం పృణాయాతయామా హ్యసౌ (6) ఆదిత్య స్తానృష యోఽబ్రువ న్నుపవ ఆయామేతి. కేన న ఉపైష్య థేతి. భూమ్నేత్యబ్రువన్తాం ద్వాభ్యాం చితీభ్యా ముపాయన్ త్స పంచచితీకః సమాపద్యత య ఏవం విద్వా నగ్నిం చినుతే, భూయానేవ భవ త్యయ మిమాం ల్లోకాన్ జయతి. విదు రేనం దేవా అథో ఏతాసామేవ దేవతానాం సాయుజ్యం గచ్ఛతి." (7) యజుఃకాండం 5-7-5.

ఈ మంత్రములు అగ్నిచయనమునుగూర్చి ప్రస్తావించు నట్టివి. ఇందు ప్రజాపతి, విశ్వకర్మ, పరమేష్ఠి, ఆదిత్యుడు— మున్నగువారు ప్రస్తావింపబడినారు. "ప్రజాపతి ర్విశ్వకర్మా మనో గంధర్వః" అనెడి యజుర్వాక్యములు విశ్వకర్మ ప్రజా పతియే అని పలుకుచున్నవి. అట్లే పరమేష్ఠి శబ్దముకూడ బ్రహ్మనుగూర్చి చెప్పుచూ భిన్నదేవతా నామముగా కన్ప ట్టుచు తికమక పెట్టుచున్నది. ఈ వివాదమును వేదార్థవేది

అయిన భాష్యకారులు సాయణు లిట్లు తనవాక్యములలో పరిష్కరించుచున్నారు.

"స పరమేష్ఠీతి- ప్రజాపతి ర్విశ్వకర్మా పరమేష్ఠీ త్యేతే త్రయో హ్యేకస్యైవ మూర్తిభేదాః."

ప్రజాపతి, విశ్వకర్మ, పరమేష్ఠి అనువారు ఒకే ఒక దేవునియొక్క వివిధ మూర్తులు అని స్పష్టము చేసినారు. ఇట్టి స్వాతంత్ర్యము భాష్యకారుల కెక్కడిది? అని ప్రశ్నింపవచ్చును. ఆయన విశ్వకర్మ తత్త్వమును సంపూర్ణముగా నెఱింగిన అనుభవి; విశ్వకర్మ సూక్తములకు అత్యద్భుతభాష్యమును వ్రాసిన పండితుడు. కనుకనే "యో దేవానాం నామధా ఏక ఏవ" అనెడి సూక్తవాక్యమునకు భాష్యము వ్రాయుచు ఆ విశ్వకర్మ ఒక్కడే సర్వదేవతల నామరూపములను తాల్చినాడని వ్రాసినారు. ఆ ప్రకారమే ఇచ్చట తాను స్వతంత్రింపక వేదమార్గమునే అనుసరించి ప్రవచించినారు. "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" అనెడి వేదవాక్యముకూడ ఈ భావమునే చాటుచున్నదికదా. కనుక జగత్కర్తయైన విశ్వకర్మయే బ్రహ్మ, విష్ణు, రుద్ర, ప్రజాపతి, పరమేష్ఠి, హిరణ్యగర్భ, త్వష్టృ, పురుషాది బహువిధ నామములను రూపములను తాల్చి బహు- అవతారములను పొందినవాడై ప్రకాశించినాడని వేదతాత్పర్యము. ఇది పురాణముల కెక్కలేదు. సృష్టి అయిన మొదటి కాలమున అగ్నిచయనాది యాగములు బయలుదేరిన

కాలమునాటిదీ వృత్తాంతము. వ్యాసులవారీ విశ్వకర్మావతార విశేషములనుగూర్చి పురాణములు వ్రాయదలచినట్లు లేదు. అందుకే అట్టి విశ్వకర్మను విష్ణునిగా భావించి, విష్ణుని చేసి ఆయన పురాణరచన కొనసాగించినాడు.

## భౌవనావతారము

మనము పఠింపబోవు చమకములో చివర "అన్నాయన శ్చాన్త్య శ్చ, భువనో భౌవన శ్చ" అని యున్నది. ఇందలి భువనమహర్షి పుత్రుడే భౌవన విశ్వకర్మ. ఈ భౌవన విశ్వకర్మ దర్శించినవే ఋగ్వేద దశమ మండలములోని 81, 82 సంఖ్యలుగల విశ్వకర్మసూక్తములు, ఆ సూక్తముల యందు బ్రహ్మాండసృష్టి వర్ణింపబడుటయేకాక, అద్వైతము కూడ లెస్సగా ప్రశంసింపబడినదని మేము ఋగ్వేద దిగ్దర్శనమున వ్రాసియే యున్నాము. ఈయన భువనదేవుని పుత్రుడైనందున భౌవను డయినాడు ఆయన విశ్వకర్మావతారుడు కావున, విశ్వకర్మ నామమును తాల్చి భౌవన విశ్వకర్మగా ప్రసిద్ధి నందినాడు. ఈ అంశము విష్ణు రహస్యమను గ్రంథమున భువనుడు ద్వాదశభృగువుల లోనివాడని నుడువబడినది.

"భువనో నామ యో దేవో విశ్వకర్మాథత త్సుతః,
ప్రసిద్ధో య స్స శాస్త్రేషు భౌవనః సురవర్ధకీ."

— విష్ణురహస్యం. 35వ అధ్యాయం.

ఈ భౌవన విశ్వకర్మయే వేదయుగమున మొట్ట మొదటి సార్వభౌముడైనట్లును, కశ్యపుడు ఆయనకు పట్టాభిషేకము నిర్వహించినట్లును ఐతరేయ బ్రాహ్మణము పలుకుచున్నది.

"ఏతేన హ వా ఐంద్రేణ మహాభిషేకేన కశ్యపో విశ్వకర్మాణం భౌవన మభిషిషేచ. తస్మాదు విశ్వకర్మా సమస్తం సర్వతః పృథివీం జయన్ పరీయాయాశ్వేన చ మేధ్యేనేజే." — పంచిక 8- ఖండిక 21- అ 4.

కశ్యపమహర్షి ఇంద్రసంబంధమైన మహాభిషేకము చేత భువనపుత్రుడైన భౌవనవిశ్వకర్మకు పట్టముకట్టెను. దానిచేత ఆతడు సమస్త భూమండలమును గెలిచి సార్వభౌముడై అనేకాశ్వమేధములను చేసెను. దీనినిబట్టి వేదకాలపు మొట్టమొదటి సార్వభౌముడు భౌవనవిశ్వకర్మయే అని తెలియుచున్నది. విశ్వకర్మయొక్క భౌవనావతారము భౌవనమూర్తి. ఈ విషయము శతపథ బ్రాహ్మణ అశ్వమేధ కాండమునగూడ ఇట్లు ప్రస్తావింపబడినది.

"స వా ఏష సర్వమేధో దశరాత్రో యజ్ఞక్రతుర్భవతి. (2) విశ్వకర్మ ఈ సర్వమేధమును చేసినాడని దిగువ మంత్ర మనుచున్నది—

"తేన హైతేన విశ్వకర్మా భౌవన ఈజే. తేనేష్ట్వాత్యతిష్ఠత్సర్వాణి భూతానీదగ్ం సర్వ మభవదతి తిష్ఠతి

సర్వాణి భూతానీదగ్ం సర్వం భవతి య ఏవం విద్వాన్ త్సర్వమేధేన యజతే, యో వై తదేవం వేద." 14

తా. సర్వమేధమనెడి యజ్ఞక్రతువొకటి కలదు. దానిని పదిరోజులు నిర్వహింతురు. అట్టి క్రతువును భౌవన విశ్వకర్మచేసి సర్వభూతములను అతిశయించి మహనీయుడై ఒప్పెను. ఆతడు సర్వము ఆయెను. సర్వమును అతిక్రమించి ప్రకాశించెను. ఈ యజ్ఞమునకు కశ్యపుడు పౌరోహిత్యము వహించెనని తరువాతి మంత్రము లనుచున్నవి.

"తం కశ్యపో యాజయాంచకార. తదపి భూమిః
శ్లోకం జగౌ - న మా మర్త్య కశ్చన దాతు
మర్హతి విశ్వకర్మన్ భౌవన! మాం దిదాసిథ.
నిమంక్ష్యేఽహం సలిలస్యమధ్యే. మోఘ
స్త ఏష కశ్యపాయం స సంగర ఇతి." — ఐతరేయం.

ఐతరేయ బ్రాహ్మణము విశ్వకర్మతోపాటు జనమేజయుని వఱకు తొమ్మండుగురు సార్వభౌములను పేర్కొన్నది. ఇది చారిత్రకాంశము.

## ప్రాభాసుడు

ఇంకొక విశ్వకర్మ బృహస్పతి చెల్లెలైన యోగసత్తకు పుట్టినట్లు తెలియుచున్నది. ఈ కథ భారత, వాయు, విష్ణు పురాణములలో కాంచగలము.

"బృహస్పతే స్తు భగినీ వరస్త్రీ బ్రహ్మవాదినీ,
యోగసిద్ధా జగత్ కృత్స్న మసక్తా విచచార హ.

ప్రభాసస్య తు సా భార్యా వసూనా మష్టమస్య హ,
విశ్వకర్మా సుత స్తస్యాం జాత శ్శిల్పిప్రజాపతిః.
కర్తా శిల్పసహస్రాణాం త్రిదశానాంచ వాస్తుకృత్.
— వాయు పురాణోత్తర భాగం. అధ్యాయం 22.

విశ్వకర్మా ప్రభాసస్య పుత్రః శిల్పిప్రజాపతిః."
— మత్స్య పురాణం.

"ప్రభావసో స్తు భార్యాయాం వసూనా మష్టమస్య హ
విశ్వకర్మా మహాభాగో జజ్ఞే శిల్పిప్రజాపతిః."
— మహాభారతాది పర్వం. 62 అధ్యాయం.

దీనికి నన్నయగారి తెలుగు-

"ఆ విశ్వకర్మ నిర్మిత
దేవవిమానుం డశేష దివ్యాభరణ
శ్రీవిరచన పరితోషిత
దేవుడు శిల్పప్రజాపతియు నై నెగడెన్."

అష్టమవసువైన ప్రభాసుడు, లేక ప్రభావసునికినిబృహస్పతి చెలియలైన యోగసక్తకును పుట్టిన విశ్వకర్మనుగూర్చి మహాభారతాదులు వచించినవి. ఇతడు అష్టమవసువు యొక్క తనయుడుకావునను, వసురుద్రాదిత్యులు విశ్వకర్మచే సృజింపబడినవారు కావునను ఈ విశ్వకర్మకు అనాది విశ్వకర్మయొక్క సంబంధముగపడుచున్నది. ఈ యోగసక్తాపరిణయము- అను కావ్యమును మద్దిపట్ల అప్పన్న

శాస్త్రి, కొప్పరపు(?) — కొట్ర వేంకటరామకవి — అనెడి కవిద్వయము తెలుగున రచించినారు. దానిని ఆంధ్రప్రదేశ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ పరిశోధనాశాఖ డైరెక్టరైన డా. వి. వి. ఎల్. నరసింహారావుగారు 20 నెంబరు పుస్తకముగా, 1986 లో ముద్రించి ప్రకటించినారు

భువనపుత్రుడు భౌవన విశ్వకర్మగా ప్రసిద్ధుడయి నాడనియు, ఆతడు ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్తములకు ద్రష్టఅనియు చెప్పికొనినాముకదా. భువన భౌవనులను చమకముయొక్క 11వ అనువాకము "భువన శ్చ భౌవన శ్చ" అని పేర్కొన్నది.

కృష్ణయజుర్వేద ప్రథమకాండ సప్తమ ప్రశ్నము కూడ "ఆప్త్యాయనశ్చా ప్త్యశ్చ, భౌవనశ్చ, భువనశ్చాధిప తిశ్చ" (౩౮) అని పేర్కొన్నది.

మత్స్యపురాణ మీ భువన, భౌవనులు భృగుదేవతా గణములోని వారని పలుకుచున్నది—

"భువనో, భౌవనశ్చైవ, సుజన్య, స్సుజన స్తథా,
శుచిః, క్రతుశ్చ, మూర్ధాచ, త్యాజ్యశ్చ, వసుధ స్తథా.
ప్రభవ శ్చాత్యయ శ్చైవ దక్షోఽథ ద్వాదశ స్తథా
ఇత్యేతే భృగవో నామ దేవా ద్వాదశ కీర్తితాః."
— 203 అధ్యాయం.

1. భువనుడు, 2. భౌవనుడు, 3. సుజన్యుడు, 4. సుజనుడు, 5. శుచి, 6. క్రతువు, 7. మూర్ధుడు, 8. త్యాజ్యుడు,

9. వసుధుడు, 10 ప్రభవుడు, 11. అత్యయుడు 12. దక్షుడు అను పన్నిద్దరూ భృగుగణమునకు చెందిన దేవతలు. దీనిని బట్టి విశ్వకర్మ భృగ్వంగిరోవంశములందుకూడ అవతరించి నాడనుట స్పష్టము. భువన భౌవనులు విశ్వకర్మీయ శిల్పు లగుటచేతనే భృగువులు రథకారులై శిల్పములు చేసినారనెడి వేదవాక్యములు సమన్వయించుచున్నవి.

ఈ విశ్వకర్మావతారములను, వారి జగద్రక్షాకార్య ములను వ్యాసునివలె ఎవరేని పురాణించినచో వారిచరిత్రలు కూడ జగత్ప్రసిద్ధములై మనకు అనుసరణీయములై యుండె డివి. కాని వేదములోని లోకకల్యాణకరములైన పెక్కు సత్య కథలకు అట్టి భాగ్యము కలుగలేదు. ఈ విషయము లను యజుర్వేదదర్శన ద్వితీయ భాగమున చర్చింతుము.

వేదములలో విశ్వకర్మ పరమాత్మగాను, పరాత్పరుడు గాను, జగజ్జనకుడుగాను, బ్రహ్మాదుల రూపుడుగాను, మహ దాది స్వరూపుడుగాను, ప్రజాపతిగాను, కూటస్థఋషి గాను, ఇంక ఎన్నెన్నో రూపములు, అవతారములు ధరించిన వాడు గాను అడుగడుగునకు అగపడుచుండును. అయినను కొన్నిం టిని మాత్రమే చెప్పుట అయినది.

## చ మ క ము

తైత్తిరీయసంహిత చతుర్థకాండమునందలి పంచమ ప్రశ్నములోని 11 అనువాకములు రుద్రాధ్యాయమను పేర

నమకముగా ప్రసిద్ధమైనవి. అటుపిమ్మట షష్ఠప్రశ్నములో విశ్వకర్మసూక్తములుకలవు.ఇకసప్తమప్రశ్నములో మొదటి నుండి 11 అనువాకములలో చమకము కొనసాగుచున్నది. ఈ నమక చమక మంత్రములతోనే మనము రుద్రాభిషేక కార్యము నొనర్చుచున్నాము. నమక చమకములు రెండును పదునొకండేసి అనువాకములతో ముగియుచుండుట గమనింపవలసియున్నది. రుద్రులు పదునొకండుసంఖ్య కలవారు కాన, ఇవి రెండును పదునొకండేసి అనువాకములు కలిగియుండుట ఔచితీయుక్తము. అంతఃకరణముతో కలసిన జ్ఞానకర్మేంద్రియములుకూడ పదునొకండే అగుచుండుట విచిత్రము. ఈ నమకచమకములకు నడుమ షష్ఠప్రశ్నములోనే విశ్వకర్మసూక్తములున్నవి. రుద్రులు విశ్వకర్మ తనయులని మనము వేదాదులయందు చవిదియేయున్నాము.అట్టివిశ్వకర్మ సూక్తములకు ఆవల ఈవల ఈనమక చమకములుండుట వేద మాతకు ఇష్టముకాబోలు. నమకము నమస్కారములతో కొనసాగిపోగా,"చ,మే" అనుమాటలతోనాకు అదికావలెను. ఇదికావలెను అనువాక్యములతో చమకముకొనసాగుచున్నది. ఇందుభగవదుపాసకుడు జీవితమున తనకు కావలసినవాటి నన్నిటిని పేర్కొనుటను గమనింతుము. నమకమున-ప్రకృతిని, అందలి వస్తువులను, జీవులను భగవద్రూపముగానే భావించి, వాటికీ వాటి కర్తయైన భగవంతునికీ సహస్ర విధముల నమస్కారములు చెల్లింపబడినవి. ఈ చమకమునందు ఆ ప్రకృతి, అందలి సర్వవస్తువులు తమ సౌఖ్యముకొరకై

తమకు కావలెనని కోరబడుచున్నది. కాగా మొదటిది ప్రకృతి పర్యవేక్షణము, భగవంతుని వివిధైశ్వర్య పరిశీలనము కాగ లదు. ఈ చమకమేమో ప్రకృతిలో మానవుడు వేటినిపొంది సుఖానందశాంతుల నందగలడో, వాటి ఆవశ్యకమును వివ రించుచున్నది.

## చమకము — అర్థవివరణ

1. "అగ్నావిష్ణూ సజోషసే మా వర్ధన్తు వాం గిరః. ద్యుమ్నై ర్వాజేభి రాగతం. వాజ శ్చ మే, ప్రసవశ్చ మే, ప్రయతిశ్చ మే, ప్రసతి శ్చ మే. ధీతిశ్చమే. క్రతుశ్చ మే. స్వరశ్చ మే. శ్లోకశ్చ మే. శ్రావశ్చ మే. శ్రుతిశ్చ మే. జ్యోతి శ్చమే. ఽసువశ్చ మే. ప్రాణశ్చ మేఽ పానశ్చ మే. వ్యాన శ్చ మే. ఽ సుశ్చ మే. చిత్తంచ మ, ఆధీతంచ మే, వాక్చ మే. మనశ్చ మే. చక్షుశ్చ మే. శ్రోత్రంచ మే దక్షశ్చ మె. బలంచ మే. ఓజశ్చ మె. సహాశ్చమేఆయుశ్చమే. జరాచమ, ఆత్మాచ మే. తనూశ్చ మే. శర్మ చ మే. వర్మచమే.ఽఙ్గాని చమేఽస్థానిచ మే. పరూంషిచ మే. శరీరాణిచ మే. (2) 1.

1. వివరణ :- హే అగ్నావిష్ణూ=ఓ అగ్నివిష్ణులారా! మీరు సజోషసా=మాయందు సమానప్రీతిగలవా రగుదురు గాక ! వాం=మీయొక్క. ఇమాగిరః=ఈ స్తోత్రవాక్కులు. వర్ధన్తు = వృద్ధిపొందునుగాక. మీరు. ద్యుమ్నైః=ధనముల తోను, వాజైః=అన్నములతోను. ఆగతం. వత్తురుగాక — రండు. వాజః=అన్నము. మే=నాకు. కలుగుగాక అని

భావము. ప్రతిమాటకూ ఇట్లే అన్వయించుకొనవలెను. ప్రసవః=అన్నముయొక్క అనుజ్ఞానము. ప్రయతిః=పరిశుద్ధి. ప్రసతిః=అన్నముమీదికోరిక. ధీతిః=అన్న ధారణము. క్రతుః =అన్న హేతువైన యజ్ఞము. (కర్మము-కృషి, శిల్పాదికము) స్వరః=ఉదాత్తానుదాత్తాదిస్వరము శ్లోకః=స్తుతి. శ్రావః= వినిపించేశక్తి. శ్రుతిః=వినెడిశక్తి. జ్యోతిః=వెలుగు, (జ్ఞానము) సువః=స్వర్గము. ప్రాణాపానవ్యానాః=శరీరమునందుప్రాణా పానాదులు, అసుః=గాలి, చిత్తం=మనస్సుచే కలుగు జ్ఞానము. ఆధీతం=అజ్ఞానముచే తెలిసికొనునది, వాక్ మనః, చక్షుః, శ్రోత్రం=మాట, మనస్సు, కన్ను, చెవి. దక్షః=జ్ఞానేంద్రియ సామర్థ్యము. బలం=కర్మేంద్రియములశక్తి. ఓజః=బలహేతు వైనఎనిమిదవధాతువు. సహః=శత్రువులనణచుశక్తి. ఆయుః= ఆయుస్సు. జరా=ముసలితనము. ఆత్మా=పరమాత్మ. (లేక ఆత్మశక్తి)తనూః=మంచిశరీరము. శర్మ=సుఖము. వర్మ=శరీర రక్షణ. అంగాని=మంచి అవయవములు. అస్థాని=ఉండ దగిన ఎముకలు. పరూంషి=వ్రేళ్ళయొక్క కణుపులు. శరీరాణి =ఇంతవరకు చెప్పబడని ఇతరావయవములు. ఈ అనువాక మున తనశరీరేంద్రియములు, అవయవములు,ఎముకలు మొద లైనవి చక్కగా ఉండవలయునని ప్రార్థింపబడినది. 1. ఇక రెండవ అనువాకము.

2. జ్యైష్ఠ్యంచమ,ఆధిపత్యంచమే, మన్యుశ్చమే. భామ శ్చమే, మశ్చమేఽమ్భశ్చమే. జేమాచమే. మహిమాచమే. వరి

మాచమే. ప్రథిమాచమే. వర్ష్మాచమే. ద్రాఘుయాచమే. వృద్ధంచమే. వృద్ధిశ్చమే. సత్యంచమే. శ్రద్ధాచమే. జగచ్చ(1) మే. ధనంచమే. వశశ్చమే. త్విషిశ్చమే, క్రీడాచమే. మోదశ్చమే. జాతంచమే. జనిష్యమాణంచమే. సూక్తంచమే. సుకృతంచమే. విత్తంచమే. వేద్యంచమే. భూతంచమే. భవిష్యచ్చమే, సుగంచమే. సుపథంచమ బుద్ధంచమ. బుద్ధిశ్చమే. క్లుప్తంచమే. క్లుప్తిశ్చమే. సుమతిశ్చమే. (3) 2.

2. వివరణ :- జ్యైష్ఠ్యం=ఎక్కువైన ప్రాశస్త్యము. ఆధిపత్యం=స్వామిత్వము. మన్యుః=మానసక్రోధము. భామః = బాహ్యేంద్రియములందగపడు కోపము. అమః=విరోధులింతయని ఊహింపరాని క్రోధము. అంభః=చల్లని తీయనినీరు. జేమా=జయసమర్థత. మహిమా=జయమువలన సంపాదించిన ప్రభావము, సంపత్తి. వరిమా = కోరదగినది - పూజ్యత. ప్రథిమా = గృహక్షేత్రాదిసంపద. వర్ష్మా=పుత్రపౌత్రాది శరీర సంపత్తి. ద్రాఘుయా=ఎడతెగని పుత్రపౌత్రాది సంపత్తి. వృద్ధం=అన్నము, ధనము. వృద్ధిః=అభ్యుదయము. సత్యం= నిజమాడుట. శ్రద్ధా=పరలోకమున్నదనెడి భావము. జగత్ =స్థావరజంగమజగత్తు. (దీనితో పొత్తు ఉన్ననేకాని బ్రతుకు సాగదుగదా) ధనః=రత్నసువర్ణాదులు. వశః=అంతయు లోబడియుండుట. త్విషిః దేహకాంతి. క్రీడా=ఆటలు. మోదః= హార్షము. జాతం=పూర్వ సంతతి. జనిష్యమాణం=పుట్టబోవు సంతతి. సూక్తం=వేదము. సుకృతం=పుణ్యము. విత్తం=

లోగడ సంపాదించిన ధనము. వేద్యం = ముందురాబోవు ధనము. భూతం = పూర్వపుక్షేత్రములు. భవిష్యత్ = రాబోవు పొలములు. సుగం = సుఖముచేరాదగిన బంధువులుండుప్రదేశము. సుపథం = సుఖమార్గము. ఋద్ధం = చేయబడిన సత్కర్మ, లేక సంపాదించిన ధనాదులు. ఋద్ధిః = చేయబోవు సత్కర్మల ఫలము. క్లప్తం = కావలసిన ధనము. క్లప్తిః = సొంతశక్తి. మతిః = పదార్థనిశ్చయ జ్ఞానము. సుమతిః = దుర్ఘటకార్యనిశ్చయ జ్ఞానము. ఈ అనువాకమునందు మానవుని లోకవిజయమునకు కావలసిన సంపత్తులన్నియు కోరబడి ఐహిక జీవన తుష్టిపుష్టులు చెప్పబడినవి. ఇక 3వ అనువాకము—

3. "శంచ మే, మయశ్చ మే. ప్రియంచ మేఽనుకామశ్చ మే. సౌమనసశ్చ మే. భద్రంచ మే. శ్రేయశ్చ మే. వస్యశ్చ మే. యశశ్చ మే. భగశ్చ మే. ద్రవిణంచ మే. యన్తాచ మే. ధర్తాచ మే. క్షేమశ్చ మే. ధృతిశ్చ మే. విశ్వం(1)చ మే. మహశ్చ మే. సంవిచ్చ మే. జ్ఞాత్రంచ మే. సూశ్చ మే. ప్రసూశ్చ మే. ప్రసూశ్చ మే. సీరంచ మే. లయశ్చ మే. ఋతంచ మేఽమృతంచ మే. యక్ష్మంచ మేఽనామయశ్చ మే. జీవాతుశ్చ మే. దీర్ఘాయుత్వంచ మేఽనమిత్రంచ మేఽ భయంచ మే. సుగంచ మే. శయనంచ మే. సూషాచ మే. సుదినంచ మే. (2) — 3.

3. వివరణ :- చమకమునందలి మాటలలో పునరుక్తి కూడ ఉన్నట్లు అగపడును. అయినను దానివలన కలుగు అనర్థమేమియు లేదు. ఒకే కోరికను పలుసారులు వెల్లడించుట

దానిమీది ఎక్కువ మక్కువను తెలుపునేకాని పునరుక్తి దోషము కాదు. ఉదాహరణకు శం అనగా ఐహికసుఖము, మయః అనగా పరలోకసుఖము. మంత్రారంభమున "శం చ మే, మయశ్చ మే" అనగా రెంటికిగల భేదమిట్టిది. ప్రియం=ఇష్టవస్తువు. అనుకామః=అనుకూల వస్తువులమీది కోరిక. కామః=ఆముష్మిక వాంఛ. సౌమనసః=మనస్సున కారోగ్యమునుగూర్చెడి బంధువర్గము. భద్రం=ఇహలోక శుభము. శ్రేయః=పరలోక హితము. వస్యః=నివసింపః గృహాదులు. యశః=కీర్తి. భగః=సౌభాగ్యము. ద్రవిణ ధనము. యన్తా=నియామకుడైన గురువు. ధర్తా=తం మొదలగు పోషకులు. క్షేమః=ఉన్నదానిని రక్షించుకొన శక్తి. ధైర్యం=ధీరత, నిశ్చలత. విశ్వం=సర్వజనానుకూల త్వము. మహః=పూజ. సంవిత్=శాస్త్రశిల్పాది విజ్ఞానము. జ్ఞాత్రం=జ్ఞాపకశక్తి. సూః=పుత్రాదులను తీర్చుశక్తి. ప్రసూః=భృత్యాదులను శాసించుశక్తి. సీరం=కృషిశక్తి. లయః=ప్రకృతి ప్రతిబంధాలను గెలుచుశక్తి. ఋతమ్= యజ్ఞాదికర్మ. అమృతం=యజ్ఞకార్యజనిత ఫలము. అమృత మనగా మోక్షమనికూడ అర్థమే. అయక్ష్మం=క్షయాదిరోగ ములు లేకుండుట. అనామయః=జ్వరాదివ్యాధులు లేకుం డుట. దీర్ఘాయుత్వం=అపమృత్యువులు లేమి. అనమిత్రం= విరోధులు లేకుండుట. అభయం=నిర్భయత్వము. సుగం= అందఱుమెచ్చు ఆచరణము. శయనం=సుఖశయ్య. సూషా= మంచిప్రాతః కాలము-సుప్రభాతము. సుదినం=మంచిరోజు,

మంచిపనులు చేసినరోజు. సుఉషా=సుప్రభాతము, సుదినము అనునవి ప్రతివారూ ఆశించునవేకదా. చమకము నాకు ఇది కావలె, అదికావలె, అనెడి కోరికలతో నిండిఉన్నప్పటికీ, ఆలోచించిచూడగా ఎన్నెన్నో గంభీరార్థములనూ, సత్యములనూ మనకు అదించుచున్నది. ఋగ్యజురాది వేదాలలో ఇన్ని భోగాలు, ఇందఱు దేవతలు, ఇన్ని కర్మలు చెప్పబడినవి. ఇన్ని అక్షరాలు ఉన్నవని వేదములయొక్క బాహ్యస్వరూపమును చెప్పుట సులభమే కాని, అది ఎంతటి ఉన్నతభావాలను బోధించుచున్నదో, ఎంతెంత లోతులలోనికి మనలను తీసికొనిపోవుచున్నదో, ఏ యే భావలోకములలో విహరింపజేయుచున్నదో, మనజీవితములను ఎట్లు తీర్చిదిద్దుకొను మనుచున్నదో పర్యాలోచించుట కష్టము. వేదమంత్రములతో అందలి భావములతో మానవ జీవితమెట్లు విడదీయరానిరీతి ముడిపడియున్నదో విచారించుట కష్టము. నిజమునకు ప్రతిదానికి నమస్కారమని చెప్పెడి నమకములో ఎంతటి నిగూఢార్థము ఉన్నదో కొంతవఱకు విచారించినాము. అట్లే ఈ చమకమునందుకూడ ఉన్నతములైన భావములు, లోతుగా ఆలోచించి, మన నడవడికి మెఱుగులు దిద్దుకొనదగిన రీతులు ఎన్నెన్ని ఉన్నవో అలోచించవలసి యున్నది. ఉదాహరణకు ఈ 1వ అనువాకమునే పరిశీలింపుడు తెలియగలదు.

నాకు ప్రతి ఉదయము సుప్రభాతము కావలె. ప్రతి దినము సుదినము కావలెననెడి మాటలలో ఎంతటి శుభా

కాంక్ష ఉన్నదో చూడుడు. కావలెననగానే రాగలదా, అని అడుగవచ్చును. అసలు కావలెను అనెడి సంకల్పము ఉన్ననే కదా నరుడు ఆ కోరికను తీర్చుకొనుటకు ప్రయత్నించునది. కోరికలేనివాడు ప్రయత్నమే చేయలేడు. కనుక కోరిక ఉండుట దోషముకాదు. ఈ కోరెడినరులు జ్ఞానముపండిన వీతరాగులేమీ కారు వారు ఐహికాముష్మిక భోగములందు రక్తిగలవారే. అట్టివారికి కోరికలు తీరవలసినదే.

నీకు రాత్రిఅంతయు సుఖనిద్ర పట్టిననేకాని సుప్రభాతముకాదు. తెల్లవార్లూ నిద్రలేనివానికి ప్రాంతఃకాలము నిద్రా దేవితోనే మొదలగుచుండును. కాన సుప్రభాత వాంఛ రాత్రిచేయు సుఖనిద్రతో ముడిపడి యున్నది. ఇక సుఖనిద్రపట్టినదే అనుకొందు, సుప్రభాతము అయినదే అనుకొందు.ఆరోజు సుదినము కావలెనని నియమ మేమున్నది! దుర్దినముకూడ కావచ్చునుగదా. అందుకే నరుడెప్పుడూ సుదినములనే కోరవలసియున్నాడు.

అట్టి కోరికే యున్నచో ఆ దినమును సుదినమును చేసి కొనుటకు ఆతడు యత్నించును. ఆ రోజు సుదినమెట్లగునో ఆ అనువాకమునందలి ఇతర వాక్యములు చెప్పుచున్నవి. అందుకే "సౌమనసశ్చమే" నాకు మంచిమనస్సుకల మిత్రులు కావలె ననుకొనుచున్నాడు. అట్టివారు ఉన్నచో, నీకాదినము సుదినము, శుభదినము కావచ్చును- కాగలదు. తరువాత సంవిత్తు - జ్ఞానము కావలె ననుకొన్నాడు. అది అన్నింటికీ

మూలమేకదా. పిమ్మట సీరం=కృషి, దానివల్ల కలిగెడి అన్నమును కోరినాడుకదా. అన్నము ఆరోగ్యమునకూ ఆయుస్సునకు మూలమైనదని అందఱికీ తెలిసినవిషయమే. యన్తా= శాసకులు-గురువులు కావలెను. వారు లేకున్నచో, మంచిదారి దొరకదు. ధృతి, క్షేమ, సుఖ, ఆరోగ్య, ధన, ధాన్యాదులు చేకూరినగాని జీవితములుకాని.ఆరోజుకానిసుఖసంపన్నములు కావు ఆసుదినములుకలుగుటకే చమకములో ఎన్నిటినో కోర వలసి వచ్చినది.ఊరకే కోరుటగాదు. చేయవలసినపని. అవి లభించుటకు నిరంతరమైనప్రయత్నము. వాటిని సంపాదించుట. అప్పుడు కాని జీవితము సార్థకముకాదు. ఇట్టి పరమములైన జీవిత రహస్యములను చాటుటకే నమకములు ప్రవర్తించి, మానవులను ధన్యులు కండని ప్రేరేపించుచున్నవి. మన మీనాడుఆ రహస్యములను మఱచినాము. ఏదో ఆచారముగా మాత్రమే ప్రయత్నించకయే కోరికలు తీరుననెడి భావముతో మాత్రమే రుద్రాభిషేకములను జరిపెడి స్థితికి దిగజారినాము. మంత్రార్థముల నెఱుంగని యాజకులు తమ జీవనోపాధితో తృప్తిపడుచున్నారు. ఇట్టి దుఃస్థితి తొలగి మంత్రముల హృదయమేమో తత్త్వము, రహస్యము ఏమో తెలిసిననాడే, అట్లు తెలిసికొని కర్మల నాచరించిననాడే లోక కల్యాణము కలుగగలదు. మంత్రద్రష్టలయొక్క, వేదపురుషునియొక్క కృషి సార్థకము కాగలదు. మనము ధన్యుల మగుటకు అదొక్కటే త్రోవ. దానినే "సుపథం" అని

చమకవాక్యము పేర్కొన్నది. ఆనాడే శర్మ (సుఖ)ముకాని, ఆనందముకాని, ఐశ్వర్యముకాని, ముక్తికాని! ఇక 4వ అనువాకము—

4. "ఊర్క్చ్ మే. సూనృతాచ మే. పయశ్చ మే. రసశ్చ మే. ఘృతం చ మే. మధు చ మే. సగ్ధిశ్చ మే. సపీతిశ్చ మే. కృషిశ్చ మే. వృష్టిశ్చ మే. జైత్రంచ మే. ఔద్భిద్యంచ మే. రయిశ్చ మే. రాయశ్చ మే. పుష్టంచ మే. పుష్టిశ్చ మే. విభుచ మే. ప్రభుచ మే. బహుచ మే. భూయశ్చ మే. పూర్ణంచ మే. పూర్ణతరంచ మే. ఉక్షితిశ్చ మే. కూయవాశ్చ మే. ఉన్నంచ మే ఉక్షుచ్చ మే. వ్రీహయశ్చ మే. యవాశ్చ మే. మాషాశ్చ మే. తిలాశ్చ మే. ముద్గాశ్చ మే. ఖల్వాశ్చ మే. గోధూమాశ్చ మే. మసురాశ్చ మే. ప్రియంగవశ్చ మే. ఉణవశ్చ మే. శ్యామాకాశ్చ మే. నీవారాశ్చ మే. 4.

4. వివరణ :- ఊర్క్=అన్నము. సూనృతా=నిజమైన మంచిమాట. పయః=పాలు. ఘృతం=నేయి. మధు=తేనె. రసః=పయోఘృతమధువులలోని సారము. సగ్ధిః=బంధువులతో కలసిచేయు భోజనము. సపీతిః=కలసిచేయు పయఃపానాదులు. కృషిః=అన్నమునుకలిగించు వ్యవసాయము. వృష్టిః=వ్యవసాయకారణమైన వాన. జైత్రం=బాగుగాపండు పొలము. ఔద్భిద్యం=చెట్లు, పొదలు మొదలగునవి. రయిః=బంగారము. రాయః=రత్నములు, ముత్యములు. పుష్టం=సువర్ణసమృద్ధి. పుష్టిః=శరీరపోషణ. విభు, ప్రభు, బహు భూయః, పూర్ణం, పూర్ణతరం, అక్షితి—అనునవి ధాన్య

విశేషములు. కూాయవాః=సన్నయవలు. అన్నం=ధాన్యములచే సిద్ధించుకూడు. అక్షుత్=ఆకలిలేమి. వ్రీహాయః=వడ్లు. యవాః = యవధాన్యము. మాషాః=మినుములు. తిలాః= నువ్వులు. ముద్గాః=పెసలు. ఖల్వాః=పెద్దపెసలు. గోధూమాః=గోధుమలు. మసురాః=అలచందలు. ప్రియంగవః= ప్రియంగుధాన్యము. అణవః = సన్నవడ్లు. శ్యామాకాః= గ్రామములోని వడ్లు. నీవారాః=అడవి వడ్లు. ఈ అనువాకమునందు ఆకలి తీర్చుకొనదగిన అన్నము, దానిని సిద్ధపఱచు వివిధ ధాన్యములు పేర్కొనబడి లౌకిక జీవితము వివరింపబడినది. ఇక 5వది—

5. "అశ్మాచ మే. మృత్తికాచ మే. గిరయశ్చ మే పర్వతాశ్చ మే. సికతాశ్చ మే. వనస్పతయశ్చ మే. హిరణ్యం చ మేఽయశ్చ మే. సీసంచ మే. త్రపుశ్చ మే. శ్యామంచ మే. లోహంచ మేఽగ్నిశ్చ మే. ఆపశ్చ మే. వీరుధశ్చ మే. ఓషధయశ్చ మేఽకృష్టపచ్యంచ మే. గ్రామ్యాశ్చ మే. పశవ ఆరణ్యాశ్చ మే. యజ్ఞేన కల్పన్తాం. విత్తంచ మే. విత్తిశ్చ మే. భూతంచ మే. భూతిశ్చ మే. వసుచ మే. వసతిశ్చ మే. కర్మచ మే. శక్తిశ్చ మేఽర్థశ్చ మే. ఇతిశ్చ మే. గతిశ్చ మే. 5.

5. వివరణ :- అశ్మా = ఱాయి. మృత్తికా=మట్టి. గిరయః=కొండలు. పర్వతాః = పెద్దకొండలు. సికతాః = ఇసుక. వనస్పతయః=చెట్లు. హిరణ్యం=బంగారం. అయః= ఇనుము. సీసం=సీసము. త్రపుః=తగరము. శ్యామం=నల్లని

ఇనుము. లోహం, కంచు, ఇత్తడి, రాగి మొదలగునవి. అగ్నిః=నిప్పు. ఆపః=నీళ్ళు. వీరుధః=లతలు. ఓషధయః= మూలికలు. అకృష్టపచ్యం=వి త్తకుండనే పండినవి-అడవు లలో పుట్టిన ధాన్యఫలాదులన్నమాట. గ్రామ్యాః=గ్రామము లలో పండించినవి. యజ్ఞేనకల్పన్తాం=ఇట్టివన్నియు యజ్ఞసమ ర్థములగునుగాక.లోకసేవకై ఉపయోగించుగాక అనిభావము. విత్తం=పూర్వార్జితధనము. విత్తిః=రాబోవుధనము,లాభము. భూతం=ఇదివఱకే ఉన్నది. పుత్రపౌత్రాదులు. భూతిః=ఐశ్వ ర్యాదులు. వసు=నివాస సాధనమైనగోఅశ్వాది. వసతిః= గృహము. కర్మ=నిరుద్యోగములేమి. శక్తిః=సామర్థ్యము. అర్థః=ప్రయోజనము. ఏమః=పొందదగిన సుఖము. ఇతిః= ఇష్టములనుపొందు ఉపాయము. గతిః=ఇష్టములను పొందుట. ఇక ఆఱవది—

6. "అగ్నిశ్చ మ, ఇంద్రశ్చ మే. సోమశ్చమ, ఇంద్ర శ్చ మే. సవితాచ మ ఇంద్రశ్చ మే. సరస్వతీచ మ, ఇంద్ర శ్చ మే. పూషాచ మ, ఇంద్రశ్చ మే. బృహస్పతిశ్చ మ, ఇంద్రశ్చమే. మిత్రశ్చమ, ఇంద్రశ్చమే. వరుణశ్చమ, ఇంద్ర శ్చమే. త్వష్టాచ(1)మ, ఇంద్రశ్చమే. ధాతాచమ, ఇంద్రశ్చ మే. విష్ణుశ్చమ, ఇంద్రశ్చమే. అశ్వినౌచమ, ఇంద్రశ్చమే. మరుతశ్చమ, ఇంద్రశ్చమే. విశ్వేచమే, దేవా ఇంద్రశ్చమే. పృథివీచమ ఇంద్రశ్చమేఽన్తరిక్షంచమ ఇంద్రశ్చమే. ద్యౌ

శ్చమ ఇంద్రశ్చమే. దిశశ్చమ ఇంద్రశ్చమే. మూర్ధాచమ ఇంద్రశ్చమే. ప్రజాపతిశ్చమ ఇంద్రశ్చమే. 6.

6. ఈ అనువాకమున పఠింపబడిన 'అగ్ని, సోమ, త్వష్టృ, విష్ణు ప్రభృతులైన దేవతలు ఋగ్వేదాదులయందు సుప్రసిద్ధులు. వీరితో ప్రతి దేవతతో పాటు ఇంద్రునికూడ చేర్చుట వారితో సమాన భాగస్వామ్యము కలవాడని చెప్పుట కే. దిక్కులన్నప్పుడు తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము – అనెడి నాల్గు దిక్కులను గ్రహింపవలయును. మూర్ధ శబ్దముచేత ఊర్ధ్వదిక్కు చెప్పబడినది. మూర్ధము (శిరస్సు) సహస్రారమునకు, మెదడుకు నివాసస్థానము కాన, దాని వలెనే ఊర్ధ్వదిక్కునకు అత్యంత ప్రాధాన్యమని గ్రహింపవలెను. 6. ఇక సప్తమానువాకము.

7. "అంశుశ్చ మే. రశ్మిశ్చ మే. ఽదాభ్యశ్చ మే ఽధిపతిశ్చ మే. ఉపాంశుశ్చ మేఽన్తర్యామశ్చ మే. ఐంద్రవాయవశ్చ మే. మైత్రావరుణశ్చ మే. ఆశ్వినశ్చ మే. ప్రతిప్రస్థానశ్చ మే. శుక్రశ్చ మే. మన్థీచ మ, ఆగ్రయణశ్చ మే. వైశ్వదేవశ్చ మే. ధ్రువశ్చ మే. వైశ్వానరశ్చ మే. ఋతుగ్రహాశ్చ మేఽతిగ్రాహ్యశ్చ మే. ఐంద్రాగ్నశ్చ మే. వైశ్వదేవశ్చ మే. మరుత్వతీయాశ్చ మే. మాహేంద్రశ్చ మ. ఆదిత్యశ్చ మే. సావిత్రశ్చ మే. సారస్వతశ్చ మే. పౌష్ణశ్చ మే. పాత్నీవతశ్చ మే. హారియోజనశ్చ మే. 7.

7. వివరణ :- అంశువు మొదలగువారు సోమప్రక రణ ప్రసిద్ధములైన సోమగ్రహ విశేషములు. రశ్మి ఇట్లు పేర్కొనబడినది- "శుక్రం తే శుక్రేణ గృహ్ణామ్యహ్నో రూపేణ సూర్యరశ్మిభిః." కావున రశ్మి సూర్యరశ్మియే. అధిపతిశబ్దము అధిగ్రహమును చెప్పుచున్నది. అది శ్రేష్ఠము కాన ఆధిపత్యమన్నమాట. ఇందు మొదటివైశ్వదేవశబ్దము ప్రాతస్సవనవిషయము. రెండవది, తరువాతిది తృతీయసవన విషయముకలది. ఈ అనువాకమున ఆ యా గ్రహములు, వాటియొక్క ఆనుకూల్యము కోరబడినది. ఇక అష్టమాను వాకము.

8. "ఇధ్మశ్చ మే. బర్హిశ్చ మే. ధిష్ణియాశ్చ మే. స్రుచశ్చ మే. చమసాశ్చ మే. గ్రావాణశ్చ మే. స్వరవశ్చ మే. ఉపరవాశ్చ మే. ధిషవణేచ మే. ద్రోణకలశశ్చ మే. వాయవ్యానిచ మే. పూతభృచ్చ మ. ఆధవనీయశ్చ మే. అగ్నీంధ్రంచ మే. హావిర్ధానంచ మే. గృహాశ్చ మే. సదశ్చ మే. పురోడాశాశ్చ మే. పచతాశ్చ మేఽవభృథశ్చ మే. స్వగాకారశ్చ మే. 8.

8. వివరణ :- ఈ అనువాకమున యజ్ఞాంగములైన సమిధలు, వేది (అరుగు) స్రుక్స్రువములు, పాత్రలు, ఱోలు మొదలగునాళ్ళు, ద్రోణకలశము, పురోడాశము మొదలగు వస్తువులు పేర్కొనబడినవి. వేదకాలము - అందును యజు ర్వేదకాలము యజ్ఞబహుళమైనదికాన వాటిస్మరణము తగి యున్నది. 8. ఇక 9వది.

9. "అగ్నిశ్చ మే. ఘర్మశ్చ మేఽర్కశ్చ మే. సూర్యశ్చ మే. ప్రాణశ్చ మేఽశ్వమేధశ్చ మే. పృథివీచ మేఽదితిశ్చ మే. దితిశ్చ మే. ద్యౌశ్చ మే. శక్వరీరంగుల యోదిశశ్చ మే యజ్ఞేన కల్పన్తామ్. ఋక్చ మే. సామచ మే. స్తోమశ్చ మే. యజుశ్చ మే. దీక్షాచ మే. తపశ్చ మ, ఋతుశ్చ మే. వ్రతంచ మేఽహోరాత్ర యోర్వృష్ట్యా బృహద్రథన్తరేచ మే యజ్ఞేన కల్పేతామ్: 9.

9. వివరణ :- అగ్నిః=చయనాగ్ని. ఘర్మః = ప్రవర్గ్యము. "ఇంద్రాయార్కవతే పురోడాశమితి విహితో యాగః అర్కః." సౌర్యంచరుమితి విహితో యాగ సూర్యః. ప్రాణాయస్వాహేతి విహితో హోమః ప్రాణః. అశ్వమేధము మన మెఱిగినదే. పృథివ్యాదులు ఆ యా దేవతలు. అంగుళులనగా వ్రేళ్ళవంటి విరాట్పురుషుని అవయవములు. ఇట్టివన్నియు వ్యాపార సమర్థములగుగాక అని భావము. ఋక్కు-మొదలైనవి మంత్రము. స్తోమమనగా సామవృత్తిరూపమైన స్తోత్రము. దీక్ష యజమానుడు పొందెడి సంస్కారము. తపస్సనగా పాపక్షయముకొరకై చేయు ఉపవాసాదులు. అంతేగాదు. మానసికముగా పరాపర ప్రకృతులను గూర్చియు, పరమార్థ తత్వమును గూర్చియు చేయు విచారణ, ఆలోచన, చింతన, ధ్యానము మొదలగునవనికూడ భావింపవలెను. ఋతువు యాగము లొనర్పదగిన కాలము. వ్రతము ప్రసిద్ధమైనదే. బృహద్రథన్తరములు సామములు. ఇట్టివన్నియు నా యజ్ఞమునకు ఉపకరించుగాక అని భావము. ఇందు పేర్కొనబడిన

వన్నియు యజ్ఞకార్యోపయోగులైనట్టివే. ఇక పదవ అను వాకము.

10. "గర్భాశ్చ మే. వత్సాశ్చ మే. త్ర్యవిశ్చ మే. త్ర్యవీచ మే. దిత్యవాట్ చ మే. పంచావిశ్చ మే. పంచావీచ మే. త్రివత్సశ్చ మే త్రివత్సాచ మే. తుర్యవాట్ చ మే. తుర్యౌహీచ మే. పష్ఠవాట్చ మే. పష్ఠౌహీచ మే. ఉక్షాచ మే. వశాచ మే, ఋషభశ్చ మే. ఉవేహచ్చ మే, ఉనడ్వాన్ చ మే. ధేనుశ్చ మే. ఆయుర్యజ్ఞేన కల్పతాం, ప్రాణో యజ్ఞేన కల్పతామపానో యజ్ఞేన కల్పతాం, వ్యానో యజ్ఞేన కల్పతాం, చక్షుర్యజ్ఞేన కల్పతాం, శ్రోత్రం యజ్ఞేన కల్పతాం. మనో యజ్ఞేన కల్పతాం. వాగ్యజ్ఞేన కల్పతా, మాత్మా యజ్ఞేన కల్పతాం, యజ్ఞో యజ్ఞేన కల్పతామ్. 10.

10. వివరణ :- గర్భాః=గర్భములు వత్సాః=దూడలు. త్ర్యవిః=సంవత్సరం ఆరునెలల వయస్సుగల కోడెదూడ. త్ర్యవీ=అంతవయస్సుగల ఆవుదూడ - రెండేండ్ల వయస్సుగలకోడె. దిత్యవాట్ అట్టిదేఅయిన ఆవు. దిత్యౌహి. పంచావిః=రెండున్నర యేండ్ల వయస్సుగల కోడె. త్రివత్సః=మూడేండ్ల వయస్సుగల కోడె. అట్టి ఆవు త్రివత్స. తుర్యవాట్=మూడున్నరయేండ్ల ఎద్దు. తుర్యౌహీ=అట్టిదేఅయిన ఆవు. ఉక్షా=వయస్సువచ్చిన ఎద్దు. (వీర్యమును ప్రోక్షించునదన్నమాట) వశా=వంజఆవు. ఋషభః=ఎక్కువ ఈడుగల యెద్దు. గర్భఘాతినిఅగు ఆవు అవేహత్. అనడ్వాన్=

బండిలాగునెద్దు. అప్పుడే ఈనినఆవు ధేనువు. ఆయుస్సు మొదలైనవి మనమెఱిగినవే. ఆత్మ అనగా ఇక్కడ శరీరము. ఇట్టివన్నియు నాయజ్ఞముచే కార్యసమర్థములగుగాక అని భావము.

**11.** "ఏకాచ మే. తిస్రశ్చ మే. పంచచ మే. సప్తచ మే. నవచ మ, ఏకాదశచ మే. త్రయోదశచ, పంచదశచ మే. సప్తదశచ మే. నవదశచ మ, ఏకవింశతిశ్చ మే. త్రయో వింశతిశ్చ మే. పంచవింశతిశ్చ మే. సప్తవింశతిశ్చ మే. నవ వింశతిశ్చ మే. ఏకత్రింశతిశ్చమే. త్రయస్త్రింశచ్చ మే. చత స్రశ్చ మేఽష్టౌచ మే. ద్వాదశచ మే. షోడశచ మే. వింశ తిశ్చ మే. చతుర్వింశతిశ్చ మే. అష్టావింశతిశ్చ మే. ద్వాత్రిం శచ్చ మే. షట్త్రింశచ్చ మే. చత్వారింశచ్చ మే. చతుశ్చ త్వారింశచ్చ మే. అష్టాచత్వారింశచ్చ మే. వాజశ్చ, ప్రసవ శ్చాపిజశ్చ, క్రతుశ్చ, సువశ్చ, మూర్ధాచ, వ్యశ్నియశ్చాన్త్యా యన, శ్చాన్త్యశ్చ, భౌవనశ్చ, భువనశ్చాధిపతిశ్చ." **11.**

**11.** వివరణ :- ఏకము మొదలైనవి సంఖ్యావాచక ములు. ఈ మాటలతో సంఖ్యాశాస్త్రమే ర్పడునుగదా. అంతే కాక ఒక్కొక్కసంఖ్య ఒక్కొకదానికి సంకేతముకూడ. ఏక సంఖ్య జగత్కారణ పరమాత్మను చెప్పును. త్రిసంఖ్య జగ దుపాదానకారణములైన త్రిగుణములను, వాటి సామ్యావస్థ అయిన ప్రకృతిని, లేక మాయాశక్తిని సూచించును. త్రి మూర్తులకుగూడ చిహ్నమే. ఇక పంచసంఖ్య పంచభూతము

లకు, పంచేంద్రియములకు, పంచవిషయములకు, పంచబ్రహ్మ లకు, పంచమూర్తులకు, పంచఋషులకు పంచావస్థలు మొదలైనవాటికి సంకేతము. ఇంతయేల; ప్రపంచమునకే అది సూచకమనుకొన్నచో సరిపోవును. ఇక సప్తసంఖ్య సప్త ఋషులకు, లోకములకు, ఆధారాది సహస్రారము వఱకుగల చక్రములకు మున్నగువానికి సంకేతము. ఏకాదశసంఖ్య ఏకాదశేంద్రియములకు, రుద్రులు మొదలగు వారికి గుర్తు. ఇట్లే కొన్ని సంఖ్యలు ప్రకృతిని, పదార్థములను, శక్తులను సూచించుచున్నవనుట పారమార్థిక రహస్యము. వాజః = అన్నము. ప్రసవః=దానికికారణమైన సస్యాదుల పునఃపున రుత్పత్తి. క్రతుః=సంకల్పము. లేక యాగాదికము సువః= స్వర్గము, దానినిపొందుటకు కారణమైన సూర్యుడు. లేదా వాజాదులు చైత్రాది మాసములకు సంకేతములనియైనను తలంపవచ్చును. ఆ యా మాసములయందు ఆ యా శక్తులు ఆరాధింపబడి సంతసించునని భావము. చమకముయొక్క-

11 అనువాకములందును ప్రకృతిలోని అనేక వస్తువులు, పదార్థములు, విశేషములు ప్రస్తావింపబడినవి. దీని తాత్ప ర్యము ఏమా అని భావింపవలసియున్నది. వేదము మనకు తల్లిదండ్రుల వంటిదని భావింతుము. తల్లిదండ్రులు బిడ్డలకు కావలసిన సర్వమును సమకూర్పవలసి యున్నారు కదా. ఆ ప్రయత్నమే చమకానువాకములలో జరిగినట్లు గమనింప గలము. నమకచమకములతో రుద్రాభిషేకమును చేయుటకు

రుద్రుడు అభిషేక ప్రియుడగుటయే కారణము. అందుకీదిగువ శ్లోకము ప్రచారములో నున్నది—

"ధ్యానప్రియో విశ్వకర్మా, జలధారా ప్రియ శ్శివః,
నమస్కార ప్రియో భాను, రలంకార ప్రియో హరిః."

విశ్వకర్మకు ధ్యానమన్నను, శివునికి అభిషేకమన్నను, సూర్యునికి నమస్కారమన్నను, విష్ణునికి అలంకారమన్నను ఇష్టమట. అందుకే మనవారు సూర్యనమస్కారములు, రుద్రాభిషేకములు ఎక్కువగా చేయుచుందురు.

## చమక రహస్యము

మానవులందఱు బాలురవంటివారు. శాస్త్రములు చదివి లౌకికమైనజ్ఞానమును సంపాదించినను, వారి జ్ఞానము సంపూర్ణమనుకొన వీలులేదు. అట్టి వారికి నానావిధ వస్తు పరిజ్ఞానమును కలుగజేసి, వాటిని సంపాదించుకొనుశక్తి నల వఱచుట వేదతాత్పర్యమని భావింపవలసి యున్నది. బాలునకు తన కేమికావలయునో, ఏమి తిని తనక్షుత్తును తీర్చుకొనవలెనో, తానెట్లు ఎదుగవలెనో తెలియదు. అట్టిస్థితిలో తలిదండ్రులు లా బిడ్డయెదుట వివిధ రుచులతోగూడిన నానా పదార్థముల నుంచినచో వాడు తన కిష్టమైన- తన జిహ్వా కింపైన వస్తువును తీసికొని క్షుత్తును తీర్చుకొని ఎదుగగలుగు చున్నాడు. అట్లే వేదమాతకూడ ప్రకృతిలో సంసిద్ధమైన వస్తువులన్నింటిని-వైదికములు, లౌకికములు అయినవాటిని

ఈ చమకముద్వారా మనముందు ఉంచినది. ఇవి అన్ని యును ఓ బిడ్డలారా! మీకు పనికి వచ్చునవే. వీటిలో మీ అభిరుచులకు తగినవాటిని మీరు వాడుకొని తుష్టిపుష్టులను సంపాదించుకొని అభ్యుదయ నిశ్శ్రేయసముల నందవచ్చు నని" తెలిపినది బిడ్డలు ఎవరికిష్టమైన పదార్థములను వా రనుభవించి పెద్దవారగునట్లు, మానవులుకూడ ఇందు సూచింపబడిన వస్తువులలో తమకు కావలసిన వాటిని ఎన్ను కొని, సంపాదించి, అనుభవించి మానవోత్తములుగా ఎదుగ వలసియున్నారనుట పరమరహస్యము. ఇట్టి ఉద్దేశ్యమే వేద మాతకు లేకున్న వాటిని ఆ క్రమములో మనముందు ఉంచ వలసిన పనిలేదు. కావున జను లీరహస్యము నెఱింగి ప్రవ ర్తించి చమక పఠనము చేతను, తదారాధనచేతను పొంద వలసిన ప్రయోజనాలను పొందవలసియున్నారు.

సాయణులీ అనువాకములకు కల్పమును, వినియోగ మును, మీమాంసను వ్రాయుచూ అనేకాంశములను అను ష్ఠానవిషయకముగా సూచించినారు. అవి అన్నియు కాలాను గుణములు గానందున, వాటి నిందు వివరింపదలంచలేదు. సంగ్రహాముగా శ్రుతిమాత తాత్పర్యమును మానవజీవితోప యోగమగునట్లు వివరించుటయైనది. ఇంతమాత్రమున పూర్వ దృష్టి లోపభూయిష్ఠమనికాని, ఇదే సర్వశ్రేష్ఠమనికాని ఎవరూ భావింపబనిలేదు. "సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే." సత్పురుషులు పరిశీలనచేసి మంచిని అనుసరింతురన్న కాళిదాస

మహాకవివాక్యము ఎల్లరికిని అనుసరణీయమే. నమక చమక విశ్వకర్మ సూక్తములను ఈ రీతిగా గ్రహింపవలయునని సూచించుటయైనది.

ఇంకొక ముఖ్యాంశము ఇచ్చట ప్రస్తావింపవలసి యున్నది. ప్రకృతి వదలదగినదనియు, పరమాత్మయే ఆశ్రయింపదగినదనియు చెప్పెడి సంన్యాసభావమునకు-ప్రపంచ త్యాగమొనర్పవలయుననుటకు చమకము విరుద్ధముగా కనబడుచున్నది. ప్రపంచమును వదలి, బైరాగివి కమ్మనుట వేదహృదయముకాదు. ఆ ప్రపంచమును సాధనముగా చేసికొని, దానికి హేతువైన పరమాత్మను సాక్షాత్కరించుకొని శాంత్యానందరూపుడవై ప్రాపంచిక బంధములనుండి ముక్తుడవు కావలసినదని బోధించుటయే వేద ఋషుల తాత్పర్యముగా అగపడుచున్నది. జగమును ఎంతగా ఉపయోగించుకొనవలెనో, అంతవఱకు మాత్రమే ఉపయోగించుకొమ్మనియే వేదబోధ. ఈ రహస్యమెన్నటికిని మఱువరానిది. ఈ సందర్భమున కొంత విచారించి చూతము.

## ఈశావాస్య దృష్టి

ఈశోపనిషత్తులోని "ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్" అనువాక్యము పరిణామశీలమైన జగత్తులో ఏ అణు పరమాణు రూపమైన వస్తువైనను, అది పరమేశ్వరునిచేత-అనగా ఒకానొక జగత్కారణతత్త్వరూప వస్తువుచేత వ్యాపింపబడియే ఉన్నది- అనుచున్నది. అనగా విశ్వమున ఏదికూడ పరమాత్మతత్త్వ వ్యాప్తిలేక లేదని

భావము. అనగా ఆ పరమాత్మ వస్తువుల లోపల, వెలుపల, అంతట వ్యాపించియున్నాడని భావము. అంతయు భగవత్స్వరూపమేకాన, నరుని ప్రవర్తన ఎట్లుండవలయునో, తరువాతి వాక్యము తెలుపుచున్నది.

"తేన త్యక్తేన భుంజీథాః, మా గృధః కస్యస్విద్ధనమ్."

ఇట్టి స్థితిలో నీవు త్యాగమయ జీవితమును గడుపుచు జగమును అనుభవింపవలమును. అనగా నీ ధనము, వస్తువు అనుకొను దానిని ఇతరులకోసమై త్యాగముచేసి స్వసంపాదనముతో జీవింపవలెనని భావము.

అంతేకాదు. "మా గృధః కస్య స్విద్ధనం" ఇతరులదైన దేనిని ఆశించకుము అనికూడ సారాంశము. ఈ విధమైన జీవితమును గడపుటచేత మానవహృదయమునకు ఒక సంతృప్తి, ఆనందము చిక్కును. దానిచే ఆతడు తన్ను బద్ధుడయినట్లు భావింపలేడు. సర్వబంధవిముక్తి దొరకినట్లే సుఖించును. అద్దానిచే లోకమున కీర్తిప్రతిష్ఠలుకూడ కలుగును. లోకులాతని సత్ప్రవర్తనను, త్యాగమయ జీవితమును అనుసరించి తమ నడవడులను దిద్దుకొందురు. ఈశ్వరుడు తాను సృష్టించిన- పంచభూతములు, సూర్య, చంద్ర, నక్షత్రాదులు, ఓషధీసస్యవృక్షాదులచేత లోకమునకు ఉపకారముచేయునట్లు, ఈ యోగీశ్వరుడును తన ప్రవర్తనచేత లోకారాధనముచేసి, ఈశ్వరత్వము(ఈశ్వరసాయుజ్యము)నుపొంది ఈశ్వరుడగును.

ఈశావాస్యములోని మొదటి మంత్రపు హృదయము ఇదియే. పిమ్మటి రెండవమంత్రమును చూతము.

"కుర్వన్నేవేహ కర్మాణి, జిజీవిషేచ్ఛతం సమాః,
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి,న కర్మ లిప్యతే నరే." 2

ఓ మానవుడా! నీవు లోకకల్యాణకరములైన కర్మలను చేయుచునే నూరేండ్లు వర్తిల్లుము. నీవిట్టి నిష్కామ కర్మ యోగివైనచో, అంతకంటె కావలసినదేదియును లేదు. అయితే, కర్మ బంధకమని తలంతువేమో; కామ్యకర్మలు బంధకములుకాని, నిష్కామములైన లోకకల్యాణకరకర్మలు బంధకములుకావు. దీనినిబట్టి చూచిన, ఒక్కక్షణమైనను వ్యర్థము చేయక కర్మ నాచరింపవలెనని తెలియుచున్నదికదా. పిమ్మటి శ్లోకములలో ఈశావాస్యము- జగత్కారణ వస్తువును, దానినిపొందు మార్గములను, పొందినవాని నడవడి-మొదలగు విషయములను ప్రస్తావించినది. కనుక కర్మ త్యాగమునకంటెను కర్మచేయుటయే మంచిదని తెలియుచున్నది.

బుద్ధుడు సంన్యాసమును అవలంబించినాడు. ప్రచారముచేసినాడు. ఆ సంన్యాసులందఱు ఆలు బిడ్డలను, గృహభోగాదులను వదలినారేకాని, అన్నపానీయాది దైహిక కార్యములను, లోకక్షేమంకరకార్యములను వదలలేదుకదా. బుద్ధుడుకూడ లోక కల్యాణార్థము ఎంతగా శ్రమించలేదు! ఇది అంతయు కర్మకాక మఱేమి? శంకర, రామానుజాదులు

సైతము సంన్యాసానంతరము ఎన్నెన్ని గ్రంథములను వ్రాయ లేదు. ఎంతమందికి జ్ఞానబోధచేసి, యోగాభ్యాసాదులను నేర్పి తారకమార్గము చూపలేదు. వారు ఆలుబిడ్డలనుతప్ప వేటిని వదలినారు! కబీరు మొదలైనవారు సైతము ఈ తరగతికే చెందుచున్నారు. ఇక బ్రహ్మంగారి జీవితము ఒక విలక్షణ మార్గమున నడచినది. ఆయనది జగదుద్ధరణకై కలిగిన పరమేశ్వరావతారముకాన,తనకాలమువఱకు అవతరించిన మహనీయుల జీవితములు లోకమునకు ఎట్లెట్లు ఉపయోగించినవో గమనించి ఒక ప్రత్యేకమైన ఆదర్శమార్గమును ఆ మహానుభావుడు చూపినాడు. సంన్యాసమునందుకల అర్థానర్థములను ఆయన గమనించినాడు. అది ఈ కాలమునకు పనికిరాదని తలచినాడు. అందుకే తాను స్వయముగా గృహస్థాశ్రమమును స్వీకరించి, సత్సంతానమునుకని, వారివలనకూడ లోకకల్యాణమును సంపాదింపనే వ్రాసినాడు శిష్యులను కూడ ఆయన గృహస్థులుగానే ఉండవలెనని అనుశాసించినాడుకాని, సంన్యాసమునకై ప్రేరేపించలేదు. బ్రహ్మగురుని ఈ మార్గమంతేయు ఈశావాస్యోపనిషత్తు చెప్పినట్టిదేకాని, భిన్నముకాదు. అసలాయన అవతారమే. వేద, వేదాంత, దర్శన శాస్త్రములకు లక్ష్యభూతమూ, అనిపించును.

వేదఋషులే సంన్యాసమును అవలబించినచో మనకీనాడు ఈ వైదిక విజ్ఞానముకాని, జగద్రహస్యములుకాని అందెడివేనా? నేటి సైంటిస్టులు సంన్యాసులైనచో, వారు

కనిపెట్టిన విద్యుచ్ఛక్తి, టీ. వి., రేడియో, అణు రహస్యాలు, అంతరిక్ష విజ్ఞానము మనకు అందెడివేనా ? ఇంక ఎందరెందరో త్యాగధనుల పరిశోధనలు కారణముగా ఇంక ఎన్నెన్నో జగద్రహస్యములు, పదార్థతత్త్వములు, ప్రయోజనములు లోకమునకు అందుబాటులోనికి రావలసియున్నవి. అట్టివన్నియు ఆ వైజ్ఞానికులు, ఆ జగద్రహస్య చింతకులు శుష్క సంన్యాసమును ప్రేమించి మూల ముడుచుకొని కూర్చుండినచో, జగత్తు విజ్ఞానశూన్యము కావలసిన దేకదా !

అయితే ఇదంతయు ఐహికభోగము అని కొట్టివేయరాదు. ఐహికము పరమాత్మకంటెను, జగత్కారణమునకంటెను భిన్నముకాదు. దానియొక్క ప్రతిభాసమే- లీలావిలాసమే ఇది అంతయు అని మనము మొదటినుండి చెప్పుకొనుచునేయున్నాము. దీనినంతటిని సగుణబ్రహ్మముగా ఆరాధించవలసినదే, ఆనందించవలసినదే. అప్పుడే జీవికచరితార్థత. కనుకనే త్యాగము, సన్యాసము, కర్మ, నిష్కామకర్మ, జగత్కల్యాణకరకర్మ మొదలైనవాటి రహస్యముల నెఱింగి మనము తగినదానిని అనుసరించి, నేటియుగమున ప్రవర్తింపవలసి యున్నది. కేవలము సంప్రదాయ దాస్యమువలన ఏ ప్రయోజనము చేకూరదు. తాతలనాటిబావియే తరతరాలవారిని ఉద్ధరింపదను సూత్రమును మనము తెలిసికొనవలసియున్నది. నవతకు స్వాగతము పలుకవలసి యున్నది. పాతను రోతగా వదలకయే, నవతకు పట్టాభిషేకముచేసి ముందుకు సాగుట ఉత్తమ మానవధర్మము.

పరిశుద్ధమగు సంన్యాసమును ఎందఱు అనుసరింపగలుగుచున్నారు! ప్రతి సంన్యాసియు ఏదో ఒక ఆశ్రమమునకో, శిష్యసంఘమునకో కట్టుపడి, వాటి సర్వాభ్యుదయములకు తను, ధన, మనః, ప్రాణములను అర్పించుచున్నాడే కాని, శుద్ధ సంన్యాసిగా మెలగగలుగుచున్నాడా! నే నెఱింగినంతలో దొంతులమ్మ, రంగావధూత, మడుగుస్వామి, చిన్నమ్మ, పెద్దమ్మ, పిచ్చమ్మ మొదలైన యోగినులు కొందఱు మాత్రమే అగపడినారు. బెంగుళూరులోని నిర్వాణమ్మ 2 వందల ఏండ్లనాడు శుద్ధ సంన్యాసినిగా ప్రకాశించినది. ఈనాడు గుంటూరు జిల్లాలోని రాజుపాలెములోని నాగశేషమాంబగారిని ప్రపంచ సంబంధములేని పరిశుద్ధ సంన్యాసిని, లేక ఆశ్రమాలను, అవధూత స్థితిని దాటిపోయిన పరబ్రహ్మస్వరూపిణి అని చెప్పవలయును. ఆమె ఉన్న ప్రదేశమును దర్శించిననేచాలు, చూచినవారు ధన్యులగుదురు. కావున నమక, చమక, విశ్వకర్మ సూక్తములలో శివ, విశ్వకర్మల తత్త్వమును మనము ఈవిధముగా అర్థముచేసికొని, అనుష్ఠించి ధన్యులము కావలసియున్నదే కాని, వేషమాత్ర సంన్యాసమునకు మురిసి మోజుపడి రెంటికిం జెడిన రేవడులము కారాదు. వైదిక ఋషులెవరును కర్మత్యాగులుకారు. బంధకములైన కర్మలను, కామ్యకర్మలను వదలి నిష్కామ లోకకల్యాణ కర్మలను వారు ఆచరించి మనకు మార్గము చూపినారు. బ్రహ్మంగారు ఆ రహస్యమునే అనుష్ఠాన పూర్వకముగా

చాటినారు. అందుకే మిత్రసాహస్రిలో సంన్యాసమునుగూర్చి ఇట్లు వ్రాయుట యైనది—

వేషమెన్న వెలిది, విజ్ఞత లోనిది,
జ్ఞానమొకటె మోక్ష సాధనంబు,
వట్టివేష మూని వంచింపకు జగంబు!
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర!

కావున నరుడుచేసెడి ప్రతికర్మయు, జగత్కారణవస్తు జ్ఞానమునకు, కార్యకారణ భావ పరిజ్ఞానమునకు హేతువై ఆతనిని బంధముక్తుని చేయునది కావలసి యున్నదను నదే సర్వవేద సారము!

నిజ మాలోచించిన గాంధిమహాత్మునిమించిన సంన్యాసి యెవరు? ఆయన భార్యతో కలసిమెలసి యుండియు, సంన్యాసిగానే మెలగినాడు. ఆమెనుకూడ లోకసేవాకార్యముల లోనికి దింపినాడు. సంతానమునుగూర్చి వారి బ్రతుకులను వారికే వదలినాడు. తాను లోకకల్యాణకరమనుకొన్న ఏ కార్యమునుగాని వీడలేదు. ప్రపంచ మానవకోటి బాగు పడుటకెన్ని మార్గములున్నవో, నాటినిగూర్చి నిరంతరము ఆలోచించుచు, తన అనుచరులను వాటి నాచరింప ప్రేరేపించుచు జీవిత కర్పూరఖండమును లోకమునకు వెలుగు నిచ్చుటకే నీరాజనమొసగినాడుకదా. ఇంతచేసినను ఆయనకు వేటియందును అహంకార మమకారములు లేనే లేవు. పని

నెఱవేఱినను, నెఱవేఱకున్నను ఒకటే సమభావము. "సిద్ధ్య సిద్ధ్యోః స్సమో భూత్వా, సమత్వం యోగ ఉచ్యతే" సిద్ధిని, అసిద్ధిని సమముగానెంచి నిష్కామముగా కర్మచేయుటయే ఆయన లక్ష్యమైనదికదా! ఆ మార్గమే సర్వులకు అనుసరణీయము. నిర్వ్యాపారమే సంన్యాసమగుచో, బుద్ధుడు, శంకరాదులు, గాంధి ప్రభృతులు సంన్యాసులేకారు. సంన్యాసి లోకక్షేమంకరుడు. అందుకే "అభయం సర్వభూతేభ్యో దత్వా నైష్కర్మ్య మాచరేత్." సమస్తప్రాణికోటికి అపకారముచేయనని అభయమిచ్చి సంన్యాసమును స్వీకరింపుమనుచున్నది శాస్త్రము. ఈ నైష్కర్మ్యమునకు నిర్వ్యాపారమని అర్థముకాదు. నిష్కామకర్మ అనియే. అభయదాత ఎల్లప్పుడును కల్యాణకరుడేకాని, భయంకరుడు కాడు.

## ఉ ప సం హా ర ము

తైత్తిరీయసంహిత (కృష్ణయజుర్వేదము) దర్శ పూర్ణమాస, అగ్నిచయన, సోమ, అశ్వమేధాది యజ్ఞకర్మలతో నిండినదయినను, జ్ఞానవిషయమున ఋగ్వేదముయొక్క అడుగు జాడలలోనే ప్రయాణముచేసి మానవజీవిత సార్థక్యమును ప్రబోధించినది. కనుకనే విశ్వకర్మ సూక్తములోని ఒక మంత్రమునందు—

"న తం విదాథ య ఇదం జజాన"

ఓ మానవులారా! మీరు మీ కంటికగపడెడి చిత్ర

విచిత్రజగత్తును సృష్టించిన పరమపితను - అనగా జగత్కా-
రణ వస్తువును ఎటుంగకున్నారు- అని జనులను మేల్కొల్పి
నది. ఆవల ఎందుకెఱుంగ లేకున్నారని తానే ప్రశ్నించుకొని-

"నీహారేణ ప్రావృతా జల్ప్యా
చాసుతృప ఉక్థశాస శ్చరన్తి."- అన్నది.

మీరు అజ్ఞానముచేత కప్పబడియున్నారు. ఆ అజ్ఞాన
మెట్టిదందురా, దానికి నిజముగా చూచిన, ఉనికియే లేదు.
అది మంచువంటిది. (నీహారమనగా మంచు). దానిని
పోగొట్టుకొనుట కష్టమేమీ కాదు. జ్ఞానమనెడి యెండ
యేపాటి సోకినను అది కరగి అదృశ్యమై పోవును. కాని
మీరందులకై ప్రయత్నింపక సామాన్యములైన ఐహిక
భోగములకోసమే, ప్రాణరక్షణయే పరమార్థముగా నెంచు
కొని అనృతభాషణాది కార్యములకు దాసులై జ్ఞానార్థము
యత్నించుటలేదు. అంతే కాదు. మఱికొందఱేమో ఆము
ష్మికములైన స్వర్గాది సుఖముల నాశించి యజ్ఞాదుల నొన
ర్చుచు భ్రష్టులగుచున్నారు- అని హెచ్చరించినది. చివరకు
"తస్మై విశః సమనమన్త" జగత్తులు ఏ దివ్యశక్తినుండి
ఉద్భవించినవో, ఏ శక్తి మీ హృదయదేశములందు ఉన్నదో
దానిని తెలిసికొని తదనుభూతిని పొంది ధన్యులు కండని
హెచ్చరించినది.

అది సమస్త విశ్వస్వరూపముతో ఉన్నది కాన, దాని
యొక్క అఖండసర్వాత్మ స్వరూపమును చూపుటకే మనక

చమకములు ప్రవర్తించినవి. మానవులారాధింపవలసిన అణు మహత్తులతో గూడిన బ్రహ్మాండ దర్శనము ఈ రెంటిలోను జరిగినది. నరుడు దేనిని కానీ బ్రహ్మాభిన్నముగా-కారణమున కంటె ఇతరముగా భావింపరాదు. కార్యకారణముల పరమైక్య పరిపూర్ణ జ్ఞానమే ఆతనికి కలుగవలసియున్నది. అట్టి జ్ఞానమును సుసులభముగా కలిగించి యజుర్వేద సంహిత మనలను ధన్యులను చేసినది. ఇదియే వేదజననీ జనకుల ఉపదేశము. దీనినే "శ్రుణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః" అని ఋగ్వేదము చాటినది. ఆ చాటింపు అన్ని వేదములకూ వర్తించియే తీరును. జగత్కారణపు తొలిరూపము అమృతమని కాని, మృత్యువనికాని చెప్ప వీలుకానిది. (న మృత్యు రాసీ దమృతం న తర్హి.) అట్టిది రెండవదశలో అమృతమైనది. ఆ అమృతమునుండియే-లోకములు, జీవులు వచ్చినారు. అట్టి అమృతపుత్రులైన జీవులలో ఆసక్తి ఉన్నవారందఱు వేదములను చదువవచ్చును. వాటి అర్థమును మననముచేసి, ఆచరించి అమృతులై అమృతతత్త్వములో కలసిపోవచ్చును. ఈ విషయమునే "శ్రుణ్వన్తు విశ్వే" అన్న వాక్యము చాటుచున్నది. ఆ వేదార్థమును విని, ఆచరించి, అనుభూతిపొందిన నాడే మానవ జీవితము సార్థకమగునది!

మంగళా శాసనము

"అగ్నే తేజస్విం స్తేజస్వీ త్వం దేవేషు భూయాః,
స్తేజస్వన్తం, మా మాయుష్మన్తం, వర్చస్వన్తం
మనుష్యేషు కురు." —తై. సం. 3-3-1.

ఓ అగ్నీ! తేజస్వివైన నీవు దేవతలలో అధిక తేజసు కలవాడవై నన్ను మనుష్యులలో తేజస్వినీ, బలవంతునీ, ఆయుష్మంతునీ చేయుము. ఈ అగ్ని పరమాత్ముని రూపాంతరమైన దైవతశక్తియే.

"మయి మేధాం, మయి ప్రజాం, మయ్యగ్ని స్తేజో దధాతు. మయి మేధాం, మయి ప్రజాం, మయీంద్ర ఇంద్రియం దధాతు. మయి మేధాం, మయి ప్రజాం, మయి సూర్యో భ్రాజో దధాతు." —తై. సం. 3-3-2.

అగ్ని నాకు మేధాశక్తిని, సంతానమును, తేజస్సును దయచేయుగాక, అట్లే ఇంద్రుడు నాకు మేధా సంతానములతో పాటు ఇంద్రియ పటుత్వమును గూడ ఒసంగుగాక. సూర్యుడు నాకు మేధను, సంతతిని, ఆధ్యాత్మికశక్తిని ప్రసాదించుగాక !

"పృథివి మాతర్మా మాహింసీః, ర్మధు మనిష్యే, మధు జనిష్యే, మధు వక్ష్యామి, మధు వదిష్యామి, మధుమతీం దేవేభ్యో వాచ ముద్యాసం, శుశ్రూషేణ్యాం మనుష్యేభ్య స్తం మా దేవా అవన్తు శోభాయై పితరోఽనుమదన్తు."
తై. సం. 3-3-4.

తా. ఓ పరమేశ్వరా! నేను మధువు (తెనె) వలె ప్రియమైన సంకల్పములనే మనస్సునందు చేయుదునుగాక. అట్లే మధువువలె ప్రియమైన కార్యముల ఫలములనే ఉత్పా

దింతునుగాక. కమ్మనైన పలుకులనే ఎల్లప్పుడు పలుకుదును గాక. దేవతలను (లోకులను) గూర్చి గూడ కమ్మనైన స్తోత్రాదులనే చేయుదునుగాక. మనుష్యులనుండి మంచి మాటలనే విందునుగాక. ఇట్టినన్ను దేవతలు రక్షింతురుగాక. పితరులు అమంగళము జరుగకుండ చూతురుగాక. ఇట్లనుట చేత మానవులు మనోవాక్కాయములచేత సర్వభూతహిత మునే ఒనర్చి వారికి హితులు కావలెనని చెప్పినట్లయినది. లోకక్షేమంకర మయిన శుభకామన ఇది ఈ మంత్రము నందలి మధుశబ్దమునకు బృహదారణ్యకోపనిషత్తు చెప్పిన మధువిద్య అనికూడ భావించి తత్త్వార్థమును పడయ వచ్చును.

"శ్రుణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః."

ఆలకింపు డమృతపుత్రు లంద ఱిద్ది!

శ్లో॥ యద్గాయత్రీ విశ్వకర్మ ప్రసాదేన కృతం శుభం,
దర్శనం భక్తిపూర్వం తత్తాభ్యా మేవ సమర్ప్యతే.

శ్రీ ప్రజ్ఞానంద కృత యజుర్వేద దర్శన

ప్రథమ భాగము

సంపూర్ణము.

## అనుబంధము

భగవచ్ఛబ్దమును గూర్చి ఈ గ్రంథము 78, 79 వ పుటలలో కొంత విచారించినాము. ఋగ్వేదాదులు ఈ శబ్దమును గూర్చి ఏమనుచున్నవో ఇప్పుడు చూతము.

"భగ ఏవ భగవా నస్తు దేవా
స్తేన వయం భగవంతః స్యామ,
తం త్వా భగ, సర్వ ఇ జ్జోహావీతి
స నో భగ పుర ఏతా భవేమ." ఋ. 7-41-5.

భాష్యం — హేదేవా, భగో దేవఏవ భగవాన్ ధనవా నస్తు. తేన భగేన దేవేన-ధనేనవా, వయం భగవంతః స్యామ- ధనవంతో భవేమ. హేభగ, తం ప్రసిద్ధం త్వా త్వాం, సర్వఇ త్సర్వఏవ జనో భృశం పునఃపున ర్వాహ్వయతి. హేభగ దేవ, స త్వమిహ, అస్మిన్ యజ్ఞే నో అస్మాకం పుర ఏతా-పురోగంతా భవ.

ఇది భగదేవతాకమైన సూక్తము భగశబ్దమునకు ద్వాదశాదిత్యులలో ఒకడైన భగుడను నర్థమొకటి, ధనమను నర్థమొకటి సాయణుల భాష్యమునుబట్టి తోచుచున్నవి. విష్ణుపురాణము చెప్పిన ఐశ్వర్యాది సద్గుణములు సరే సరి. భగు డనగా సూర్యుడనియెంచి, అట్టి సూర్యులు, సృజింపదగినవారుగా గలవాడు భగవంతుడు-విశ్వస్రష్ట అని, యెంచుట సమంజసమే. కాని వైష్ణవసిద్ధాంతులు భగవచ్ఛబ్దము విష్ణువునకే చెల్లునందురు. ఇది సర్వ పండితజనేష్టము కాజాలదు.

విష్ణుపురాణముచెప్పినఐశ్వర్యాదులైన ఆఱుగుణములు బ్రహ్మరుద్రాదులకుకూడ ఉండవచ్చును అయినను బ్రహ్మాదుల విషయమున భగవచ్ఛబ్దము ఔపచారిక (అప్రధాన) మనియు, విష్ణువిషయముననే అది ముఖ్యమనియు విష్ణుపురాణ మనుచున్నది—

"ఏవ మేవ మహాన్ శబ్దో, మైత్రేయ భగవానితి,
పరమ బ్రహ్మభూతస్య, వాసుదేవస్య నాన్యతః.
తత్ర పూజ్యపదార్థోక్తి, పరిభాషా సమన్వితః,
శబ్దోఽయం నోపచారేణ,త్వన్యత్ర హ్యుపచారతః."

విష్ణువునకే సర్వేశ్వరత్వమును ప్రతిపాదించుటకు పుట్టిన విష్ణుపురాణము భగవచ్ఛబ్దమును విష్ణునకే పరిమితము చేయుటలో వింతలేదు. ఇంకను విష్ణుపురాణము.

"జ్ఞాన, శక్తి, బలైశ్వర్య, వీర్య తేజాం స్యశేషతః,
భగవచ్ఛబ్ద వాచ్యాని, వినా హేయై ర్గుణాదిభిః."

అనికూడ అన్నది. భగవంతుడనగా విష్ణువుమాత్రమే. అని రూఢిగా భావింపబడుటచేతనే విష్ణు లీలలను వర్ణించు గ్రంథము "భాగవత" మైనది. అట్లే కృష్ణుడుచెప్పినది కృష్ణగీత కాక, భగవద్గీతయైనది. పాపము శివుడు చెప్పినది "శివగీత" మాత్రమే అయి యూరకున్నది. ఇందుకనియే భాగవతశబ్దమునకు విష్ణుభక్తుడనునర్థముకూడ ప్రచారములోనికి వచ్చినది. "భగవతి భక్తః భాగవతః" అన్నారుకదా. అంతే కాని, భాగవతశబ్దమునకు శివభక్తుడని అర్థము రాదట. శివుని పట్ల భగవచ్ఛబ్దము ప్రధానముకాకపోవుటయే ఇందుకు కారణము కావలయును. అందుకే పాణినీయమున "శివభాగ

వతవత్సమాసః" అన్నారు. ఇది పాణినీయము చదివినవారి కెఱుకయే. త్రిమూర్తులలోకాని, పంచమూర్తులలోకాని భగవచ్ఛబ్దమును ఒక్క విష్ణునకే పరిమితముచేయుట ఏటి న్యాయమో! మనవారు సంధ్యావందనములో "కేశవాయ స్వాహా-" ఇత్యాదిగా కేశవనామ పఠనము చేయుచుందురు. అట్లేతటి శైవులు శివనామములను, శాక్తేయులు శక్తినామములను ఉచ్చరింపవలెనుకదా. అసలు సనాతన సిద్ధాంతమున వాటికి చతుర్వింశతినామములనిపేరు. ఈ 24 సంఖ్య చతుర్వింశతి తత్వములకు సూచకము. ఈ ఆచారమింతవఱకు విశ్వకర్మసిద్ధాంతానుసారులలో కాంచగలము.విష్ణుప్రాధాన్య యుగమున చతుర్వింశతినామములు కేశవనామములైనవి.

ఇట్టి లోపములుండుటంబట్టియే అథర్వశిఖోపనిషత్తు భగవచ్ఛబ్దమునిట్లు నిర్వచించినది:- భవము, యోగము - అను రెండుమాటలు మనకు సుపరిచితములే. భవమనగా సంసారమనియు, యోగమనగా సంసార నివృత్తి సాధనము, లేక ఈశ్వరునితో సమైక్యమనియు సుస్పష్టమే. భవశబ్దమునం దంత్యవర్ణలోపమును, యోగశబ్దమునం దాద్యవర్ణలోపమునుచేసి, రెంటిని కలుపగా 'భగ', మను శబ్ద మేర్పడు చున్నది. ఇప్పుడు భశబ్దముచేత భవమును, గశబ్దముచేత యోగమును వివక్షితములు. భవము హేయము, యోగము ఉపాదేయము (గ్రహింపదగినది). దీని సారాంశము - భవమును హరించి, యోగము నొసంగు శక్తిగలవాడు భగవంతుడని. "భవం నిహత్య యోగం దదాతీత్యర్థః" ఇక అథర్వ శిఖోపనిషద్వాక్యములను చూతము—

"అథ కస్మా దుచ్యతే భగవా నితి? యస్మా దుచ్చార్యమాణ ఏకోరుద్రః భవం నిహత్య యోగం దదాతీతి, తస్మా దుచ్యతే భగవా నితి."

నేను నీ అథర్వశిఖోపనిషన్మంత్రమును ప్రబోధచంద్రోదయ నాటక వ్యాఖ్యానములో చూచినాను. అటుపిమ్మట నాగరలిపిలో ముద్రితమైన ఉపనిషన్మండలిలోని అథర్వశిఖోపనిషత్తును పరిశీలించితిని. అందు, పై నుదాహరించిన వాక్యములు లేవు. సంస్కృత ప్రబోధ చంద్రోదయ నాటకమునకు వ్యాఖ్యానము వ్రాసినవాడు మన తిమ్మరుసుమంత్రి మేనల్లుడైన నాదెండ్ల గోపన్న. అతడు ప్రామాణికుడుగాని, సామాన్యుడు కాడు. అతడు చూచిన అథర్వశిఖోపనిషత్తులో నున్న వాక్యములు ఇటీవల ఎట్లు ఎవరిచే తొలగింపబడినవో చెప్పలేముకదా! ప్రాచీన వ్యాఖ్యాతలు ఉదాహరించినవి ఆధునిక ముద్రణలలో అగపడకుండుట ఇంకకొన్ని పురాణాగమాదులయందును నేను గమనించుట యైనది. ఇట్లు పాఠములను, విషయములను ఎత్తివేయుట పరమాన్యాయమని బాలుడేని చెప్పగలడు. విష్ణుపురాణము భగవచ్ఛబ్దమును విష్ణువునకే చెల్లుననుటయు, తక్కినవారికది అప్రధానమనుటయు ఏమంత బాగున్నది. త్రిమూర్తులనుగూర్చి మన పురాణములు ఎవరిని వర్ణించవలసి వచ్చినప్పుడు వారినే పరాత్పరులనుగా వర్ణించినవి. కావున భగవచ్ఛబ్దము సృష్ట్యాది కార్యములొనర్చు అఖండ పరబ్రహ్మమునుగూర్చి (అది ఏ నామములతోనున్నను) చెప్పునని పాఠకులు భావింపవలయును. అథర్వశిఖోపనిషత్తు రుద్రుని భగవంతుడని చెప్పినది కాన, అది విష్ణ్వాదులకుగూడ చెల్లవచ్చుననియే మా భావము.

---

## ఉపయుక్త గ్రంథములు

శుక్ల, కృష్ణయజుర్వేదములు 2. ఋ గథర్వ వేదములు 4. తైత్తిరీయ, ఐతరేయ, శతపథ బ్రాహ్మణములు 7. ఈశ, కేన, కఠ, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యక, శ్వేతాశ్వతర, మహాశిల్ప, పంచబ్రహ్మ, విశ్వకర్మోపనిషత్తులు 20. బ్రహ్మసూత్ర-మధ్వ, శంకర, రామానుజ, నీలకంఠ భాష్యములు,24. నిరుక్తము-25. భగవద్గీత 26. శౌనకుని బృహద్దేవత27. స్కాంద విష్ణు, బ్రహ్మాండ, మత్స్య, భాగవత, వాయు, బ్రహ్మాండ, విశ్వకర్మ పురాణములు-35. మహాభారతము 36. మూలస్తంభము. 37. రథకారాధికరణము 38. వైఖానసాగమము 39. పరశివవిశ్వకర్మాగమము 40. భర్తృహరి సుభాషిత త్రిశతి 41. శివాగమము 42. విష్ణు రహస్యము 43. రఘువంశము 44. వేదాంత పంచదశి 45. కొన్ని పాంచరాత్రాగమములు 46. మంత్రపుష్పము 47. మహారాష్ట్రభాషలోని విశ్వబ్రహ్మ కులోత్సాహ 48 విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము 49. నాగరఖండము 50. శిల్ప దర్శనము 51. మిత్రనాహ్రసి 52 సీతారామాంజనేయ సంవాదము 53. బ్రాహ్మణోత్పత్తి మార్తాండము 54. మెగ్డానాల్ వైదిక వాఙ్మయచరిత్ర. కొన్ని జైనబౌద్ధదర్శనములు.56.INDOARYAN MYTHO LOGY. 57. SERPENT POWER (SIR JOHN WUDRAFEE)58. తైత్తిరీయారణ్యకము59.డా. రాధాకృష్ణపండితుని భారతీయ తత్వశాస్త్రము 60.కొన్ని శ్రీవిద్యా గ్రంథములు 61. కులార్ణవ తంత్రము 62. సాంఖ్య, న్యాయ, వైశేషికదర్శనములు 65. ఆంధ్రీకృత శ్రీభాష్యము 66.

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
| --- | --- | --- | --- |
| 7 | 5 | కషములైన | కష్టములైన |
| 5 | 15 | బ్రహానందవల్లి | బ్రహ్మానందవల్లి |
| 11 | 9 | నృణక్తు | వృణక్తు |
| 14 | 19 | సుధనసేచ | సుధన్వనేచ |
| 18 | 1 | సస్ఫిజ్జరా | సస్ఫిఙ్జరా |
| 23 | 10 | శ్రస్తుడ | ప్రశస్తుడ |
| 48 | 7 | వికృకర్మాండము | విశ్వకర్మాండము |
| 69 | 15 | మొదరైనవి | మొదలైనవి |
| 72 | 10 | అయుధం | ఆయుధం |
| 78 | 17 | సమగ్రన్య | సమగ్రస్య |
| 93 | 16 | యేకత్వరమునకు | యేకత్వమునకు |
| 99 | 3 | వైదైశ్చ | వేదైశ్చ |
| 103 | 6 | విశ్వయాయ | విశ్వమాయ |
| 109 | 16 | భువపిత | భువనపిత |
| 116 | 16 | యతసప్తర్షిప్వర | యత్రసప్తర్షిస్వర |
| 122 | 20 | విషువుతో | విష్ణువుతో |
| 123 | 19 | పంచర్టి | పంచర్షి |
| 126 | 23 | శ్రోతం | శ్రోత్రం |
| 144 | 18 | మార్గో | మార్ణో |
| 147 | 8 | రుద్రేందాదులు | రుద్రేంద్రాదులు |
| 152 | 20 | ఎన్నికపోలేదు | ఎన్నకపోలేదు |
| 157 | 1 | గమనింపదన | గమనింపదగి |
| 159 | 13 | విర్మకర్మ | విశ్వకర్మ |

| | | | |
|---|---|---|---|
| 160 | 16 | స్ఫురింపయునని | స్ఫురింపలయునని |
| 212 | 11 | అవ్యక్తాద్యక్తయ | అవ్యక్తాద్వ్యక్తయ |
| 213 | 1 | సుషుపులు | సుషుప్తులు |
| 219 | 8 | జగత్కారమును | జగత్కారణమును |
| 234 | 9 | వాగ్దేవికి | వాగ్దేవి |
| 237 | 15 | స్యపాదో | పాదోఽస్య |
| 246 | 14 | మేల్గోపుట | మేల్కొలుపుట |
| 263 | 6 | ప్రజాపతిర్వికర్మా | ప్రజాపతిర్విశ్వకర్మా |
| 264 | 17 | ష్భద్యాం | పద్భ్యాం |
| 265 | 2 | అయినారు | పుట్టినారు |
| 276 | 12 | వైశ్యకర్మణాః | వైశ్వకర్మణాః |
| 280 | 15 | మంముల నుండి | ములనుండి |
| 281 | 11 | సద్యోజాజాత | సద్యోజాత |
| 283 | 9 | 4-3-5-6 | 4-3-3 |
| 285 | 2 | పజాపతి | ప్రజాపతి |
| 285 | 18 | అను-1. | అను-2. |
| 303 | 8 | పశ్నింప | ప్రశ్నింప |
| 302 | 9 | ప్రత్తస్మా | పైత్తస్మా |
| 302 | 14 | భవత్యయమిమాం | భవత్యభీమాం |
| 313 | 19 | ధనః | ధనం |
| 315 | 20 | మృత్యువులులేమి | మృత్యువు రేము |
| 318 | 11 | నమకములు | నమకచకములు |
| 319 | 6 | చైత్రీంచమ | జైత్రంచ మ |